ఆ యయోధ్యయు విదేహము మీకు సరియె
నీవు వసిష్ఠ మౌనియు విచారించి
కావలసిన పనుల్ గావించుకొనుఁడు
మాకు నొక్కస్వతంత్రమా? అన్ని పనులు
మీకెట్లు సరిపోవు మేలవిమాకు
నొప్పునేనెవ్వఁడ నొక ముహూర్తమున
నిప్పుడ నలువుర కిత్తుఁ గన్నియల"

216 పుట 5214/5224

4. నామతీర్థాదికములు తీర్చుట. వైష్ణవ సంప్రదాయము.

పుట 312

5. అంతఃపురములోనికి రాజు వచ్చునప్పుడు రాజుగారి రాక తెలుపుచు బిరుదు గద్యలు చిలుకలు చదువుట

పుట 284

6. రాజు నిద్రనుండి లేవఁగానే పరిచారకులు దర్పణములు దాల్చి నిల్చుట. "పరిచారకులును దర్పణములు దాల్చి"

(పుట 308)

చూడుఁడు రాయవాచకము "దర్పణముఖావలోకనానంతరంబున"

7. వనమార్గమును చక్కఁబఱచుటకు వలయు పారలు మొదలగు సాధనములు.

పుట 560

8. అవసరముల వారు - అంగరక్షు - సువారంబువారు-సంబళ బత్యంబులు - పంపుడుఘూళ - కైజీతకాండ్రు - డెబ్బది

రెండు నియోగములవారు - ఒంటర్లు - కై కానుక - మొదలగు రాజకీయపారిభాషిక పదములు వరదరాజు కాలమున ప్రచారములో నున్నవి. శాసనములలో, కైఫీయతులలో, సాహిత్యములో విరివిగా వాడుకలో నున్నవి.

9. అరవ రాజ్యముంబోలె యందఱు సిగల విరులు చుట్టుట.

10. భరద్వాజాశ్రమున, సాంగు బళానులాపములు
కొలవణి, కోలాటము పేరణి, కోలచారిణి - చిందు
గుజ్జరి - దేశినాట్యములు - మద్దెల, తాళములు
రావణహస్తము - దండి - మొదలగు నుపకరణములు.

వరదరాజు రసోచితముగ నచ్చటచ్చట వ్యవహారములో నుండు పదము లుపయోగించినాడు. మచ్చునకు :—

1. కిటుకులు దీరు - రహస్యములుబయలుపడు-కిటు కంతా। అని వ్యవహారము

2. అద్దిరాయిా బాపనాస.

3. ఆలి పొంతనము.

4. అవనిజగూడి, పొటిలంబుగాంబోయి చెక్కు చెదరక

ఎంత పనిచేసిన శ్రమ లేకున్నట్లుడుంట. ఎంత పనిచేసిన పొల్లిము (పొటిలము) గా నున్నదని వాడుక

5. గ్రామసింహములు - కుక్కలు—

ఇవి యీనాడును మాండలీయకములుగా కళింగ ప్రాంతముల వాడుకలో నున్నవి.

6. ఈ బందయె తీరుట - ఈ చికాకే తీరుట

7. నిబద్ది - నిజము

వరదరాజు విపులముగ జాతీయములను సామెతల నుపయోగించినాఁడు, తన్నుగట్టద్రాళ్లు తాఁదెచ్చినట్లు - కత్తిమీఁది సాము-మిన్నువిఱిగి పైబడినట్లు - ఆవదిన్నటుల - గుటికమ్రింగిన సిద్ధుడు-విංజమాకిడినట్లు - పుట్టెడు కన్నీరు-కందుగుందు - గువ్వకరిగొని యడుగు-మొదలగునవి.

శబ్దవిశేషములు

1. దుక్కంబు - దుఃఖశబ్దతద్భవము.
2. నికేతము - గృహము - నిఘంటువులలో నికేతనము గలదుగాని నికేతము లేదు.
3. అజారము - హజారశబ్ద రూపాంతరము
4. మచ్చులు - మీఁదకట్టడము లేక మిద్దెటిల్లు
5. తన్నీరుతిత్తులు - మంచినీటితిత్తులు
6. పెద్దరాణివాసము - పట్టపుదేవి
7. యతనమున - కుదాహరణము - యకారయతి
8. గరివించి - గర్వించి రూపాంతరము
9. డోయిట - దోయిట రూపాంతరము '(డోయిట......వేపచెట్లుకు)'
10. దిందు - డిందు (దీకు...దిందుయతి)
11. అక్కటికించి - కరుణించి
12. ఉక్కోలు - ఉక్కు *కోలు - ఉక్కుగొన్నట్లుగా. మిక్కిలి బలముతో విజృంభించుట
13 గడిరాజు - శత్రురాజు

14. కడిరాజు – మిత్రుఁడైనరాజు. పంక్తిభోజనము చేయురాజు

15. కడివారు – పంక్తిభోజనము గలవారు

16. కబ్బికావ్యము-కవికావ్యము. కవిశబ్దభవము కబ్బి. ఇటే
కబ్బితేడు – కవిరాజు

17. అంబకములు – కన్నులు – "పడయుదునింక నంబకములీ
(క్షణము" పండితా. చ.)

18. చింద్రెంబు – సిందూరము

19. కరిసించు – ఎదిరించు

20. సజ్జారములు – సామజాగారములు. ఏనుగులు
నివసించు చోటు – దీనిసంప్రదాయమిది.

ప్రాచీనకాలమున రాజనగరులలో రాత్రులు రక్షణఁగా నాలుగు జాములు నాలుగు ఏనుగులను నగరివాకిలియందు కాపు నుంచెడివారు. వానికే 'యామకుంజరము' 'లనిపేరు-ఆయేనుగు' లుండు ప్రదేశమునకు నావెనుక నగరునకుకూడ సజ్జారము అను పేరువచ్చినది. సామజాగారము. సజ్జాగారము సజ్జారము అని దీని రూపావతారము – ప్రాకృతభాషలలో సకారము హకారముగా మారుటచే, సజ్జారముహజ్జారము – హజారము అయినది. చూడుఁ డు. సింధు – హిందు హజారము. తెనుఁగున 'అజారము' అను నజాది పదమైనది. "సింగంపుగద్దె యుంచితిమజారమున"

(పుట 557. పంక్తి 7638.)

వ్యాకరణవిశేషములు.

1. 'నా' అనుటకు 'తన' అను సర్వనామమును ధారాళ ముగఁ బ్రయోగించుట.

2. చేతురు, కోతురు, పట్టుక, చేసుక-యిత్యాది ప్రయోగములు పెక్కుసారులు గలవు.

3. ఈ ప్రొద్దు కుపవాసము - కుపష్టి.

4. చేయుధాతువునకు 'చేసు' ప్రయోగము
కౌసల్య...రాఘవుఁడు నాయందు
జేసు మిక్కిలి ప్రీతి
ఇట్లే అంగరనృసింహకవి రాజరాజ్యాభిషేకమున.
మొదటిపద్యము-శ్రీసతి...వ్రాసుటకున్ - (ప్రాస)

5. కర్తయ్యు-తత్పు మాకారసంధి (కర్తయయ్యు అనవలెను)
బహువచనంబున 'రు' గాగమురామి

6. బాలులును జ్వరితులు నింతులఁను గోచరింప "లు" యతి

7. అర్థరాత్రివేళ-అర్ధరాత్రము అనవలయును

8. ప్రథమావిభక్తి 'డు' ప్రత్యయలోపము
తన చెంగటికి సుమంత్రనిఁ జేరఁ బిలిచి

9. పేదాదిశబ్దంబుల "రాలు" ప్రత్యమున హల్లునకు యతి

రమణి నీవుప్రసన్నురాలవు గమ్ము - చిన్నయసూరిసూత్రమున నచ్చుకేయతి వచ్చునుహల్లునకు రాదు—

10. వైరిసమాసము
పృథుల పెన్నెఱిగుంపు.

11. ఆగమాన్యచకారమునకు పూర్వమురామి
"కించవైతివి విలోకించ నోరుతుమె"

## రచనానైపుణి

వశ్యవాక్కగు వరదరాజు యొక్క ద్విపదరచన మతిసర
శమై, సర్వజన సులభగ్రాహ్యముగ నుండును. కవితా శిల్పమున
కమనీయ రచనా సౌందర్యమున, నిది రంగనాథ రామాయణ
మునకే విధమునను దీసిపోదు - నన్నయభట్టారకునివలె వరద
రాజు సంస్కృతాంధ్ర భాషాశైలి బహుప్రసన్నత గలది. సం
స్కృత సమాసరచన వర్ణనల యందే వరదరాజు చేయును.

కాంచన దళరత్న కందళకర్ణి
కాంచిత కమలవనాభి శోభితము
మకరంద రసలోల మదచంచరీక
నికర గాయన గాన నిబిడీ కృతంబు
శౌనకాదిమ మహా సంయమి శ్రేష్ఠ
మానితాశ్రమ లసమాన కూలంబు
మానిత సురత సంభ్రమ రిణదివిజ
మీనేక్షణా మణీ మేఖలారవము
కలితలతా డోలికాలోల మాని
కలకన్యకాతులాకోటిస్వనంబు
పనస రసాల రంభానారికేళ
తినిశక్రముకవరోత్కీర్ణ రోదంబు
వారికేళీలోల వైమానికాభి
సారికావీతహొమ్మృషా మీనబలము
యాజన హోమధూమా కాండజలద
రాజకాచ్ఛన్న తరంగ మాలికము
కారండవమరాళికాప్లవీభూత
గౌర సారస పరాగ ప్రపంచంబు,

తెనుఁగుశైలికి ద్విపద రచనలో నుండెడి యవకాశము లను కవి పూర్తిగ వినియోగించుకొన్నాఁడు. ఏ ద్విపద కాద్విపద విడివడి నట్లుగ రచించుట,యేగాక, పాదాంతమున నను ప్రాసముల నుపయోగించి, చదువరుల చెవులకింపు నింపినాఁడు. ఒక్కొక విభక్తి ప్రత్యయముతోడనే ద్విపదలు విస్తరింపఁజేసి నను నవి విసువుపుట్టింపవు ఉదాహరణము. శ్రీమించురత్నకిరీటంబుతోడ. అనునది 12 పంక్తుల వఱకు నడచినది. భరతుఁడు చేసిన శపథములు షష్ఠీవిభక్తిలో.

"ఇది నేఁదలంచిన నినమండలంబు నె
నెదిరిచూడఁగ నిష్ఠుఁడేఁగెడి గతికి
నిదురించు నావు దన్నినవానిగతికి" అయోధ్య-7260

అనునిట్టిపంక్తులు నూఱుగలవు.

భరతునికి రాజనీతి బోధించుపట్ల రక్షింతె, నేయుదువె మొదలగు ప్రశ్నార్థక క్రియలతో 250 పంక్తులు గలవు. ఇట్లయ్యును చదువువాని కేపాటి వాచకతయున్న నవి చదువవలయు ననియే యుండునుగాని చర్విత చర్వణముగా నున్నట్లు కన్పట్టవు.

తెనుఁగురచనకు మచ్చుతునుక

"రవిలేనిదినము సారథిలేని రథము
కవిలేనికీర్తి యంకము లేనిపోటు
ప్రతిలేనివాదు తీర్పరిలేనిసేన
ధృతిలేనితెగువ కూరిమిలేనిచెలిమి
దొరలేనిసీమ చంద్రుఁడు లేనిరాత్రి
ధరిలేనిసంధ్య మంత్రము లేనిజపము

సతిలేనిగృహము వాసనలేనిపూవు
భృతిలేనికొలువు కోయిలలేనివనము
శ్రుతిలేనిపాట శూరులులేనికోట
కతలేనిరచన నిల్కడలేనిమాట"

ఇది శ్రవ్యకావ్యమేయైనను, వరదరాజు సహజప్రతిభా విశేషముఁజూపి దృశ్యకావ్యములైన నాటకముల యందువలె, ఇందలి పాత్రలను సజీవములైనట్లు చిత్రించినాఁడు. అందు ముఖ్యముగ సీతా, రామలక్ష్మణ భరత సంవాదము లెంతయు రసపూరితములై ప్రజాసామాన్యమును, పండితలోకమును నొకే విధముగ రంజింపఁజేయుచున్నవి.

మూలగ్రంథము "పాఠ్యేగేయేచమధురమ్" అని ప్రఖ్యాతివహించినది గావున పాటగా పాడుట కనువగునట్లుగా ద్విపదలో దీనిని రచియించుట విశేషము. ద్విపద మధురకవితా శాఖకుఁ జెందినది. సంస్కృతమున మధుర మధురాక్షరములతో వాల్మీకి కోకిల రామాయణము గానము చేసినట్లు వరదరాజు మధురకవితా శాఖపై, దేశభాషలలో మధురాతి మధురమగు తెనుగులో నీకావ్యము కంఠమెత్తి గానమొనర్చినాఁడు. కథ రామకథ, కవి రాజకవి. కృతి ఐహికాముష్మికద్విపద హేతువగు ద్విపద, కావున తెనుగువారన్ని విధముల దీని నాదరింపఁ దగినది. ఇందలి కవితా విశేషములను గ్రహింపవలెనన్న, గ్రంథమంతయుఁ బూర్తిగ ముద్రణభాగ్యము నందవలెను. ప్రస్తుతమీ రెండు కాండములను ముద్రించి, ఆంధ్రమహాజనులకు వరదరాజ కవితా

మృతమునుఁ జవి చూపించిన శ్రీతంజావూరి శరభోజీ సరస్వతీ పుస్తక భాండాగారము వారి నాంధ్ర విద్వల్లోక మెంతయో ప్రశంసింప వలసియున్నది.

తక్కిన గ్రంథభాగములుకూడ త్వరలో ప్రకటింపఁజేయు భార మాంధ్ర మహాజనులపై నిలిచియున్నది.

ఈ మహా గ్రంథమునకిదియే ప్రథమ ముద్రణము. ఇంతే కాక, ఏకైకప్రతి సహాయముగ జరిగినగ్రంథ సంస్కరణము మూలమున నిందెన్నియేని లోపములుండవచ్చును. అచ్చుతప్పు లను సాధ్యమగు నంతవఱకు సవరించితిని. ఇంకను నచ్చటచ్చట నిలిచియుండవచ్చును. వానిని సవరించి చదువుకొందురుగాక యని ప్రాజ్ఞులకు విన్నవించుచున్నాను.

ఇట్టి గ్రంథమునకు సంపాదకత్వము వహించుటకు నాకనుమతి నొసఁగిన మదరాసు విశ్వవిద్యాలయ కార్యనిర్వా హక వర్గమువారికి నామనః పూర్వక కృతజ్ఞతాపూర్వక నమస్కా రము లర్పించు చున్నాఁడను. ఈ గ్రంథముద్రణ ప్రారంభము నుం డియు నత్యంతశ్రద్ధవహించి, మూలతాళపత్ర ప్రతినొసంగి, సంస్క రించుటకు ననుకూల పరిస్థితులను గల్పించి నన్ననేక విధముల ప్రోత్సహించిన, తంజావూరి పుస్తక భాండాగార గౌరవకార్య దర్శులు శ్రీ యస్. గోపాలన్ గారి సహృదయత్వమును, నాదరాభి మానములను నేనెన్నఁడును మఱువఁజాలను. వారికి నాహృదయ పూర్వక కృతజ్ఞత.

అచ్చు మొదలిడిన నాఁటనుండి యామూలాగ్రముగ మూలతాళ పత్రప్రతితో దీనిని పరిశీలించి, ప్రూపులు దిద్దుట యందును గ్రంథ సంస్కరణమునందును నాకు చేదోడువాదోడు గానున్న చిరంజీవి శివసుందరేశ్వరరావునకు నాయాశీస్సులు

గ్రంథరత్నమగు నీకృతి, రత్నము ముద్రాక్షరశాలలో ముద్రితమగుట సమంజసమేగదా! ముద్రణమును సకాలములో నింత చక్కఁగ సంతరించిన మదరాసు రత్నము ముద్రాక్షర శాలవారికి నాధన్యవాదములు.

ఇతిశివమ్.

స్వాతంత్ర్యదినము
15-8-50

ఇట్లు
విద్యారత్న;
నిడుదవోలు వేంకటరావు ఎం. ఏ,
మదరాసు విశ్వవిద్యాలయాంధ్ర
శాఖాధ్యక్షుఁడు



# తప్పొప్పులపట్టిక

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 24 | 585 | పుంజూడ | పుఁజూడ |
| 35 | 847 | పుప్వ | పువ్వ |
| 46 | 1101 | పువ్య | పువ్వ |
| 47 | 1129 | పేరెఁగిం | పేరటిఁగిం |
| 50 | (పేరు) | శ్రీరాయా | శ్రీరామా |
| 52 | 1257 | బాగ్యముల్ | భాగ్యముల్ |
| 72 | 1752 | తొడ | తోడ |
| 74 | 1793 | యొ వేని | యొన్నేని |
| 75 | 1807 | టఁజెసి | టఁజేసి |
| | 1825 | యాగంబొ సాగనీక | యాగంబొనర్చెదనను... .. దైత్యులుసాగనీక |
| 76 | 1844 | సంతొషంబు | తోషంబు |
| 77 | 1857 | సొఁక | సోఁక |
| | 1867 | అక్షొహిణి | అక్షోహిణి |
| 78 | 1880 | పరికిఁపం | పరికింపఁ |
| | 96 | వెద్తు | వేర్తు |
| 103 | 2488 | పీచొపు | పీచోపు |
| 212 | 5130 | సేసితివొ | సేసితివా |
| 213 | 5155 | నకుకీఁగీర్తి | నకుఁగీర్తి |
| 232 | 5584 | విసయ | వినయ |
| 235 | 5682 | నెయెడ | నేయెడ |
| | 87 | కొపించి | కోపించి |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
| --- | --- | --- | --- |
| 237 | 5730స | ఁడో | సంతో |
| 238 | 5759 | సున్నవు | సున్నఫు |
| 239 | 5779 | సాఁకొర్చి | సోఁకోర్చి |
| 240 | 5808 | గాంచమణి | గాంచనమణి |
| 245 | 43 | సహానాసు | సహావాసు |
| | 52 | క్రాధంబు | క్రోధంబు |
| 246 | 53 | గాంభిర్య | గాంభీర్య |
| 250 | 167 | దఱువిని | దఱినువిని |
| | 172 | మొప్వ | మొప్పఁ |
| 253 | 240 | యిప్పుడె | యప్పుడె |
| 256 | 309 | యొసంగి | యొసఁగి |
| 261 | 444 | తెల్వంగ | తెల్పంగ |
| 262 | 461 | యూండ | యుండ |
| 265 | 547 | నంబువు | సంబవు |
| 266 | 549 | సన్నిది | సన్నిధి |
| | 556 | గావింవ | గావింప |
| 268 | 608 | యొసంగె | యొసఁగు |
| 269 | 638 | విన్నఁచాలుగవ | విన్నఁజాలున |
| | 641 | నీకిత | నీకింత |
| | 643 | ఘూఁబాణి | పూఁబోణి |
| 270 | 658 | నెఱింగింప | నెఱిఁగింప |
| 273 | 739 | రాసి | డాసి |
| | 744 | సేయిదువెు | సేయుదువెు |
| 274 | 756 | దలంవుని | దలంపుమి |
| 275 | 787 | గర్తయొ్య | గత్తయ్యు |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 276 | 808 | అశ్వినీ | అశ్వినీ |
| | 813 | శత్రుఘ్న | శత్రుఘ్న |
| 277 | 827 | కాతేని | కాదేని |
| 278 | 349 | య్యది | నెయ్యది |
| | 864 | యుద్ధమి | యుద్ధము |
| 279 | 8-5 | మఱచితివే మొ | మఱచితివీ వే మొ |
| | | మగుతురె. | మఱతురె |
| 280 | 902 | గై కొకు | గై కోకు |
| .81 | 933 | దొర్మూల | దోర్మూల |
| 287 | 1071 | జూడంగ | జూడఁగ |
| 293 | 1214 | యోాయని | యొయని |
| 314 | 1735 | వెనక్క | వెన్క |
| 323 | 1972 | మేరుద లు | మెదురులు |
| 328 | 2100 | ప్రొద్దె | ప్రొద్దె |
| 368 | 3307 | యెమేర | యే మేర |
| 493 | 3363 | యే తెర | యే తేర |
| 384 | 3432 | నొసఁగి | నొసఁగి |
| 415 | 4198 | వకతుఁడై | వంతుఁడై |
| 429 | 4530 | నీధిలో | వీథిలో |
| 451 | 5059 | గూహుఁడు | గుహుఁడు |
| 453 | 5097 | తనవునం | తనువునం |
| 464 | 5366 | భాధ | బాధ |
| 482 | 5815 | తల్లిలోడ | తోడ |
| 484 | 5857 | రొక్క | రొక్క |
| 486 | 5909 | తాడము | తాడనము |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 489 | 975 | నార్వ | సోర్వ |
| 492 | 6452 | యయ్యై్య | యయ్యై |
| 507 | 6420 | చుఁయ | చుఁదా |
| 515 | 6612 | జాలంగ....పశ్చమ | జీలంగ....పశ్చిమ |
| | | మాహా | మహా |
| 535 | 7095 | యుదు | సేయుదు |
| 569 | 7932 | ముఁ | మున |
| 577 | 8113 | దగునెక | దగుసేయుఁక |
| 587 | 8368 | గాక | జోక |
| 621 | 9 96 | పనిని | పనిగొని |
| 624 | 9274 | నర | భర |
| 655 | 10011 | దేశికకుంగ్రై వ | దేశికుఁడైనయట్టి |
| 685 | 10705 | టాధ్రి | టాద్రీ |



# విషయానుక్రమణిక

## బాలకాండము

| విషయము | పుట |
|---|---|

| విషయము | పుట |
| --- | --- |

| విషయము | పుట |
|---|---|



## అయోధ్యాకాండము

| విషయము | పుట |
| --- | --- |

శుభమస్తు.

# శ్రీ రామాయణము

## —: ఇష్టదేవతాస్తుతి :—

శ్రీకరభోగీంద్ర – శిఖరవిహారి
లోకరక్షణకళా – లోకప్రచారి
కలశాంబునిధిరాజ – కన్యాపనోది
అలఘుసత్త్వవిహంగ – హయవరసాది
వేదవేదాంతార్థ – విద్యానువాది
ఆదిమధ్యాంతక్రి – యాపరిచ్ఛేది
నవరత్నమయభూష – ణవిభావిభాసి
రవికోటిసంకాశ – రమ్యవిభాసి
సకలకల్యాణగు – ణమ్మణాకరుఁడు
వికచాబ్జనయనుండు – వేంకటేశ్వరుఁడు 10
ధారుణిపారిజా – తంబుమాకెపుడు
కోరికలెల్లఁ జే – కూరుచుంగాఁత.
అలకనిర్జితభృంగ – అతికృపాపాంగ
అలఘుహేమాభాంగ – అలమేలుమంగ
మాయింటిలోన స – మస్తశోభనవి
ధాయినియగుచు ని – త్యమునుండుఁగాఁత.
వీణాంకుశాభయ – వికచారవింద
పాణి ఘనశ్రోణి – భ్రమరికానీల
వేణి కోకిలవాణి – వినుతగీర్వాణి
వాణి మజ్జిహ్వపై – వసియించుఁగాఁత. 20

ధన్యమానసుఁడు సూ - త్రవతీవిలాసి
సైన్యనాయకుఁడు వి - ష్వక్సేనుఁడెపుడు
నేనొనరించు భూ - మిజాష్టకావ్యంబు
పూనిక నెలవేర్పు - బూటయౌఁగాఁత.
శేముషీకలనావి - శేషుండు శేషుఁ
డామరస్తుతిశాలి - యండజశ్రేణి
వైనతేయుండు మ - ద్వచనసంగతికి
నానందరసదాత - లవుదురుగాఁత.
లోకపరిత్రాణ - లోలతమైవాణి
ఆకసమ్మననుండి - యవనికిదిగఁగ 30
నాదిపాదమ్మన - నవలిద్వితీయ
పాదంబునెడ మొరఁ - పనుసరాజించు
మాణిక్యమంజీర - మధురస్వనంబు
నాఁగమా రామాయ - ణమును భారతము
కావించు వాల్మీకి - కవివర వ్యాస
భావముల్నాయందు - పనిగొనుఁగాఁత.
రతిరాజగురుకృపా - రాజితు, విజిత
రతిరాజు యతిరాజ - రాజదాకారు
యతిరాజయోగి మ - దాచార్యుచరణ
శతపత్రములు స - హచరములౌఁగాఁత. 40
పుట్టతేసియ యొండు - పులినభాగమునఁ
బుట్టినయమృతంపు - బుగ్గ యొండనఁగఁ
బరగు రామాయణ - భారతంబులను
సరససారస్వతౌ - షధరసంబులకు
చెవులుజిహ్వలు చాల - సెలలిచ్చి ధన్య

భవులైన నన్నయ - భట్టాదికవుల
నైపుణి నాకబ్బ - నాకబ్బికావ్య
రూపమై వేంకటేశ - ద్రు వరించుఁగాఁత.
తెలియనివెల్ల సు - ధీనిధుల్ దెలుపఁ
దెలిసికొందురుగాని - తెకతెకమీఱి 50
గ్రక్కునం దప్పన - రాదు మీకనుచుఁ
దక్కువారలును కొం - త రచింత్రుగాఁత.
అనుచు నభీష్టదై - వారాధనంబు
చనువున నుభయభా - షాకావ్యనుతియు
నాచార్యభజనంబు - నన్యాపదేశ
వాచాలతయుఁ జూపి - వలయునైఖరిని

—: గ్రంథ రచనోద్దేశము :—

నేకధరచియింప - నిహపరసౌఖ్య
సాకల్యఫలము లి - చ్ఛావిధేయములు
నేపురాణమొసర్ప - నెల్లపుణ్యముల
తేపమై భవవార్ధి - తీరంబుఁజేర్చు 60
నేకావ్యమువచింప - నెలమి నాచంద్ర
లోకలోచనకీర్తి - లోకంబునిండు
నేయితిహాస మూ - హించికావింపఁ
గాయంబు శ్రేయోని - కాయమైవెలయు
నట్టియాదిమకావ్య - మందమైతేట
వుట్టంగ నవరసం - బులు పిచ్చిలంగ
జల్లిమాటలునప - శబ్దముల్ జజ్జు
టల్లికల్ ప్రావలం - దదుకుఁబల్కులును

పునరుక్తములు వట్టి - పూదెలు కాకఁ
దెనుఁగు లీఁచలును సం - దిగ్ధముల్ ప్రాలు 70
మాలికల్ కటువులే - మఱపులు కొసరు
లాలంబములు వెట్టి - యతకడంబులును
చాయలెత్తుట లర్థ - చౌర్యముల్ పెట్టు
జాయలులేక ల - క్షణసమ్మతముఁగ
నందమై సుకవులౌ - రాయన చెవుల
విందుగాఁ గపురంబు - వెదచల్లినట్లు
ధ్వనులు వ్యంగ్యములు విం - తలు వాసనలును
మినుకులు జిగిబి - మొరవడుల్ జాతి
వార్తలు నుపమలు - వర్ణనాంశములు
మూర్తిమద్వాక్యముల్ - ముద్దులుచూప 80
నొకమాటకన్న వే - ఱొకమాటవింత
యొకపాదమునకన్న - నొకపాదమొఱపు
నొకదళంబునకన్న - నొకదళంబంద
మొకయుత్తరము మించ - నొకయుత్తరంబు
వెలయంగ ద్విపదఁగా - వింప చిత్తమునఁ
దలఁచి యేనొకశుభో - త్కటదినంబునను

—: స్వప్నవృత్తాంతము :—

సుఖనిద్రితుఁడనైన - చో పూర్వపుణ్య
సఖమైన యొకసుఖ - స్వప్నంబునందు
కలకలనవ్వుచ - క్కని నెమ్మొగంబు
గిలగిలమొరయు బ - ల్కెంపుటందియలు 90

తళతళమెఱచు బి - త్తరిఁదాల్చునురము
జలజలచింద్రెంబు - చల్లు వాతెఱయు
మినమినచామన - మిసిమి నెమ్మేను
కనఁగనవెలుఁగు చౌ - క్కపుకిరీటంబు
లివలివలాడు మే - లిమికుండలములు
రవరవల్గనువ్రాంచు - రత్నహారములు
నిగనిగల్మను పైఁడి - నిగ్గుచేలంబు
ధగధగలీను సు - దర్శనకరము
చకచకల్గల పాంచ - జన్యంబునమరు
నొకదివ్యమూర్తి నా - యొద్దఁజూపట్టి 100
జలదగంభీరని - స్వనముతో నపుడు
పలికెనిట్లని శ్రోత్ర - పర్వంబుఁగాఁగ
నినుమెచ్చివచ్చితి - నీతలంపెఱిఁగి
ననుఁ దిరువేంగళ - నాథుఁగాఁదెలియు
పద్యకావ్యము చేసి - పరమభాగవత
హృద్యచరిత్రంబు - నిచ్చితి మాకు
మంగళప్రదమసా - మ్యము శతాధ్యాయి
రంగమాహాత్మ్యంబు - రచియించినావు
మాపేరనిపుడు రా - మాయణద్విపద
యేపుమీఱఁగ రచి - యింపు మింపలర 110
రాజులు సత్కవి - రాజు లందందు
నీజగతిఁదలంప - నెందఱోఁగలరు
రాజవు సత్కవి - రాజవు నీవె
యీజగతిసమాను - లెవ్వారుగలరు?
కావ్యంబులం దాది - కావ్యంబు సకల

సేవ్యంబు భువనప్ర - సిద్ధంబు సుజన
భాగధేయంబు శో - భనకరం బఖిల
భాగవతానంద - పదవియు నైన
వల్మీకతనయ కా - వ్యసుధారసంబు
కల్మషాపహము భా - గ్యవశంబుచేత 120
నీకులభించె దీ - ని తెలుంగుచేసి
ఆకల్పమైన వి - ఖ్యాతి గైకొనుము.
ద్విపదగావింపుము - తేట తెల్లమిగ
నిపుణత శ్రీరాము - ని కథాక్రమంబు
వాలాయమిద్ది యథా - వాల్మీకముగను
చాలసాంకోర్చి ర - సస్థితుల్ మెఱయ
నీవుగా కితరులు - నేరరుపూని
యేవంవిధంబుగా - గృతినిర్వహింప 130
నీకవితంబునై - నిర్దోషమగుచు
మాకునంకితము రా - మాయణంబైన
బంగరుపుప్వుల - పరిమళమై పొ
సంగి జాజులును ప్ర - సాదమ్మునట్లు
కరమొప్పు నీవట్ల - కావింపుమనుచు
తిరువెంకటేశుఁడ - దృశ్యుఁడైనంత.
వేకువ కలగాన - వేడుకయెల్ల
చీకటుల్ విరియింప - చిత్తాంబుజంబు
కడువికసింప మే - ల్కని ప్రభాతమున
దడయక సమయోచి - తక్రియల్ దీర్చి 140
రాజులువారలుఁ బౌ - రాణికుల్ సుకవి
రాజులు మంత్రులు - రసికులుఁగొలువ

గొలువుండి వారిచే - గోర్కెని యబ్బురముగ
కలతెఱంగెల్లను - కలతెఱంగెల్ల
తెలివిడిగాగ న - ద్దేవునూక్తములఁ
దెలుపవారలు ప్రమో - దించి యిట్లనిరి.

—: కవివంశవర్ణనము :—

అవధరింపుము దేవ ! అచలితభక్తి
నవనిఁబెంపొందు నీ - యంతరాజునకు
విహితంబకాదె శ్రీ - వేంకటేశునకు
సహజంబు స్వప్నసా - క్షాత్కారలీల 150
నినకులంబున వేంక - టేశుండు మున్ను
జనియించి తనపుణ్య - చారిత్రమెల్ల
బోయకులంబునం - బుట్టు వాల్మీకి
సేయ నందుబ్రమోద - చిత్తుండుగాక
అర్కవంశమున నీ - వై జనియించి
తార్కాణగాఁగ నే - తత్కథావిధము
రచియింపుమనియె - శ్రీరామచంద్రునకు
నచలితప్రీతిగ - దా నిజాన్వయుఁడు
తనచరిత్రంబు కీ - ర్తనసేయ వినుట
తనయులచేఁగాదె - తామున్నువినియె 160
నుచితోపయోగ్యమీ - యుత్తమకావ్య
సుచరిత్ర మీవాన - స్ఫుట విహితంబు
సామాన్యమే రామ - చంద్రకీర్తనము
లేమేమి పుణ్యంబు - లీవు చేసితివో
నీతల్లిదండ్రు లె - న్నిభవంబులందు

భూతలంబున నిట్టి - పుత్రుండుగలుగ
నేమేమి నోచిరో - యింతియుకాన
యీమేటిపుణ్యంబు - లేలసిద్ధించు
కలియుగరామ - జగద్విదితంబు
తలఁప నీవంశమెం - తకృతార్థమయ్యె 170
శ్రీకరుండై ధరి - త్రీచక్రమేలె
నాకల్పవిఖ్యాతుఁ - డగుచోళవిభుఁడు
ఆకరికాళచో - ళాధీశుకీర్తి
యాకర్ణనీయమి - య్యవని నెయ్యెడల
అతఁడుకావేరిక - ల్లన కట్టఁగట్ట
నతిశయించెను తదీ - యాన్వవాయమున
పుట్టిన రవివంశ - భూభుజావళికి
కట్టాన్వయులనంగఁ - గలితతేజమున
అందులో తెలుఁగుబి - జ్జనవిభుఁడు
కుందేందుమందార - గురుకీర్తిశాలి 180
వార్తగా హత్తుము - వ్వరగండబిరుద
కర్త మాన్నిబ్బర - గండవిక్రముఁడు
వేఁడికిగండండు - వీరాగ్రయాయి
వాఁడికిగండండ - నార్యదోర్బలుఁడు
లీల బారామండ - లీకరగండ
నాళీకతాటకీ - నారాయణుండు
దళితారి నవలక్ష - దళవిభాళాంక
కలితుండు మీసర - గండసాహసుఁడు
కీర్తిమంతుఁడు పాట - కీపుత్రబిరుద
కర్త బిజ్జలుమహీ - కాంతుండువెలసె. 190

ఆసంతతినిఁబుట్టె - నహితగజేంద్ర
కేసరితాతన - కేసరి యగుచు
కొట్టి చంగఁగఁదోలి - కుటిలారివరుల
మట్టిరంగసి దాన - మహిమచే మించె
నిట్టిరంగమటంచు - నెల్లరుఁబొగడ
కట్ట రంగక్షమా - కాంత శేఖరుఁడు
అరాజదేవేంద్రు - నాత్మజుండయ్యె
హారాజభామినీ - హరియశుండు
పరవధూద్రవ్య - చాపల్యదూరుండు
హరిదాసరాజైన - హరిదాసరాజు 200
అంగనాభూషణం - బగు పోచిరాజు
సింగరిరాజన్య - శేఖరుసుతను
శాలిమై కృష్ణమాం - బను వరియించె
నాలేమతోఁబుట్టు - వగు నోబమాంబ
అర్థిశ్రీరంగరా - యలు నాల్గుపూరు
షార్థముల్ గలుగ క - ల్యాణమై మించె
ఆయశోనిధిసుతుం - డై రామదేవ
రాయలు మారట - రాముఁడై వెలసె
హరిదాసరాజు కృ - ష్ణాంబయందులను
హరిసుదర్శనమూర్తి - యగురామరాజు 210
రాజభగీరథు - రవితేజు వరద
రాజును నిను దాత - రాయనిఁగాంచె,
రచియింపుమీవు శ్రీ - రామాయణంబు
ప్రచురంబుగా తొల్లి - ప్రాచేతసుండు
క్షితిమీఁదనుంచుని - క్షిప్తంబు లోక

హితముగా నది దీర - దితరులచేత
అన వారివాక్యంబు - లౌఁగాక యనుచు
తనకేమి యీ యసా - ధ్యప్రయత్నంబు
కడతేర్పనున్నాఁడె - కా వేంకటేశుఁ
డొడబడి యెపుడు నా - యుల్లంబులోన 220
ఆదేవునికె భార - మని యేరచింతు
నాదికావ్యారంభ - మదియెట్టులనిన

—: సంక్షేపరామాయణము :—

వసుధనుత్తమతప - స్స్వాధ్యాయ నిరతు
నసమవాక్చతుర మ - హామునిశ్రేష్ఠు
నారదమౌని యా - నసము వీక్షించి
కోరి వాల్మీకి పే - ర్కొని యిట్టులనియె.
మునినాథ! యీ లోక - మున నెల్ల వారి
మనుజులు గరతలా - మలకముల్ మీకు
నెవ్వాండు గుణవంతుఁ - డెవ్వాండ శూరు
డెవ్వాండు ధర్మజ్ఞుఁ - డెవ్వాఁ డుత్తముఁడు 230
తలఁప నెవ్వాఁడు కృ - తజ్ఞుండు నిజము
వలయువాఁడును దృఢ - వ్రతుఁడు నెవ్వాఁడు
ఎవ్వాఁడులోకైక - హితుఁడు విద్వాంసుఁ
డెవ్వాఁడు నేర్పరి - యెవ్వాఁడన్నిటను
కన్నులవిందన - కనుపట్టు నెవ్వాఁ
డెన్న ధైర్యంబుచే - నెసఁగు నెవ్వాఁడు
కోపమెవ్వాఁడు వై - కొనఁడు తేజమునఁ
జూపట్టు నెవ్వాండ - సూయ యెవ్వానికి

పొడమ దెవ్వనికోప - మునకు దేవతలు
గడగడవడఁకుచుఁ - గలన నోడుదురు 240
అట్టివాని వచింపుఁ - డడుగంగ వేడ్క
పుట్టైనాకనఁ బుట్ట - పుట్టు నత్తపసి
యన్న త్రిలోకజ్ఞుఁ - డైననారదుఁడు
యిన్ని హెచ్చుగుణంబు - లెందైనఁగలవె ?
ఇట్టిగుణంబుల - కిరవు దాశరథ
పుట్టై నిక్ష్వాకుభూం - భుజునివంశమున
రాముఁడందురు మనో - రాముండు ఓపువి
రాముండు తేజోభి - రాముండు ధైర్య
విభవంబుగలవాఁడు - విజితేంద్రియుండు
త్రిభువనోన్నతుఁడు బు - ద్ధియు నీతి నేర్పు 250
నైశ్వర్యమునునంత - రరిజయస్ఫురణ
శాశ్వతంబులుగ ని - చ్చలునందువాఁడు
ఎగుభుజంబులవాఁడు - హీనబాహుండు
నగుమోమువాఁడు చిం - దపుమెడవాఁడు
తళుకుఁజెక్కులువెడం - దయురంబుగలిగి
బలువైనవిల్లు చేఁ - బట్టినవాఁడు
కొమరొప్పుపెకాళియు - గూఢజత్రులును
నమరులలాటంబు - నడుగులసొబగు
చామననెమ్మేను - చక్కందనంబు
తామరకన్నులు - తనరు నంగములు 260
మంగళాయతన కో - మలముఖాంబుజము
రంగైనవాఁడు ధ - ర్మజ్ఞభావనుఁడు
పరమసత్యాత్ముండు - ప్రజలకు నిహాముఁ

బరము లీనేర్చు శో - భనకీర్తిశాలి
జ్ఞానాధికుఁడు సర్వ - సముఁడు వశ్యుండు
దీనులఁబోషించు - ధృఢమానసుండు
జగములునిర్మింప - సంరక్ష సేయ
జగమెల్ల భరియింపఁ - జాలినవాఁడు
రక్షకుండఖిల ధ - రాజీవములకు
రక్షకుండెపుడు ధ - ర్మవిధానమునకు 270
నిజధర్మపాలన - నిపుణుండు మిగుల
స్వజనరక్షణమున - సరిలేనివాఁడు
వేదవేదాంగసం - వేది కోదండ
వేదపారగుఁడస్త్ర - విద్యావినోది
సర్వశాస్త్రార్థ ని - శ్చయమానసుండు
సర్వజ్ఞుండాత్మవ - శంబగువాఁడు
మఱపెఱుంగనివాఁడు - మనుజులు తనదు
పరిణామమరసింపఁ - బరగెడువాఁడు
వగపెఱుఁగఁడు, సాధు - వర్తనవాఁడు
పగయెఱుంగఁడతిప్ర - భావుఁడుత్తముఁడు 280
సదయాత్మకుఁడు విచ - క్షణుఁడు సజ్జనులు
కదిసి పాయక కొల్వఁ - గరమొప్పువాఁడు
జలరాశినదులలో - సరివొత్తుగలియుఁ
గలయికవిబుధ సం - గతిఁ బేర్చువాఁడు
కలిమిగల్గినవాఁడు - ఘనుఁడు పూజ్యుండు
పలుమారుచూడఁ జూ - పట్టినవాఁడు
చక్కనివాఁడు కౌ - సల్యాకుమారుఁ
డెక్కుడుగుణమున - కిరవైనవాఁడు

కడలేనిగుట్టున - కలశాంబురాశి
తోడరుస్థైర్యంబునం - దుహినాచలంబు 290
గరుడకేతనుఁడు వి - క్రమసమున్నతిని
హరిణాంకుఁ డాలోక - నానందరచన
కదిసి కోపించిన - కాలాగ్నినిభుఁడు
వదలనితాల్మి - సర్వంసహాదేవి
కలిమి నుదారవై - ఖర్వహయవాహుఁ
డలఘుసత్త్వమున రెం - డవ ధర్మమూర్తి
దశరథాత్మజుఁడు స - త్యపరాక్రముండు
దశరథరాజనం - దనుల శ్రేష్ఠుండు
ఉత్తమసుగుణసం - యుక్తుఁ డా రాము
వృత్తంబు దశరథో - ర్వీజాని యరసి 300
ధరణిజనాళి చి - త్తముల సమ్మతము
పరికించి యువరాజ - పట్టంబుగట్ట
నాలోచనముచేసి - యప్పుడయోధ్య
చాలఁగాంగ్రైసేయు - చందంబుచూచి
వోవక మందర - యుపదేశ మొసఁగ
నావేళ విభుదేవి - యైన కైకేయి
వరము వేఁడిన ధర్మ - వశమహోపాశ
పరివృతుండై కైక - పట్టిని భరతుఁ
బట్టంబుగట్టను - పట్టి శ్రీరాముఁ
గట్టిడితనమునఁ - గానలకనుప 310
వరమిచ్చుటయు తండ్రి - వచనంబుచేసి
విరచితస్నేహాత్తి - వినయభూషణుఁడు
అనుఁగుఁదమ్ముఁడు సుమి - త్రానందకరుఁడు

ఘనుఁడు లక్ష్మణుఁడును - కల్యాణి సీత
దేవమాయోపము - దేవేరి వెంట
రా వనంబున కేఁగె - రామచంద్రుండు
సర్వలక్షణగుణ - సంపన్నశీల
సర్వమంగళపుణ్య - సాధ్వి యా సీత
ప్రాణముప్రాణమై - హరిణాంకు వెంటి
రాణించు రోహిణీ - రమణిచందమున 320
ననుసరింపగ పౌరు - లందఱు వెంటఁ
జను దేర దశరథ - జనపతి రాఁగ
శృంగిబేరపురంబుఁ - జేరి యెల్లఱను
గంగాతటంబున - కనురామి కదలి
గుహుఁ డోడగడప ము - గ్గురు నేరుఁ దాఁటి
బహుళవనంబునఁ - బాదచారమున
నేరులునడవుల - నేకముల్ దాఁటి
వారలచ్చట భర - ద్వాజులం గాంచి
యామహాని యనుమతి - నలచిత్రకూట
భూమీధరమున న - ప్పుడు పర్ణశాల 330
తమ్ముఁడు గట్టినం - దరుణియుండగను
సమ్మతిశ్రీరామ - చంద్రుండు నిలిచె,
తనయులంబెడగాసి - దశరథవిభుఁడు
ఘనమైన పుత్రశో - కమునసీల్గుటయు
భరతుండుతండ్రికి - పరలోకవిధులు
స్థిరభక్తిఁ జేసి వ - సిష్ఠాదులైన
మునులుప్రార్థింప రా - మునిఁదోడితెత్తు
తనతోటిరాజ్యమి - త్తరినని కదలి

చిత్రకూటనగంబు - చేరిరాఘవు ప
విత్రపాదములు భా - వించిసేవించి 340
రమ్మని ప్రార్థింప - రఘువీరుఁ డాద
రమ్మున పితృవాక్య - రక్షణశాలి
ఊరడింపుచు పర - మోదారుఁడతి కృ
పారూఢిమై తన - పాదుకాద్వయము
పాలించుకొమ్మన - భరతుండు మఱలి
ధీలాలితుండు నం - దిగ్రామమునను
అన్నసేమము పున - రాగమనంబు
మన్నించి యాత్మలో - మఱవకయుండె.
రామలక్ష్మణులు ధ - రాతనూజాత
యామేరనుండక - యవ్వలఁగదలి 350
దండకారణ్యంబు - దరియ విరాధు
డుండి యచ్చట రాము - నుగ్రబాణముల
మృతినొందె శరభంగు - నీక్షించి రాముఁ
డతనివీడ్కొని సుతీ - క్ష్ణాశ్రమంబునకు
జని యగస్త్యముని యా - శ్రమముదర్శించి
జననాయకుం డగ - స్త్యభ్రాతఁగాంచి
అలయగస్త్యునిచేత - నైంద్రమైనట్టి
యలఘుకోదండంబు - నక్షయాస్త్రముల
కవచానలు నిశాత - ఖడ్గంబు నందు
ప్రవిమలదండకా - రణ్యవాసులకు 360
మునులకు నభయమి - మ్మలనిచ్చి యెల్ల
దనుజులందునుమ సం - ధాసూఢిపూని
అగ్నిసమానమ - హర్షులసాధ్వ

సొగ్గులంజల్లార్చి - యలరుచున్నంత
పాపంబుదలంచి శూ - ర్పనఖవచ్చుటయు
నాపాలఁతినిఁబట్టి - యాజ్ఞసేయింప
నది విరూపంబుతో - నడలుచుఁబోయి
విది తమ్ము పెకలించు - విధమునందెలుప
ఖరదూషణాదులు - కదనంబుఁజేసి
మఱల కొక్కముహూ ర్త - మాత్రంబులోన 370
పదునాల్గువేవురం - బడిరిశ్రీరాము
పదనుటమ్ములచే సు - పర్వులుపొగడ
అదిచుప్పనాతిచే - నరసి రావణుఁడు
మదిఁగొల్చిమారీచు - మాటలువినక
అతనిఁదోడ్కొని దండ - కారణ్యమునకు
జతగూడివచ్చి యా - చాయ మారీచు
మాయామృగంబు గ - మ్మాయన్నయట్ల
సేయనాతఁడురిఘు - శ్రేష్ఠు బేల్పుఅచి
లక్ష్మణు వంచించి - లంకావిభుండు
లక్ష్మీసమాన ని - లాసుతబలిమి 380
జెఅవట్టుకొనిపోవ - సీతావరుండు
సరగున తమపర్ణ - శాలకువచ్చి
తమ్ముఁడుదాను సీ - తనుఁగాన లేక
నుమ్మలికింపుచు - నల్లంబులోన
వనముల వెంబడి - వచ్చి యచ్చోట
దనుజేంద్రహేతిచే - ధరణి(పైఁద్రెళ్లి)
యున్నజటాయువు - నూ క్తులచేత
విన్నవారై రి త - ద్వృత్తాంత మెల్ల

కామిని తెలుఁగుఁబై - కార్యంబు దెలివి
రామకార్యార్థక - ల్యాణముల్ నుడువ 390
శోకించి రఘుపతి - శూరుఁ బక్షీంద్రుఁ
జేకొని యుత్తర - క్రీలాచరించె (?)
విపినభూముల సీత - వెదకుచువచ్చి
యపుడొకచో వికృ - తాకారుఁడైన
భయదవిగ్రహుని క - బంధునిఁగాంచి
జయశాలి యొక దివ్య - శరమునం దునిమి
అతనినింద్రునివీటి - కనిచి తదూర్ధ్వ
గతములౌ కోనలఁ - గానలయందు
జాయనువెదకుచు - శబరియున్నెడకు
బోయి యా వనితచేఁ - బూజలుగాంచి 400
పంపాతటంబునఁ - బవమానతనయు
సంపూర్ణజవసత్త్వ - శాలిఁ జేపట్టి
యతఁడు దెల్పినరీతి - నర్కతనూజు
క్షితిపతి వహ్నిసా - క్షిగఁ జెల్మిసేసి
ధరణిజ తెలుఁగుఖే - దమునంది యామె
చెలుఁగున భూషణ - శ్రేణి వైచుటయు
వినియునుఁగనియు ని - వ్వెఱనొంది రామ
జనపతి వాలిని - సమయింతుననుచు
ప్రతినచేసిన మహా - బాహుసత్త్వంబు
మతి నమ్మలేక రా - మన్నృపాలుకునకు
నినసూతి బలుగొండ - కెనయైనయట్టి 410
ఘనమైన దుందుభి - కాయంబుఁజూపఁ
గోమలంబైన యం - గుష్ఠాంచలమునఁ

దా మీాట నదిగూలె - దశయోజనముల
సుగ్రీవునమ్మామి - చూచి శ్రీరాముఁ
డుగ్రసాయకమేర్చి - యొక్కటవింట
సంధించి యేసిన - సప్తసాలములు
బంధురగతి ద్రుంచె - పర్వతంబొకటి
చొచ్చియవ్వలదూరి - క్షోణిలోనాఁటి
వచ్చెఁగ్రమ్మర రఘు - వరుతూణమునకు 420
నదిచూచి యలరొందు - నగచరవిభుని
కదనంబు వాలితోఁ - గావింపుమనుచుఁ
బనిచిన నాతండు - పర్వతగుహలఁ
దనగర్జితమునిండ - దరసి కిష్కింధ
చెంతనిల్చిన వాలి - చీరికిఁగొనక
యెంతయునెదురుగా - నేతేరఁ దార
వలదన్నవినక గ - ర్వమున సుగ్రీవుఁ
దలపడిపోరుచో - దశరథాత్మజుఁడు
బలువింటనొకకోలఁ - బడనేయ వాలి
యిలవ్రాలె తారాదు - లెల్ల శోకింప 430
నపుడు కిష్కింధకు - నభిషిక్తుఁజేసి
తపనజుఁబట్టంబు - తాఁగట్టఁబనిచి
వానకాలముగాన - వలనుగాకునికి
మానవేంద్రుఁడు నిల్చె - మాల్యవద్గిరిని
తరువాత సుగ్రీవుఁ - దమ్మునిచేత
నరపతి పిలిపించ - నాల్గుదిక్కులకు
సీతనువెదకఁబం - చిన కపులెల్ల
నాతతభయభక్తి - నందంద సనిన

దక్షిణంబున మాఱు - తకుమారకుండు
పక్షినాయకుని సం - పాతినిం జూచి 440
యతఁడువచ్చినజాడ - నతిజవశక్తి
శతయోజనాయత - జలరాశిదాఁటి
రావణభుజపరా - క్రమపాలితంబు
గావుననమరు లం - కాపట్టణంబు
చొచ్చినల్దిక్కులు - చూచితా వెదకి
యచ్చోనశోకవ - నాంతరసీమ
రామునిఁదలఁచి వి - రాలిఁజింతిలుచు
స్వామైన యాసీత - చందంబుచూచి
మ్రొక్కితన్నెఱిఁగించి - ముద్రికయిచ్చి
యక్కన్నెతలమిన్న - యందిమిన్నంది 450
వనపాలకులఁగొట్టి - వనమెల్లఁబెఱికి
తనివోకతోరణ - స్తంభముల్ విఱిచి
సారిదిరావణుమంత్రి - సుతులనేడ్గురను
దొరలనేవురఁగొట్టి - తొంపరలాడి
అక్షునిఁబోదిగొని - యలయింద్రజిత్తు
రాక్షసేంద్రుఁడు వంప - బ్రహ్మాస్త్రమేయ
తాఁగట్టువడి ధాత - తనకిచ్చువరము
చేఁగట్టులూడ్చి య - జేయసాహసుఁడు
చిఱుతపగ్గంబుల - చేఁగట్టువడిన
తెఱఁగున లంక భీ - తిదొఱంగికాల్చి 460
సీతసేమముచూచి - సింధువుదాఁటి
యాతటి జాంబవ - దాదులతోడ
కాకుత్స్థుకడకేఁగి - కంటిజానకిని

కైకొమ్మురమ్మనఁ - గాఁగిటఁజేర్చి
హనుమంతు లాలించి - యర్కజముఖులు
వెనుకొని డెబ్బది - వేల్గపుల్ గొలువ
జలధితీరముచేరి - శరములువఱసి
జలరాశిగరువంబు - చాయకుందెచ్చి
నలుఁడు సేతువుగట్ట - నలినాప్తకులుఁడు
బలిమితో లంకపై - పాళెంబుడిగ్గి 470
రావణకుంభక - ర్ణప్రముఖులను
కావరంబులుమాన్చి - కలనిలోగెలిచి
శరణుచొచ్చిన విభీ - షణునిఁగారుణ్య
పరతచే లంకకుఁ - బట్టంబుగట్టి
అనలుచే పరిశుద్ధ - మైనజానకిని
వినువీథి నింద్రాది - విబుధులుపొగడ
వరియించె దేవతా - వరమునఁగపుల
మఱలంగ బ్రతికించి - మానినితోడ
సైన్యంబుతోడ పు - ష్పకముపై మఱలి
ధన్యాత్ముఁడౌభర - ద్వాజునాశ్రమము 480
నిలిచి పావనిఁబిల్చి - నిజవిజయంబుఁ
దెలుపనంపుటయు నం - దిగ్రామమునకు
నతఁడేఁగి వినిపింప - నలరి యాభరతుఁ
డతిశయప్రీతిమై - యపుడెదుర్కొనఁగఁ
దారునచ్చటికేఁగి - తలముల్లు నార
చీరలునూడ్చి రం - జిల్లఁగై సేసి
ఆసత్త్వనిధి యయో - ధ్యాప్రవేశంబు
చేసి సుమంతవ - సిష్ఠాదులైన

పరమా ప్తజనులుచేఁ - బట్టాభిషేక
పరమోత్సవమునొంది - ప్రజలఁ బాలించి 490
ధార్మికులై పుష్టిఁ - దనరి సంతుష్టిఁ
బేర్మిగైకొని రోగ - బృందంబునణఁచి
భయములు దుర్భిక్ష - భయములు నగ్ని
భయములుఁదస్కర - భయములు లేమి
భయములు వాతజ - భయములు జంతు
భయములు లేక శో - భనవైభవముల
ధనధాన్యపశువస్తు - తరుణీకుమార
కనకభూషణ వాహ - గణములంగలిగి
పతులఁబాసినయట్టి - భామినీమణులు
సుతశోకముల మను - జులు నెందు లేక 500
కృతయుగమర్యాద - నెల్లపుణ్యముల
క్షితివెలయంగఁబో - షించుచు నతఁడు
హయమేధశతకంబు - నయుతగోదాన
నియమముల్ మిగులఁబూ - ని చరించిమించి
జనములనేకాద - శసహస్రవర్ష
దినములుపాలించి - దివ్యులుపొగడఁ
గైవల్యమునఁ కేఁగుఁ - గావుననిట్టి
రావణాహితుబాల - రామాయణంబు
ధరణీసురులు విన్న - ధర్మబోధంబు 510
నరపతుల్ వినిన నా - నారాజ్యములును
వణిజులు వినిన స - వస్తులాభంబు
గుణులుశూద్రులు విన్నఁ - గోరుకోరికలు
గలుగునంచును రామ - కథ బాలకాండ

వలనొప్పునాదికా - వ్యముగ నారదుఁడు
వాల్మీకివేఁడిన - వాక్యరూపముగఁ
దాల్మిసంక్షేపక - థావిధానంబు
వాకొని యమ్మౌని - వరుపూజలంది
నాకంబునకు నేఁగె - నారదుఁడపుడు

## —: కథారంభము :—

పరమధార్మికుఁడైన - ప్రాచేతసుండు
కరమొప్పుచున్న గం - గానికేతమునఁ 520
తమసమీపమున ను - త్తమసత్వరాశి
దమితసంసారాంధ - తమసయౌ తమస
నీలంపునిగ్గుల - నిగనిగల్ దేఱి
చాలంగ తేటలై - సరళప్రవాహ
విలసితమౌతీర్థ - విభవంబుఁజూచి
కెలనశిష్యునితోడఁ - గీర్తించిపలికె
తాపసోత్తమ! భర - ద్వాజ! చూచితివె!
యీపుణ్యవాహిని - నిదియొక్కటేవు
కలుగనినీట న - కల్మషంబగుచు
నలరె సజ్జనమాన - సాబ్జంబుఁబోలి 530
స్నానంబు సేఁత మి - చ్చటనీదుచేతఁ
బూను కమండలం - బు ధరిత్రినుంచి
నారచీరలుదెమ్ము - నావుడునట్ల
గా రానతండు వ - ల్కలములొసంగ
వలువలందుక తన - వలసినయెడల
మెలఁగుచోనొక్క భూ - మీరుహాగ్రమున
చంచూపుటంబులతోఁ - జంచుపుగూర్చి

క్రౌంచముల్ కవగూడె - కలకలధ్వనుల
వీనులచొక్కింప - విని తేరిచూచు
వానినాయకుని స - మక్షంబునందు 540
నొకబోయ కనికరం - బొకయింత లేక
యొకయమ్ముచే క్రౌంచ - మొర్విపైఁగూల
వేసిన నెత్తురుల్ - వెడలవాతెఱను
మూసినకన్నుల - ముద్దయైపడిన
కరుణాసముద్రుఁడా - క్రౌంచంబునందు
తరుశాఖపై క్రౌంచి - తల్లడమంది
పలవరింపుచుపొక్కి - పడితెక్కలార్చి
కలఁగుచుఁగాలూఁదఁ - గానకయొడల
తొగరుదేఱెడుజుట్టు - తో మెఱుఁగెక్క
పొగరునెమ్మనితోఁ - బొరలుప్రాణేశుఁ 550
జూచివందురుచున్న - చోపక్షిఁ దేరఁ
జూచికిరాతుపై - సోఁకోర్వకతఁడు
ఓరినిషాద! నీ - యొడలుర్విమీఁద
నేరదుకొన్నాళ్లు - నిలిచివర్తిలఁగ
నేమికార్యంబుగా - నేసితిక్రీడ
నేమఱియున్నట్టి - యీపక్షిఁబడఁగఁ
గొంచకనాప్రేమాలఁ - గొంచఁద్రెళ్లించి
కించనైతివి వీలో - కించనోరుతుమో!"
అనియిట్లుశపియింప - నాశాపవాక్య
వినుతాక్షరములొక్క - వృత్తరూపమునఁ 560
బరగిననాశ్చర్య - పరవశుండగుచు
మరియునుమఱియునె - మ్మదిఁజర్చచేసి

తనశిష్యుఁడగు భర - ద్వాజునితోడ
వినుమునితన శాప - వృత్తంబుదెలిపె

మానిషాద! ప్రతిష్ఠాం త్వ మగమ శ్శాశ్వతీ స్సమాః
యత్క్రౌంచ మిథునా దేక మవధీః కామమోహితమ్

ఈ లీలశపియింప - నీశాపవాక్య
మేలకో శ్లోకమై - యొసఁగె నివ్వేళ 570
జంత్రగాత్రములకు - జతగూడె పాడ
తంత్రీలయసమన్వి - తంబయిమించె
ఛందోనిబద్ధమై - చరణముల్ నాల్గు
నందమై యిదివింత - యయ్యెనెమ్మదికి
శోకంబునఁగిరాతుఁ - జూచి తిట్టినను
శ్లోకరూపంబయ్యె - చోద్యమైయనిన
ఆమాటవిని మది - నాభరద్వాజుఁ
డామోదమునునొంది - యదిపఠియించి
యిరువురు నలరొందు - నెడ భరద్వాజుఁ
డురుభక్తిఁదత్ప్రవా - హోదకంబులను 580
గురునితోఁగ్రుంకిడి - గురుఁడేఁగ వెంటఁ
గరమున జలపూర్ణ - కలశంబుదాల్చి
తమయాశ్రమముచేరి - తచ్ఛాపవాక్య
విమలార్థమాత్మభా - వించునవ్వేళ
లోకేశుఁడఖిలైక - లోకనిర్మాత
నాకుసంభవుంజూడ - నలినసంభవుఁడు
వచ్చిననెదురుగా - వచ్చివాల్మీకి
యచ్చపుభక్తితో - నర్ఘ్యపాద్యముల

నొసఁగి యర్ఘ్యాసనం - బునిచిన దాన
వసియించి ధాత యా - వాల్మీకిఁజూచి 590
యుచితస్థలమునఁగూ - ర్చుండ నేమింప
విచలితాత్మకుఁడౌచు - విన్నఁబోవుచును
పాపాత్మునిశపింపఁ - బరుపో_క్తి శ్లోక
రూపమైయునికి యా - క్రోశించిక్రౌంచి
విలపంబులకు బోయ - వేటునక్రౌంచ
మిలఁగూలె నన్యాయ - మిటులనివగచి
వగనున్నమునిఁజూచి - వనజసంభవుఁడు
నగుమోముతోడ నా - నతియిచ్చెనపుడు
ఏలయ్యమునినాథ! - యీశాపవాక్య
మూలమై వాణి నీ - ముఖమునవెల్చె 600
చింతిల్లనేఁటికి - శ్రీరాముచరిత
మంతయునీవు కా - వ్యముగా రచింపు
నారదుం డేతీరు - న వచించె నీకు
నారీతిఁ జేయు రా - మాయణరచన
తెలిసియుఁదెలియని - దేవాదిదేవు
లలితచారిత్రలీ - లాస్వరూపగుణ లు
రావణాసురముఖ్య - రాక్షసకృత్య
భావముల్ సీతాప్ర - భావచర్యలును
నెఱుఁగనివెల్ల నీ - హృదయంబులోన
నెఱుఁగంగనగు నీకు - నెద్దితోఁచినను 610
సత్యమై యాగము - చయముచందమున
నిత్యమై నీవాణి - నిలుచునెల్లపుడు
నమ్మనోహరకావ్య - మద్రులు నదులు

నిమ్మహిఁగలనాళ్ల - కిమ్మయివెలయు
నెన్నాళ్లు భువినుండు - నిమ్మహాకావ్య
మన్నాళ్లు నీవునీ - యవనివర్ధిలుము.
ఆవెన్క నేనుండు - నన్నాళ్లునాదు
శ్రీవనుండుము జగ - ద్గీతవర్తనల
ననుచునంతర్ధాన - మందె పద్మజుఁడు
మునివరుండాశ్చర్య - మునఁదేలుచుండి 620
తనశిష్యులను భర - ద్వాజాదులైన
మునులెల్ల నాశ్లోక - ము పఠింపుచుండ
వినియిట్టి సమవర్ణ - వృత్తముల్ గూర్చి
తనసేయుకావ్యమం - తయుఁబూనఁదలఁచి
సర్వసంపద్గుణ - సామగ్రిగలుగు
సర్వోన్నతము రామ - చరితమంతయును
వస్తువుగాఁగ భా - వములోననిల్పి
స్వస్తికాసనమున - స్వస్థుఁడై నిలిచి
వారిపూరమ్ములు - వలకేలనంటి
తూఱుపుఁగొనలవాఁ - దుగదర్భలునిచి 630
అంజలితోఁగూడ - నందువసించి
రంజిల్లుమదిని శ్రీ - రామాయణంబు
గావింపఁదలచి రా - ఘవుల వర్తనము
భావించి దశరథ - పతిచరిత్రంబు
కౌసల్య మున్నగు - కాంతలనడక
లాసన్నమైన రా - మాత్మవర్తనము
నతనితమ్ములజాడ - లాసీతవలని
కతలును వారల - కల లక్షణములు

నగవులు మాటలు - నడుపులుం గ్రియలు
తగవులు హృదయవ - ర్తనములిచ్చలును 640
వనములలో రఘు - వరునిచెయ్దములు
అనిమిషారాతుల - యాగడంబులును
కరతలామలకంబు - గాఁజూచినట్లు
వరుస జిత్తగువున - వ్రాసినయట్లు
కన్నులఁగట్టిన - కరణిఁజిత్తమున
నన్నియు నాకకోవ - యై గోచరింప
రత్నంబులన్నియు - రాసిగాఁగూర్చు
రత్నాకరంబన - శ్రవణపర్వముగ
ధర్మార్థదము కామ - దము మోక్షదంబు
శర్మదంబును పుణ్య - సారంబుగాఁగ 650
శౌర్యంబు సత్యంబు - సౌమ్యవర్తనము
ధైర్యంబు శాంతియు - దాంతియువెలయ
రాముని జననంబు - రఘువీరువేఁడ
కామించి వచ్చిన - కౌశికస్థితియుఁ
దాటకహరణంబుఁ - దపసిజన్నమున
మేటిరక్కసులఁబో - మీటిగెల్చుటయు
జనకుజన్నము చూడఁ - జనుచోట గౌత
ముని యహల్యకుశాప - మోక్షమిచ్చుటయు
మిథిలా (పురంబున - మేటిరాఘవుఁడు
పృథుశక్తిహరువిల్లు - పేర్చిత్రుంచుటయు 660
సీతావివాహంబు - సీతతోపురికి
నేతేర భార్గవుం - డెదిరియాఁగుటయు
నతనిభంగము నయో - ధ్యాప్రవేశంబు

క్షితిపతిరామాభి - షేకవార్తయును
కైకవరంబు బొం - కక దశరథుఁడు
మేకొనియునికియు - (మిథిలాతనూజ)
సౌమిత్రియునువెంటఁ - జనుదేరవెడలు
రాముని భీకరా - రణ్యయాత్రయును
గుహునిఁజూచుటయును - గుహుఁడోడగడప
గహనంబులందులఁ - గడచిపోవుటయుఁ 670
చిత్రకూటనగంబు - చేరిరాఘవుఁడు
క్షాత్రవైఖరి పర్ణ - శాలనిల్చుటయుఁ
బురిలోన దశరథ - భూపతి శోక
భరముచే స్వర్గతిఁ - బాటిల్లుటయును
భరతుండు తండ్రికిఁ - బరలోకవిధులు
గరిమఁజేయుటయు రా - ఘవుఁదోడితేర
వనులకేఁగఁగభర - ద్వాజుఁడెల్లరకు
వినయవర్తనముల - విందొనర్చుటయు
డాసి యాచిత్రకూ - టముమీఁదభరతుఁ
డే సేరఁగని రాము - నీక్షించి (తమదు) 680
పురికి రమ్మనుటయుఁ - బోకరాఘవుఁడు
భరతునకును తన - పాదుకాయుగము
నిచ్చిపొమ్మనుటయు - హితమతి మరలి
వచ్చియాభరతుఁ డు - ర్వరయెల్ల రామ
పాదుకాధీనమై - పరగించి ప్రజల
నేది నందిగ్రామ - మిరవుసేయుటయు
రాముఁడు దండకా - రణ్యంబుచేరి
యామేర మునులకు - నభయమిచ్చుటయు

శరభంగుని సుతీక్ష్ణ - సంయమిఁజూచి
యరిగి యగస్త్యుని - నాశ్రయించుటయు 690
నతఁడొసంగంగ విల్లు - నమ్ములు నసియు
నతిభక్తినంది య - య్యనుమతంబునను
పంచవటిస్థలిఁ - బర్ణశాలను వ
సించుచున్నెడ వారి - చేత శూర్పనఖ
ముక్కునుజెవులును - మొదలంటఁబోయి
దుక్కంబుతో ఖర - దూషణాదులకుఁ
దెలుపుటయును వారు - దిక్కయి వచ్చి
చలమున రాఘవా - స్త్రమ్ములచేత
పదునాల్గువేలకా - ల్బలముతో వారు
కదన నీల్గిన దశ - కంధరుండెఱిఁగి 700
మారీచుఁడును తాను - మనుజేశుఁడున్న
యారామమున కేఁగ - నపుడు రావణుని
యనుమతినొకపృగ - మై రామచంద్రుఁ
గనుబ్రామటయు వాఁడు - కడతేఱుటయును
రావణుండపుడు ధ - రాతనూజాతఁ
గావరంబున చెఱి - గొఁబట్టుటయును
మరలువేళ జటాయు - మరణంబు వాఁడు
పురికినేఁగి యశోక - భూజంబుక్రింద
సీతనుంచుటయును - శ్రీరామచంద్రుఁ
డాతని వైదేహి - నరసికానమియు 710
వచ్చి జటాయువు - వచనసంగతిని
చిచ్చుఱయమ్మున - చేతులుందునిమి
పఱతెంచునట్టి క - బంధుఁద్రుంచుటయు

హరిణాక్షిశబరిచే - నర్చలందుటయుఁ
బంపాతటంబునఁ - బవమానతనయుఁ
సంపూర్ణజవసత్త్వ - శాలిఁగాంచుటయు
మారుతతనయునా - మతమునం జేరఁ
జేరి సుగ్రీవుతోఁ - జెలిమిఁబూనుటయు
వాలిసుగ్రీవుల - వైరవర్తనము
వాలినిగెలుచు స - త్త్వముగనుపింపఁ 720
గడకుఁబో దుందుభి - కాయంబుమీటి
తడయకప్పుడు సప్త - తాళముల్గూల్చి
నమ్మించుటయు భూమ - నాయకుండపుడు
సమ్మతి వాలితో - జగడించుటయును
వాలిఁగూల్చుట రఘు - వరుఁడు కిష్కింధఁ
బాలింప సుగ్రీవుఁ - బతిఁజేయుటయును
వానకాలము మాల్య - వంతంబునందు
తా నిల్చుటయు భాను - తనయు నవ్వానక
రప్పించుటయును ధ - రాతనూజాత
నెప్పువానరులచే - నెమకఁబంపుటయు 730
బవనందనుఁడు సం - పాతివాక్యముల
జనమున జలరాశి - చౌకళించుటయు
సామీరి లంకలోఁ - జానకివెదకి
యేమేరఁగానక - యిచ్చఁగుందుటయు
శోకంబునొంది య - శోకంబుక్రింద
నాకొమ్మవసియింప - నరసిచేరుటయు
వ(రలు నుంగి)రమిచ్చి - వనమొల్లఁ బెఱికి
సరగ నక్షాదులఁ - జమరిచ్చుటయుఁ

జిట్టకంబుల నింద్ర - జిత్తుచేఁజిక్కి
నెట్టుకయాలంక - నీఱుసేయుటయు 740
మరలి యంబుధిదాఁటి - మనుజేశుఁగాంచి
వరబుద్ధినేఁగంటి - వైదేహి ననుట
రాముఁడేపున వాన - రబలంబుఁబోవ
నామేర జలరాశి - నాశ్రయించుటయు
శరణుజొచ్చినవిభీ - షణునకు రామ
నరపతి యభయదా - నంబు సేయుటయుఁ
బ్రాయోపవేశంబు - బడశాస్త్రవిజయ
సాయకంబులవార్ధిఁ - జాలఁగ్రోల్చుటయుఁ
గడలిపై సేతువు - గట్టివానరుల
విడియించి యాలంక - వీటఁబుచ్చుటయు 750
రావణకుంభక - ర్ణవధక్రమంబు
దేవతల్మెచ్చఁబొం - దిన విభీషణుని
పట్టంబుగట్టించి - పావకశిఖల
ముట్టిన జానకి - ముదము రెట్టింప
విబుధానుమతిమున - వేడ్కఁజేపట్టి
సబలుఁడై పుష్పక - స్థలి వసించుటయు
మరలివచ్చుచును రా - మవిభుండు మాని
వరుఁడగు నాభర - ద్వాజుఁగాంచుటయు
మానవపతి హను - మంతునిఁబిలిచి
పూని నందిగ్రామ - మునకుఁబంపుటయు 760
భరతుఁడెదుర్కొనఁ - బార్థివోత్తములు
పొరిఁబొరి వల్కలం - బులు దొలంగుటయు
సకలభూషణసము - జ్జ్వలులై యయోధ్య

వికసింప మతులు ప్ర - వేశించుటయును
శ్రీ......................భవము
చేరినదొరలంగై - సేసి పంచుటయు
జగతి తా నేకాద - శసహస్రవర్ష
మగుదినంబులు ప్రజ - నరసిప్రోచుటయు
నడవులకును సీత - నంపుట సీత
కడుపున కుశలవుల్ - గలుగుట యనెడి 770
కతలమీరుచు నాఱు - కాండముల్ గాంగ
జతగూర్చియేనూరు - సర్గముల్ గలుగ
...................వదినాల్గువేలు
పదముల గ్రంథవి - స్తరమై యెసంగ
నొనరించిపై కథ - లుత్తరకాండ
మునఁజెప్పె వాల్మీకి - మునినాథుఁడపుడు
కుశలవు లత్యంత - కుశలమానసులు
దశరథపౌత్రులు - దార శేముషులు
వచ్చిన నిగమముల్ - వారికినేర్పి
వచ్చినతరవాత - వాల్మీకిమౌని 780
...................లు జతగూడియున్న
కరణులు బుద్ధినై - ఖరులురక్తియును
రాగశిక్షయుఁజూచి - రామాయణంబు
బాగుగా వారికి - పఠియింపఁజేసె
గాంధర్వ మధుర సం - గతుల వీశియలు
సంధించి గాంధార - షడ్జనిషాద
ధైవత ఋషభ మ - ధ్యమ పంచమముల
తావులు మంద్రమ - ధ్యమతారకముల

వెలయవారలకథ - వినుపింపఁ జూచి
చెలువముల్ నడుపులు - సింగారములును 790
పలుకులు నాజాను - బాహువుల్ చెవుల
వెలుపాటియురములు - వెడఁదకన్నులును
చూచిమానులువారి - సొబగుశ్రీరాముఁ
జూచి యచ్చునఁదీర్చు - చోద్యమై యుండ
బింబంబు తత్ప్రతి - బింబంబు లటుల
నంబకంబులకు న - త్యానందమొసగ
నున్న వారలచంద - మూర్వీజనంబు
విన్నవించిన రామ - విభుండు హర్షించి
చూచువేడుకనుండు - చో నాశ్రమమున
వాచంయములు వారి - స్వరవిశేషములు 800
విని సభయై కూడి - వికచాననములఁ
గనుదామరల నశ్రు - కణములురాల
నానందములనొంది - యౌనయ్య! మేలు!
గానమా సరిసాటి - గానమెయ్యెడల
రాగమేళన ననురా - గంబులొంది
బాగయ్యెశ్లోకార్థ - భావంబులనుచు
మెచ్చియందొకమౌని - మేలిమిఁగొంచు
లిచ్చెదండెపుగోల - యిచ్చెనొక్కరుఁడు
.........యి - చ్చెనొకండుదాత
తానమై గోపిచం - దనమిచ్చెనొకఁడు 810
భూషింప వల్కలం - బులొసంగెనొకఁడు
కాషాయవస్త్రముల్ - గప్పెనొక్కరుఁడు
.........ఒగ్గనమీద - మీదనమ్మౌను

లిచ్చునీవులకు - వారిచ్చులనలరి
ఆయుష్యమును నీతి - హోసముఖ్యంబు
శ్రేయస్కరము - కవిజీవనౌషధము
శ్రుతులసారమ్ముతే - జోలాభకరము
నతులంబునైనరా - మాయణంబిట్లు
వినుపింప సిచ్చులు - విని మునిరాజు
తనవెంటసీతనం - దనులఁదోడ్కొనుచుఁ 820
దమ్ములుగొలువర - త్నమయాసనమున
సమ్మతిరాజులు - సచివులనడుమఁ
గొలువున్నశ్రీరాము - కొలువులోపలికిఁ
గళుకువీణెలు పు_స్త - కమ్ములు పూని
మునుకొని వచ్చురా - ముని బాలకులనుఁ
గనుఁగొనిలక్ష్మణ! - కంటివే వీరి
జోడుగూడినయట్టి - శ్రుతులవియ్యంబు
పాడెడుచందంబు - పలుకులందములు
మహనీయరాజకు - మారలక్షణము
లహాహా! నామదికిప్పు - డానందమయ్యె 830
వినుమనికొలువులో - విభులెల్లవినఁగ
జనకుఁడుశ్రీరామ - చంద్రుండువలుక
మునియెచ్చరింప రా - మునికథ సుతులు
వినుపించు తత్కథా - విధమెట్టిదనిన

— కథాప్రారంభము —

మనువంశనృపులచే - మహనీయ్యమగుచు
ననుపమంబయ్యెరా - మాయణరచన

సగరులచేనైన - సాగరంబనఁగఁ
దగునదిలోకైక - ధర్మసాగరము

## — అయోధ్యాపుర వర్ణన —

సరయువుపొంతకో - సలదేశమునను
ధరణిఁజెన్నగునయో - ధ్యాపట్టణంబు 840
నొండు రెండునునైన - యోజనంబులకు
నిండిన వెడలుపు - నిండుపండ్రెండు
యోజనంబుల పొడ - వొప్పుపట్టణము
రాజితంబుగమను - ప్రభుండునిర్మించె
రాజమార్గంబులు...............
రాజిల్లుమణిమయ - రంగవల్లికలు
పుష్పమేల్కట్టుల - బ్బురపుమేడలును
పువ్వులతోఁటలు - భువనేశ్వరములు
మకరకేతనములు - మణిగవాక్షములు
చకచకల్ వెదచల్లు - చంద్రశాలలును 850
కోటలునట్టళుల్ - కొత్తళంబులును
నీటైనయంగళ్లు - నిబిడయంత్రములు
రం...................లుజబురు
జంగులాశ్వరులుదం - చనపుఁజేతులును
నరిభీమ తేజంబు - లగుసామజంబు
లరయఁబాయురయంబు - లగుహయంబులును
రత్నసౌధములు కి - రాటయూధములు
రత్నాకరానుకా - రము లగద్దలును

సావళ్లఁ బసిఁడిహ - జారముల్ కడల
కావళ్లఁగాచువి - క్రమవీరభటులుఁ 860
కేళీవనమ్ములుఁ - గృతకాచలములు
బాలికాలంకార - పణ్యవీధులునుఁ
బరవుచప్పరము లు - ప్పరిగెలు సాము
గరుడులు వైభవా - గతవిమానములుఁ
జెఱకుఁదోఁటలు - మిన్నుచెనకుకోటలును
విరులుఁగదంబముల్ - విలుచుఁబేటలును
దేవాలయములు భూ - దేవవీథులును
బావుకదుందుభి - ప్రణవఘోషములు
వీణాపణవశంఖ - వేణుమృదంగ
రాణాతిమధురధీ - రధ్వానములును 870
నదిమనోదరదంబు - లగునరదములుఁ
బదికింప విక్రమో - ద్భటులైనభటులు
వేదశాస్త్రార్థకో - విదులైనద్విజులు
నాదిరాజనయజ్ఞు - లైనరాజులునుఁ
గలిమిఁగుబేరునిఁ - గైకొనివణిజు
లలరవిప్రులఁగొల్చి - యమరుశూద్రులును
మకరతోరణములు - మహనీయకేతు
నికరముల్ నిర్మల - నీరదీర్ఘికలు
గోపురంబునుమించు - గోపురంబులును
కోపనానూపుర - కోలాహలంబు 880
నలరొందియింద్రుని - యమరావతియును
జలరుహాగర్భుని - సత్యలోకంబు
యక్షలోకేశ్వరు - నలకాపురంబు

నక్షీణశమనసం - యమినీపురంబు
గెలుచునానాగుణ - కీర్తనల్గాంచి
యలరునయోధ్యాఖ్య - హాపట్టణంబు

## — దశరథుని రాజ్యపాలన —

పాలించుసకలభూ - పాలశేఖరుఁడు
శీలవివేకదా - క్షిణ్యభూషణుఁడు
వరమతియిక్ష్వాకు - వంశవర్ధనుఁడు
స్థిరధైర్యనిధి జితేం - ద్రియుఁ డుదారుండు 890
ధార్మికాగ్రణి దీర్ఘ - దర్శి యత్యంత
నిర్మలచిత్తుండు - నిపుణమానసుఁడు
బలవంతుఁ డతికృపా - పరుఁడు పుణ్యాత్ముఁ
డలఘుకీర్తివినోది - డైశ్వర్యఘనుఁడు
సత్యసంధుఁడు సర్వ - సముఁడర్థులకును
నిత్యదాత త్రికర్మ - నిరతుఁ డుత్తముఁడు
నతిసాహసుండ స - మాధికవైరి
నతరాజిలోకుఁడు - న్నతభుజాబలుఁడు
దశదిశల యశః ప్ర - తాపముల్ నించు
దశరథుండలరునా - ధన్యురాజ్యమున
నప్రసిద్ధుఁడపూజ్యుఁ - డలసమానసుఁడు 900
నప్రయోజకుఁడు న - నాచారపరుఁడు
నపకారి నాస్తికుం - డవివేకి మూర్ఖు
చపలచిత్తుండు దు - ర్జనుఁడు కొండియుఁడు
పాపాత్మకుఁడు మధు - పాని దుర్జనుఁడు
కోపి జాల్ముఁడు కృత - ఘ్నుండు కాముకుఁడు

దారిద్ర్యవైరూప - ధరుఁడు కురూపి
జారుండు చోరుఁ డ - జ్ఞాని లోభియును
వెదకిన లేక కో - విదులు ధార్మికులు
సదయాత్మకులు సత్య - సంధు లాఢ్యులును 910
బరమపుణ్యులుఁ గీర్తి - పరులు కారుణ్య
నిరతులు నిజకార్య - నిర్వాహకులును
నన్యోన్యహితులు ద - యాళువుల్ సుజన
మాన్యులు సకలస - మ్మతులు ధీరులును
నుపకారులును, వైభ - వోన్నతుల్ వీత
కపటమానసులునై - కడఁ గూడఁ గలిగి
పితృవాక్యపాలన - ప్రియకుమారకులు
పతియ దైవంబని - పాటించుసతులు
నతిథులందనియించు - నన్నదాతలును
వ్రతముగా నిజధర్మ - వశులైనజనులు 920
మీఁటియవ్విభుఁడుధా - ర్మికుఁడై నకతనఁ
జోరులు సకలశో - భనసమృద్ధులును
మణికుండలములు భ - ర్మకిరీటములును
ప్రణుతవిభూషణాం - బరవితానములుఁ
బువ్వులుపూఁతలు - భోగభాగ్యములు
నవ్వమోములు లల - నారత్నములునుఁ
పాఁడియుఁబంటయు - బహుపదార్థములుఁ
బోఁడిమియునుఁగల్గి - పొదలుచునుండ
నగరంబువెలి సత్య - నామమై చాల
నగణితంబైన మ - హాప్రదేశమున 930

తగవింధ్యహిమవన్మ - తంగశైలముల
నెగడి దా నంబువుల్ - నిబిడముల్ గాఁగఁ
గట్టుకంబముల ని - గళములుగదియఁ
బట్టు కుముదసార్వ - భౌమాంజనాది
కులములుంగల దంతి - కులము సజ్జార
ముల నడగొండల - మురువున మెఱయ
శక పారశీక భో - జ వనాయు సింధు
కుకుర బాహ్లికహట్ట - ఘోట్టాణజములు
హాళి ద్వియోజనా - యతమైన వాజి
శాలలహయముల - చడితీలు మెఱయ 940

## — మంత్రివర్ణన —

నింగితజ్ఞులు నతి - హితులు మంత్రజ్ఞు
లంగీకృతాన్యోన్యు - లనురక్తులైన
సిద్ధార్థ విజయదృ - ష్టి జయంత్ర మంత్ర
సిద్ధ సాధకజయ - స్థిర సుమంత్రులును
మఱి యశోకుఁడు నెన - మంద్రుప్రధాను
లరయనవ్విభునిఁబా - యకఁగొల్చియుండ
వరపుణ్యులు వసిష్ఠ - వామదేవాఖ్యు
లిరువురు హితపురో - హితులై వసింప
వెలయుచు ధర్మకో - విదులు జితేంద్రి
యులు ననాగత కార్య - యోజనపరులు 950
రాజానుమతులు ప - రస్పరస్నేహ
రాజితుల్ చారవా - ర్తావిలోకనులు
సర్వసమాను లు - త్సాహసమేతు

లుర్వీహితులు చతు - రోపాయమతులు
సంధివిగ్రహముఖ - షడ్గుణోన్నతులు
సంధాప్రతిష్ఠితుల్ - సామాదిరతులు
నైనమంత్రుల కిర - ణావళిచేత
భానుఁడొప్పెడురీతి - పఙ్క్తిరథుండు

— దశరథుఁడు పుత్రకామేష్టిఁ జేయ యత్నించుట —

తావెలసియును సం - తానంబు లేని
యావిచారంబుతో - నశ్వమేధంబు 960
గావింపఁదలఁచి యా - గమవేత్తలైన
పావనాత్మకులను - బ్రాహ్మణోత్తముల
వామదేవసుయజ్ఞ - వత్సజాబాలి
జైమినిభరతకా - శ్యపముఖ్యఋషుల
నాత్మపురోహితుం - డైనవసిష్ఠు
నాత్మజహీనతఁ - బ్రాప్తమైనట్టి
ఖేదంబుఁదెలుప నుం - కింప యమ్మౌను
లాదరంబున విన - నతఁడిట్టులనియె
అఖిలంబునెఱుఁగుదు - రాత్మజుల్ లేక
సుఖమెట్లు గల దెందుఁ - జూచిననాకు 970
నేతదర్థంబుగా - నే నశ్వమేధ
మీతరింగావింప - నిచ్ఛయించెదను
యీకోర్కెలీడేర్పఁ - డింతటివారు
నాకుఁగల్గి యుపేక్ష - నాయమే? సేయ
నరువదివేలేండ్లు - లఖిలభోగముల
ధరణియేలితిని ద - త్తకురిత్తచనిమోఁ

గాలంబు మీఱలీ - కార్యంబుఁదీర్ప
నాలోచనముసేయుఁ - డనినవారెల్ల
మేలు! నృపాలక! - మీహృదయంబు
కీలెఱుంగకమాకుఁ - గిమ్మనరాదు 980
ఎఱుఁగకయున్నార - మే భావికార్య
పరిణామ మది కాల - పక్వంబు చేత
నెన్నడు లేనట్టి - యీచింత యింత
సన్నమె పొడము - టీశ్వరునాజ్ఞఁగాక
కడతేర్తు మట్లనే - కావింపు మఘము
విడిపింపు తురగంబు - విధ్యుక్తముగను
యాగోపకరణంబు - లఖిలవస్తువులు
వేగదెప్పింపుఁడు - వేదులమర్చి
సరయూతటోత్తర - స్థలమున శాల
విరచింపఁజేయుఁడు - వివిధనైఖరుల 990
నన నట్లకాగ న - య్యశ్వరత్నంబు
ఘనలక్షణంబుల - గలదాని వెదకి
దురితంబులణఁగ శాం - తులుహోమములును
స్థిరమతిఁజేసి ఋ - త్విక్కులంజూచి
తప్పులురాకయ - థావిధిగాఁగ
కప్పకయందఱుఁ - గనుకల్గియొకట
కొదవలురానీక - కొనసాగ యాగ
మిదినెరవేర్పుఁడెం - తే యెచ్చరిల్లి
ఛిద్రముల్ వెదకుచుఁ - జేరుదురపుడు
భద్రకర్మేతరుల్ - బ్రహ్మరాక్షసులు 1000
అందుచే యజమాన - హానియాగాన

నందరునందుప్ర - యత్నముల్ గలిగి
సకలసామగ్రుల - సమవదానములఁ
బ్రకటింపుఁడన వారు - పార్థివునాజ్ఞ
నటులకావింపుదుమని - యిండ్లకరుగు
నటమీఁద మంత్రులు - నందఱంబనిచి
నగరిలోపలికేఁగి - నరపతి తనదు
మగువలతోడ న - మ్మారులవేఁడి
దాను తురంగమే - ధము సేయుదీక్ష
పూనినచందమ - ప్పుడు దెల్పుటయును 1010
ప్రాభాతికంబులా - పద్మినులట్ల
సౌభాగ్యవతుల యా - స్యంబులువొదలి
యానందములంబొంది - రమ్మఱునాఁడు
మానవేంద్రుఁడు మహో - మహిమగొల్వుండి
పుత్రులపై యాస - పురికొల్ప వేడ్క
మత్రాధికముగ సు - మంత్రుఁడిట్లనియె
దేవ! పూర్వమున ఋ - త్విక్కులచేత
నేవిన్నయర్థంబు - హృద్గతంబగుచు
బొసఁగియున్నది నీ - దుపూనికెకిపుడు
సుసరంబుగాఁగల్గు - సుతలాభమంచు 1020
నామదిఁదొంటి స - నత్కుమారుండు
సేమంబు నీకురాఁ - జెప్పినమాట
అదియెట్టులనిన కా - శ్యపకుమారకుఁడు
సదమలవిజ్ఞాన - సంపన్నమూర్తి
ఆతనివిభాండకుం - డందురు పేరు
సుతుఁడాతనికిజన - స్తుతచరిత్రుండు

గుణనిధిఋశ్యశృం - గుఁడనంగఁగలఁడు
గణుతింపనమ్ముని - గణికానురక్తి
తావచ్చిరోమపా - దనృపాలునగర
దేవీయుతముగవ - ర్తించునెవ్వేళ 1030
నసముతోదశరథుఁ - డశ్వమేధాంగ
మొసగంగఁబుత్రకా - మేష్టిసేయించి
అమ్మునికృపచేత - నాత్మనందనుల
నమ్మాధవాంశజు - లైనట్టివారి
నలువురఁగాంచున - న్నతెఱంగునాదు
తలఁపున కొనఁగూడె - తప్పదీమాట
అనవిని యెవ్వరా - యనఋశ్యశృంగుఁ
డనుమానియేమిటి - కైయంగరాజు
రప్పించె భోగము - రమణులేమాయఁ
గప్పితెచ్చిరియట్టి - కథయేర్పరింపు 1040
మనినసుమంత్రుఁడ - య్యవనీశుఁజూచి
వినయంబుతోడన - వ్విధమొల్లఁబలికె

— ఋశ్యశృంగుని కథ —

నరవరోత్తమ! విభా - ండకకుమారకుఁడు
చిరతపోనిధి ఋశ్య - శృంగుండురెండు
బ్రహ్మచర్యంబులఁ - బదిలుఁడైనడపు
బ్రహ్మరతుండుపూ - ర్వమహాశ్రమమున
నాశ్రమంబునఁదండ్రి - కగ్నిహోత్రునకు
శుశ్రూషలాచరిం - చు నలంతలేక
అనుదినం బీరీతి - నన్యమేమియునుఁ

దనమది నెఱుఁగక - తపముఁ గావింప 1050
నతని కెగ్గొనరించు - నట్టిదోషంబు
ప్రతిపన్నమై యుంగ - రాజ్యంబునందు
వానలు గురియక - వసుమతి జనులు
దీనులై కుయ్యిడఁ - దెలియంగ లేక
రోమపాదుఁడునుఁ బు - రోహితామాత్య
సామంతులకు నీప్ర - సంగంబుఁ దెలిపి
విజ్ఞాననిధులైన - విప్రపుంగవులఁ
బ్రాజ్ఞులనాగమ - పారంగతులను
వీక్షించి యీ యనా - వృష్టిదోషంబు
దక్షులుమీర లిం - దఱుఁ గలిగియును 1060
నా రాజ్యమునఁ గల్గ - నాయమే ? దీని
నేరీతి వారింతు! - నెద్ది కారణము ?
భావించి మీరలు - ప్రతిచింత సేయు
కీవేళ నురకొందు - రే యనుటయును
విని విప్రులెల్లనా - విశ్వేశుఁ జెంతఁ
బనివచ్చు బెల్లవి - భాండకసుతుని
యొడఁ జేయుమేవిధి - నేని యమ్మౌనిఁ
దోడుక తెచ్చిన నీతి - దోషముల్దొలఁగు
ననవారిఁ గాంచియు - య్యవనీశుఁ డనియె
మనయింటి కాతఁడే - మతమున వచ్చు 1070
నెద్ది యుపాయమిం - కెటుల రప్పింత
మెద్ది సాధక మాన - తిండనిపలుక
రాజేంద్ర! యమ్మౌని - రాజాత్మజునకుఁ
బూజ సేయుచుఁ దాన - ప్రొద్దువోకలను

మెలఁగుటేకానియే - మియు నన్యమెఱుఁగ
డిలనొక్కపురమైన - నీక్షింపఁబోవ
డంగనాపురుషరూ - పాంతరంబరయఁ
డంగాధివర ! యింద్రి - యనిరోధనమున
నున్నవాఁడటుగాన - నొసపరి వయసు
కన్నెలంబనిచినఁ - గనునంతలోన 1080
కమలాక్షుఁడున్నాఁడె - కామనపాల
కమలాస్త్రుఁడున్నాఁడె - కాకామినులకు
విషయాతురుండగు - వెలఁదులచూపు
విషముసోఁకిననెల్లు - వివశుండుగాఁడు
పనుపుఁడిప్పుడె - పణ్యభామినీమణుల
ముని యంతరాక కా - మునిరెంకగాక
అనఘనియాఁగాక - నాప్రధానులనుఁ
బనిచినవారలు - పడవాళ్లచేత
వీటిలో వెలజాతి - వెలఁదులనెల్లఁ
జాటించి పిలిపించి - సవరణల్ చేసి 1090
వలయుసొమ్ములొసంగి - వనితలవెంట
నెళవుదెల్పఁగవిప్ర - నికరంబుఁగూర్చి
పంచినవారువి - భాండకాశ్రమము
నంచుల నొకగుమి - వైవిలాసినులు
దండెయుఁగిన్నెర - తంబురా వీణె
యొండొండసుతి గూర్చి - హాయులుమార్గమున
వింతరాగంబుల - వీనులు చొక్క
పంతుమార్గమ్మునఁ - బదములేర్పఱచి
పాటల నాటల - పంచసాయకుని

వేఁటకుదీములై - వెలపువ్వుఁబోండ్లు 1100
మౌనియాశ్రమమున - మలయుచోఁదండ్రి
స్నానార్థముగ నేఁగు - సమయంబుగాన
నొక్కండు పర్ణశా - లోపాంతసీమ
దక్కరాయితఁడను - తరి గోచరింప
నున్నయమ్మునిం జూచి - యొద్దిక సాని
కన్నియల్ మరుమాయ - గతిఁబడుననుచు
గిలకిలనవ్వుచు - కిన్నరల్ మొరయఁ
తళుకుఁజూపులనుబి - త్తరములు మెఱయ
గణగణమొలనూలి - గంటలు మొరయ
ఝణఝణమంజీర - చయముఘోషింప 1110
కంకణమ్ములుమ్రోయఁ - గమ్మలుగదల
బింకెపుగుబ్బల - బిగువురెట్టింపఁ
గడు లేఁతనడుములు - గడగడవణఁక
అడుగులఁబోషిత - ప్రహాసవ్వముల్ గదియ
వెలలేనినవ్వుల - వెన్నెలల్ గాయ
పలుకులఁగపురంపు - పలుకులురాల
నంగముల్ తళుతళు - క్కని మించులీన
బంగరుకాశలఁ - బసి నిగ్గుమీఱ
జడలనల్లినపువ్వు - సరులు గమ్మనఁగ
విడిగెంపుమోవుల - విన్నాణమెసఁగ 1120
నవయువచాకచ - క్యములురాణింప
నువిదలందఱువాని - యోలంబుచేరఁ
జూచి దిగ్భ్రమనొంది - చోద్యంబువెనిచి
లేచి దిగ్గన మౌను - లే వీరలనుచు

నందఱవదముల - నందంద్రవాలి
చిందులాడుచు వారు - చెదరి కేడింప
కరములు మొగిచిచెం - గటవినయమునఁ
బరువడి నర్ఘ్యముల్ - పాద్యంబులొసఁగి
ఎవ్వాఁడవెద్దిపే - రెఁగింపుమనుచు
జవ్వనులడుగ - నోసంయములార! 1130
నాజనకుఁడు విభాం - డకుఁడు మన్నామ
మీజగతిని ఋష్య - శృంగుఁడటంద్రు
మీయాశ్రమంబెద్ది - మీ రేమి వేఁడి
యేమెడ కేఁగుచు - నిటచేరినారు
అనిన మహాత్మ! మా - యాశ్రమంబిటకు
ననతిదూరము చేర - నగునేఁటిలోన
తడవుగాఁ శాడి ప - దక్రమంబుననుఁ
గడు మెచ్చ శుద్ధమా - ర్గమున మీఁఱుదుము
జలజాంబకు కథాప్ర - సంగముల్ నేర్చి
వలవనియాస నె - వ్వరిఁ జేరఁబోము 1140
మందులలోఁ జేయు - మతముమాతలంపు
లందుతక్కుమహ త్త్వ - మదుగ నేమిటికి
రవణతో శుకవచో - రచనలుచూప
భువి మమ్ముఁబోల స - త్పురుషులు లేరు
ఆ ప్తమర్మ మెఱుంగ - నగుయోగ్యుఁబిలిచి
ప్రా ప్తసంగతి బట్ట - బయలు సేయుదుము
మానినాయక! విను - మా! వనితలము
కానవెన్నడు విని - కని పుట్టు మొదలు
నావలపులజాడ - లరయవుగాక

నీవు మమ్ములఁబాసి - నిమిషమోరుతువె 1150
చక్కనికొమ్మల - చందంబుచూచి
చొక్కన మరలిరాఁ - జూతువే యిటకు
మామోవిపండ్లకై - మనసూరనట్టి
మీమామనులున్నారె - మేదినియందు
కలహంసగమనాను - కారచేష్టలును
నెలకొను కీరవాణీ - విలాసములుఁ
గలకలాయిత రవ - కంఠరవంబు
తలంపనియీ రిత్తె - తపమేల ? నీకు
కొమ్మాస్వదింపు కై - కొనుమనిచెలులు
కమ్మక గోదుమ - కజ్జముల్ మేప 1160
మెండుగా మెసవుచు - మీయాశ్రమమునఁ
బండు నే యిటు - వంటిపండ్లని మెచ్చి
యలరి యాపాదకే - శాంతంబుగాఁగఁ
గలవాణులను చ - క్కఁగాఁ దేఱిచూచి
పూనుమీశివలింగ - ముల కేల లేవు ?
పానవట్టములంచు - పాలిండ్లనివురు
తుమ్మెదగుంపులఁ - దోలెదననుచు
కొమ్మనునుదుటిముం - గురులంటిత్రోచు
వేలిమిఁబోం ల్లెంత - వింతాయెననుచు
తేలిక కస్తూరి - తిలకముల్ మెచ్చు 1170
స్వాదుగా గమగమ - వలచునెచ్చోటి
బూదియోయని గంద - వొడికేలనంటు
ఈవింత ముంజిత్రా - ళ్లెక్కడివనుచు
తా వేదు మేఖలా - దామముల్ చూచి

యేసీమపటికంబు - లిట్లుండుననుచు
గాసిల్ల వజ్రాల - కడియముల్ద్రిప్పు
నేచెట్టులనుఁబుట్టు - నీవల్కలంబు
లీచాయనవి వల్వ - లెగనెత్తి చూచు
మంచివె రుద్రాక్ష - మాలిక లనుచు
కాంచి నీలపుసరుల్ - కన్నులనద్దు 1180
రేకమించఁగ నుత్త - రీయంబులందు
చేకమండలువు లుం - చితిరంచునవ్వు
చిగురాకులా యివి - చిదుముదమనుచు
తొగరుఁగెమ్మోవులం - దుకగిల్లఁజూచు
నిటులున్నయమ్మౌని - నింతులలోనఁ
గుటిలకుంతలయోర్తు - గొబ్బునఁగదిసి
రమ్మనిమౌని క - రమ్ముచేఁబట్టి
సమ్మతినొకమ్రాని - చాటుననిలిచి
జిగిబిగిచన్నుల - చిఱుతసోఁకులను
గగురుఁదాల్పఁగమేను - కౌఁగిటచేర్చి 1190
కరయుగళంబుపైఁ - గదియించివచ్చి
చుఱుచుఱుక్కనగోరు - సోఁకులంటించి
చెవిచెంతనెమ్మోము - చేర్చిమ్రాన్గన్ను
హావణింపఁజేసి పం - చాస్త్రమంత్రములు
కలరవకలరావ - గళనాదభేద
కలనలచేత నం - గము మఱపించి
కొనగొమ్మునాఁటునో - కోమలపాణి
యనుచు చేకాచి కా - యజునిమేల్కొల్ప

తజ్జనకునిభీతిఁ - దరుణులఁగూడి
అజ్జసేసుకపోయి - రవ్వనీవనికి 1200
పోయినం గళవళిం - పుచుఁదెల్వినొంది
మాయలాఁడులమీఁది - మమతలం దగిలి
పసవువాడెల దిమ్ము - పట్టినమీఁరి
కసిగాటుపెనకువఁ - గనువేఁదురెత్తి
యెందువోయిరోమాను - లిందఱుగూడి
కందునొక్కో వాటిఁ - గనుఁబందువులుగ
మీసలుమొలవని - మెచ్చులవయసు
మోసెత్తు వేడబం - బులబ్రహ్మచారి
యొక్కఁడునునుబాటు - కోరి.........
............తని నిండుఁ - జందురువంటి 1210
మొగమునామొగముతో - మొలకలేనవ్వు
చిగురొత్తనత్తించి - చేవింతచేర్చి
యొకమనోహరశబ్ద - ముపదేశమిచ్చె
సకలావయవములు - ఝల్లుమనంగ
నమ్మనోహరశబ్ద - మవ్యక్తమధుర
మమ్మునిబాలు జి - హ్వాంచలసీమ
జనియింప విని జన్మ............
...............మృత - విభవంబుగాఁగ
నాదంబునుండి క - ర్ణరసాయనముగ
నాదుడెందము నిజా - నందకందముగ 1220
నందుచే నేఁదన్మ - యావస్థనొంద
నెందువోయెనొచూడ - కెట్లుండనేర్తు
నెటకుఁబోయిరొ మాను - లేవారిఁజేరి

ఱెటువోయినను వెంట - నే వెలంగుదును
అనియెంచి......... - యక్షిణులందు
వనితలేఁగినజాడ - వచ్చెనచ్చటికి
వచ్చినయెదురుగా - వచ్చి నెచ్చెలులు
పచ్చవిల్తునిపూజ - బాణంబులనఁగ
మెలఁగెడుతొలుకారు - మెఱపులరీతి
మలయుచుఁజక్కఁ గ - మ్రొడటంచునలరి 1230
వనిత లారత్నకం - బళముపైనునిచి
పనివానిఁబిలిపించి - బవిరి దిద్దించి
చలువలుగట్టించి - సన్నపునామ
ములుదీర్చి వలచుగం - బుర విడెమిచ్చి
చవుకళలిడి జీని - సరిపెణల్ వైచి
రవణగా కర ముంగ - రంబులు దొడిగి
పరిమళంబులుఁబూసి - పరువంపువిరులు
కురులచకొమ్మున దిండు - కొనసాగఁజుట్టి
బురుసారుమాలు సొం - పుగఁగట్టి యిల్లు
మఱపించి నడపు నే - మము వీటిఁబుచ్చి 1240
మెలయించుకొని యొక్క - మెలనాఁగచేతఁ
దలిరుకేంగెలఁగ్రై - దండయొసంగి
గిలుకుపావాలుద్రొ - క్కించిరాజసము
తులకింప రోమపా - దుపురంబుఁజేర్ప
నానరపతిమాను - లాప్తులు సకల
సేనలుగొలువ వ - చ్చినమస్కరించి
పల్లకిలోన న - ప్పరమ మునీంద్రు
నల్లంబురంజిల్ల - నునిచి యాచుట్టు

భోగినీరత్నముల్ - బొదివి నానాని
యోగవైఖరులచే - నుడిగముల్ సేయ 1250
గాంధర్వమేళంబు - క్రందుగా మొరయ
సింధురహయబలు - శ్రేణి మున్నాడ
పాదచారంబున - భక్తితో రోమ
పాదుండు మానివెం - బడివచ్చి తనదు
నగరిలో నునుపక్ష - ణంబులో నతని
జగతిపై వానలు - జడివట్టికురియఁ
బ్రజలెల్లనారోగ్య - భాగ్యముల్ గనిరి
రుజలెల్లమాసెనా - రోమపాదుండు
ఆశాంతరాళస - మంచితకీర్తి
కాశాంతకునకు మ - హాతపోనిధికి 1260
నాశాంతకులమణి - యాత్మజయైన
యాశాంతనొసంగిక - ల్యాణంబుచేసి
నమ్మానియున్నవాఁ - డతనిగేహమున
నిమ్మఘంబతనిచే - నీడేరఁగలదు
కరుణాకరులు వంశ - కరులు శ్రీకరులు
పురుషోత్తములునైన - పుత్రులఁగనుము
అంగాధిపతిచెల్మి - యాశింపుమాతఁ
డంగీకరింప నీ - వమ్మౌనిఁదెమ్ము
మారులేదు సనత్కు - మారు పల్కులకు
ప్రారంభ మొనరింపు - మనదశరథుఁడు 1270
ఆనందమున వసి - ష్ఠాను మతంబు
తోనమ్మహాత్ముండు - తోడనేతేర
సరణిఁబల్లకుల కౌ - సల్యాదులైన

తరుణులు రా సుమం - త్రసుయజ్ఞముఖులు
ననుచరులును చతు - రంగబలంబు
తనవెంటఁగొలిచిరా - దశరథేశ్వరుఁడు
పయనరీతుల రోమ - పాదుపురంబు
రయమునఁజేర నా - రాజన్యుఁడపుడు
ఎదురుగావచ్చి య - నేకసత్కృతుల
మది వొదలించి య - మ్మనువంశనిధిని 1280
నాతులతోఁదన - నగరిలోనుంచి
యేతరి నరమర - లించుక లేక
బహుమానముననుంపఁ - బదియేనునాళ్లు
విహితవైఖరినుండి - విందులఁదేలి
భానువంశుఁడు రోమ - పాదునితోడ
తానువచ్చిన ప్రయ - త్నమునకిట్లనియె.
ధారుణీనాథ! శాం - తాదేవితోడ
నారూఢభక్తిని - యల్లునిఁ గూర్చి
మాపురంబునకు ని - మ్మనవియాలించి
తేపె నావెంటవా - రినిఁబంపవలయు 1290
కల దిమ్మహాత్ముచేఁ - గార్యంబుమాకు
వలదనరాదువే - వత్తురుమరల
అననట్లయగుఁగాక - యనిబుశ్యశృంగుఁ
దనపుత్రికనుఁగూర్చి - దశరథువెంట
ననుపుటయును తాను - నతఁడంప మరలి
అనురాగమున నయో - ధ్యాపురంబునకు
నొక్కయందలమున - నువిదయుమునియు
నెక్కిమున్నుగఁ ఱోవ - హెగ్గాళెలులియు

కనకతప్పెటలు శం - ఖములును ధార
లును నాగసరముల - ల్లుకమ్రోలమొరయ 1300
కామినుల్హ స్తకం - కణములు గదల
హేమచామరయు - గం బిరుగడవేయ
తనబలంబునుఁదాను - దశరథనృపతి
వెనుకొనివచ్చియ - వ్విమలాత్ముఁదెచ్చి
నగరంబులోతన - నగరిలోఁగొంత
నగ కేర్పరించి శాం - తాసమేతముగ
నింద్రవైభవముతో - నెల్లరుమాని
చంద్రునియడుగులఁ - జాగిలిమ్రొక్క
మునిచిపూజించిరా - జోపచారముల
ననురాగమొందింప - నంతఃపురమున 1310
దశరథసతులుశాం - తనుఁజూచిపొగడ
దశవారములు మహో - త్సవమునసుండె.

— పుత్రకామేష్ఠి —

అంతసుమిత్రనా - నాగమాంతంబు
సంతోషితస్వాంత - జలజకుంతంబు
అతులప్రకాశమా - నాంశుమంతంబు
ప్రతిపన్నవివిధస - ర్వర్తుకాంతంబు
పవనకిశోరశో - భననిశాంతంబు
నవనవవాసనో - న్నత లతాంతంబు
వాసఁగెమారునిబలం - బునకు పంతంబు
లెసగొనిధరణి - నెల్లెడ వసంతంబు 1320

ఆవేళమఘము సే - యఁగ మదిఁదలఁచి
ధీవిశాలునిదివ్య - తేజోవిలాసు
గుణనిధిఋశ్యశృం - గునిఁబూజచేసి
గణుతించి యాచార్యుఁ - గా నొడఁబఱచి
పరికరమ్ములును సం - భారముల్ గూర్చి
తురగంబువలయు కం - దువఁబోవఁబనిచి
యాసుమంత్రునిఁజూచి - యఖిలఋత్విజుల
వాసోవిభూషణో - జ్జ్వలులఁగావించి
రప్పింపుమనినవా - రలనట్లకూర్ప
నప్పుణ్యనిధి వసి - ష్ఠాదులైనట్టి 1330
వారలంబూజించి - వారితోధర్మ
సారవాక్యములదీ - క్ష వహించియుండి
సంవత్సరంబిట్లు - చనుటయు శాస్త్ర
సంవేదిమఱల వ - సంతకాలమున
సవనశాలాప్రవే - శ మొనర్చి యందు
నవనీశ్వరుఁడు వసి - ష్ఠాదిమానులకు
నాచార్యునకుమ్రొక్కి - యాగంబుకొఱఁత
లేచాయ లేకుండ - నీడేర్పఁడనిన
నటులకావింపుదు - మనిపురోహితులు
పటుమతి వడ్రంగి - పనులవారలను 1340
పారలవారిని - బలిమిమానసుల
గారలు సొదపనుల్ - గావించి వారి
చిత్తరువులవారి - శిల్పిశాస్త్రముల
నుత్తములగువారి - నుప్పరవారి
కరణంబులను నధి - కారులఁబనుల

నెఱివాదులను గ్రహ - నిర్వాహకులను
యిసుమును సున్నంబు - నిటికెలు గడమ
రసవర్గములు దెచ్చు - ప్రజలనుఁగూర్చి
రాజులకును బంధు - రాజికి దిశల
రాజులకును సుమం - త్ర ప్రముఖులకు 1350
విడుదులు నులుపాలు - వేర్వేఱఁదగిన
యెడలనేర్పఱపించి - యెల్లరఁగూర్ప
నా సుమంత్రునిఁజూచి - యనియె వసిష్ఠుఁ
డోసచివోత్తమ! - యుత్తమశీలుఁ
బావనజ్ఞానసం - పన్నుని జనక
భూవరుఁదోతెమ్ము - పోరానిసఖుని
కాశీశుమామఁగే - కయు ధారుణీ త
లేశునిం దోతెమ్ము - హితబంధులైన
కోసలమగధులం - గొనిరమ్ము నీవె
వాసిగానీధరా - వరుల సీమలకు 1360
పోయితోడుక తెమ్ము - పొంతలనృపుల
రాయభారులనంపి - రప్పింపు వేగ
ననుమాటకుసుమంత్రుఁ - డందఱిబిలువఁ
జనువారిఁబనిచితాఁ - జనిజనకాది
నృపతులుబిలిచిన - నిఖిలభూపతులు
నుపదలతోడ - నయోధ్యలోపలికిఁ
గొన్నిదినంబుల - కునుఁజేర పతికి
విన్నవించినవారి - విడుదులయందు
తరతరంబ యమర్చి - దశరథవిభుఁడు
గురునాజ్ఞబుశ్యశృం - గుని యనుమతిని 1370

— దశరథుం డశ్వమేధయాగము చేయుట —

నగణితయాగ శా - లావాసుఁడగుచు
తగురీతినశ్వమే - ధ ముపక్రమించె.
సంవత్సరమునిండ - సవనహయంబు
సంవిధానంబుగా - శాల ముందఱికి
జేరినయాఋశ్య - శృంగునియాజ్ఞ
మీరకపరమధా - ర్మికులు యాజ్ఞికులు
అర్పించి పగటసా - యంసమయమున
నేర్పుమీఱఁగహోమ - నియమముల్ దీర్చి
వరుసఁబూర్వాహ్ణాప్ర - వర్గ్యంబుచేసి
హరిహయప్రీతిగా - హవియంశ మెలమి 1380
నాదినంబులలోన - నలసినవారిఁ
బేదల ననదల - బీదల జడుల
రోగుల యాతులఁ బా - లుల శిశువులను
యోగుల వృద్ధుల - నుపవాసపరుల
నలసినవారిని - నా కొన్నవారి
నలఁగినవారిన - నాథల నెల్ల
యిష్టమృష్టాన్నంబు - లిడిపదార్థములఁ
దుష్టినొందించి బం - తుల వెంటవారి
నుపచరింపుచు విని - యోగజనంబు
నిపుణులై వడ్డించి - నెవ్వాలుదీర్ప 1390
నన్నపర్వతములు - నాజ్యవాహినులు
వన్నెమీఱుపసిండి - వన్నెసూపములు
ఫలములుకజ్జముల్ - పాయసాన్నములు
కలవంటకములూరుఁ - గాయ లంబళ్లు

పచ్చళ్లు పెరుగును - పాలు తేనియులు
నిచ్చలుగా భుజి - యించి యాజకులు
సవనావసరముల - శాస్త్రప్రసంగ
నివహముల్ గెలుచుచు - నికలవాదింప
నాగమనిధులుప - డంగపారీణు
లాగమాంతార్థజ్ఞు - లైనఋత్విజులు
నుచితాసనంబుల - నుండి యయ్యాగ
మచలితక్రమముతో - నాచరింపంగ 1400
యిరువదియొకమూర - లెనిమిదిమూల
లిరుగేలుసోఁకఁజొ - టిచ్చుమందములుఁ
గలిగిబిల్వములాఱు - ఖదిరంబులాఱు
ముదురుమోదుగులాఱు - మొదలింటిదొకటి
దేవదారువొకండు - తీర్చినవిఱుగు
చేవమ్రానొకటికై - చేసి యూపములు
నాటించియూపంబు - నకునొక్కనూత్న
సాటిగానన్నింట - సరవిగాఁజుట్టి
అమరసప్తర్షుల - నాకాశమట్లు
సమయూపముల యాగ - శాలశోభిల్లి 1410
తగుయాగమునకుఁ ద - త్తద్దైవతాక
ముగయాగపశువులు - మున్నారమర్చి
పక్షులుగ్రూరస - ర్పంబులమీఁద
సీక్షింపనెడమీఁక - యిటుకలువఱచి
గారుడచయనంబు - గానేర్పరించి
వేరుపడగనశ్వ - విశసనవేళ
జలచరంబుల నెల్ల - సవరించి తెచ్చి

యొలమితో బశువుల - నెల్లఁ బట్టించి
కౌసల్యమును దురం - గమపరిచర్య
చేసినవెనుకన - సిత్రితయమున 1420
చేరియశ్వముఁ బట్టి - ఛేదించిరాత్రి
యారామతురగంబు - నాలింగనంబు
చేసుకళయనింపఁ - జేసినాడెల్ల
కౌసల్యయట్లుండ - గా మఱునాఁడు
మేకొని యయ్యశ్వ - మునుసుమిత్రయును
కైకయు నట్లన - శావింప చారి
వేకంబులాడుచు - వేగిననంత
అశ్వంబునుప బుత్వి - గావళిచేసి
శాశ్వతుండగు హుతా - శనుకీలలందు 1430
పరిపక్వమగుడు వ - పాహోమపుణ్య
పరిమళంబునరాజు - పాపంబులణఁగ
అపుడాస్వాదింపన - య్యాజికుల్ హయము
విపులశస్త్రముల వే - ర్వేరభాగించి
పదియునాఱంగముల్ - పావకునందు
చెదరకహోమంబు - చేసి రీరీతి
యిమ్మఘం బిటుచెల్లు - నితరముల్ జువ్వి
కొమ్మయైనను ప్రబ్బ - కొమ్మదానైన
యొక్కయూపంబుచే - నొనరుజన్నములు
పెక్కుయూపములిందుఁ - బెనుపొందుఁగాని 1440
మునుపుచతుష్టోమ - మునువెన్కవృద్ధ
మును నతిరాత్రంబు - మూఁడునాళ్లకును
దినమొక్కహోమము - ద్ధినివేల్చియిట్టి

యనఘయాగము - నకు నంగంబులైన
నతిరాత్రమాయువు - నభిజిత్తు విశ్వ
జితియు జ్యోతిష్టోమశి - వనామకంబు
నరయ నప్తోర్యామ - మను షడంగముల
మెఱయుయాగము లశ్వ - మేధంబులందు
నొనరించి యీరీతి - హోతకుం దూర్పు
తనరంగబ్రహ్మకు - దక్షిణోర్వియును 1450
నరనాథుఁడధ్వర్యు - నకుఁబడమరయుఁ
గరిమ నుదీచి యు - ద్గాతకునొసంగె
నజపుత్రుఁడా సము - ద్రాంతమౌజగతి
యజునికట్టడదక్షి - ణార్థంబుగాఁగ
నపుడుబుత్త్విక్కులా - యవనీశుఁగాంచి
యపరిమితప్రీతి - నందియిట్లనిరి.
రాజన్య! యేమెల్ల - రాజ్యంబు సేయ
నేజాడ నేర్తుమే - యింతియెకాక
స్వాధ్యాయమో? తీర్థ - యాత్రలో? కాక
యధ్యాత్మచింతయో - యవనియేలుటలు 1460
తాపనోత్తము లేడ? - ధర యేలు టేడ?
యోపమీ గొడవల - కొకమాటవినుము
క్రయమిచ్చి మాచేతఁ - గైకొనుముర్వి
రయమున నన దశ - రథమహీవిభుఁడు
కోటియావులుపది - గోటుల టంక
వాటంబులట్టిద్ర - వ్యము నలుమడిగ
వెండియందుకు రెట్టి - వివిధరత్నముల
వెండియువస్తువుల్ - వెలగానొసంగి

ధరణిఁగైకొమ్మన్న - ధారుణీసురలు
గురుఁడునుఋశ్యశృం - గుఁడునున్నయెడకు 1470
వచ్చితెల్పినవారి - వారికింబంచి
యిచ్చివారలఁదని - యించినయపుడు
కోరెడువారికిఁ - గోటిరొక్కంబు
భూరిగానొసఁగ న - ప్పుడుపేదయొకఁడు
జనపతిచేతిప - చ్చలకడియంబు
గనివేఁడనవ్వు మె - గంబుతోనొసఁగె
నందరకపుడుసా - ష్టాంగంబుగాఁగ
వందనంబొనరించు - వసుధేశుఁజూచి
దీవెనలొసఁగభ - క్తినిఋశ్యశృంగు
భావించియిట్లని - పలికెనవ్విభుఁడు. 1480
తనయులవేఁడితి - తాపసవర్య
నినుపుత్రులనొసంగి - నెగులువారింప
తానుతురంగమే - ధముసేయుటెల్ల
మానీంద్ర నినుఁబిల్వ - మతియించిసుమ్ము
నినుఁదోడితెచ్చుట - నిజముగాఁదనకు
తనయులవేఁడ - చిత్తముగల్గిఁనూవె
ఆలస్యమేల ? య - య్యత్నంబుచేసి
మేలెంచుమనిన న - మ్మౌనిధావియనియె
ధారుణినాథ! యా - ధర్వణమంత్ర
వారముల్ గలవందు - వలనఁజేయింతుఁ 1490
బుత్రకామేష్టి యి - ప్పుడ యందువలన
బుత్రులఁబడయుము - పుణ్యావర్తనుల
ననుచుబుత్రేష్టి సే - యఁగహోమకుండ

మొనరించివహ్నినా - హుతులిచ్చునపుడు
పావనతరహవి - ర్భాగంబులకును
దేవతల్ గగనవీ - థినివచ్చినిల్చి
సమయంబుగావున - సకలలోకేశు
కమలసంభవుఁజూచి - కదిసియిట్లనిరి.

## — దేవతలు బ్రహ్మతో సంభాషించుట —

దేవ! నీవరములోం - దినకావరమున
రావణుం డఖిలవి - ద్రావణుండిపుడు 1500
యక్షులందోలి వి - ద్యాధరావళిని
శిక్షించి దివి - జులం జీకాకుచేసి
పన్నగకోటుల - బాధించి గరుడ
కిన్నరశ్రేణులం - గీడ్పడందరిమి
గంధర్వులనుఁగొట్టి - ఖచరులనణఁచి
బంధురోన్నతిని ది - క్పాలురగెలిచి
గర్వాంధుఁడై కన్ను - గానకయెందు
సర్వంకషంబైన - సాహసోద్ధతిని
నందనకాన నాం - తరపారిజాత
చందనకల్పక - చ్ఛాయలయందు 1510
మెలఁగెడుదేవతా - మీనలోచనలఁ
జలమునచెఱవట్టి - సనియె లంకకును.
అతనియాజ్ఞచలింప - నంబుధివెఱచు
వెతలరాపడిగాలి - విసరంగవెఱచు
నాళీకమిత్రుఁడెం - డలుగాయవెఱచు
కీలి నాలుకలు మి - క్కిలిఁజాఁపవెఱచు

వెఱతురందఱుమమ్ము - వెఱవకుమనెడు
దొరలెందు లేరనీ - దు పదంబులాన
కావుమమ్మనవిని - కమలాసనుండు
దేవతలకుఁ గృపా - దృష్టినిట్లనియె. 1520

ఏగల్గియును - వెరపేఁటికినింక?
లోఁగునే మీకుఁ ద్రి - లోకకంటకుఁడు
వరములునాచేత - వాఁడొందునపుడు
నరులఁదలంపఁడు - నాసముఖమున
నందుచే నిలమాన - వావలిచేతఁ
బొందువాఁడపజయం - బు నిజంబుగాఁగ
మనుజులకునుఁదర - మా! వానిగెలువ
వనమాలిమనుజుఁడై - వచ్చినఁగాక
శరణుచొత్తముపంక - జవిలోచనునకు
కరుణింప రక్షింపఁ - గర్తయెయొకఁడు 1530

ననుచునందఱుభావ - నాయత్తులగుచు
కనుఁదామరలతోడఁ - గరములుమొగిచి
తలఁచినంతసమస్త - దాసకోటులకు

—: దేవతలప్రార్థనమున విష్ణువు మనుష్యావతారమెత్తుట :—

సులభుఁడైనట్టికౌ - స్తుభవిభూషణుఁడు
శ్రీమించురత్నకి - రీటంబుతోడ
చామననెమ్మేని - చందంబుతోడ
వర్ణితదరహాస - వదనంబుతోడ
కర్ణకుండలవిభా - కళికలతోడ

కరములుశంఖ చ - క్రంబులతోడ
నురముమీఁదవసించు - నొయ్యారితోడ 1540
గ్రైవేయమణిమయాం - గదములతోడ
సౌవర్ణకటితటి - శాటికతోడ
హారకంకణమేఖ - లావళితోడ
కారుణ్యరసవిలో - కనములతోడ
భువనపావనపదాం - బుజములతోడ
రవికోటిశతభాసు - రద్యుతితోడ
మెఱుఁగుటెక్కలతోడి - మేరువుమీఁద
మెఱుపులతోనీల - మేఘమోయనఁగ
వైనతేయస్కంధ - వర్తితపీఠి
దీనకోటులభాగ - ధేయమానతఁడు 1550
అరవిందభవముఖ్యు - లగువేలుపులకు
హరిసర్వమయుఁడు ప్ర - త్యక్షమైనిలచె.
నిలిచిన నింద్రాది - నిర్జరు లజుఁడు
సలలితభక్తితో - సాగిలిమ్రొక్కి
నాళీకనయన! య - నంతశయాన!
నీలనీరదగాత్ర! - నిత్యకల్యాణ!
కరుణాసముద్ర శా - ర్ఙ్గగదాసిధరణ!
శరణాగతత్రాణ - శరనిధివాస!
సాధురక్షణ! భక్త - జనపారిజాత
మాధవ! దానవ - మదనిరాకరణ! 1560
నారాయణ! యనాథ - నాథవిశ్వాత్మ
ధారుణీభారని - స్తారకదేవ!
శరణుచొచ్చితిమి నీ - చరణాబ్జములకుఁ

గరుణింపు గావుము - గావుము మమ్ము
నభయదానమొసంగి - యార్తులఁజూచి
సభయుల రక్షించి - జగతి పాలింపు
రావణకుంభక - ర్ణ నిశాటవరుల
లావుచే జగము తె - ల్లను దీలుపడియె
నీచేతఁగానియ - న్నీచులం దునియ
నోచక్రి! యెవ్వరు - నోపరెయ్యెడల 1570
మానిమిత్తంబుగా - మానవాకృతిని
మానితపుణ్యుఁడౌ - మనువంశనిధికి
నీదశరథునకు - హ్రీ శ్రీ సుకీర్తు
లీదేవులనమించు - నృపునికాంతలకుఁ
బుట్టుము నాల్గు రూ - పులమాకు మాట
పట్టిమ్ము సకలభూ - భారమ్ముమాన్పు
యక్షగంధర్వవి - ద్యాధరాదులను
రక్షింపు త్రిభువన - రక్షఁగావింపు.
నీవెదిక్కనవుడు - నిండినకరుణ
నావేలుపులపై క - టాక్షంబు నిలిపి 1580
యందఱువిన దర - హాసముఖార
విందుఁడై యపుడు గో - విందుఁడిట్లనియె.
ఇచ్చితివరము లిం - తేలచింతిల్ల?
వచ్చితి మిముఁగావ - వలసియిచ్చటికి
దశరథసుతుఁడనై - ధరణిజన్మించి
దశకంఠుఁబుత్రమి - త్రయుతంబుగాఁగ
దునుముదు మిమ్ముఁగా - తును విచారములు
మనముల మాని నె - మ్మదినుండుఁడనుచు

నంతర్హితుండయ్యె - నపుడుభూపాలుఁ
డెంతయుఁబుత్రకా - మేష్టిగావింప. 1590

—: దశరథునకు ప్రాజాపత్యపురుషుఁడు
పాయసము నిచ్చుట :—

వలమానశిఖలతో - వహ్నితీండ్రింప
నలఘుతేజుండు మ - హాపురుషుండు
నల్లనివాఁడులే - నవ్వువెన్నెలలు
చల్లెడువాఁడు వి - శాలనేత్రుండు
బలవంతు డరుణితాం - బరుఁడు కెమ్మోము
గలవాఁ డుదాత్తశం - ఖధ్వనివాఁడు
రుచిరకేసరి తనూ - రుహాసటజాలుఁ
డుచితాభరణలక్ష - ణోపేతమూర్తి
పర్వతాకారుఁడు - పావకతపన
సర్వస్వతేజోవి - శాలుఁ డుత్తముఁడు 1600
గంభీరయానుఁడొ - క్కఁడువచ్చి శాత
కుంభభాజనముగై - కొనిదాని నిండ
పాయసాన్నమమర్చి - పత్నిఁజేపట్టి
మాయగాపతివచ్చు - మార్గంబుఁగోప
చుట్టును వెండియుం - చు లమర్చుపసిఁడి
మిట్టపళ్లెరమున - మెఱయు పాయసము
కొమ్మిది యజుఁడు నీ - కు నొసంగుమనియె
నిమ్మనీపట్టపు - టింతులకెల్ల
యిది దేవనిర్మితం - బిదిపుత్రలాభ
మొదవించు నిదియె య - భ్యుదయకారణము 1610

సేవింపనిమ్మని - సీమంతినులను
భూవర! కనుము స - త్పుత్రలాభంబు
అనినదగ్గనలేచి - యంజలిచేసి
జననాయకుఁడుపాయ - సపుఁబళ్లెరంబు
రెండుచేతులనంది - ప్రీతిఁజండాంశు
చండప్రకాశ వి - శాలుఁడై నిట్టి
ఘనునకుతావల - గావచ్చియతఁడు
కనుచాటునొంద - వేగమున దివ్యాన్న
సంపూర్ణకనక భా - జనము భారమున
వంపూగాతనకర - వారిజయుగము 1620
చంద్రదీధితినాక - సంబొప్పరీతి
చంద్రాననాముఖ - చంద్రరోచులును
పొలుపగు తన యంతి - పురమునకేఁగి
యలరుఁగౌసల్యక - య్యన్నంబు సగము
నిచ్చియున్నసగంబు - నిరువాగుచేసి
యిచ్చెసుమిత్ర కం - దేకభాగంబు
కడమయన్నము రెండు - గాఁబంచి యొకటి
యిడియెఁగైకేయికి - ట్లిచ్చి శేషించు
పాయసాన్నాష్టమ - భాగంబు మఱియుఁ
జేయి చాపంగ ని - చ్చెను సుమిత్రకును. 1630
దివ్య తేజోబలా - ధికపాయసంబు
లవ్వాహతములింతు - లట్లు భుజించి
గర్భముల్ దాల్చినం - గని రాజమణికి
నిర్భరానందంబు - నివ్వటిలంగ
నమరావతీపురం బ - మరేంద్రుఁడేలు
క్రమమునసంతోష - కలితుఁడై యుండె.

—: దేవతలయంశమున వానరాదులు పుట్టుట :—

హరిపుట్టునట్టికా - ర్యమెఱింగిదాత
గరుడవిద్యాధర - గంధర్వసిద్ధ
చారణయక్షఖే - చరకిన్నరులను
స్వారాజముఖదేవ - సమితినచ్చరల 1640
నందఱఁజూచి మీ - యంశంబులందు
నందితసత్వస - న్నాహులం గపులఁ
బుట్టింపుఁ డే మున్న - పుట్టించినాడ
నెట్టుక జవసత్త్వ - నిధి జాంబవంతు
నన నట్లకాకని - యంగదజనకు
ఘనువాలి నింద్రుఁడు - గల్పించె మొదట
తపనుండు సుగ్రీవు - తారుని గురుఁడు
నవుడనలుఁడు నీలు - నలవిశ్వకర్మ
నలుని నశ్వినులమైం - దద్వివిదులను
జలదిరాజుసుషేణు - శరభాంగుశరభు 1650
పర్జన్యుడలకాది - పతి బాహు బలస
మర్జితుండగు గంధ - మాదను ధీరు
నురుసత్త్వవజ్రకా - యునిమనోవేగ
గరుడునిమేరు శం - కాశశరీరు
రుద్రతేజునిఁగామ - రూపసంచారు
భద్రాత్ముహనుమంతుఁ - బవనుండుగాఁగఁ
బొడమించి రున్న వే - ల్పులుగల్గఁజేసి
రడవులయందు ని - జాంశ వానరుల
నందఱుఁజవశాలు - లందరుధీరు
లందరుగామరూ - పాతి విక్రములు 1660

గోపుచ్ఛములు నెలుం - గులు వానరములు
నాపూర్ణసత్త్వాఢ్యు - లరిజయోన్నతులు
శైలభూరుహనఖ - శస్త్రాస్త్రదంత
వాలాయుధులు భూమి - ప్రయ్యలుసేతు
జలధులుగలఁప న - క్షత్రముల్ రాల్పఁ
గులగిరు లగలింపఁ - గుప్పింప శరధి
మిన్నుల నెగయంగ - మిహిరుగ్రహింప
నన్నిటనేర్పరు - లావనేచరులు
వాలినిసుగ్రీవు - వాలితనూజు
గాలిపట్టిని తారు - గంధమాదనుని 1670
నలుని సుషేణు మైం - ద ద్వివిదులను
కొలిచి కొండలుపనుల్ - గుహలును దరులు
సంకేతములుగాఁగ - జగమెల్లనిండి
యంకిలిలే కద - శాననహరణ
కారణుండగురాము - కార్యనిర్వహణ
భారకులగుచు న - ప్పగిదినున్నంత.

—: శ్రీమద్రామచంద్రావతార ఘట్టము :—

కరమర్థితోఁబుత్ర - కామేష్టియందు
పరగవేల్పులుహ వి - ర్భాగంబులంది
యందరుఁదమయిచ్చ - నరిగినయంత
పొంది నయోధ్య య - ప్పుడు దశరథుఁ 1680
డంగరాజ్యమునకు - నబలతో ఋశ్య
శృంగుఁడుచనియె మ - హీశుండువనుప
రాజులందరు దశ - రథుఁడంపఁజనిరి.

రాజసంబున నిజ - రాజ్యంబులకును
నాత్మవాంగఁగఁజేరె - నమ్మహీనాథుఁ
డాత్మగేహినులతో - నంతఃపురంబు
జనపతి యంత పుం - సవనాదికంబు
లెనయు వేడుకఁజేసి - యెదురులుచూడ
నెలలొకపంద్రెండు - నిండంగదాల్చి
సులలిత మధుమాస - శుక్లపక్షమున 1690
నవమిఁబునర్వసూ - నక్షత్రమునను
ప్రవిమలబుధవాస - రమున నుచ్చమున
గ్రహములైదుండఁ - గర్కటకలగ్నమున
నహమునం జంద్ర బృ - హస్పతుల్ గూడి
యుదయించిశుభ - దృష్టినుండఁగౌసల్య
సదయాత్మశ్రీరామ - చంద్రునింగనియె.
దివ్యలక్షణయుతు - దేవతానాథు
నవ్యయు నింద్రు న - య్యదితి గన్నట్లు
సర్వగుణాఢ్యుఁబు - ష్యమునఁగైకేయి
సర్వేశ్వరాష్టమాం - శంబున భరతు 1700
లాలితంబుగమీన - లగ్నంబునందు
భూలోకమందారు - బుణ్యాత్ముఁగనియె.
శ్రీమించునట్టియా - శ్లేషకర్కటక
నామలగ్నంబున - నలినబాంధవుఁడు
నుచ్చస్థితుండయి - యుండ సుమిత్ర
నచ్చరిత్రులను ల - క్ష్మణుని శత్రుఘ్నుఁ
గనియెను చుక్కల - కరణి తేజమునఁ
దనరి యుజ్జ్వలరూఢి - దశరథాత్మజులు

ఆవేళభువినిండె - నలరులవాన
దేవతాదుందుభుల్ - దివినెల్లమొరసె 1710
పాడిరిగంధర్వ - భామినుల్మింట
నాడిరి లాస్యంబు - లప్సరాంగనలు
మలసె వాసనలతో - మలయమారుతము
వెలసె వేలుపుల దీ - వెన లాకసమునఁ
బురజను లానంద - మునఁ దేలిరపుడు
ధరణీశుతపము నెం - తయు నిండఁబండె
పొంగెనువిల్లెత్తు - పొడవుధరిత్రి
మంగళా లంకారమయ - మయ్యెఁబురము
దశరథుఁడపుడుగో - దానసహస్ర
దశతులాపూరుషా - ద్యము లొనరించి 1720
భూరిసువర్ణముల్ - భూరిగానొసఁగి
పౌరులు ద్విజులు తె - ప్పలఁ దేలనిచ్చి
సేమంబున వసిష్ఠు - చే జాతకర్మ
నామక్రియాదులు - నడపించి యతఁడు
తనయులునలువురు - ధార్మికాగ్రణులు
జనలోకవినుతు లా - జానుబాహువులు
చక్కని వారు వి - శాలలోచనులు
మిక్కిలిమగటిమి - మించినవారు
సత్యసంధులుసర్వ - సములుఁబుణ్యాత్మ
లత్యుదారులు విన - య వివేకపరులు 1730
వారలందటిలోన - వర్ణింపరాదు
శ్రీరాముగుణము లా - శేషునకైన

రథములమీఁదసార - థులమెచ్చింప
బృథులాశ్వముల - నెక్కియెన్నికకెక్కఁ
గరివరారోహ సంగ - తులఁజరింప
వెరవుతోఁకానల - వేఁటలాడంగ
గరిడీలు సాదనల్ - గావింప వేఁట
దారలరావాహ్యాళిఁ - దులకించి మఱల
నెరవాదులయి కవల్ - నెమ్మితోఁగూడి
సరవితోఁరామల - క్ష్మణులొక్కజతయు 1740
భరతశత్రుఘ్నులే - ర్పడి యొక్కజతయు
నౌరిమతోఁనన్యోన్య - ముద్దులుగూడి
వెలయుచోఁసౌమిత్రి - విలువిద్యపేర్మి
సలలితపితృభక్తి - సమతానియూఢి
పెనుపొంద రాముపై - పిన్నటనాఁట
మునుకొనినెయ్యంబు - మొలపించు మదిని
రామచంద్రుఁడును ని - ద్రల భోజనముల
సాములచదువుల - సవరణలందు
వీరాడునెడఁ జాల - నెనరువాటిల్ల
నారసితనయట్ల - ననుజునినడపు. 1750
ధరణీశ్వరుండిట్టి - తనయులఁగూడి
హరిదేవతలతోడ - నమరినజాడ
సకలలోకములకు - స్వామియౌనజుని
యకలంకసంతోష - మనుభవింపుచును
తనయులకెల్లను - ద్వాహముల్ సేయ
తనగురుఁడుండునుఁదానుఁ - దలంపుచున్నంత.

—: దశరథునికడకు విశ్వామిత్రుఁడు వచ్చుట :—

యిచ్చమీాదటికార్య - మెల్లనెఱింగి
వచ్చునచ్చటికి వి - శ్వామిత్రమౌని
దౌవారికులతోడ - తనవచ్చురాక
యావేళ నెఱిఁగింపుఁ - డనవారుభీతి 1760
విన్నవించెను మహీ - విభుఁడు తానున్న
యున్నతాసనము కా - లూఁదక డిగ్గి
యింద్రుండుబ్రహ్మకు - నెదురేఁగుమాడ్కి
సాంద్రభక్తిని వసి - ష్ఠసమన్వితముగ
గాధేయుకడ కేఁగి - కాంచి యమ్మునికి
సాధువై ఖరినమ - స్కారంబొనర్చి
యతిభక్తినర్ఘ్య పా - ద్యంబులొసంగ
అతఁడమ్మహిపాలు - నాశీర్వదించి
"సేమమే రాజ! వ - సిష్ఠభద్రంబె?
భూమీశ! లెస్సలె - పుత్రులకెల్ల? 1770
కుశలమే? నీరాష్ట్ర - కోశంబులకును
దిశలభూవరులు వి - ధేయులేనీకు?
సుఖమె మీాప్రజలకుఁ - జుట్టంబులకును?
సఖులెల్లనానంద - సహితులైనారె?
పరిణామమా నీఁదు - పడఁతులకెల్ల?
దొరసియుందురెగడి - దొరలునీయాజ్ఞ
సామంతులెపుడు - చనువుగోరుదురె?
నేమముల్ నడుచు - నే నీయాశ్రితులకు?
నడపుదేరాష్ట్రకంట - కశోధనంబు?
కడతేర్చినావెసం - గరమున రిపుల? 1780

మానసీయమె ధర్మ – మార్గంబు ? దేవ
మానుషకర్మముల్ – మఱినడుపుదువె ? ”
అనిన “ నీదయచేత – నంతయులెస్స ”
లని యందరును స – భాయతనంబుచేరి
యున్నతాసనముల – నుచితనై ఖరుల
మున్నువసిష్ఠు న – మ్మునిరాజునునిచి
యారాజుసింహాస – నా రూఢుఁడగుచు
గౌరవంబుగఁ జూచి – కౌశికుఁబల్కె.
“ ఘోరుననిర్జల – భూమినిఁగురియు
ధారాళమగునమృ – తపువానరీతి 1790
తగినదంపతులకుఁ – దనయులుగలిగి
యగణితసంతోష – మందించినటుల
యెనేనినాళ్లఁబో – యిన సొమ్ముమఱల
కన్నులముందరఁ – గనుపించుకరణి
కోరికతారేఁగి – కొలుచునవ్వేల్పు
వారకయెదురుగా – వచ్చినమాడ్కి
మునినాథ! నామనం – బునకునీరాక
యనుపమసంతో – షమందించెనిపుడు.
ఎంతకల్యాణమ – య్యెనునేటిదివస
మింతటివేడుక – యెట్లువాకొందు 1800
ఫలియించెనాదు త – పంబులన్నియును
సులభంబుగా మిమ్ముఁ – జూడంగఁగల్గె
యేనుసేసినభాగ్య – మెవ్వరుఁజేయ
రానందమగ్నుం – డనైతి నివ్వేళ
రాజర్షి వయ్యును – బ్రహ్మర్షివైతి

నే జటేంద్రులకైన - నీశక్తిగలదె?
నీవువచ్చుటఁజెసి - నేఁడునాభూమి
పావనంబయ్యెనా - భాగ్యవైఖరిని
నాకేశవందిత! - నాకిట్టిమేలు
చేకూరఁదలఁచి వి - చ్చేసితిరిటకు 1810
నేమివేఁడిననిత్తు - నెటుసేయుమనిన
తామసింపకొనర్తు - తప్పదీమాట
అవుగాములెన్నక - యనుమానముడుగి
ప్రవిమలాత్మకనన్ను - ఁబనిగొనుమిపుడు.
అనుచువీనులకు నా - త్మాంబుజంబునకు
ననురాగకరమైన - యధిపతిమాట
వినివసిష్ఠాదులు - వినుచుండ వేఁడు
జననాథుఁజూచి వి - శ్వామిత్రుఁడనియె.

—: రామునిఁ దనతోఁగూడఁ బంపుమని విశ్వామిత్రుఁడు దశరథు నడుగుట :—

"ఈమాటవలికితి - విక్ష్వాకుతిలక!
యేమహీశులు సాటి - యేనిన్నుఁబోల్ప 1820
బుద్ధిమంతుడవై - పుడునువసిష్ఠు
బుద్ధియామీద నె - ప్పుడునీకుఁదోడవు
పలికినపలుకు త - ప్పకసత్యకీర్తి
నిలుపుముసూనృత - నిరతుండవగుము
యాగంబొనర్చెద-నసుదైత్యులుసాగనీక
మాంసలచిత్తులై - మదిఁగ్రొవ్విరక్త
మాంసముల్ సవన ని - ర్మలవేదియందు

కురియింపుచున్నారు - కోపించి వారి
బోరిగొనఁజాలుదుఁ - బోలివోవుతపము 1830
ననియెంచివారిపై - నలిగి శపింప
మినిరామునిదియేని - మిత్తంబుగాఁగ
తోడుకొనిచను బుఁ - ద్ధితో వచ్చినాఁడ
కొడుకనిచూడక - కువలయాధీశ !
కరుణాభిరాము సం - గర రంగభీము
నరవిందహితధాము - నతిపుణ్యనాము
వరగుణైకలలాము - వైరివిరాము
చిరయశోధనకాము - శ్రీరాముఁగూర్చి
అనుపుమునావెంట - నాత్మీయతేజ
మునఁగాతు నతని న - మ్ముము నాదుపల్కు 1840
చంపింతు నతనిచే - సవనఘాతకుల
సంపూర్తి గావింతు - సవనంబు నేను
ముల్లోకమునకీర్తి - మొనయింతునీకు
నెల్లసంతోషంబు - లీయఁజాలుదును
రామునిచేఁగాని - రాక్షసులితర
సామాన్యనృపులచే - చాయకురారు
పాపాత్మకులు కాల - పాశసంయుక్తు
లీపుణ్యుచేఁగాక - యేలత్రుంగుదురు
పుత్రమోహముమాని - భూప! నీజ్యేష్ఠ
పుత్రునినావెంటఁ - బొమ్మనిపనుపు 1850
యేనెఱుంగుదు నిది - యీవసిష్ఠాదు
లైనపెద్దల కఖి - వ్యక్తమిత్తెఱఁగు
వేఱొండుతలఁపులు - విడిచినావెనుక

మీరాముసంపించు - మీ యనిపలుక
ధర్మార్థకామపూ - తంబుతో పరమ
ధార్మికుండైనయా - తపసిపల్కులకు
శోకంబుభయమును - సొంకనేమియును
వాకొనలేక భా - వముపల్లటిల్ల
గ్రమానురీతి ముహూర్త - మాత్రంబునిలచి
మేనువడంకయే - మియుఁదెల్పఁగాక
ఊరక తానుండి - యొకకొంతఁదెలిసి
యీరెలుంగున నమ్ము - నీంద్రునకనియె. 1860

—: విశ్వామిత్రునివెంట రాముని బంపుటకు
దశరథుఁడు చింతిల్లుట :—

"యేమిపల్కెదు? బది - యేనేండ్లవాఁడు
రామచంద్రుండు సా - రసవిలోచనుఁడు
యేజాడనంపుదు - యేఁజూచిచూచి
రాజధర్మములనే - రఁడు పోరొనర్ప
అక్షోహిణీబలం - బతిశౌర్యసార
మతియం బదిగొల్వ - నరుదెంతునేను
నావారునేనుదా - నవులఁద్రుంపుదుము
పావనాత్మ! శరీర - పర్యంతమునకు 1870
యాగంబునెఱవేర్తు - నప్పసిబిడ్డ
యాగడంబులుగాక - యనిసేయఁగలఁడె?
చిప్పకూఁకటులనా - శ్రీరామచంద్రు
నొప్పునే పట్టి దై - త్యులపాయఁద్రోయ
వివిధమాయోపాయ - విధులు రాక్షసులు

దివిజులనైన సా - ధింపనోపుదురు
అట్టివారలగెల్చు - నని రామచంద్రు
నెట్టు వేడితిరి? నో - రెట్లాడెమీకు?
జగడంబులెఱుఁగునో - స్వబలంబు తెఱఁగు
పగవారిబలమని - పరికింపఁగలఁడొ 1880
బాలుఁడస్త్రకళాప్ర - భావంబు తెఱుఁగఁ
డేలయ్య నీబుద్ధి - యీచందమయ్యె?
నేరాము నెడబాసి - నిమిషమాత్రంబు
నేరుతునె మేన - నిలుపఁ బ్రాణముల
రామచంద్రుఁడె నాదు - ప్రాణంబు రాముఁ
గామించుబలము ని - క్కమయేని నీకు
యేను నా సైన్యంబు - లెల్లను వెంట
మానీంద్రవత్తు నీ - మఖము చెల్లింతు
నరువదివేయేండు - లాత్మజుల్ లేక
దరిద్రొక్కియున్నయి - త్తరిఁ బుత్రులనుచు- 1890
కలిగినా రిందులో - కల్యాణశీలుఁ
డలరాముఁడొకఁ - డె నాప్రాణాధికుండు
యెవ్వరా రాక్షసు - లెవ్వాఁడువనిచె?
నెవ్వనితనయు లా - హీనమానసులు?
నేపాటివారు వా - రేర్పడఁబల్కు?
నీపూన్కి నెరవేర్తు - నిజముగాననిన''
నతనిమాటలువిని - యలఁతినవ్వొలయ
క్రతురక్షణార్థియౌ - గాధేయుఁడనియె.
''లోకకంటకుఁడు త్రి - లోకభీకరుఁడు
ప్రాకటజయశాలి - రావణాసురుఁడు 1900

బ్రహ్మవరంబునఁ - బ్రబలినవాఁడు
బ్రహ్మసంతతివాఁడు - పరమసాహసుఁడు
ప్రౌఢయశుండువి - శ్రవసునందనుఁడు
గాఢిమిూఱఁగఁ గుబే - రునికినగ్రజుఁడు
నాసవనంబు వి - ఘ్నముసేయఁగర్త
యాసురారాతి - నానాసురభర్త
నతని పంపునవచ్చి - నట్టిదుర్జయులు
ప్రతిభమారీచ సు - బాహులన్వారు
దశరథభూప! యా - దానవాధములు
దశరాత్రసవనమేఁ - దలకొనిసేయఁ 1910
జేతురు విఘ్నముల్ - శ్రీరాముఁబనుపు"
మీాతఁడొక్కఁడు సమ - యించువారలను.
అవివిని గుండియ - యవిసి శరీర
మవశంబుగా నాల్క - నటతడిలేక
నడుములువిఱిగి దై - న్యంబుతో మెడలు
వడి కౌశికమునీంద్రు - పదములఁబ్రాలి,
"బ్రదికింపవయ్యయో - పరమమునీంద్ర!
యిదె తనూభవదాన - మీావయ్యతండ్రి
తల్లియును గురువును - దండ్రిదైవంబు
లెల్లరునా పాలికీఁ - వె నీకుఁగవము 1920
రావణునకునంద - రమువణంకుదుము
నేవెరతును రాము - ని గణింపనేల?
మనుజులనెల్లనో - మనఁబూఁపలట్లు
కనిమ్రింగువాని నే - గతిగెల్వవచ్చు?
కాలుండువానితోఁ - గలహింపవెఱచు

కాళియైననువానిఁ - గనియోడిపరచు
వానిపంపునఁబూని - వచ్చినవారు
సూనుల సుందోప - సుందదైత్యులకు
నేమెల్లనోపుదు - మే వారిఁజెనక
మాముందరసుబాహు - మారీచులనుచుఁ 1930
బలుకకుఁడొకఁడైన - బలముతోఁగూడి
చలమునం బోరుదు - సాధింతువాని
నెటులైనమేలునీ - వింక్కటమీఁద
జటి వర్య ! మారామ - చంద్రునిమాట
తలఁపకు " మనవుఁడు - దశరథవిభుని
పలుకులకునునెయ్యి - పై వేల్చినపుడు
భగ్గునమండిన - పావకురీతి
దిగ్గునలేచిగా - ధేయుఁడిట్లనియె.

—: వసిష్ఠుఁడు విశ్వామిత్రునిమహిమ రామునకుఁ జెప్పుట :—

తగునయ్యయిటులాడి - తప్పరాఘవుల
కగునయ్యయిటువంటి - యనృతవాదంబు 1940
నీచేత నీకార్య - నిర్వాహశక్తి
చూచికాదనిన - చో నూయేమిగొఁటంత
మంచిది యిందుచే - మాకేమిమోహమా
గాంచెదు నాదు యా - గముచిక్కువడిన
నెటుఁగకయున్నా - రమే వచ్చినట్టి
తెలివుమీకేమిం - తతీరనిపనియె.
చుట్టాలునీవును - సుఖముననుండు
పట్టభద్రుండవై - పదివేలువచ్చె

రాముని మేమునే - రక తలంచితిమి
మామీఁదినేరంబు - మదిసహియింపు 1950
మనునంత గడగడ - నల్లాడె ధరణి
వనధులు పిండలి - వండుగాఁగలఁగె
జలజలరాలె న - క్షత్రగణంబు
కలఁగి భీతిల్లి ది - గ్గజములు మ్రొగ్గె
గ్రక్కున నెల్లెడఁ - గావిరుల్ గప్పె
దిక్కులన్నియును వి - దిక్కులై తోఁచె
నావేళ భానువం - శాచార్యుఁడైన
ధీవిశాలుఁ డరుంధ - తీప్రాణవిభుఁడు
మానికోపము రాజు - మాట తెఱంగు
పైనగుకార్యంబు - పరికించి పలికె. 1960
"భూమీశ! మీవంశ - మునరాజులెల్ల
తాముపల్కిన మాట - తప్పరెవ్వరును
ధర్మస్వరూపుఁడు - దారమానసుఁడు
ధార్మికాగ్రణి చిరం - తనతపోరాశి
యితనితోమును మించ - నిందఱువినఁగ
ప్రతినలుచేసి ద - బ్బరలాడనగునె?
వలదీ యధర్మప్ర - వర్తనంబింత
సులభుఁడే మనకు నీ - సుజ్ఞానధనుఁడు
చేసెదనని పల్కి - సేయనివాఁడు
చేసినయట్టియ - శేషపుణ్యములు 1970
బూదిలో హోమమై - పొలియుఁగావునను
కాదుసుమీ మీఱ - గాధేయునాజ్ఞ
పావకపరిధిఁజే - బదిలమై, యరిథ

యావహంబగునట్టి - యమృతంబురీతి
నీమునివెంటబో - యిన నెల్లనాడు
రామునికేల కో - అంతరానేర్చు?
యకృతాస్త్రుఁడైన నీ - యనపంపువలన
సకలశాస్త్రవులను - సమయింపనేర్చు
పనుపుమీ కౌశిక - పరిపాలితునకు
మనరామునకుసామ్య - మా? జగత్త్రియము 1980
యీమానివరువెంట - నేఁగినజాలు
రాముతోనెదురువా - రా? నిశాచరులు
శౌర్యోన్నతుఁడు సత్య - సంధుఁడత్యంత
ధైర్యమానసుఁడుశాం - తత వివేకధనుఁడు
ననఘుఁడు దివ్యశ - స్త్రాస్త్రకోవిదుఁడు
ఘనతరబుద్ధిమా - ర్గవిశారదుండు
కౌశికుఁడటె రక్ష - గావించువాఁడు
ధీశాలిమరి కల - ఁడే విచారింప
గరుడగంధర్వరా - క్షస యక్ష ఖచర
సుర సిద్ధ చారణ - స్తోమంబునందు 1990
తెలియరెవ్వరును గా - ధేయుదివ్యాస్త్ర
బలము భృశాస్యుని - భార్యలైనట్టి
జయయు సుప్రభయు ద - క్షతనూజ లట్టి
దయితల యందు పు - త్రశతంబుగాంచె
నొక్కొక్కసతియందు - నొకయేఁబదేసి
లెక్కఁబుత్రకులు గ - ల్గిన భృశాస్యునకు
జయకునేఁబది మహా - స్త్రములుప్రయోగ
నియతంబున్నయందు - నిఖిలయుద్ధముల

నుపసంహరింపంగ - యోగ్యంబులయ్యె
నపుడుసుప్రభగాంచు - నన్నియస్త్రములు 2000
నివియెల్లనేరుచు - నీకౌశికుండు
వివిధంబు లితరాస్త్ర - విద్యలునెఱుఁగు
నేరుపు నిన్నియు - నీకుమారునకు
శ్రీరాము నిమ్మని - సింహున కిమ్మ
వలసినయపు డపూ - ర్వములుగల్పించు
దెలియరెవ్వరును గా - ధేయునిమహిమ
యీతండు విల్లందె - నేని దేవతలు
భీతిఁబాఱకదండ - వెట్టంగలేరు
వచ్చెను కీర్తిదే - వలసియిచ్చుటికి
నిచ్చెదనని బొంక - నెట్లగునీకు 2010
ననుమానములుమాని - యనుపుశ్రీరాము
జననాథ! లక్ష్మణ - సహితంబుగాఁగ
బిలిపింపు" మన గురు - ప్రియవచనములు
తలమీఁదనుంచి సం - తసమందిరాజు

## —· రామలక్ష్మణులు విశ్వామిత్రుని వెంటనడుచుట ·—

రప్పించుటయు రఘు - రాముండు ముదము
ముప్పిరిగొనఁగ త - మ్ముఁడుఁదానుఁగదలి
తల్లులకెల్ల వం - దనములుచేసి
తెల్లముగా వారు - దీవెనలొసఁగ
వామదేవాదులు - వలగొనిమ్రొక్కి
సేమమా వారియా - శీర్వాదములను 2020
చేరితండ్రికిమ్రొక్క - చిన్నిబాలకుల
గాఢాముత్తోనెత్తి - కౌఁగిటఁజేర్చి

కన్నులబాష్పాంబు - కణములురాల
నన్నువబిడ్డల - నంకపాళికల
ముద్దాడిశిరములు - మూర్కొనిమమత
కొద్దికన్నులఁజూచి - కూఁకటుల్ దువ్వి
యిరువురచేతులు - నిరుగేలఁబట్టి
నరపతి గాధేయు - నకు నొప్పగించె.
తనకుమ్రొక్కినయట్టి - దశరథుపట్టిఁ
గని వసిష్ఠుఁడురాము - కరముల నిమిరి 2030
సకలాంగరక్షకై - చాలమంత్రించి
యకలంకమతిగొల్వఁ - డనిపనుచుటయుఁ
కైకొనివారలఁ - గౌశికుఁడమర
లోకంబునకు నాత్మ - లోఁదీటె భయము
శుభశకునంబులు - చూచుచు రామ
విభుఁడువెంబడిరాఁగ - వెనకలక్ష్మణుఁడు
కవదొనల్ జోడుసిం - గాణులుదాల్చి
యవిరళప్రీతి పం - చాననుండైన
శేషునికైవడి - చెలువొప్పువారి
వేషముల్ కన్నుల -విందొనరించె. 2040
అసములు బద్దగో - ధాంగుళీత్రాణు
లసిధరుల్ కాకప - క్షాంచితులగుచు
నల యజుంగని కొల్చు - నశ్వినులనఁగ
నలరి రమ్మునివెంట - నక్కుమారకులు
శంకరువెనకవి - శాఖకుమారు
లంకిలిలేకపా - యకకొల్చురీతి
అర్ధయోజనమాత్ర - మరిగి రాజన్య
మూర్ధన్యులతోడ న - మ్మునియిట్టులనియె.

—: విశ్వామిత్రుడు రామునకు బలాతిబలలను విద్యలనిచ్చుట :—

"తామసింపకుండు చే - త జలంబులంది
యామేరసంధ్యశు - ద్ధాచమనములు 2050
చేయుండుమీారన" - చెప్పినయట్ల
సేయువారలంజూచి - చిరతపోధనుండు
సకలమంత్రకియా - స్పదములై యెలమిం
బ్రకటించుబల యతి - బలయునావెలయు
నుత్తమంబగువిద్య - లుపదేశమొసంగె.
అత్తరి భావికా - ర్యంబు లూహించి
యారెండువిద్యలు - నాకలిదప్పి
లేరాక్షసులమాయ - లిచ్చలభయము
మఱపులు రావని - మహిమముల్ దెలిపి
"సరిలేరుమీాకుభు - జాశౌర్యములను 2060
నతులంబులైన వి - ద్యలునేర్చుకతన
సతతవిజ్ఞానవా - సనంబాయకుండు
పుట్టునీవిద్య లం - భోజగర్భునకు
పట్టంగాదెల్పితి - పాత్రముల్ గాన
తలంచుకార్యముల సా - ధనములన్నిటను
వెలయుండిందుల లోక - వినుతవర్తనల"
ననుచునాదేశింప - నమ్మంత్రయుగము
వినివారునేర్చి భా - వించికౌశికుని
గురునింగానాత్మంగై - కొనిసేయవలయు
పరమశిష్యవిధాన - పరిచర్యసేసి 2070

రామచంద్రుండు శ - రత్కాలతపన
రామణీయకమహో - రాశియైమించె.
ఆరాత్రిసరయూత - టావనియందు
నారాఘవులును మ - హాతపోనిధియుఁ
దృణశయ్యలందు ని - ద్రించివేగుటయు
గుణశాలియాకౌశి - కుఁడు కోసలేంద్ర
కన్యకాగర్భము - క్తాఫల! రాఘ
దన్వయతను ప్రభా - తంబయ్యెనిపుడు
తావితోనురలుబ్బుం - దారకాస్యముల
తో వికసిల్లె ని - ద్దురమేలు కొనుము! 2080
శ్రీరామ! మునికోటి - చింతతోఁదమము
దూరమై తొలఁగె ని - ద్దురమేలుకొనుము!
బలురక్కసులప్రతా - పంబులతోడఁ
దొలఁగెతారకలు ని - ద్దురమేలుకొనుము!
మొగిసెను రక్కస - ముదితలకన్నుఁ
దొగలతోఁదొగలు ని - ద్దురమేలుకొనుము!
దశరథరాజను - ధాపయోరాశి
శశధర! నిద్దుర - చాలింపవయ్య!
భరతాదిసోదర - భావమిళింద
సరసిజ! నిద్దుర - చాలింపవయ్య! 2090
మాయానిశాచర - మదవన్యరాశ
తోయద! రామ! ని - ద్దురలేవవయ్య!
పర్జన్యముఖదేవ - పాలనశౌర్య
దుర్జయ! రామ! - నిద్దురలేవవయ్య!
మలసియగస్త్యాశ్రి - మంబుఖేదములు

తోలంగింపవలయు ని - ద్దురలేవవయ్యా!
సరణిలోనర్థమో - జనమాత్రేఁజిన్న
దురమున్నదొకటి ని - ద్దురలేవవయ్యా!
చెనకి నాజన్నంబు - చెఱచుదానవులఁ
దునిమింపవలయు ని - ద్దురలేవవయ్యా!" 2100
అనుచుమేల్కొలుప నా - య్యనలేచియతని
యనుమతిఁగాల్యసం - ధ్యాదులుఁదీర్చి
మునిరాజువెంట త - మ్ముఁడుఁదానుఁగదలి
యొనరుగంగాసర - యూసంగమమున

—: అంగదేశపు వృత్తాంతము రామలక్ష్మణులకు విశ్వామిత్రుఁడు చెప్పుట :—

పుణ్యాశ్రమమొకండు - పొడగని "మునివ
రేణ్యా! యీవనమెవ్వ - రిది?" యంచునడుగ
నచటివృత్తాంతమా - ద్యంతంబుఁదెలియ
వచియించెఁబ్రీతివి - శ్వామిత్రుఁడంత.
"హరుఁడుపార్వతిఁబెండ్లి - యై మౌనివరులు
సురలునుఁగొల్వని - చ్చోనుండునపుడు 2110
దర్పంబుచేతఁగం - దర్పుండుగినిసి
నేర్పుచాలకతోడ - నె యనంగుఁడయ్యె
నందుచే నంగరా - జ్యమనంగవెలసె
నిందుశేఖరవాస - మిమ్మహాశ్రమము.
ఆదేవుశిష్యులీయ్యా - ఖిలసంయములు
పోదమచ్చటి" కని - పోయిరచ్చటికి
ఆవనసీమది - వ్యజ్ఞాననిధులు

పావనాత్ములు మది - భావించిచూచి
యెదురుగాఁజనియమ్ము - నీంద్రుసేవించి
పదములకర్ఘ్యంబు - పాద్యంబునొసంగి 2120
శ్రీరామచంద్రుఁబూ - జించిసౌమిత్రి
నారూఢభక్తితో - నర్చించి వారి
వేడుకముప్పూర - వేడుక యచట
నాఁడెల్ల నిలువవి - న్నపమాచరింప
నియమముల్ దీర్చిమా - నియుఁదారునచట
శయనించిరప్పుడి - క్ష్వాకువంశజులు
మునివరబహుమాన - ములను గాధేయ
ముని కథావృత్తాంత - ముల నాటిరేయి
యచ్చటనుండివా - రమ్మఱునాఁడు

—: మలయకరూశదేశ వృత్తాంతము :—

మచ్చికమీర న - మ్మౌనిపుంగవులు 2130
తెప్పించునోడ గా - ధేయాన్వితముగ
నప్పుడువారెక్కి - యలఘుప్రవాహ
రంగత్తరంగప - రంపరాపూరి
తాంగజారాతికే - శాంతరంబైన
గంగాస్రవంతినిఁ - గడచుచో శ్రవణ
మంగళప్రదమైన - మధురస్వనంబు
వీతేర విని రఘు - వీరుఁడీప్రమోఁత
యేతోయమనమూని - యెఱిఁగి యిట్లనియె.
"కైలాసగిరిమీఁదఁ - గలదుమిక్కిలి వి
శాలమై మానస - సరసినాఁగొలను 2140

అజునిమానసమున - నదిజనియించె
నజపాత్రయట్టి మ - హాసరోవరము
జాలెత్తిప్రవహించి - సరయువైమించె.
భూలోకమునసిట్టి - పుణ్యంపుటేరు
సాకేతపురిచుట్టి - జాహ్నవియందు
నేకీభవింపన - య్యిరువాగుఁగూడి
సంధించునెడల త - త్సంగమజనిత
బంధురధ్వనియిది - భక్తినీక్షింపు
సేవింపు'' మనవారు - చేయెత్తిమ్రొక్క-
నావల గంగామ - హానదిదాఁటి 2150
దరిజేర్చెమము గా - ధితనయుఁడన్నట్లు
దరిజేరియవ్వల - దక్షిణదిశను
శరభవరాహకా - సరిబుతిుభల్ల
రురుసింహగవయశా - ర్దూలమాతంగ
కాకఘూకారవ - కంకవిరావ
భీకరంబైన య - భేద్యకాననము
దవ్వులఁగనుఁగొని - తాపసనాథ!
యెవ్వరినెలవది - యెఱిఁగింపుమనిన
నివిదివ్యదేశంబు - లినవంశ! మొదట
యవి మలదముకరూ - శాఖ్యమైవెలయు 2160
వృత్రాసురునిఁజంప - వెనువెంట హత్య
సుత్రాముఁబీడింప - సురలుమానులును
నిచ్చోట కుండల - నెల్లతీర్థములు
తెచ్చిస్నానమొనర్పఁ - దీరెపాపంబు
అగవైరినిర్మలుం - డైనట్టికతనఁ

దగనొండుమల – దాభిదానంబుచేత
నచ్చోటనాఁకలి – యణఁగినకతన
యుచ్చైఁగరూశాఖ్య – యింద్రుఁడమ్మహికి
నతిశయశ్రీలచే – నమరునిందు
గతకాలమున వెన – కనుయక్షజాతి 2170
భామిని సుందుని – భార్యమారీచ
నామంబులగల యక్షు – నకు దల్లియగుచు
కొడుకునుఁదాను నుఁ – గూడియీపీమ
నడవిగాఁజెఱిచి యా – తాయాతజనులు
సమయింపుచుండు ని – చ్చటికర్థయోజ
నము మీరనుండుఁ దా – నవి యున్నటెంకి
దానినిమిత్తమై – దారుణంబైన
యీనట్టడవిత్రోవ – నేతేరవలసె
యిట్టిరక్కసిఁద్రుంచి – యీరాజ్యమునకుఁ
గట్టడసేయు మ – కంటకశ్రీలు 2180
యీత్రోవరానేర – రింద్రాదిసురలు
నీతోడుగలనాకు – నిశ్శంకమయ్యె.
పాపాత్మురాలిది – పట్టి వధింపు
మాపూర్ణవిఖ్యాతు – లందుము నీవు
మెచ్చురించితినన్న – మెంతయుమదికి
నచ్చెరువుగ రాముఁ – డమ్మౌనికనియె.
"ఆఁటది యబల య – ఘాంగనయిట్టి
మేటిసత్త్వముదీని – మేనికెట్లొదవె?
యక్షభామినియయ్యు – నదియేల? ఘోర
రాక్షసకర్మసం – రంభిణియయ్యె? 2190

వివరింపు" మన రఘు - వీరునిమాట
చెవిసోఁకిపలికె కౌ - శికమునీంద్రుండు.

—: తాటకా వృత్తాంతము :—

అదియందు సుకేతుఁ - డను యక్షవరుఁడు
గాదిలబిడ్డలఁ - గానక వగచి
ధాతనుఁగూరిచి - తపమాచరింప
నాతరింబ్రత్యక్ష - మై పద్మభవుఁడు
వెయ్యేనుగల లావు - వెలసియట్టి
తొయ్యలినిత్తు పు - త్రునొసంగనీకు
పొమ్మన్నయక్షుండు - పుత్రికంగాంచి
యిమ్మన్నసుందుల - కిచ్చెభార్యగను. 2200
మారీచు వానికు - మారుండువాఁడు
ప్రారబ్ధమైన శా - పము ప్రాప్తమగుట
దానవుఁడయ్యెనం - తటసుందుఁడీల్గ
వానిభామినికామ - వశ్యాత్మయగుచు
గట్టివాతనమున - కాఁకచేనొడలు
పట్టఁజాలకవెట్టి - వట్టినయట్ల
తపముసేయునగస్త్య - తాపసుఁజూచి
కృపతోడనన్ను వ - రింపు మీవనుచు
వలవంతచే పయి - ప్రాలఁజేరుటయు
కలశజుండలిగి రా - క్షసివి గమ్మనుచు 2210
శాపమిచ్చిన నిశా - చారిణియగుచు
రూపింపదారుణ - రూపంబుతోడ
యిటులగస్త్యుఁడు శాప - మిచ్చు నేయనుచు

నటపట్టి యయోధ్యా శ్ర - మావాసులైన
యతులఁబీడింపుచు - న్నది దానిఁదునిమి
వెతలెల్లమాన్పు మ - వ్విమలాత్మకులకు
నిపుడుగోబ్రాహ్మణ - హితమాచరింపు
ముపకారమొనరింపు - ముర్వికినెల్ల
నీవెకా కితరులు - నిర్జరులైన
లావునందీని బ్రే - లనుఁజూపలేను 2220
యిదియాఁడుగోల - యనియెంచకు నీదు
మదిలోనరాజ ధ - ర్మమువిచారింపు
శిష్టరక్షణమును - శ్రీరామచంద్ర!
దుష్టనిగ్రహము నీ - దుష్ప్రవర్తనము
తరుణి విరోచను - తనయ మందరను
గిరిభేదివధియించి - కీర్తిగైకొనియె.
ఇలయెల్లఁదొల్లియ - నిద్రంబుసేయఁ
దలఁపవిష్ణువు శుక్రు - తల్లినిఁదునిమె
మఱియుధార్మికులైన - మనుజనాయకులు
పఱచుటెంతులఁ జంపి - పావనులైరి. 2230
నామాటచేదీని - నాతిగా యనుచు
నీమదిఁగొంకక - నేడె దండింపు
మను మాట విని యప్పు - డంజలిచేసి
వినయంబుతోరఘు - వీరుండిట్లనియె.

—: తాటక వధ :—

అంపుమనుచుముందె - యడిగితినన్ను
నంపె మాతండ్రి - నీయడుగులవెంట

నలవసిష్ఠాదుల - యనుమతిసేయ
వలసి నీవెనువెంట - వచ్చినవాఁడ
చెప్పినబుద్ధులు - శిరసావహించి
యప్పుడె మీచిత్త - మలరించువాఁడ 2240
అలయగస్త్యాదులై - నట్టిమానులకు
నిలవేలుపులకునే - హితమొనరింతు
ననుగులక్ష్మణుచేతి - యమ్ములవిల్లు
మునిచూచిమెచ్చ రా - ముఁడుకేలనంది
నారిసారించి గు - ణధ్వనిసేయ
భోరుకలఁగెను - భువనంబులెల్ల
కంటకారులఁగూర్పఁ - గల స్వయంవరణ
ఘంటాధ్వనులు దేవ - కామినులకును
నార్తరక్షణకథా - యతవందిబృంద
కీర్తనల్ రాఘవాం - కితబాణములకు 2250
సంతతాహ్వానముల్ - సంగరాహార
చింతఁగ్రుమ్మరుముని - శ్రేష్ఠవీనులకు
రాజితజలధరా - రావముల్ దైత్య
రాజన్యచేతోమ - రాళంబులకును
అధ్వని విని తాట - కాసురి చాల
సాధ్వసంబున గుండె - ఝల్లుమనంగ
దిగులుచే నేమియుఁ - దెలియకఁగడుపు
పగిలి చెమర్చికం - పమునంది భ్రమసి
భ్రమానుగంట ముహూర్త - మాత్రంబునేల
యూనుక కరములు - నూరటనొంది 2260
ధిటదెచ్చుకొనిక్రొత్త - తెలివితో నాద

మెటనుండివినవయ్యె - నెట్టిగోయనుచు
నామ్రోతఁవచ్చుచా - యనెవచ్చుదాని
భీమారుణేక్షణ - భీకరాకారఁ
జూచి కాటుకకొండ - చొప్పగుమేను
యేచిపై పొడవుగా - నెత్తుఁజేతులును
మెఱుపులువెదచల్లు - మెఱుఁగుకోరలును
హారిగెల రీతిన - ల్లాడుఁజన్నులును
వివృతాస్యగర్తంబు - వెళపైనకకడుపు
గవని వాకిళులట్లు - కరమొప్పుఁజెవులు 2270
వంకరముక్కు గ - వ్వలవంటిపండ్లు
సంకుకామాక్షులు - జగజంపుజడలుఁ
గలిగి పైవచ్చుర - క్కసిఁజూచినగవు
సెలవులం దులకింప - శ్రీరాముఁడనియె!
"కంటివె లక్ష్మణ! కై - కోదు మనల
దంటరక్కసి దీని - దాని యచ్చెరువు
పెనుఁగొండవలె నిది - పెరిగిపై రాఁక
కననెంతవారికి - గర్భముల్ గలఁగు
మోడుసేసెద దీని - ముక్కునుఁజెవులు
చూడు నీవెన్నడు - చూడవింత 2280
బుద్ధిరాఁజేతు ని - ప్పుడ నిశాచరికి
వద్దేలమనకుస్త్రీ - వధమాచరింప"
అననంత తాటక - యట్టహాసమున
బెనుఁగొండయోయనఁ - బేర్చిపై రాఁగ
దిగులొందివెఱచిఁగా - ధేయుండుదాని
నగణిత టంకాక్కార - మడరించివిలిషి

వెలుపు లేకుండదీ - వించిమెవ్వరికి
వెలువని రక్షగా - వించెరామునకు
నాలోన వివిధది - వ్యాస్త్రముల్ దుమ్ము
రాలును మీాదవ - ర్షముగాఁగఁగురిసి 2290
తాటకరాఁజూచి దశర - థాత్మజుఁడు
హాటకపుంఖంబు - లైనబాణముల
నన్నియుఁబోవై చి - యర్థచంద్రాస్త్ర
మెన్నికసంధించి - యెత్తినరెండు
చేతులు మొదలంట - చిదిమివై చుటయు
భీతిలే కదిచేరఁ - బ్రియసహోదరుఁడు
సౌమిత్రిచూచి య - స్త్రంబులు రెంట
తాముక్కుఁజెవులు చి - త్రంబుగాఁదునిమె.
చెవులుముక్కునుఁబోయి - చేతులుందునిసి
భువియెల్లనిండనా - ర్పుచునోరుఁదెఱచి 2300
మ్రింగెద ననిచూచి - మించి రాలేక
యంగంబుకనుపింప - కాదుష్టబుద్ధి
మింటికినెగసి యే - మియుఁదోఁచనీక
కంటికి తనయున్కి - గనుపింపరాక
మాయగల్పించియా - మారీచుతల్లి
పోయఁబొమ్మనిపంచి - పోకకేడించి
మెఱయించు నొకచోట - మెఱుపులగుంపు
కురియించు నొచ్చోట - ఘోరవర్షంబు
రాలించు నందంద - రాలబల్ జడలు
తూలించు విషమవా - తూలముల్ విసరి 2310
రప్పించు మధసింధు - రంబులందంద

తెప్పించు మీఁద న - దీప్రవాహములు
కదియించు నలువంక - కాఱుచిచ్చులను
చదియించు దరులపై - శైలముల్ వైచి
నిండించు పాముల - నేకముల్ చుట్టు
చండించుపోకపి - శాచవేషముల
నీరీతిమాయల - నేకముల్ సేయ
నారాఘవులు చాల - యలజడినొంది
కాలునుఁగేలునుఁ - గదలింపలేక
యాలోచనలుసేయు - నపుడుఁగౌశికుఁడు 2320
"భయమంది, రఘురామ! - పాపాత్మురాలిఁ
జెయిగాచునేరమిఁ - జింతిల్లవలసె
యాఁటదియనియెంచి - యక్కటికించి
గాటంపుమాయల - గాసినొందితిరి
చాలును సంధ్యావ - సరముగావచ్చె
నీలోన దీని మా - యింపకయున్న
దానికి బలమనం - తంబగు నేరి
చేనైనఁ గినిసి శి - క్షింపంగరాదు
తనువు వేగమె దీని - తోఁబోరుచాలు
పనిలేనివాఁడవే - పట్టిపాలార్ప 2330
"నన విని రఘురాముఁ - డన్నిదిక్కులను
కనుఁగొని మింటనె - క్కడమాయచూపె
నాదిక్కుచూచి మా - యలుమాయ శబ్ద
భేదిసాయకముల - బెగడుపుట్టింప
నదివచ్చి ఋలనిల్చి - యాగ్రహంబొప్ప
నెదిర్థింప సాయకం - బేర్చి రాఘవుఁడు

నారితోఁగూర్చియు - న్నారిపేరురము
దూర నేయఁగనది - దూఱిపాఱుటయు
నాయమ్ముదానవి - యాయమ్మునాఁటి
కాయమ్ముప్రయ్యలు - గావించునంతఁ 2340
గూలెనుకాటుక - కొండయోయనంగ
నేలవ్రేఁగణఁగియు - నిండువ్రేఁకముగ
పిడుగుకైవడివచ్చు - భీమరాక్షసినిఁ
బడవైచి తముఁగాచె - భళిభళియనుచు
దివినుండి యింద్రాది - దివిజులువచ్చి
భువనవందితు గాధి - పుత్రు నీక్షించి
"కలవురాఘవులకుఁ - గార్యముల్ మీఁద
బలియురతోఁజేయు - బవరంబులితఁడు
సామాన్యుఁడే! దివ్య - శస్త్రాస్త్రజాలఁ
మేమెఱింగినవి నీ - వెఱిఁగినవెల్ల 2350
నేరుపు మీతండు - నీవెంటవచ్చు
శూరుండుపాత్రుఁ డి - చ్చోటమాకొఱకు
రాఁజేయు" ననవుఁడు - రఘురాము మోము
తాఁజూచి గాధినం - దనుఁడుదీవించి
"శిరముమూర్కొని - యలసితి రన్నలార!
యరమరల్ దీర నీ - యాశ్రమంబునకుఁ
దొరసిచైత్రరథంబు - తోఁదులఁదూఁగి
గరిమఁగైకొనియె నీ - కాననంబిపుడు
తాటకవోవ ని - ద్రలెఱింగిమునిరి
యీలెంకినున్నమా - నీంద్రులందరును 2360

యీప్రొద్దుకిచ్చోట - నే యుండిమనము
రేపుపోవుదముచే - రిక మదాశ్రమము
యిచటికిదవ్వులే - దేలవేగిరము
సుచరిత్ర! యీవన - క్షోణులయందు
వసియింత మని" తగు - వైఖరినుండి
అసమతపోనిధి - యమ్మరునాఁడు
రాజసూనుల నిద్దు - రలు మేలుకొల్పి
యాజటివర్యుఁడి - ట్లని పల్కెనపుడు.

—: రామునకు విశ్వామిత్రుఁడు దివ్యాస్త్రముల నిచ్చుట :—

"శ్రీరామ నిన్నుఁజూ - చి మనంబులోన
మీఁతెసంతోష మే - మి హితంబొనర్తు? 2370
నేరుపువాఁడ నే - నేరిచి నట్టి
యారూఢదివ్యశ - స్త్రాస్త్రమంత్రములు
ఆదరం బమర నిం - ద్రాదుల నిన్ను
కోదండదీక్షాది - గురుఁడనిపింతు
నీవు విల్లందిన - నిఖిలలోకములు
లావునగెలుచు ను - ల్లాసమేనిత్తు
దేవగంధర్వదై - తేయరాక్షసులఁ
జేవాఁడిజయమందఁ - జేయుదునిన్ను
శుచివి గమ్మని" తాను - శుచిప్రాఙ్ముఖుండు
నచలితాత్మకుఁడునై - యాదేశమొసఁగె 2380
దండచక్రంబును - ధర్మచక్రంబు
చండాంశునిభకాల - చక్రంబు చక్రి
చక్రంబు నైంద్రమా - చక్రంబు రౌద్ర

చక్రసాధనము వ - జ్రంబు శైవంబు
రుద్రంబు బ్రహ్మశి - రోనామకంబు
కాద్రవేయము నైషి - కము పినాకంబు
పాశి పాశము ధర్మ - పాశంబుఁగాల
పాశంబు బ్రహ్మాస్త్ర - పావకాస్త్రములు
మోదకిశిఖరి నా - ముసలంబు లశని
భేదద్వయంబు - కౌబేరకాస్త్రంబు 2390
రాక్షసంబును శిఖ - రంబు క్రౌంచంబు
నక్షయనారాయ - ణాస్త్రవజ్రములు
హయశిరఃకంకాళ - మనెడి శక్తులును
భయదవాయువ్యకా - పాలాస్త్రములును
కంకణంబును నంద - కము మధనంబు
శాంకరం బసిరత్న - శస్త్రదైత్యములు
సంతాపనంబు శో - షణము తర్పణము
శాంతంబు శౌర్యప్ర - శయనాస్త్రములును
సైంధవమానవా - స్త్రవిలాపనములు
గాంధర్వమోహన - కందర్పములును 2400
సౌమనశరేబు ప్ర - స్వాపనాస్త్రంబు
తామససత్యవిద్యా - ధరాస్త్రములు
మౌసల సంవర్త - మాయాధరములు
శాసకఘోరపై - శాచకంబులును
మదనదారుణసుదా - మని సితేషువులు
నదయతేజములు సో - మాస్త్రంబుననఁగ
అతులప్రయోగది - వ్యాస్త్రముల్ నేర్చి
యుతఁడుమార్గంబున - నరుగుచుఁబల్కె,

"అస్త్రముల్ నేర్చితీ - వనఘ! నావలన
నస్త్రోపసంహార - మరయంగవలదె 2410

—: ఉపసంహారముల రామున కుపదేశించుట :—

పలికెద యివినేర్చి - పనిగొమ్ము భక్తి
వెలయ నారాధింపు - వేర్వేర" ననుచు
సత్యవంతము రభ - సంబు దృష్టంబు
సత్యకీర్తి ధనంబు - సర్వనాభంబు
ప్రతిహారలక్షాక్షర - ముల వాఙ్ముఖము
ప్రతిపన్న కామరూ - ప పరాఙ్ముఖములు
నావరణము జృంభ - కాస్త్రమోహములు
నావల సంతాన - హరణధాన్యములు
కామరూపంబును - కరవీరరుచిర
భీమవిధూతక పి - తృసౌమనములు 2420
నైరాస్యవిమలను - నాభముల్ జ్యోతి
షారంభములు నుద - శౌనపద్మ
నాభాస్త్రములు దృఢ - నాభంబు దుందు
నాభశస్త్రము మహా - నాభంబు వృత్తి
మంతంబు నల ధృతి - మంతంబు నర్చి
మంతంబు కృశనంబు - మధనంబు యోగ
ధర దశాక్షులు హరి - ద్రము విషమంబు
హరణశస్త్రంబుల - శతాక్షరాస్త్రంబు
దశవక్త్రమును ప్రశాం - తము దశాక్షరము
దశశీర్షము ననంగ - ధగువిద్యలొసంగి 2430

కామరూపమును సు - ఖస్వరూపములు
శ్రీమూర్తిమంతముల్ - శ్రీకారణములు
జపియింపు" మనుచు వి - శ్వామిత్రుఁ డనిన
జపియించె శ్రీరామ - చంద్రు డన్నియును.
ఆవేళనస్త్రంబు - లాకృతుల్ దాల్చి
పావకమూర్తులు - పాటిల్లఁగొన్ని
నీలనీలప్రభా - న్వితములై గొన్ని
జ్వాలలతోఁగొన్ని - సమదాట్టహాస
కలనలఁగొన్ని భీ - కరములై గెలుపు
పలుకులతోఁగొన్ని - పగ్గెలఁగొన్ని 2440
యంగారసదృశంబు - లై కొన్నిధూమ
లాంగంబులై గొన్ని - యర్కతేజమునఁ
గొన్ని చంద్రప్రభఁ - గొన్ని యీరీతి
నన్నియువెలుఁగుచు - నంజలుల్ చేసి
"పనిగొమ్ము మమ్ము నీ - పనుపుచేసెదము.
మునినాథుఁడొసఁగె మ - మ్మంబరిగ్రహింపు
దాసుల మేము నీ - దలఁచుఁగార్యములు
చేసివచ్చెదము నీ - క్షేంపుమమ్మ" నిన
శ్రీరాముడన్నియుఁ - జేపట్టినాడు
వారలై యేను గా - వలసిన యపుడు 2450
రండు మీరు మదంత - రంగంబులోన
నుండుడంచును పర - మోదారుఁడైన
యారామవిభుఁడు - భృశాశ్వపుత్రులను
నూరుగురిని లక్ష్మ - ణునికితా నేర్పి
యవ్వాలంజనుమ న - త్యాశ్చర్యమొకటి

దవ్వులంజూచి సం - తసముతోఁబలికె.
"అల్లదె మిన్నుల - నంటి కన్పట్టి
నల్లనై మదికి నా - నందంబుచేసి
నీలనీలాంబుధ - నిభమై యుపాంత
శైలమై కలకల - స్వనపరిష్కరణ 2460
విహగమై హరిణాది - వివిధమృగాది
బహుళమై సకలతా - పసవేదఘోష
నిబిడమై యాహవ - నీయాదివహ్ని
నిబిరీసధూమమా - నితగంధమైన
యీయాశ్రమంబుపే - రెయ్యది? దీన

—: వామనమూర్తి చరితము :—

నేయతీంద్రులు వసి - యించి యుండుదురు?
మీయాగశాల యే - మేర యెవ్వారు
దాయ లీ సవనవి - ధానవైఖరికి
నీప్రొద్దు మనముంద - మీ యాశ్రమమున
నేపణఁగింతుమీ - కెగ్గొనరించు 2470
దనుజులనొక ముహూ - ర్తమున విచ్చేయు
డ"ను మాటవిని తన - యాత్మనుప్పొంగి
శ్రీరామచంద్రుని - చెక్కులు నిమిరి
గారవనంబమరంగ - గౌశికుండనియె.
"ఇదివైష్ణవస్థాన - మిందువిష్ణుండు
ముదముతోఁబహుకాల - ము తపంబుచేసి
నందుచే నిది వామా - నాశ్రమంబయ్యె.
చెందు నిచ్చటసర్వ - సిద్ధులెల్లరకు

సిద్ధాశ్రమంబని - చెప్పిరిదాన
సిద్ధులకును తప - స్సిద్ధి గల్గుటను 2480
బలియను రాక్షస - పతి పట్టణంబు
తొలుతనీదేశంబు - దుర్జయుండతఁడు
దితిజుల నేలి యా - దిత్యులఁదోలి
శతమఖాది దిగీశ - జాలంబుఁదరమి
ముఁల్లోకముల తన - ముద్రచెల్లించి
బల్లిదుండై హవి - ర్భాగంబులెల్ల
సురలకీయక రా - క్షసుల పాలుచేసి
సురసతుల్ కేలన వీ - చోపులు వీవ
మత్తుఁడై తానొక్క - మఖముగావింప
న త్తర వహ్నిము - న్నగువేల్పులెల్ల 2490
వైకుంఠమున కేఁగిన - వనమాలిఁగాంచి
లోకేశ! యాశ్రిత -లోకమందార!
పుండరీకాక్ష! యం - బుజగర్భవినుత!
అండజరాడ్వాహ! - యాద్యంతరహిత!
విశ్వభావన! విశ్వ - విభవవిశ్వేశ!
విశ్వాత్మ! విశ్వాభి - వృద్ధిప్రచార!
పాలింపు మమ్ము నీ - పాలింటివారి
నేలింపు నాకంబు - నింద్రాదిసురల
కలిగింపు మాకు యా - గముల భాగములు
తొలగింపు మిలకు - దైత్యులచేతిపొరు 2500
రక్షింపు మిపుడు గో - బ్రాహ్మణశ్రేణి
శిక్షింపు మదమత్త - చిత్తరాక్షసుల
యాలింపు మామొర - యంతరంగముల

పాలింపు మేదిని - భారంబుమాన్చి
మాయింపు బలిదైత్య - మదగర్వరేఖ
సేయింపు మముఁ బున - ర్జీవులఁగాఁగ
విడివింపు చెఱనున్న - విబుధకామినుల
నడపింపు ధర్మంబు - నాల్గుపాదముల
పుట్టుమిప్పుడు కశ్య - పుని భార్యయందు
కట్టు మనాథరక్షణ - కంకణంబు 2510
నుడుగుము వటుఁడవై - నూతనదాన
మడుగుము బలినిమూఁ - డడుగుల నేల
పట్టు మర్వియు నింగి - పదములు రెంట
మెట్టుము వానిభూ - మినణంగిపోవ
కరమిమ్ము మాకు నేఁ - గాఁచెద ననుచు
వరమిమ్ము కాశ్యపు - వద్దికిఁబోయి
పన్నించు గరుడనిఁ - బల్లనగట్టి
మన్నించు మమ్ము ర - మ్మన్న! యనిపలుక
మొర యాలకించి య - మ్మురభేదిసురల
గరుణించి పొమ్మని - కాశ్యపుఁజేరి 2520
తనయులకై నీవు - తపమాచరింప
నినుమెచ్చివచ్చితి - నీకుజన్మింతు
నని యదితికి వామ - నాకృతిఁబుట్టి
దనుజేంద్రుఁడగు బలిఁ - దాఁజేరఁబోయి
యాగంబుసేయుచు - నర్థులువేఁడ
చాగంబతఁడొసంగు - సమయంబుచూచి
స్వస్తివాదమొనర్చి - జగతిమూఁడడుగు
లస్తోకమతి వేఁడి - యతనిచే నంది

మురవైరిముల్లోక - ములు నిండఁబెరిగి
ధరయెల్లనొక్క పా - దంబునఁగొలిచి 2530
యాకాశ మదియొక్క - యడుగుననుంచి
పైకొనిబలిఁద్రొక్కి - పాతాళమునకు
నాకైవడి నుపేంద్రుఁ - డన్నయైనట్టి
నాకీశునకు భువ - నము లెల్లనిచ్చి
యతులతపోనిష్ఠఁ - దైయుండునునికి
నతనిచే నిదివామ - నాశ్రమంబయ్యె.
చేరుదమివ్వన - సీమకు" ననుచు
నారాఘవులతో మ - హాతపోధనుఁడు.

—: రామాదులు సిద్ధాశ్రమముఁ జేరుట :—

ప్రాలేయమని పున - ర్వసుఁగూడివచ్చు
లాలితశ్రీల క - ళానిధియనఁగ. 2540
వచ్చుచోనచ్చటి - వాచంయమీంద్రు
లచ్చపుభక్తితో - నర్ఘ్యపాద్యములు,
కౌశికునకు యిచ్చి - కరమర్థివచ్చి
దాశరథులకు స - త్కారముల్ చేసి
యాతిథ్యమొసఁగిన - నచ్చోటవారు
ప్రీతివసించి యో - రేయి నిద్రించి
మరునాడు రామ - లక్ష్మణులు ప్రభాత
కరణీయ్యములుదీర్చి - గాధేయుఁజూచి
"సిద్ధసంకల్ప! యీ - సిద్ధాశ్రమమున
సిద్ధంబుగాయాగ - సిద్ధిఁగైకొనుము. 2550

దీక్షవహింపు ౖదై - తేయులాఁగినను
శిక్షించెదము శర - శ్రేణులచేత"
అనిన జితేంద్రియుం - డై దీక్షవార్చి
మునులెల్లఁ దత్కర్మ - ములఁ బ్రవర్తిల్ల
యాగమారంభించి - యమ్మునినాడు
వేగిన నగ్నులు - వేల్చిరాజిల్లు
మునిశిఖామణికి త - మ్ముఁడుదానుమ్రొక్కి
వినయంబునను రఘు - వీరశేఖరులు
దేశకాలంబునుఁ - దెలిసియిట్లనిరి.

—: రాముఁడు మారీచాదిరాక్షసుల జయించుట :—

"కౌశికమునినాథ! - క్రతువిఘ్నకరులు 2560
యెప్పుడువత్తురో - యిషుపరంపరల
నప్పుడె వారలహతి - యొనర్చెదము."
అని దానల్ సవరించి - యమ్ములేర్పరచి
ధనువులెక్కిడు కొని - ధట్టీలుకట్టి
కవచముల్ దొడిగి యా - గవిశాలశాల
సవిధదేశమునను నె - చ్చరికనున్నంత.
సంతోషమున మౌని - చయము రాఘవుల
నెంతయు నుతియించి - "యీతపోధనుఁడు
దీక్షచేమౌనవ్ర - తివహించినాఁడు
రక్షింపుఁడీక నారు - రాత్రు లిమ్మఖము 2570
కనకల్గి గురవక - కాచియీడేర్పుఁ"
డనివారు సవనక్రి - యలునిర్వహింప.
ఆఁకలిడప్పియు - నలయికల్ లేక

ప్రాఙ్నోర్చిదిక్కుల - చూపులునిల్పి
నిద్దురమానికం - టికిఱెప్పగాచు
పద్దునరేయును - పగలునేమరక
యెక్కుడునట్టివిం - డ్లెక్కిడినట్లు
త్రొక్కినమెట్టులు - త్రొక్కినయట్లు
పట్టినశరములుఁ - బట్టినయట్లు
కట్టినధట్టీలు - కట్టినయట్లు 2580
తమలోనఁ దారన్న - దమ్ములొండొరులు
సమయముల్ దెలుపుచు - జతనముల్ గలిగి
యాతరివర్తింప - నాఱవనాఁడు
హోతల వివిధమం - త్రోరు నాదములు
సామాదినిగమవి - స్తారఘోషములు
నామోదకర దేవ - తాహ్వానరవము
రాఘువజ్వాలతా - రావంబు నెనసి
మోఘుంబుగాక క - ర్ముకఘూర్ణిలంగ
విని యాగ్రహమునభా - వించిరాక్షసులఁ
బనిచి మారీచసు - బాహులాయాగ 2590
శాలలో రక్తమాం - సంబులుగురియ
నాలోచనల్ చేసి - యనిచి వెంబడిని,
మెఱుపులతో వచ్చు - మేఘుంబులనఁగఁ
బరగి మారీచసు - బాహుదానవులు
అసిలతాయుగళమ - ల్లార్చుచుమింటి
దెసఁదోఁచుటయును బు - ధ్వాజులు భీతిల్లి
''శ్రీరామచంద్ర! వ - చ్చిరినిశాచరులు
వీరె నెత్తురుజల్లు - వేదికమీఁదఁ

గురియుచున్నారని - కూయికినంత
శరమును విల్లు హ - స్తములఁగీలించి 2600
దుర్వృత్తులును మదాం - ధులుక్రూరులైన
శర్వరిచరుల ల - క్ష్మణునకుఁజూపి
"చూడుము పిడుగుల - చొప్పునవీరు
జోడుగాఁగూడివ - చ్చు దురాత్మకులను
పావనాస్త్రంబుచేఁ - బవమానుచేతఁ
బోవు మబ్బులరీతిఁ - బోవనేసెదను."
అనునంతలో నుర్వి - నాజానుబాహు
లును ధనుర్ధరులు బా - లులు నీలహేమ
గాత్రులునైన రా - ఘవుల దానవులు
మిత్రచంద్రులు పుడ - మినిఁ గాచినట్లు 2610
సవనంబుగాచు నె - చ్చరికలుచూచి
తవిలి విఘ్నమొనర్చ - తలఁపునరాఁగ
దారుణమానవా - స్త్రంబు సంధించి
మారీచును రమురా - మవిభుండునైన
నాఁటుతోడనె యోజ - న శతంబునకును
మీటినచందాన - మింటిపైఁ బోవ
వొగడాకు గొనిపోవు - నోజమున్నీట
మొగముక్రిందుగనైవ - మువ్వముణింగి
పడునంత దశరథు - పట్టి సుమిత్ర
కొడుకునెమ్మోముగ - న్గొనియిట్టులనియె. 2620
"మానవాస్త్రంబు ల - క్ష్మణ! యెంతమంచి
పూనికచెల్లించె - పొలియింప కతని
దూరంబుగాఁగ పా - థోరాశిలోనఁ

పారంగవైచె సు - బాహుఁబోనీక
పోరిగొందుచూడు మి - ప్పుడే" యనిపిడుగు
సరియైనపావకా - స్త్రంబుసంధించి
గురిసేసివేసిన - కుంభినిమీఁదఁ
దెరలె కాటుకకొండ - ద్రెళ్లినయట్లు
బాహుశౌర్యమున సు - బాహునిఁద్రుంచి
సాహసోన్నతుఁడు కా - సల్యాసుతుండు 2630
వారిరాక్షసుల నె - వ్వరిఁబోవనీక
మారుతాస్త్రమువైచి - మహిఁగూలనేసె.
అజనంబు నెఱనేర్చి - యమరేంద్రుమాడ్కి
విజయంబుగైకొని - విల్లెక్కుడించి
సౌమిత్రి చేతి కో - సంగె దండప్ర
ణామంబు గాధేయు - నకుఁజేయునంత
కురిసె మిన్నుననుండి - కుసుమవర్షములు
మొరసెను నిర్జర - మురవారవములు
గంధర్వగాయన - గానంబులెసఁగె
సంధించెపవమాన - శాబంబులపుడు 2640
కౌశికమౌని రా - ఘవునిదీవించి
"యో శౌర్యభూషణ! - హోమకార్యములు
కడతేఱెనొక్క వి - ఘ్నము లేకమాకు
నెడపని సంతోష - మెచ్చెనీయందు
పితృవాక్యమును మాకుఁ - బ్రియమునుఁజేసి
యతిశయవిఖ్యాతు - లందితివీవు"
అనునంతనచటి సం - యములెల్లరాము
ననుపమప్రీతితో - నాశీర్వదించి

సాధారణుఁడుగాఁడు - సత్యసంధుండు
గాధేయమౌని రాఘు - వ వంశతిలక! 2650
అమ్మునీంద్రుఁడునిన్ను - నర్థించు టెల్ల
నిమ్మఘం బీడేర్ప - నెంచియకాదు
పరమకల్యాణలా - భము లెల్లనతని
కరుణచే నటమీఁదఁ - గైకొనఁగలవు
పాయనిదైతేయ - బాధలుమాన్చి
మాయాశ్రమంబక - ల్మషముచేసితివి.
ఏమేల్లదీవెన - లిచ్చుటఁగాక
యీమెచ్చుమెచ్చియే - మీయఁజాలుదుము
సుఖివి గమ్మ'' నునంత - సూర్యుండు చరమ
శిఖరిఁ చేరెనుముని - శ్రేణులతోడ. 2660
ఆరాత్రివసియించి - యమ్మఱునాడు
శ్రీరామవిభుఁడుకౌ - శికున కిట్లనియె.
''ఓమునీశ్వర! నీకు - నొనరింతు నతులు
కామించి మమునీవు - కార్యాంతరములు
పనిగొమ్ము మీరెందు - పనిచిన నటకు
జని వేఁడునర్థంబు - సమకూర్పఁగలము
దాసులు (దుష్టకృ - త్య) విధానములకు
నోసరిల్లము మాకు - నూరటల్ దగునె
నావుఁడు గాధి నం - దనుఁడుశ్రీరామ
యావలనొకకార్య - మిచ్చనెంచితిని. 2670
ఆనఘుఁడుమిథిలాపు - రాధినాథుండు
జనకుండు యాగంబు - సలుపుచున్నాఁడు.
అచ్చటికేఁగి యా - యజ్ఞంబుచూడ

వచ్చితిమనిబల - వత్తరంబైన
కోదండమొకటి యా - క్షోణీశునింట
నాదిత్యఖచరవి - ద్యాధరాదులును
యెక్కిడఁగాలేని - యీశుండుదాల్చు
నొక్కవిల్లున్నదా - యుర్వీశ్వరునకు.
యాగఫలంబైన - యాదిసునాభంబు
యాగంబునకు మెచ్చి - యయ్యీశుఁడొసఁగె. 2680
అదినాటనుండియు - నతని దేహమున
సదమల గంధపు - ష్పములఁబూజింప
నున్నది నీవట్టి - యుగ్రకార్ముకము
కన్నులఁజూతువు - గాక రమ్మనుచు"
పయనమై మునులు వెం - బడిరాఁగఁగదలి
జయకారణములైన - శకునముల్ గనుచు
నరవిందనయన పా - దాబ్జమరంద
గరిమంబుఁగన్న గం - గకు నుత్తరమున
సరణినేఁగుచు నను - సారి మానులను
హరిణాదిమృగ వి - హంగావళి నెల్ల 2690
యిమ్మహాశ్రమమువీ - రేవేళఁగాచి
సమ్మతి నుండుడు - చనుఁడనిపల్కి.
అందరనునిచియా - హైమాచలంబు
పొందికదక్షిణం - బునఁజుట్టివచ్చి
యావెన్కధనదుని - యాశఁ బట్టిసుము
త్రోవను కమల బం - ధుఁడు పశ్చిమాద్రి
కూటంబునకు హేమ - కుంభమైవెలయు
పాటికి రఘువంశ - బాలకుల్ మునియు

శోణాప్రవంతినిఁ - జూచి రాఘవుఁడు
పాణియుగ్మముమోడ్చి - భక్తినిట్లనియె. 2700
"ఈభూమిఁగనుఁగొంటి - రే! మహనీయ!
వైభవంబు సమృద్ధ - వనశోభితంబు
లోచనానంద మా - లోకింపఁదగియె
వాచంయమీంద్ర! యె - వ్వరినివాసంబు
పలుకు? మీావన", రఘు - ప్రవరునీక్షించి
కలతెఱంగెల్లను - గాధేయుఁడనియె.

—: కుశకుశనాభుల వృత్తాంతము :—

ఉత్తమకులజాతుఁ - డురుగుణాధికుఁడు
మత్తారిరాజదు - ర్మానభంజనుఁడు
దశదిశాలంకార - ధవళయశుండు
కుశభూవరుఁడు నిరం - కుశ పరాక్రముఁడు 2710
వైదర్భియను గుణ - వతి యందునతఁడు
గాదిలితనయులఁ - గాంచెనల్వురను.
బోధముల్ గలకుశాం - బుఁడు కుశనాభుఁ
డాధూర్తరజనుఁడు - నవ్వసున్నృపుఁడు
జనియింప నపుడు కు - శక్షితీశ్వరుఁడు
తనయుల నల్వురం - దాఁజూచిపల్కె.
"పాలింపుఁ డఖిలభూ - భాగంబుమీారు
తూలింపుఁ డెపుడు శ - త్రునృపాలకులను
ధర్మ మేమఱకుఁ డే - తరిని యాగాది
కర్మముల్ నడపుఁడా - గమవేత్తలైన 2720

యవనీసురలఁ బ్రోవుఁ - డనదలఁగావుఁ
డవధానముల నుండుఁ - డని పనుపుటయు.
ఘనుఁ డాకుశాంబుండు - కౌశాంబిపురము
తనపేరనిర్మించి - తానేలుచుండె.
పొలుచు మహోదయ - పురము గావించి
యిలయెల్లఁ గుశనాభుఁ - డేలుచునుండె.
ఆధూర్తరజుఁడు ధ - ర్మారణ్యపురము
సాధువర్తనఁజేసి - జగతి పాలించె.
వసువిభుఁడా గిరి - వ్రజముఁ గావించి
యసమవైఖరి చేత - నవని పాలించె. 2730
"ఇది యావసునృపాలుఁ - డేలెడిపురము
మదనారివిక్రమ! - మాకుఁగాఁజూచి
కొండలైదును వీటి - కోటలై పరిఘ
యుండు కైవడి చుట్టు - నొక పూవుదండ
వైచిన తెఱఁగున - వర్ణింపఁదగియె.
చూచువారలకు నీ - శోణాప్రవంతి
మాగధ నిధి సంగ - మమున నీసీమ
మాగధదేశనా - మమున రంజిల్లె.
నలువురలోఁ గుశ - నాభుండు వేల్పుఁ
దలిరాకుబోఁడి ఘృ - తాచిఁ జేపట్టి 2740
దానికి నూర్వురు - తనయలఁగాంచె.
ఆనెలంతలు యవ్వ - నారంభమునను
వనకేళి నుద్యాన - వనము లోపలను
మనసిజు వలకారి - మాయలో యనఁగ
నందెలు ఘులుఘుల్లు - మని మొరయంగ

చిందులాడుచు సన్న - జిలుఁగుఁబయ్యెదలు
జాఱ దళాయను - జక్కవ కవల
మీఱుగుబ్బలు మిఱి - మిట్లు గొనంగఁ
బరువులువారు ని - బ్బరమునఁజీర
నెరికె లట్టిటుపడ - నిగనిగమెఱచు 2750
తొడల చక్కదనంబు - తులకింప లేఁత
నడుములు నవ్వల - నకనకలాడ
పేరాస నధరబిం - బీఫలంబులకుఁ
గీరముల్ వలగొనఁ - గ్రేళ్లుదాఁటుచును
తొంగలిరెప్ప సం - దులఁ బుటమెగసి
నింగిఁబేరెమువారు - నిడువాలుఁజూపు
బేడసదాఁటుల - పిఱుఁదువేఁకములు
వాడని విరులు రు - వారించు జడలు
సంకుమదంబు పి - సాళించు అవికె
కుంకుమలను మేన - ఘుమ్మని వలచు 2760
పరిమళమ్ముల ముద్దుఁ - బలుకుల రత్న
వరభూషలకు వన్ను - (వను)వెట్టు మేని
చకచకలను వనీ - సరణుల మెలఁగు
మొకరిపాయపు రాచ - ముద్దుగుమ్మలనుఁ
బవనుండు చూచి ద - ర్పకునకు లోఁగి
యవల నిల్చి వసంతుఁ - డడపంబుఁ గట్ట
చక్కని రాజవే - షమునఁ గన్పట్టి
యక్కన్నెలకు దన - యాస దెల్పుటయు
నభిమానవతులైన - యంబుజేక్షణలు
సభయలై చందనా - చల(మందు)జొచ్చి 2770

"సకలాంతరాత్మవు - సాక్షి వెల్లరకు
నకట! మాచిత్త మీ - వరయకున్నావె?
మమ్ముఁ గావలసిన - మాతండ్రి నడిగి
సమ్మతించి యతండొ - సంగ వరించి
కామోపభోగముల్ - గైకొనక యురకె
కామింప నీయంత - ఘనుకునగునె?
ఒల్లము పొమ్మ"న్న - నూరకే పోక
పల్లవాధరలపై - పవమానుఁడలిగి
వారల లోఁజొచ్చి - వారి యాకార
గౌరవంబుల గోర్వఁ - గా లేక యపుడు 2780
మరగుజ్జులనుఁజేసి - మంచిరూపములు
చెఱిచినఁ గన్నీరు - చింద నందఱునుఁ
దమతండ్రిఁ గుశనాభ - ధరణీశుఁజేరి
తమచందములకు నెం - తయు వెఱగందు
నతనిపాదములపై - నడలుచుఁబొరలు
సుతల నెమ్మోములు - చూచి యిట్లనియె.
"ఏమి నిమిత్తమై - యెలనాఁగలార!
నీమేర పిఱిమూరెఁ - జేసి యంగములఁ
గొఱమాలితిరి మిమ్ముఁ - గోపించియిట్టి
కొఱఁత యెవ్వఁడుచేసె? - కులధర్మసరణి 2790
తప్పితి" రోయను - తండ్రినీక్షించి
యప్పువ్వుఁబోణు లి - ట్లనిరి ఖేదమున.
"మాచెల్వుచూచి కా - మవికారమగ్నుఁ
డై చేరి పవమానుఁ - డాసించియడుగ
మాతండ్రి యనుమతి - మమ్ము వరింపు

మీతలంపులు మాను - మీవని పల్కఁ
గోపించి మాకు'' నీ - గుజ్జరూపములు
శాపించి నటులిచ్చి - చనియె నటన్న.
వినియంతలోచాల - విస్మితుఁడగుచుఁ
దనమదిలో మెచ్చి - తనయులఁ జూచి 2800
"మేలుమే లతుల ధా - ర్మికుఁడయ్యెఁ నింత
పాలుమాలునె మిమ్ము - పవనుండుచూచి
మీకతంబునకీర్తి - మించితి నేను
నా కులం బతిపావ - నంబయ్యె నేఁడు
దివిజులయెడ నింత - దీమసం బునుచు
నువిద లెచ్చటనైన - నున్నారె? జగతి
మెలఁతల కభిమాన - మే భూషణంబు
వలదె యీనిలుకడ - వారిజాక్షులకు
క్షమయె సత్యంబును - క్షమయె ధర్మంబు
క్షమయె కులంబును - క్షమయె వర్తనము 2810
క్షమయె మోక్షంబును - సకలార్థములకు
క్షమఁబోల సాధనాం - శము లెందుగలవు!
మీ యాలువులె యెందు - మీకంగరక్ష
యేయెడలనుఁ బ్రోవ - నీశుఁడున్నాఁడు
పొండ'' ని తనమంత్రి - పుంగవు లండ
నుండంగ వారితో - నొకమాటవలికె.
"కన్నియలను దేశ - కాలపాత్రంబు
లెన్ని యొక్కరుఁబిల్చి - యిచ్చుట యొప్పు
వలయుఁజేయుంగ ను - ద్వాహముల్ వీరి
వలదింట నునుప జ - వ్వనులైన వారి 2820

—: బ్రహ్మదత్తుని చరిత్రము :—

చూళినా నొక మునీ - శుఁడు నియమంబు
చాలంగఁబూని ప్ర - శాంతచిత్తమున
నతఁడూర్ధ్వరేతుఁడై - యరిదితపంబు
కతిపయదినములు - కావింపుచుండ
నొకకొమ్మ గంధర్వ - యూర్మిళ యనెడి
సకియకు తా తనూ - జాత యైనట్టి
సోమద యను రామ - చూళినిఁ జేరి
యామేర పరిచర్య - లాచరింపంగ
చూచి యందుకు మెచ్చి - సోమదం బిల్చి
యాచూళి యేమిత్తు - నడుగు మీవనిన 2830
''బ్రహ్మనిష్ఠుని ధర్మ - పరుని నీయట్టి
బ్రహ్మైకనిధి నాకు - పట్టిగా నొసఁగు
నొకనాడు పురుష సం - యోగ మే నెఱుఁగ
నొకని యధీననై - యుండుట లేదు'',
అన విని యమ్మౌని - యనుమోద మంది
తనదు మానసపుత్రుఁ - దరుణికి నొసఁగె.
బ్రహ్మతేజోనిధి - పాలించు సుతుని
బ్రహ్మదత్తునిఁగాంచి - పడఁతియునరిగె.
''అగణితశ్రీలతో - నమరేంద్రుమాడ్కిఁ
బొగడొందు కాంపిల్య - పురి నున్నవాఁడు 2840
నమ్మహాత్మునకు క - న్యాశతకంబు
సమ్మతినిత్తు ని - చ్చటికిఁ బిల్పించి''
అనుచుతోడనె కమ్మ - లంపి రప్పించి
తనయల నందఱఁ - దా ధారవోసె.

ఏణాంకవదనల - నెల్లఁబె ద్వేర
పాణిగ్రహ మొనర్చి - బ్రహ్మదత్తుండు
నతని కేల్మోఁకిన - యంతలో కన్య
లతనుని సమ్మోహ - నాస్త్రంబు లనఁగ
మొదటిచక్కదనంబు - మొదటిచిన్నెలును
మొదటిజవ్వనములు - మొలిపించినట్లు 2850
శశిరేఖలనఁగ మిం - చఁగ సంతసించి
కుశనాభుఁడా ముద్దు - కూఁతులఁ జూచి
యందలంబుల నుంచి - యరణంబు లొసఁగి
యందఱు దీవించి - యల్లుని వెంటఁ
బనిచిన సోమద - పరమహర్షమున
తనదు కోడండ్ర లం - దఱ గారవించి
కాంపిల్యపురిలో సు - ఖస్థితినుండె.

—: విశ్వామిత్ర కౌశికీనదుల వృత్తాంతము :—

సంపూర్ణకాముఁ డ - జ్జన నాయకుండు
గోత్రాభివృద్ధికై - కుశనాభుఁడెంచి
పుత్రులఁ గామించి - పుత్రకామేష్టి 2860
పూని కావించు న - ప్పుడు పద్మగర్భు
మానసపుత్రుఁడౌ - మౌని కుశుండు
"వచ్చినీకొసఁగితి - వంశవర్ధనుని
యిచ్చితి" ననిమౌని - యెఱిగిన యంత.
ఆనరపతి గాధి - యను మహారాజు
మానితపుణ్యుఁ గు - మారునింగనియె.
"గాధిరాజునకు యేఁ - గలిగితి రాఘు

వాధీశ! యిదియె మా - యన్వయక్రమము
నాకు తోఁబుట్టువు - నాకన్నఁ బెద్ద
యాకన్నె వెలయు స - త్యవతీ సమాఖ్య 2870
ఏము రుచీకున - కిచ్చిన వారు
భూమినుండఁగ రోసి - పుణ్యదంపతులు
యీశరీరములతో - నేఁగిరి దివికి
కౌశికి యందురా - కన్నియ పేరు
హిమవన్నగము పొంత - నీయుర్విమీఁద
నమలాంగి తనకీర్తి - యతిశయిల్లుటకు
దివిజులు పొగడ న - దీరూప యగుచుఁ
బ్రవహించె కౌశికి - ప్రఖ్యాతిఁ గాంచె.
ఏనాఁట నుండియు - నిచట వసింతు
నానందకర వామ - నాశ్రమంబునను 2880
సిద్ధాశ్రమంబు ప్ర - సిద్ధాశ్రమంబు
సిద్ధంబు మీరు వి - చ్చేసిన కతన
ప్రొద్దుగూఁకియుఁబ్రొద్దు - బోయెను మీకు
నిద్దుర లేకున్న - నేరరు తేవ
పయనమై రా నిందు - పవళింపుఁ డబ్జ
నయనముల్ ముగుడించి - నాసమీపమున
చూడుమల్లపుడె ప - క్షులు గూళ్లు చేరె
నీడ ద్రుమంబుల - నిద్రింపవయ్య!
కొమ్మలు వ్రేల నా - కులు మణిగించె
నెమ్మిమైఁ దరువులు - నిదురింపవయ్య! 2890
గగనంబు మేనెల్ల - కన్నులో యనఁగ
నెగడె తారకములు - నిదురింపవయ్య!

మెండుగా దిశల నే - మియుఁ గానీక
నిండెను చీఁకటుల్ - నిదురింపవయ్యా!
ఎచ్చోట వెన్నెల - లెసఁగించి కలువ
నెచ్చెలి పొడ కాపె - నిదురింపవయ్యా!
దుర్జయులై చరిం - తురు రాత్రులెల్ల
నిర్జరారాతులు - నిదురింపవయ్యా!
ధారాళమకరంద - ధారల నీల
నీరజంబులమించె - నిదురింపవయ్యా! 2900
పొగరు వెన్నెలలాని - పొట్టలనిండ
నిగుడెఁ జకోరముల్ - నిదురింపవయ్యా!
పావన రఘురామ! - బడలిక దీర
నీవును తమ్ముండు - నిదురింపరయ్యా!"
అని రాము నూరార్చి - యా తపోధనుఁడు
కనుమొగుడింప రా - ఘవులు నిద్రింప
నచ్చోటఁగల వారా - లందఱుఁగూడి
ముచ్చట గాధేయ - మునిచరిత్రంబు
విందుగా వీనుల - విని సమీపముల
నందఱు నిద్రించి - రప్పుడునాఁడు, 2910
శోణాపగాంచల - క్షోణులం జనుచు
నేణాంకధరమూర్తి - ఋషిచక్రవర్తి
గనుఁగొని "యేచాయ - గడత మీయేరు?
కనరాదు త్రోవన" - గాధేయుండనియె.
"నా వెనకనె రమ్ము - నరవర! వారె
పోవుచున్నారు ము - న్నుగ తపోధనులు
నెళవరులందఱు - నే నేఁగుజాడ

తోలఁగక" రండ ని - తోకొనిపోయి
యావ్వలం జనుచు మ - ధ్యాహ్నసంగతికి
దవ్వుల జాహ్నవి - దర్శించి చేరి 2920
యన్నదిఁదీర్థంబు - లాడి కర్మంబు
లన్నియుఁగావించి - హవిరన్న మెలమి
భుజియించి యొక రమ్య - భూమిఁగూర్చుండి
విజయలోలుఁడు రఘు - వీరుఁడిట్లనియె.
"మునినాథ! యీయేఱు - ముల్లోకములను
తనచేత పావన - త్వమునొందఁజేసి
జలధిగామిని యైన - చంప మేలాగు?
తెలుపుమీ? వనిన" గా - ధేయుఁడిట్లనియె.

## —: గంగా పార్వతుల జన్మకథ :—

"హిమవన్నగేంద్రుండు - హేమాచలంబు
కోమరిత దాను గై - కొని మనోరమను 2930
వరియించి యయ్యింతి - వలన యీగంగ
తరవాతఁ బార్వతి - తాఁగని పెనుప
తన తపంబున నుమా - తగుణి మెప్పించి
యెనసి యీశ్వరు వరి - యించె నాసాధ్వి
నగకన్యఁబెండ్లియై - నాగ్రకంకణుఁడు
పగలును రేలెడ - బాయని రతుల
సడలక దివ్య వ - ర్షశతంబు ప్రేమ
లెడపకఁగ్రీడింప - నెల్లదేవతలు
నజుని మున్నిడుకొని - యచటికి వచ్చి
"గజచర్మధర! శైల - కన్యయు నీవు 2940

నీలీలఁ గ్రీడింప - నీతేజమోర్వఁ
జాలునే యీసర్వ - సచరాచరంబు
మానిమిత్తంబుగా - మానుము నీవు
మానిన మెడనతి - మాత్రరతంబు
లోకోపకారార్థ - లోలచిత్తమున
నీకార్యమునకు మీ - రియ్యకోవలయు.
తీరునే నీదివ్య - తేజంబుఁ దాల్ప
నేరికి భువనంబు - లెల్ల రక్షింపు
దంపతుల్ కామ తం - త్రంబు చాలించి
యింపుతో తపముల - కేఁగుఁడు మీరు" 2950
అన "నట్లు కాకని" - హరుఁడాత్మతేజ
మొనర తేజము నందె - యునుపుదు నిపుడు
జారినయట్టి తే - జము దాల్పనొకరి
మీరేర్పరింపుఁ - డిమ్మేదిని నన్న
మేదినియేకాక - మిగిలినవార
లోదేవ! ధరియింప - నొక్కరున్నారె?
నిలుపు మర్వర" నన్న - నీలకంధరుఁడు
వెలువరించిన విశ్వ - విశ్వంబునిండి
యతుల ప్రవాహమై - యద్రులు నదులు
క్షితియు నేకముగ ముం - చిన వేల్పులెల్ల 2960
వనలుని ధరియింపు - మనిరి పావకుఁడు
తనశక్తిచేత రే - తము ధరియింప
నదికాఁకచే ముద్ద - నైమిన్నుమోచి
వదలక శ్వేతప - ర్వతము చందమునఁ
బావకాదిత్యప్ర - భాఢ్యమై వెలుఁగ

నావీర్యమనలుండు - నాపంగలేక
తోడైన వాయువు - తోఁగొంచు వచ్చి
వీడని కసువులో - విడిచె రేతంబు.
అప్పుడు తనసౌఖ్య - హాని గావించు
తప్పుచే శైలనం - దన కోపగించి 2970
వేలుపులనుఁగాంచి - వెతనొందుతన్నుఁ
బోలబిడ్డలులేక - పొమ్మని పలికి
పుడమి గనుంగొని - పుత్రులు లేక
యడలుచు బహునాట - కాధీనవగుచు
చరియింపు" మనియిల్క - శపియించి తుహిన
ధరణీధరముచేరి - తపమాచరింప.
తనపతిఁదోడ్కొని - తానేఁగె గంగ
వినుత చారిత్రంబు - వినుపింతు మీఁద.

—: కుమారస్వామి జననము :—

తమబలంబుల కెల్ల - దళవాయి లేక
నమరులు పద్మజు - నడుగుల వ్రాలి 2980
దేవసేనాని న - ర్థించి యేమెల్ల
భావించి శంకరుఁ - బ్రార్థింప నతఁడు
"పార్వతియెడఁ బుట్టు - పట్టిని మీకు
సర్వసైన్యమునకు - స్వామిగా నిత్తు"
అనిపల్కి తపముసే - యఁగఁ బోవహరుఁడు
"వనజసంభవ! మాకు - వలయు సేనాని
కరుణింపు" మనిన నా - కంజాతభవుఁడు
సురలఖేదంబులు - చూచియిట్లనియె.

''తనపట్టి యని గంగ - తనయు భావించి
మనసులోపల నర - మర యుంచుకొనదు. 2990
శైలజగాన త - జ్జారరగోళ
లాలితపిండ మ - ల్లన వహ్నిచేత
తెప్పించి గంగాన - దీ సలిలముల
నిప్పుడే యనుపు (డ - హీనసాహసుఁడు
సైన్యాధిపతి మీకు - సమకూడు''ననిన
మాన్యుఁ బావకు పవ - మానునిఁ గూర్చి
నగజ దాల్చిన తేజ - మపుడు దెప్పించి
గగనగంగనుఁ దాల్పఁ - గా నొడఁబఱచి
యునిచిన గంగ య - య్యుగ్ర తేజంబు
తనయందు నుంచి సం - తప్త తేజంబు 3000
ధరియింపఁ జాలక - తనతండ్రి పొంత
శరవణంబునఁదెచ్చి - సడలించి చనియె.
ఆరుద్ర తేజస్సు - మా కలనమున
భూరి మయంబయి - పొలిచె పర్వతము
నీ రెల్ల బంగారు - నీరయ్యె నదుల
భూరుహంబులు స్వర్ణ - భూజంబులయ్యె
ధాతువులయ్యె నం - దలి పలములు
జాతరూపాఖ్య గాం - చన మిట్లుమించె.
ఆ రెల్లుగుట్టలో - నప్పుడుపుట్టె.
వీరాగ్రణి కుమార - విఖ్యాతుఁ డొకఁడు 3010
చనుఁబ్రాలుగ్రోలింప - షట్కృత్తికలనుఁ
బనిచిరి వేల్పులా - బాలుని యెడకు
నారుల స్తన్యపా - నం బొనరింప

నాఱుమోముల మించె - నక్కుమారుండు
కృత్తికల్ వెనుప ధా - త్రి నతండు గాంచె
న త్తెఱఁగార్తికే - యాఖ్యగర్భమున
స్కన్నుండుగావున - స్కంధనామమున
వన్నియె గాంచె ను - ర్వర షణ్ముఖుండు.
అతనిసేనానిఁగా - నాదిత్యులెల్ల
హితమతిఁబ్రార్థించి - యిడిరి పట్టమున 3020
నీ కుమారాఖ్యాన - మెవ్వరువినిని
శ్రీకరులై శుభ - శ్రీలనొందుదురు.

—: సగరచక్రవర్తిచరిత్ర :—

గంగభూమికి వచ్చు - కత యేర్పరింతు
మంగళాకరమని - మఱియు నిట్లనియె
"తాలిమతో నయో - ధ్యాపట్టణంబు
పాలించి సగర - భూపాలశేఖరుఁడు
నిండువేడ్క నరిష్ట - నేమి బిడ్డలను
రెండుపెండ్లిండ్లు ధా - ర్మికుఁడాతఁడాడె
వెనరుమీరఁగఁ గేశి - నీ సుమతులను
మనుజేశుఁడతఁడు స - మంబుగా నేలి 3030
హిమవంతమున కేఁగి - భృగువునుఁగూర్చి
ప్రమదలుఁదాను త - పంబుగావింప.
అమ్మునిప్రత్యక్ష - మై మహీవిభుని
కొమ్మకొక్కతె కొక్క - కొడుకు నొక్కతెకు
నరువదివేవుర - నాత్మనందనులఁ

గరుణించి వేఁడు డీ - గతి నిత్తుననిన
చాలునొక్కరుఁడె వం - శకరుండు తనకు
నేలపెక్కండ్రని - యెంచి నెమ్మదిని
వరముగా కేశిని - వాకొన్న సుమతి
యరువదివేవుర - నడిగె నందనుల 3040
భృగుఁడట్లవారల - కిచ్చిపోవుటయు.
సగరభూపతివచ్చె - సాకేతపురికిఁ
దానడిగినకోర్కె - తప్పక మొదటి
మానినీమణి యస - మంజునిఁ గనియె.
అరుదుగా రెండవ - యంగన సుమతి
అరువదివేవుర - నర్థించి కనియె.
ఒక్కమావిని లోకు - లుప్పతింపంగ
నెక్కొన్నతనయుల - నేతికుండలను
నునిచి పెంపఁగవార - లొండొరుఁగడవ
ననిచిన రేఖల - నానాఁటఁబెరుగ 3050
నసమంజుఁడును బాల - కావళి నెల్ల
మసలక సరయువు - మడువు లోపలను
త్రోయుచు నుండ నం - దుకు సగరుండు
కూయిడు జనుల సం - క్షోభ మాలించి
నట్టేటఁద్రోయుచు - న్నాఁడు బాలకులఁ
బట్టిపీఁడును తన - పట్టిగా యనక
నడవులఁద్రోపించె - నంశుమంతుండు
కొడుకాతనికి సర్వ - గుణసమన్వితుఁడు
తనయులు మనుమండు - తనచిత్తమునకు
ననురాగమొనరింప - నమ్మహీవిభుఁడు 3060

శాశ్వతంబగు కీర్తి - నవరింపఁబూని
యశ్వమేధము సేయ - నాత్మలో దలఁచె."
అనవిని దీప్తాన - లార్కసంకాశు
మునిఁజూచె పల్కె రా - ముఁడు సంతసమున.
"మాకులఁబునఁబుట్టు - మానవాధిపుల
శ్రీకరచరితముల్ - చెవి నాలకింప
సంతసంబయ్యె నా - సగరువృత్తాంత
మంతయు నెఱిగింపు" - మన మౌనిపలికె
ప్రాలేయనగ వింధ్య - పర్వతసంధి
నాలింపుభూమి యా - ర్యావర్తమంద్రు. 3070
ఆచ్ఛోటమఖము సే - యఁగ నియమించి
వొాచ్చమ్ము లేని య - శ్వోత్తమంబేర్పు
బలముతో నస్త్రశస్త్ర - పాణియై వెంట
నల యంశుమంతుఁ బో - మ్మని విడిపించి
దీక్షితుండై యుండ - దేవేంద్రుఁడలిగి
రాక్షసుఁడై యశ్వ - రత్నంబుఁబట్టె.
మాయచే హరియింప - మది సగరుండు
సేయు తెఱంగేది - చింతిల్లుచుండఁ
బలికిరి ఋత్విజుల్ - పర్వకాలమునఁ
దొాలగించు గుఱ్ఱపు - దొంగను వెదకి 3080
పట్టి తెప్పించ నీ - పట్టున యాగ
మెట్టును కొఱఁతయా - నింతియె కాక
యజమానునకు హాని - యగుఁగాన తగిన
ప్రజనంపి నీయాగ - పశువుఁదెప్పింపు"
మనవుఁడు తనయుల - నరువదివేల

జనపతి పిలిచి దీ - క్ష వహించి నాఁడ
నాకుఁబోరాదునా - నాప్రయత్నముల
మీకుఁదోఁచిన యట్ల - మేదిని యెల్ల
యోజనంబున కొక్కఁ - డోడక వెదకి
తేజిఁదెచ్చినఁగాక - తిరిగిరావలదు. 3090
మాయొద్ద నీయంశు - మంతుఁ డుండెడును
పోయిరండని" పల్కి - భూపాలుఁడనుప.
సగరులువచ్చిభూ - చక్ర మంతయును
తగునీతి వెదకి వృ - థా ప్రయత్నములఁ
గసికలు పారలు - గడ్డపారలును
ముసలముల్ దాల్చి - కమ్మనక పరిగట్టి
యిలయెల్లఁద్రవ్వుచు - నెదురైనచోట
బలురక్కసులను స - ర్పములను ద్రుంచి
కొండలతోఁగూడ - కుంభినియెల్ల
చండించి త్రవ్వి దు - స్సహ వృత్తి మెలఁగ 3100
భూతకోటులు పరా - భూతులై చాల
భీతిల్లి కూయిడ - బెగడి దేవతలు
ధాతసన్నిధికేఁగి - ధరణికి నైన
యీాతిదెల్పిన వారి - కిట్లని పలికె.
"తురగంబుఁ గొనుచు నిం - ద్రుడుపోయి కపిలు
మఱుగునఁగట్టె నె - మ్మది నిల్లుచేరె.
ఈజగద్రోహు లా - యిరవునకేఁగి
యాజటివర్యుకో - పానలార్చులకు
నిగురుగానున్నారు - నిమిషంబులోన
సగరుల కవసాన - సమయంబు వచ్చె 3110

మీకేల చింతిల? - మిన్నకయుండుఁ
డీకార్యమెల్ల నే - యెఱిఁగి యున్నాఁడ
వొమ్మన్న సురలెల్లఁ - బోయిరి సగరు
లిమ్మహి వెలయులో - నెచ్చోటు వెదకి
కానక తమతండ్రి - కడ కేఁగి హయముఁ
గానలేమని పల్కఁ - గన్నెఱ్ఱఁ జేసి
"తురంగంబుఁ దేక వ - త్తురె పొండుమరల
ధరయెల్లఁ ద్రవ్వి పా - తాళంబు వెదకి
యా రసాతలవిశ్వ - మంతయుఁ జూచి
ధీరులై తురగంబుఁ - దెండు పొండ"నిన 3120
నందరు ధరణి వ - య్యలుగాఁగఁ ద్రవ్వి
యెందుఁజూచిన జీవ - హింస సేయుచును
పాతాళమునఁ బూర్వ - భాగంబు నందు
నాతరి భూభార - మాదలఁదాల్చి
యమరు విరూపాక్షు - మను దంతిఁ గాంచి
తమరందు తురగ ర - త్నము గానలేక
దక్షిణంబున కేఁగి - దర్పంబు మెఱసి
యక్షీణబలులు మ - హాపద్మగజముఁ
గాంచి యచ్చట వాజిఁ - గానక తామ
సించక పడమర - చేరి యచ్చోట 3130
సౌమనసం బను - సామజోత్తమము
భూమిఁదాల్పఁగఁజూచి - పోయి యవ్వలికి
నుత్తరంబునను పాండు - రోరుగాత్రంబు
మత్తంబు భద్ర సా - మగజంబుఁగాంచి
వేలుపుమూల ద్ర - వ్వి రసాతలంబు

నాలోకనముసేయ - నల్ దిక్కునందు
తపనతేజుని సనా - తను వాసుదేవు
కపిలుని తురగంబుఁ - గాంచి హర్షించి
"ఓరిగుఱ్ఱపుదొంగ! - యోడకనీవు
గీరుబు తోడ మి - క్కిలి మౌనిఁబోలి 3140
పొడకట్టితివి నిన్నుఁ - బోనిమ్ము కట్టి
పొడవక పోదుము - పోకు" మనంగఁ
గాంచి యమ్మౌని హుం - కారం బొనర్ప
నంచితరోషాన - లాభీలశిఖలఁ
బాపాత్ము లన్యాయఁ - బరులొక్కఁడైన
రూపేర్పడక సగ - రులు భస్మమైరి.
అరువదివేవురు - నణఁగిపోవుటయు
తురగంబు వోయిన - త్రోవ గానమియు
జాలచింతలు పెంప - సగరుండు తాల్మి
మాలి యప్పుడె యంశు - మంతునిఁ బిల్చి 3150
"మతిమంతుండగు బుద్ధి - మంతుఁడ వార్య
హితుఁడవు శూరుల - కెల్ల నగ్రణివి
తురగంబుఁ దే లేదు - తోతేరఁబోయి
తిరిగిరారైరి యే - తెరువునఁజనిరో?
ఎచ్చోట పినతండ్రు - లేఁగిరి నీవు
నచ్చోటికరిగి మే - లరసిరమ్మ"నుచుఁ
గైదువు శరములుఁ - గలన మేలిచ్చు
కోదండమును కేలఁ - గొమ్మనియొసఁగి
మెచ్చరిక మెలంగు - మెందుఁ బూజ్యులను
మచ్చికతోఁగొల్చి - మన్నన గనుము 3160

యనుమని యాతఁడ - మ్మనుమని భక్తిఁ
దనర దీవించి - ఖేదమునఁ బంపుటయు
నంశుమంతు రీతి - నలఘుతేజమున
నంశుమంతుఁడు తండ్రు - లరిగిన జాడ
ధరఁద్రవ్వివారు పా - తాళంబుచొచ్చు
తెరువునవచ్చి దా - దిగ్గజేంద్రముల
పర్వంబులను శిరో - భాగంబు లూఁప
నుర్వియెల్లఁజరించు - నురుసత్త్వధనులఁ
గాంచి తండ్రులఁ దుర - గము వేరువేరఁ
గాంచితిరే యన - గజరాజులెల్ల 3170
పోయిరిత్రోవగాఁ - బొమ్ము నీవచటి
కా యశ్వరత్నంబు - నందె చూచెదవు
పొమ్మన్న వలవచ్చి - పూజించి యతఁడు
నమ్మత్తగజముల - నన్నిటిమీఁది
రాసులై యొరుమూలఁ - బ్రబలుమంటలను
భాసితాంగములతో - భస్మమైపడిన
జనకులంగని మదిఁ - జాల శోకించి
మునిచెంత తమయశ్వ - ము మెలఁగఁజూచి
కైకొని సగరసం - ఘమునకు వార
లేకడ నొసఁగంగ - నిచ్ఛఁజింతించి 3180
జలము లెచ్చటలేక - చాలశోకించి
నల యంశుమంతు తో - నండజస్వామి
సగరునిబావ కా - శ్యపుఁడు పక్షీంద్రుఁ
డగణితప్రీతితో - నటపొడసూపి
వైనతేయుఁడను మీ - వారెల్లఁదనకు

మేనల్లు వారల - మేయ సాహసులు
తగునె సాధరణో - దక దాన మొసఁగ
సగరులీ లౌకిక - జలములచేత
కడతేర నేర్తు రే! - గంగాప్రవాహ
మడరించి తిలదర్భ - లావలియొసఁగు 3190
కపిలకోపాగ్ని ద - గ్ధశరీరులైన
విపులపాపాత్ముల - వే దరిజేర్చు
మంచివాఁడవు నీవు - మఘవాజిఁగొనుచు
సంచితపుణ్యా మీ - సవన మీడేర్చు
మరుగు మయోధ్యకు - నన్నపక్షీంద్రుఁ
చరణంబులకు మ్రొక్కి - చయ్యనఁగదలి
తనపితామహునితో - తండ్రుల తెఱఁగు
వినతాసుతుని మాట - వినుపించుటయును.
కడలేనిదుఃఖ సా - గరములోమునిఁగి
యడలుచు నెరవేర్చి - యశ్వమేధంబు 3200
గంగనుర్వికిఁ దెచ్చు - క్రమమాత్మలోనె
అంగక యాత్మసా - మ్రాజ్య మేలుచును
ముప్పదివేలేండ్లు - మునుముట్ట బ్రదికి
ముప్పున సురలోక - మున కేఁగెనతఁడు.
అతనికి తరువాత - నంశుమంతుండు
క్షితియెల్లఁ దా నభి - షిక్తుఁడై ప్రోచి
ఘనుని దిలీపుని - గాంచి యా వెనక
తనరాజ్యమెల్ల నం - దనునకు నిచ్చి
వెలయ ముప్పదిరెండు - వేలేండ్లు గంగ
నిలకుఁ దేరఁగ మది - నెంచి కాసలను 3210

వింతతపంబు గా - వించి చేఁగాక
యంతట దివమున - కరిగె నవ్విభుఁడు.

—: భగీరథుఁడు గంగకై తపంబొనర్చుట :—

ఆ దిలీపుఁడు పది - యాఱ్వేలై నట్టి
యాదిమరాజుల - యందొక్కఁడగుచు
ధరణి యంతయు సము - ద్ర పరీతముగను
పరిపాలనముచేసి - పావనచరితు
సుతు భగీరథుఁ గాంచి - సుస్థిరభోగ
వితతిచే ముప్పది - వేలేండులుండి
ఘనమైన రుజఁగాల - గతినొందెఁజనియె.
అనిమిషపురమున - కా తరువాత 3220
రాజన్యుఁ డా భగీ - రథుఁడు సాకేత
రాజధాని మహావి - రాజితుండగుచు
పాలింపుచును గంగ - పావనశ్రీల
భూలోకమునకుఁ - దేఁబూని యుఁ దనకు
కొడుకల వేఁడియు - గోకర్ణమునకు
వెడలి తపంబు - గావించె రాజ్యంబు
సచివులు పాలింప - సుకట్ట నియతి
నచలుఁడై ఘోర పం - చాగ్నిమధ్యమున
యినునిపై తనచూడ్కి - యిడి రెండుచేతు
లును పొడవెత్తి కా - లు ధరిత్రిమీఁద 3230
మోపక యంగుష్ట - మున నిల్చి నెలకు
నాపోశనవ్రత - మాచరింపుచును
తపమొనరింప ప - ద్మభవుండు మెచ్చి

యపుడుప్రత్యక్షమై - యాతనికిట్లనియె.
"అనఘ! మాంసాహారి - వై యుట్టి భీమ
వనిలోన వేయేండ్లు - వదలని తపము
చేసితి మెచ్చి వ - చ్చినవాఁడ నిన్ను
వాసిగాఁగోరిన - వరము లిచ్చెదను
నడుగు మీవన" "దేవ - యడిగెద మిమ్ము
కొడుకులఁ గామించు - కోరిక యొకటి 3240
మావంశజులకు గ - ర్మంబులు దీర్ప
దేవతానది నిధా - త్రికిఁ దెచ్చుటొకటి
కోరితి"నన "నీదు - కోరికల్ రెండు
కూరిమినొసఁగితి - కొడుకులం గనుము
గగనవాహినిఁ దెమ్ము - కరమర్థి మీదు
సగరుల కొసఁగుము - స్వర్గభోగములు
గంగను ధరియింపఁ - గానొక్క సర్వ
మంగళావిభుఁడె స - మర్థుండుగాక
యెవ్వరు నోప ర - య్యాశునిం గూర్చి
యెవ్వేళ గావింపు - మీవుతపంబు" 3250
ననిపల్కి గంగతో - ననుమతి యొసఁగి
చనియె వేల్పులు గొల్వ - జలజసంభవుఁడు.

—: గంగావతరణము :—

మొదలింటి గతి నుగ్ర - ముగ తపం బతఁడు
మదనారిఁగూర్చి భీ - మ వనంబులోన
కావింపుచుండగఁ - గరుణాశంకరుఁడు
దేవి యుతంబుగా - దివిజులు గొల్వ

సన్నిధిచేసి యె - సంగెద కోర్కె
నన్ను వేఁడు మనంగ - నరనాథుఁడనియె.
"దేవ! ధాత్రికి వచ్చు - దివిజ స్రవంతి
నీవది తలఁదాల్చి - నిలుపంగవలయు 3260
నెవ్వారిచేఁ దీర - దెదిరించి నిలువ
నివ్వరం బిమ్మన - నిచ్చితి ననిన
తలఁచు భగీరథు - తలఁపు వెంబడినె
యల మంచుమలపట్టి - యాకాశగంగ
హరునిఁగూడఁగ సచ - రాచరంబైన
ధరణియెల్లను రసా - తలముతోఁగూర్తు
ననుచు నుత్కటవేగ - మమరంగ నొక్క
పెనువెల్లియై గంగ - పృథివికి దుమికె.
ఆగర్వమెఱిఁగి పు - రారి యట్టిట్టు
సాగనీయక హిమా - చలదరీనిబిడ 3270
భీకరారణ్యశో - భితము లౌజడలు
జోకగా దిక్కులు - చుట్టి రాఁబఱచి
నటియించు నెడమహో - నటజటాటవినిఁ
బొటమరింపఁగలేక - పొంగెల్ల మాని
సుడివడి నదియున్న - చొప్పు నేర్పడక
సడలి యేసందున - జారి పోరాక
యిందాఁకఁజూచితి - మెక్కడఁ బోయె
బృందారకాపగ - పేరైనలేక"
యనుచు భగీరథుం - డచ్చోట గొన్ని
దినములుచూచి య - ద్దేవు భావించి 3280

యతఁడు వెండియు తప - మాచరింప
నతికృపాపరుఁడై మ - హాదేవుఁడపుడు
జడచుట్టు వదలించి - జగతికై కొంత
సడలినంతన బిందు - సరములోపలను
గుభులు గుభుల్లని - ఘూర్ణిల్లి దాఁటి
త్రిభువనంబులను ప్ర - తిధ్వనులీయఁ
బ్రవహింప యవియె స - ప్తప్రవాహముల
నవతరించెను భువ - నాశ్చర్యముగను
ప్రాచుర హ్లాదిని - పావని నలిని
యైచెన్నుమీఱెను మ - హాపగల్మూడు 3290
సీతయు చక్షువు - సింధువు ననఁగ
ఖ్యాతిగాఁపడమర - నైమూఁడునదులు
ప్రవహించె నాభగీ - రథుని వెంట
నవనిభేధిల్ల మ - హానది యొకటి
అమ్మహారథు రథం - బరిగినత్రోవ
గ్రమ్మకయుత్తర గా - మిని యగుచు
కారండవ క్రౌంచ - కలహంస చక్ర
సారసకలకల - స్వనశోభితంబు
కమఠకుళీరన - క్రగ్రాహభయద
తిమి తిమింగిల సమా - కీర్ణాంతరంబు 3300
కనకాబ్జకల్హార - కైరవప్రసవ
వినుతమాధ్వీ రసా - విత షట్పదంబు
అభ్రంలిహోర్మికా - ప్రాంచలచార
శుభ్రడిండీరవి - శ్రుతదిశాముఖము
బహుళతదావర్తాన - పాయచంక్రమణ

మహనీయతరతరు - మధ్యమానంబు
నగుచు మిన్నుననుండి - యభ్రయానముల
నిగనిగమెఱచు మ - ణీభూషణముల
నాదిత్యరుచులతో - నధినుతుల్ సేయు
నాదిత్యకోలాహ - లానువాదముల 3310
శరదభ్రముల యాక - సంబు చందమున
హరిణపక్షములైన - హంసపోతముల
దొరయుచునిలకెల్ల - దొడవుకై వడిన
వరనదీరత్న ము - ర్వరవచ్చుగపుడు
మలకలై దిక్కుల - మలయు నొక్కెడను
చులకనై వేగంబు - చూపు నొక్కెడను
తగునశ్వముల రీతి - దాటు నొక్కెడను
నిగుడక యందంద - నిలుచు నొక్కెడను
గజములోయన నొక్క - కడమందమంద
నిజగమనము చూపు - నిలుచు నొక్కెడను 3320
లహరీపరస్పరో - ల్లాసఘట్టనల
విహితాట్టహాసముల్ - వెలయించు నొకట
నమరలోకముఁబాసి - యవనిపైఁబుట్టు
నమరుల మరలంగ - ననుపు నీరార్చి
తొలఁకుల నెగయు లేఁ - దుంపురులంటి
పొలయుగాడ్పులఁ బాప - ములుఁబాఱమీటు
యిరుగడ నింద్రాదు - లెల్లసేవింప
గరుడగంధర్వ య - క్షప్రభుల్ గొలువ
వచ్చినదీ నద వన - పర్వతములు
గ్రొచ్చుచు నన్ని ది - క్కులునాక్రమించి 3330

నాచాయనొకజహ్నుఁ - డనుముని యాగ
మాచరింపఁగ ద్రవ్య - మలర తోఁగూర్చి
శాల యుర్వొత్తుగాఁ - జరుముక పొలి
నాలోన జహ్ను మ - హామాని యలిగి
పోనీక యయ్యేరు - పుడిసెండునీరు
గానుంచి యొక్క గ్రు - క్కనె పట్టిమింగె.
అదిచూచి విబుధులా - హా నినాదముల
వదలక యమ్మని - వర్యుఁగీర్తింప
గంగ! నీ తెఱఁ గెఱుఁ - గంగ లేనైతి
భంగమందితి ''నని - ప్రార్థింపుచుండ 3340
చింత చేఁదిరిగి చూ - చి భగీరథుండు
చెంతలఁ బ్రణమిల్లి - చేరి ప్రార్థింప
నా రాజ జటివర్యుఁ - డైనజహ్నుఁడు
భోరున తనకర్ణ - పుటములవెంట
పొమ్మన్నతనికిఁ - బుట్టితి ననుచు
సమ్మతితోఁ గంగ - జాహ్నవియనఁగఁ
బేరఁబెంపునఁగల్గి - పెల్లుబ్బెదిశల
మీరుచు పరమధా - ర్మికవర్యుఁడనఁగ
వెలయు భగీరథు - వెంబడివచ్చి
జలరాశిచొచ్చి ర - సాతలంబునకు 3350
దుమికి పాతాళంబు - దూరి యాసగర
సుమహితభస్మరా - సులునీటఁగలయ
కాపిలకోపాగ్నిఁ - గ్రాఁగినవారి
పాపంబులెల్లను - పైపయిఁదొలఁగఁ
బ్రవహించుటయు భగీ - రథునిదీవించి

దివికి నేఁగిరివారు - దివ్యవేషముల
నపుడబ్జభవుఁడుప్ర - త్యక్షుమై నిలిచి.

—: బ్రహ్మ భగీరథుని కడకువచ్చుట ;—

యపరిమితప్రీతి - నాభగీరథునిఁ
గాంచియుర్వికిని గం - గాప్రవాహంబు
పెంచి పావనత గ - ల్పించితి వీవు 3360
నందఱునుఁ గృతార్థు - లైరి మీవారు
నందన నీకు నీ - నాకస్రవంతి
యవని భాగీరథి - యనుపేరువెలయు
తవిలియున్నది జగ - త్త్రయిఁబ్రవహించి
త్రిపథగా నామ మం - దెను మీకులంబు
నృపవర్యు లపవర్గ - నిత్యభోగములు
మెందాంక జలరాసు - లీయేఱునుండు
నందాక నెమ్మది - ననుభవింపుదురు
కావింపు వీరికి - గంగాజలముల
పావనవృత్తి త - ర్పణముఖక్రియలు 3370
యసమానుఁడు దిలీపుఁ - డంశుమంతుఁడు
నసమంజసుఁడు సగ - రావనీవిభుఁడు
పూని చేతనుఁగాక - పోయిరి గంగ
దేనేర కీరితిం - దెచ్చితి వీవు
సేయునట్టి ప్రతిజ్ఞ - చెల్లించుకొంటి
వాయతవిఖ్యాతు - లందితివీవు
ధార్మికుండవు వీనఁ - దానమొనర్పు
కర్మముల్ నడుపుము - కనుము నందనుల”

ననుచు దీవించిరా - యంచపై నెక్కి
చనియె పద్మభవుండు - సత్యమార్గమున. 3380
ధాత యానతి చేతఁ - దండ్రికిఁదనదు
తాతకు సగరుని - తరము రాజులకుఁ
దిలతర్పణములిచ్చి - తీర్చికర్మములు
విలసితాలంకార - విధిశోభనంబు
చేకొని జనులెల్ల - సేవింపవచ్చె
నాకల్పయశుఁ డయో - ధ్యాపురంబునకు
ధరణిజనంబుల - ధర్మమార్గమునఁ
బరిపాలనమొనర్చి - పరగుటంజేసి
గంగావతరణంబు - కథవిన్నఁగలుగు
సంగరవిజయంబు - సకలధర్మములు 3390
పితృదేవతాప్రీతి - ప్రియవధూలబ్ధి
హితకార్యసిద్ధి య - నేకపుణ్యములు
గలిగి పాపంబులు - కడకొసరించి
వెలయుదు రటుగాన - వివరింపవలసె.

— విశాలాపుర వృత్తాంతము —

సాయంసమయమయ్యె - సంధ్యాదివిధులు
సేయుండు నా నట్లు - చేసెరాఘవుఁడు
సౌమిత్రియునుఁ దాను - సంయమినాథ !
నీమృదూక్తులచేత - నిమిషమైతోఁచె
యీ రేయియొకనిద్ర - నేతెల్లవాఱె
చేరెఁబూర్వాచల - శిఖర మర్కుండు 3400

నోడయియారేవున - నున్నదిమునులఁ
గూడి పోదము రమ్ము - గొబ్బున నెక్కి-
యని యుత్తరంబుగా - నయ్యేఱుదాఁటి
మును లెదుర్కొనుచు త - మ్ముబహూకరింప
నావలఁజనుచోట - నతిరమ్యమగుచు
దేవలోకముమాడ్కి - దివ్యసంపదల
సమధికంబైన వి - శాలాపురంబు
రమణీయతకు మెచ్చి - రాఘవుండనియె.
"ఎవ్వరుగావించి - రెయ్యది నామ
మెవ్వారుందురుదీన - నెఱింగింపుమనిన"? 3410
విని విశాలపురి ప్ర - వృత్తంబు గాధి
తనయుఁడు రఘువరో - త్తమున కిట్లనియె.
"ఇంద్రుని చారిత్ర - మిది వినుపింతు
చంద్రసన్నిభ! రామ - చంద్ర! ఆలింపు
సకలసురాసుర - సంఘంబు బుద్ధి
నొకచింతయిడి కృత - యుగవేళయందు
జరయు నాఁకలియు నుఁ - జావును లేక
పరిణామమునునుండు - పరమౌషధంబు
క్షీరాంబురాశి ద్ర - చ్చి గ్రహింత మమృత
పూరంబు జనియించు - బుగ్గచందమున 3420
నది తెచ్చి సేవింత - మని మందరాద్రి
వదలకజలధిఁ గ - వ్వంబుగానునిచి

—: పాలసముద్రమును మథించుట :—

వాసుకి తరిత్రాడు - వలె దానఁజుట్టి
యాసురాసురలు స - వ్యాపసవ్యములఁ

దరుపంగ వాసుకి - దంష్ట్రమూలముల
గరళంబు జలరాసిఁ - గాలకూటంబు
పేరిట జనియించి - పృథివి నింగియును
స్ఫారవిషానల - జ్వాలలచేతఁ
గమలింప సురలు శం - కరు పాలికరిగి
తమ కభయము వేఁడు - తరి నచ్యుతుండు 3430
వనజాక్షుఁ డప్పుడు - వచ్చి యీగరళ
"మనఘ! నీ వగ్రపూ - జార్థంబు గొనుము
కాలకూటంబు గ్రిం - గక యుంటివేని
తాళఁజాలక జగ - త్త్రయము నశించు
నేమరకు" మటంచు - నీశుతోఁ బలికి
తామరసాక్షుఁ డం - తర్ధానమంద,
అమృతోపమంబుగా - హాలహాలపాన
మమరహితార్థమై - హరుఁడు గావింప
మున్నిట్టి చందాన - మున్నీఁటిలోనఁ
బన్నగ రజ్జుసం - పన్నమందరము 3440
వైచి సురాసురల్ - వరుస మథింప
నాచాయ తరికొండ - యడుగు వట్టుటయు
దితి కొడుకులు నది - తి కుమారకులును
నెతలతో మొఱ - వెట్ట విన్నవీక్షించి

—: ధన్వంతరిపుట్టుట :—

యందరు మెచ్చఁగా - ర్మావతారమున
మందరం బెగనెత్తి - మత్తుగా నునిచి
దేవతలును పూర్వ - దేవతావళియు

లావణ్యబద్మప - లాశనేత్రుండు
వారధి వేయిండ్లు - వరబాహుశక్తి
భారకుండై మథిం - పఁగ నందువలన 3150
మానితాయుర్వేద - మయుఁడు ధార్మికుఁడు
పూని ధన్వంతరి - పుట్టె నవ్వెనక
నచ్చరల్ జనియించి - రమరదానవులు
వచ్చి వారెవ్వరి - వంతుగాకున్న
వలయు కైవడినుండ - వాకొనుటయును
వెలజాతి వారైరి - విబుధలోకమున
తరవాత జలరాశి - తరువ నన్నడుమ
వరుణనందన యైన - వారుణిపుట్ట
నామద్యము గ్రహించి - రమరులు గాన
నామయిం గనిరి సు - రాసురత్వములు 3460
నుచ్చైశ్శ్రవము పుట్టె - నొడిచె నయ్యింద్రుఁ
డచ్యుతుండు హరించె - నట్ల కౌస్తుభము
నమృతంబు పుట్టెదై - త్యాదిత్యవరులు
తమలోన జగడించి - దర్పంబు లెంచి
కలహింపుచుండఁగఁ - గమలేక్షణుండు
నిలిచె నప్పుడు మోహి - నీ స్వరూపమున
మాయదైత్యులఁ గను - మాయించి మించి
గాయకంబున సుధా - కలశమంకించి
ఇంద్రాదులకుఁ బంచి - యిడియె వేల్పులకు
నింద్రునితో కల - హించి రాక్షసుల 3470
పొలిసిన తరివేలు - పులతోఁడఁగూడె
నెలమి త్రిలోకంబు - నేలె వాసవుఁడు

సిద్ధచారణుల ర - క్షించె శరీర
సిద్ధిగైకొనిరి ని - శ్చింతతో సురలు.

—: పుత్రశోకాతురయైన దితి తపంబుసేయుట :—

ఆదిత్యు లీరీతి - నమరులౌ టెఱిఁగి
యాదితి శోకభ - యార్తయై కలఁగి
ప్రాణనాథుని కశ్య - ప బ్రహ్మఁజూచి
పాణియుగ్మముమోడ్చి - పలికె నిట్లనుచు.
" అనఘాత్మ! ఆదిత్యు - లమృతంబుఁ గ్రోల
తన తనూజులనెల్ల - తవిలివధించి 3480
యున్నవా రింద్రాదు - లోకఁడైన యేను
గన్నవారల పరా - క్రమశాలిఁ గాన
నాయింద్రుఁజంపెడు - నాత్మజుంగాంచి
యీయభిమతము నా - కీడేర్పవలయు "
నన నట్లు యిచ్చితి - నశుచి రాకుండ
వినుతశీలమున నే - వేళకన్గల్గి
తపము గావింపు మ - బ్దసహస్రదినము
లపుడు నీకు జనించు - నతఁ డింద్రుఁజంపు
పొమ్మని తనకరం - బున నింతిమేను
సమ్మతంబున ముట్టి - చనియె కశ్యపుఁడు. 3490
పతినిఁ గూరిచి కుశ - ప్లవనంబునందు
దితి యుగ్రతపము భ - క్తినొనర్చుచుండ
యీ తెఱఁ గాత్మలో - నింద్రుండు దెలిసి
భీతిల్లి గురుండు చె - ప్పిన యుపాయమున
వంచనచేత న - వ్వనిత యున్నెడకు

మంచివాఁడునుఁబోలి - మఱుదల్లి యగుట
నిజముగా నడచువా - ని తెఱంగుదోఁప
భుజియించువేళ మై - పూఁతలవేళ
జలకంబువేళ వ - స్త్రము లందువేళ
మెలఁగువేళల నిద్ర - మేకొనువేళ 3500
నేమేమి వలయుఁ దా - నెటులుండవలయు
నేమిసేయుటయొప్పు - నెయ్యవి వేఁడు
నన్నియు నొనగూర్చి - యరలేకసవతిఁ
గన్నబిడ్డఁడు తన్నుఁ - గాచుకయుండ
" మది తొమ్మనూటతొం - బదియేండ్లు చనియె
బదియేండ్లు వెలితి నా - పతివరంబునకుఁ
గొడుకు పుట్టిన నింద్రు - గుణవంతు నెట్లు
తొడఁ బడఁజంపింతు - దోసంబుగాదె".
అనియింద్రు పరిచర్య - లాత్మలో మెచ్చి
కనికరంబున పూర్ణ- గర్భిణివల్కె. 3510
"వాసవ! మీతండ్రి - వరమిచ్చినాఁడు
నాసుతుఁడొకరుఁ డు - న్నత బాహుబలుఁడు
జనియించు నిఁక దశ - సంవత్సరముల
నినువంటి యున్నవా - నికిఁ గల్గినాఁడు
యిరువుర నేకమై - యీజగత్త్రయిని
సరిలేని యట్టి భు - జాశౌర్యములను
ఎల్లలోకంబుల - నేలుండు కడుపు
చల్లగా మిముఁజూతు - సవతియునేను
నీ యంతవాఁడగు - నినుఁగెల్వఁగలఁడు
నీయనుజుఁడు డాప - నీతోడఁదగడు. 3520

కనియెదు, సుఖముండు - గాకనీ" వనుచు
వనిత కంటికి నిద్ర - వచ్చినదైన
తనకాళ్లు చాఁపుచో - తలవీడ నొటిగి
మనసులో నేమఱి - మధ్యాహ్నవేళ
నశుచియై శయనించు - నవసరంబెఱిఁగి
యశనిచే యోగవి - ద్యాబలంబునను
కామరూపము దాల్చి - కడుసంతసమున
సోమరియగు నిండు - చూలాలిఁగాంచి

—: సప్తమరుత్తుల చరిత్ర :—

కడుపులోనికిఁ జొచ్చి - గర్భపిండంబు
తొడిఁబడ నతఁడేడు - తునియలుగాఁగ 3530
కడుపులో శాలుఁ డు - త్కటరోదనంబు
లడరింప భయద వ - జ్రాయుధాహతిని
మానక "మారుద - మారుద" యనుచు
తోన యొక్కటి యేడు - దునియలుసేయ
నంతట మేల్కని - యా దితితనదు
సంతును "చంపకు - చంపకు" మనుచు
వాపోపు నెడల వె - ల్వడి వజ్రహస్తుఁ
డై పెదతల్లికి - సాష్టాంగ మొరిగి
చేతులు మొగిచి "ర - క్షింపుము నన్ను
నాతి! నీ తనయుండు - నాపగవాఁడు 3540
నను గెల్వనట్టి యు - న్నతసత్త్వశాలి
జనియించు ననుమాట - సహియింపవెఱచి
తునిమితి నే నేడు - తునియలుగాఁగ

కనికరంబున నను - గావుమీ'' యనిన
నా మాటవిని దితి - యాత్మఁ జింతించి
యా మఘవునిఁ జూచి - యప్పుడిట్లనియె
"నీకేఁటి నేరము - నిర్జరాధీశ !
నీకు నేర్పరచు నా - నేరముగాక
మదిమదినుండి సు - మాళించి మర్మ
మిది దెల్పఁగా వచ్చు - నిదిదెల్పరాదు 3550
అనక నా వెట్రినై - యట మించ నాడి
యనుభవించితి యట్టి - యవివేకఫలము
తునియ లేడును మరు - త్తులు గాఁగనుండు
రనిశంబు నీవార - లై మెలంగుదురు
సకలలోకములు ని - చ్చకు వచ్చినట్లు
సుకరులై మెలఁగఁగా - ర్చుక నడపింపు
దేవతలై వాయు - దేవతాఖ్యలను
నీవు వెట్టినపేర - నే మెలంగుదురు
మారుతులై" యన్న - మాటకు మెచ్చి
స్వారాజువల్కె "నీ - వచనసంగతిని 3560
అమ్మ ! నీసుతులట్ల - యమరులై లోక
సమ్మతి మారుత - స్కంధంబులందు
వసియింతు రేఁ బోయి - వచ్చెద ''ననుచు
కొసరులన్నియుఁదీరి - కుధరారి చనియె.

—: విశాలాపుర వృత్తాంతము :—

ఆ యింద్రుఁడుఁ జట్టి - యవని యిచ్చోటు
యీయర్క సంతతి - నిక్ష్వాకునృపతి

తా నలంబసయను - తరలాక్షియందు
పూని విశాలాఖ్య - పుత్రునింగనియె.
అతని పేరిట నిమ్మ - హాపట్టణంబు
క్షితి విశాల యనంగ - సిరులతో వెలసె. 3570
అతఁడు ధూమ్రాశ్వ నా - యన శృంజయాఖ్య
జితవైరి నృపులఁగాం - చిరి సహదేవు
అతనికి హేమచం - ద్రావనీశ్వరుఁడు
సుతుఁడయ్యెను సుచంద్ర - శుభనాము నతఁడు
నా రాజుఁగనియెఁ గు - శాశ్వుఁ డాతనికి
శూరోత్తముఁడు పుట్టె - సోమదత్తుండు
కలిగె వాని కతండు - కాంచెఁగకుస్థుఁ
డలరాజు సుమతి నా - మాత్మజుఁగనియె.
అతఁడివ్విశాలామ - హారాజధాని
హితుఁడై జనులకెల్ల - యేలుచున్నాఁడు. 3580
ఈవిశాలాపురం - బేలినకతన
నావిభుల్ వైశాలి - కాహ్వయులైరి.
అందరు నుత్తము - లందరు శూరు
లందరు ధర్మజ్ఞు - లాయురున్నతులు
నీరాజకులము వా - రిచ్చోట మనము
నీరేయి వసియించి - యెల్లి వైదేహి
పురి కేఁగుద మటంచుఁ - బోయినాఁడచట
ధరణీశసుతులతోఁ - దాపసోత్తముఁడు
వచ్చిన నెదురుగా - వచ్చియాసుమతి
యచ్చపుభక్తితో - నర్ఘ్య పాద్యముల 3590

గాధేయుఁబూజించి - "కనుఁగొంటి మిమ్ము
నేధన్యుఁడ సమాను - లెవ్వారునాకు
వీరు నాయనుజులు - వీరు నందనులు
వీరుప్రధానులు - వీరాప్తజనులు
యిది సైన్య మిదిపురం - బిట్టిసామ్రాజ్య
పదవియెల్లను మీకృ - పాపాలితంబు
వీరులు దేవతా - వీరవిక్రములు
(వీరిరువురుఁజూడ - విష్ణుఁ బోలుదురు)
గజసింహగమనులు - కంజాతపత్ర
విజయావలోకులు - విండ్లునమ్ములును 3600
దొనలుఁగైదువులు నం - దుకవచ్చువారు
చను నశ్వినులవంటి - చక్కనివారు
జోడుగూడినవారు - సూర్యచంద్రులకు
జోడైన పరమతే - జోవిరాజితులు
కొమరుఁబాయపువారు - కూడియిద్దరును
సమచిత్తవృత్తులై - సంగినవారు
భూమికి డిగ్గనవే - ల్పులరీతి రూప
సామగ్రిచూడఁ బొ - సంగినవారు
తలిరుటాకులను కెం - దమ్ములమీఱఁ
గల పదంబులవారు - కరకురానేల 3610
రానేల? వీరలే - రాజనందనులు?
పూనికె యెయ్యెడ - పోవుటచెపుడ?
వీరలపేరెద్ది - వినుపింపు" మనిన
నారాజుఁజూచి మ - హామునిపల్కె
"రాజన్య! దశరథ - రాజనందనులు

రాజీవనేత్రులు - రామలక్ష్మణులు
ఆసురిఁదాటక - నణఁగించి మించి
నాసవనముఁగాచి - నన్నుమన్నించి
జనకు జన్నము చూడఁ - జనుచున్నవారు
కని వీరిఁబూజింపు - కరమర్థి" ననిన 3620
నా రాజువారల - నర్థించి నిలుప
నారాత్రి యతని గే - హమున వర్తించి
మఱునాడు గదలి - యమ్మౌనీంద్రు వెనక
(..........................)
మిథిలాపురము చూచి - మెచ్చుచుఁ జేరి
మిథిలోపవనములో - మెఱయు నాశ్రమము
జంతుశూన్యంబు వి - జనము నౌ నొక్క
కాంతార మీక్షించి - కౌశికుఁ జూచి
"మెవ్వరి యాశ్రమం - బిది యిందుఁగాన
మెవ్వరి?" నన మౌని - యిట్లనిపల్కె. 3630

—: అహల్యా వృత్తాంతము :—

"గౌతమాశ్రమ మిది - కాకుస్థతిలక!
ఆతని సతి నహ - ల్యా దేవియండ్రు
దంపతు లిచ్చోటఁ - దపమాచరించి
రింపు వుట్టింప న - నేక వర్షములు
నావేళ తఱిచూచి - యమరనాయకుఁడు
తావచ్చెనటకు గౌ - తముని వేషమున
నపు డహల్యనుఁ జేరి - "యతివ! నీకడకు
నిపుడు వచ్చినరాక - మెఱిఁగింతు వినుము

అతివలఁ గామించు - నట్టివారెందు
ఋతుకాలమనరు కో - రికగల్గెనేని 3640
ప్రొద్దున్న దిపుడు సం - భోగేచ్ఛ నీదు
వద్దకిఁ జేరితి - వనిత! రమ్మ" నిన
"అతలోదరి నన్ను - నరసేయనేల!
యేతెమ్ము తెలిసితి - నింద్రుండవగుదు
కోరివచ్చిన వారి - కోరికల్ దీర్ప
నేరని సతులకు - నిష్కృతుల్ లేవు
రమ్మని యింద్రునా - రాటమ్ముదీర్చి
పొమ్ము నిన్నును నన్నుఁ - బోషించు కొనుము
కనుకల్గి మీఁదటి - కార్యమూహింపు
మెనయునే జారుల - కిట్టితామసము",  3650
అని యహల్యా యత్త - మగుపర్ణశాల
యనిమిషస్వామి స - య్యన నిర్గమించి
వచ్చుచో భువనపా - వనుని గౌతముని
సచ్చరిత్రుని నదీ - స్నానార్ద్రవసను
ననలసంకాశు దే - వాసురారాధ్యు
ఘను సమిత్కుశపాణిఁ - గని చాలవెఱచి
"తొలఁగునీమది మది - ద్రోహి దుర్మార్గ
నలిగి కోపించి య - హల్యనీవేళ 3660
భోగించి నాదురూ - పున వచ్చినట్టి
రాగాంధుండవు సుర - ప్రభుఁడవానీవు?
నీవృషణంబులు - నేలపైఁబడక
కావరంబును కాము - కత్వంబుఁజెడదు
పడుఁగాక పొమ్మ"న్న - పడిపోవ నట్లు

తడయు కహల్యగా - తముఁడు వీక్షించి
"నీకు నాహారంబు - నిద్రయు సుఖము
లేక తపించి ధూ - ళిమునింగి యొరులు
గనరాక పాషాణ - గతిని వేయేండ్లు
చనిన యవ్వెనక కౌ - సల్యాసుతుండు 3670
రాముఁడు వచ్చునా - రాధింపు మతని
నీమేను దాల్చినా - నెలవుగోరెదవు".
అనుచు శపించినీ - హారాద్రి కరిగి
మునినాథుఁ డచ్చోట - మునిచర్యనుండె.
అమరేంద్రుఁ డఫలుఁడై - యధికదైన్యమున
నమరులఁ జూచి యి - ట్లనివల్కఁ లేక

—: రాముఁ డహల్యకు శాప విముక్తి ననుగ్రహించుట :—

"గౌతముఁడు తపంబు - గావింపుచుండ
నాతపోనిధి తపో - హాని గావింప
దేవకార్యార్థమ - ద్దేవి నహల్య
నేవంచన మొనర్చి - యీలువుచెఱిచి 3680
యాగౌతముని శాప - మందితి నిట్లు
ఆగడంబయ్యె నా - యత్న మంతయును
నతఁడు గోపించి య - హల్యనుఁ దిట్టె
నతని తపంబెల్ల - నాఁటఁడిఁబోవ
మీ నిమిత్తంబు నా - మేనికి కొదవ
రా నిట్లు చూచి యూ - రక యుండఁదగునె?
మఱియింపుం డిందుకు - మార్గాంతరంబు
హితమన్న పితరుల - నీక్షించి సురలు

మీరు మేషాండముల్ - మెలఁకువఁదునిమి
స్వారాజు కటిసీమ - సంధింపవలయు. 3690
పొట్టేళ్ల నిది మొదల్ - పుడమి జన్నములఁ
బట్టి వధింపరు - పశుకర్మమునకు
మీ నిమిత్తంబది - మేకొనవలయు
మా నిమిత్తంబున - మారాడవెఱచి
వారట్ల సేయ నె - వ్వారు యజ్ఞములకు
దేరు మేషముల పి - తృప్రీతికొఱకు
నిది గౌతమాశ్రమం - బిచట నమ్మౌని
సుదతియున్నది పోయి - చూతము రమ్ము"
అనుచు ముందర మౌని - యరుగ వెంబడిన
యినకులోత్తములు తా - నెట్టి చిత్రంబొ 3700
మఱుఁగుగానున్న ధూ - మమువాయఁద్రోచి
కరమొప్పు పవనస - ఖజ్వాలయనఁగ
వ్యాకీర్ణమైన నీ - హారంబు ద్రోచి
రేకమించిన చంద్ర - రేఖ యోయనఁగ
జలములలోఁ బ్రతి - చ్ఛాయ గన్పట్టు
జలజభాంధవుదీప్తి - సరణియోయనఁగ
మహనీయపుణ్యాశ్ర - మంబులో నలఘు
మహిమఁగ్రుమ్మరు దేవ - మాయయో యనఁగ
నలఘు తపస్విని - యైన యహల్య
తలనాఁడు పొందు గౌ - తమునిశాపంబు 3710
పోఁబెట్టి తనదైన - పూర్వవేషమునఁ
బూఁబోణియై వచ్చి - పొడకట్టుటయును
తనకు మ్రొక్కిన రఘూ - త్తముని దీవించి

మనములో గౌతము - మాటలు దలంచి
యారామచంద్రుని - యర్ఘ్యపాద్యముల
నారాధనము సేయ - నమరవాటికను
ధిమ్మని మొరసెను - దివిజదుందుభులు
ఘుమ్మనమారుతాం - కురములు వొలసె
కురిసె నల్దిక్కులం - గుసుమవర్షములు
నెరసెను సురకామి - నీనర్తనములు 3720
నాతరి రామస - మాగమం బెఱింగి
గౌతమముని వచ్చి - కాకుస్థుఁజూచి
పూజలుచేసి య - ప్పుణ్యాశ్రమమున
నాజటివరుం డహ - ల్యనుఁగూడియుండె.

—: రామాదులు మిథిలఁ జేరుట :—

మునివెంట తానుఁ ద - మ్ముఁడును రాఘవుఁడు
చని మిథిలాప్రవే - శంబు గావించి
ఆ పురినీశాన్య - మైన దిక్కునను
చూపట్టు నమ్మహీ - శుని యజ్ఞశాల
గనుఁగొని గాధేయ! - "కంటిరే మ్రోల
జనకుని మఘవాటి - చక్కదనంబు 3730
పావనశ్రీల వి - ప్రనికేతనముల
దేవతాహ్వాన సం - దీప్తరావంబు
సవనహుతాగార - శకటపంక్తులును
ప్రవిమలతర ముని - ప్రవరవాటికలు
మెచ్చొనరించె ని - మ్మిథిలాపురమున
నెచ్చోట నసియింతు - మెఱింగింపుఁ" డనిన

"అల్ల జలాశయం - బరుత చూచితివె
చల్లనై యొకపర్ణ - శాల చూపట్టె
అందరుగుదమన్న" - నక్కుమారకులు
కొందఱ మునులతోఁ - గూడి కౌశికుఁడు 3740
తారును వసియించు - తరి జనకుండు
చారుల వలన వి - శ్వామిత్రు రాక
నెఱిఁగి యప్పుడె పురో - హితు శతానందు
నెఱిగించి యతనితో - నేఁగ నచ్చటికి
అప్పుడు ఋత్విక్కు - లా గాధితనయు
నొప్పుగా జనక ని - యోగంబుచేత
పూజించు పూజలఁ - బొదలి యజ్జనక
భూజాని సంప్రశ్న - ముల నాదరించి
అతఁడొసఁగిన కన - కాసనాగ్రమున
హితమతి వసియింప - నెల్లవారలును 3750
ఉచితాసనంబుల - నుండ నవ్విభుఁడు
సుచరిత్రు నమ్మునిఁ - జూచియినిట్లయె.
" ధన్యుండనైతి నా - తపము లీడేరె
మాన్యుండ నేఁజేయు - మఘము ఫలించె
నీ రాకచేత పు - నీతుండనైతి
నారయ నేనె కృ - తార్థుండ జగతి
తీరును పదిరెండు - దినముల కింక
ప్రారంభ మొనరించు - నాత్మీయమఘము
వచ్చినవారు స - ర్వము నెరవేర్చి
విచ్చేయుఁ డిదియె నా - విన్నపంబ"నుచు 3760

నంజలిచేసి య - య్యనఘుని చెంత
రంజిల్లు చున్నట్టి - రామలక్ష్మణులఁ
జూచి "వీరెవ్వ రె - చ్చోటికేఁగెదరు
రాచకుమారులే - రాజనందనులు
వీరి పేరెయ్యది ? - వినుపింపుఁ" డనిన

—: కౌశికుఁడు రామలక్ష్మణుల వృత్తాంతము
జనకునకుం దెల్పుట :—

యారాజుఁ జూచిమ - హాముని వల్కె-
వరమతు లిక్ష్వాకు - వంశవర్ధనులు
కరుణాకరులు ధైర్య - గాంభీర్యనిధులు
రాజతేజులు దశ - రథకుమారకులు
రాజీవనేత్రులు - రామలక్ష్మణులు 3770
నా వెంటవచ్చి దా - నవిని తాటకిని
దేవతల్మెచ్చ ధా - త్రినిఁద్రెళ్లనేసి
బలిమి మారీచ సు - బాహుల గెల్చి
యెలమి నాపూనిక - యీడేర్చి మఘము
కడఁక మైఁగాచి మా - ర్గమున శాపంబు
తడకట్టు దీర్చి గా - తము నిల్లువిల్పి
నీవీటిలోపల - నీలకంధరుని
చేవిల్లు దాఁచియుం - చిన తెఱంగెల్ల
వినిచూడవచ్చిరి - వీరశేఖరులు
కొని తేరఁబనుపుము - కోదండమిపుడు". 3780
అనిన శతానందుఁ - డమలినానంద
మున నాకుమారుల - మొగములు చూచి

వీరలే మాపాలి - వేలుపులైన
శ్రీరామలక్ష్మణుల్ - స్థిరశౌర్యనిధులు
కాంచెనే మాతల్లి - గౌసల్యపట్టి
కాంచెనే శాపమో - క్షుమహల్యనేఁడు
కనియెనే యీరాము - గౌతము సాధ్వి
వినియెనే వీరల - వృత్తాంతమెల్ల
చేతుల నంటి పూ - జించెనే యితని
ప్రీతునిఁగావింప - శ్రీపాదయుగము 3790
తావచ్చెనయ్య ? గా - తమముని యటకు
దేవితోఁగలిసియం - దె వసించి నాఁడె ?
ఆదంపతుల సేమ - మరసివచ్చితిరె ?
నీదుమాటల చేత - నీఁగ ఖేదములు
తలఁచిరె నన్ను మా - తలిదండ్రులవుడు
పలికిరె నాకు దె - ల్పఁగ మేలువార్త ''
అనిన విశ్వామిత్రుఁ - డన్నియు నతని
మనసురంజిల నాల్గు - మాటలఁబలికె
తగి రేణుకాజమ - దగ్నులం బోల్చి
మగువ తా గౌతము - మనికి వాకొనిన 3800
యాశలెల్ల ఫలించి - యీరాముఁజూచి
యాశతానందుఁ డి - ట్లనిపల్కె నపుడు.
నాపుణ్యమున వచ్చి - నార లిచ్చటికి
తాపసోత్తమువెంట - దశరథుండనుప
నీతండు మునిమాత్రుఁ - డే ? తపోమహిమ
రాతిగుండియగల్గ - బ్రహ్మర్షియయ్యె
సాధారణుండె యీ - సత్యాత్ముఁడైన

గాధేయు నావేల్పు - గాఁగ నెంచితిని
యీతండె గతి నాకు - నెల్ల కార్యముల
యీతపోనిధి సేవ - నీవు ధన్యుఁడవు 3810
వినుపింతు నివ్వాని - వృత్తాంత మెల్ల
వినుమని యందఱు - వినఁగ నిట్లనియె.

—: విశ్వామిత్ర చరిత్రము :—

"పరమధార్మికుఁడు కృ - పా పరాయణుఁడు
శరజాలసంవేది - సాహసాధికుఁడు
దాక్షిణ్యశాలి ప్ర - తాపభూషణుఁడు
దక్షుండు నిరుపమ - ధర్మవర్తనుఁడు
కుశుఁడనవొక రాజు - కుంభిని వెలసె,
కుశనాభుఁడతనికిఁ - గొమరుఁడై మించె
గాధి యవ్విభునకుఁ - గలిగె నాయనకు
గాధేయుఁ డీ పుణ్య - ఖని జనియించె 3820
నితఁడు రాజ్యము చేసి - యెల్లరఁ బ్రోచి
క్షితి యెల్లఁ దన యాజ్ఞ - శిరసావహింప
నక్షోహిణీబలం - బరుదేర వెంట
నీక్షోణిఁ జరియించు - నెడనొక్కనాఁడు
వేఁట వెంబడి వన - వీధుల వచ్చి
గాఁటుప్పు టెండల - గాసిలి యలసి
పనస రసాల నిం - బ కదంబ వకుళ
ఘనసార చందనా - గరు శోభితంబు
కురువక మల్లికా - కుంద చాంపేయ
మరువక మల్లికా - మాననీయంబు 3830

నాహవనీయమ - ఖానలధూమ
సాహాయ్య జలధర - శతసమన్వితము
కారండవక్రౌంచ - కమల కల్హార
సారస కుముదకా - సార శోభితము
హరిణాది నానామృ - గాకీర్ణమాని
వరగృహోపాంత ప - ల్వల సమన్వితము
ఘనవాలఖిల్యవై - ఖానసప్రముఖ
మునివరస్వాధ్యాయ - ముఖరీ కృతంబు
అనఘ పుణ్యపురాణ - హరికథాశ్రవణ
మనన పారగ ధరా - మరకదంబకము 3840
పావనతర హవి - ర్భాగాను యాత
దేవ పరంపరాం - తిమ దిశాముఖము
నైన వసిష్టమ - హామానిచంద్రు
మానిత పుణ్యాశ్ర - మంబు వీక్షించి
కడువేడ్కమానికిఁ - గౌశికవిభుఁడు
తడయక సాష్టాంగ - దండ మర్పించ
దీవించిన యరుంధ - తీ ప్రాణవిభుని
భావుక ప్రశ్నముల్ - పరిపాటినడుగ
ధార్మిక ల్మీయట్టి - ధరణీశులుండ
శర్మంబులకు నేమి - చదువులకేమి 3850
యాగంబులకు నేమి - యధ్యాత్మనిరత
యోగంబులకు నేమి - యొకవెత్తిగలదె"
అనుచుదీవించి ఫ - లాంబుముఖ్యముల
ననుపమ ప్రీతితో - నాతిథ్య మొసఁగి
యాసనంబిచ్చి హి - తానులాపముల

నానంయమీంద్రుఁడి - ట్లని పల్కెనపుడు.
"మీకు లెస్సలె? సర్వ - మేదినీ నాథ!
ఏకడధర్మంబు - నెడవాయ కుందె?
పాలింతువే? నీవు - పరిజనంబులను
మేలుగోరుదురె? భూ - మీజనుల్ నీకు 3860
విజయంబుగాంచితే - విమతులంగెల్చి
భజియించితే గురు - బ్రాహ్మణోత్తముల
సప్తాంగములకు లె - స్సలెకదా? మహికి
ప్రాప్తులే నీ పుత్ర - పౌత్రాదులెల్ల
నరసిపోషింతువే - యనదలఁజూచి
పరిణామమేనీదు - బాంధవావళికి?
సేమమే? నిన్నుఁ గొ - ల్చినరాజులకును
భూమి యకంటకం - బుగనేలినావె?
సంతోషమా నీకు - సచివులకెల్ల
యింతులఁగోరిక - యిచ్చియేలుదురె? 3870
సకలంబుసేమమే? - జననాథ!" యనిన
ముకుళిత హస్తుఁడై - మునిఁ - జూచిపలికె.
"మీకటాక్షమున భూ - మిజనంబు సేమ
నేకొఱంతయులేక - యెలమి నుండి లిమి
మాయేలుబడియైన - మహిసుందరట్టె
మీయంతవారలే - మి విచారమింక"
అని పరస్పరము వా - రాత్మల ముదము
ననలొత్త సంభాష - ణములవర్తిల్లి
మాయింటభుజియించి - మనుజేశ! వెనుక
మీయూరికరుగఁగ - మేకొనవలయు 3880

రాజ్యాధిపతివి ధ - ర్మస్వరూపుఁడవు
పూజ్యుండవటుగాన - పోరామి మాకు
"అనిన విశ్వామిత్రుఁ - డనియె మామీఁద
ననుకంప మీఱుంచు - నంతయె చాలు
భుజియింపు మెంతయు - పోయి వచ్చెదము
నిజముగా మఱువక - నిలుపుండికరుణ
మదిలోన" నన విని - మఱియు నమ్మౌని
సదయుఁడై "మాయెడ - చనువుచెల్లించి
త్రోచిపోవకయున్న - తోయమాత్రంబు
మాచేత భుజియింపు - మాకుగౌరవము 3890
పోవల"దన గాధి - పుత్రుండునట్ల
కావింపుఁడని పల్క - కామధేనువును
రప్పించి నందిని - రాజుకుంబ్రజల
కిప్పుడు నీవు విం - దిడి పంపుమనిన

—: కామధేనువు నిమ్మని విశ్వామిత్రుఁడు
వసిష్ఠు నడుగుట :—

బంతులుసాగిన - పరివారమునకు
సంతసంబున నొక్క - సరియగుచుండ
లీల బంగారుప - ళ్లెరములు వారి
మ్రోల గిన్నెలతోడ - మొలపించి యుంచి
కలిగించె నందుల - కలమాన్నరాశి
మొలపించె బహుసూప - ముల కన్నుదనియ 3900
పెరిగిఁ చెఁజుట్టును - పెక్కుశాకములు
పరగించె మితి మీఱ - పచ్చళ్లగుంపు

జాలెత్తఁజేసె నా - జ్యప్రవాహములు
తేలించె తెప్పల - తేనె కాలువలు
వెలయించె నేచాయ - వింతకజ్జములు
కలయించె నెడమీక - కలవంటకములు
ప్రవహింపఁజేసెను - పాయసాన్నములు
నవని నిండించె ర - సావళ్లచేత
పులుసులు షడ్రసం - బులు వారివారి
తలఁపులఁదలఁచునం - తకు మున్నెగాఁగ 3910
ఘుమ్మనితావులు - గుమ్మరింపంగ
కమ్మందనంబు లా - కసమెల్లనిండ
దొరలతో నాలుక - త్రుప్పుడుల్ దీఱ
పరిజనుల్ కుత్తుక - బంటిగా నపుడు
భుజియించి వార్చి తాం - బూలంబులంది
రుజలును మానస - రుజలును మాని
వలసిన తరులక్రే - వల నీడలందు
చలువపట్టుల సుఖ - శయనులై రంత.
పల్లకీలునుఁ దాను - భక్ష్యభోజ్యములు
నుల్లముల్ రంజిల - నొకపాత్రుగలసి 3920
యారగించి నృపాలుఁ - డామేలు మఱచి
"వీటఁడిదైన యావు - విందొనర్చుటకు
ములుచతనంబున - మునులకునేల ?
వెలలేనియీ యావు - వింతలుగాక
రాజయోగ్యంబిది - బ్రాహ్మణులేడ?
యీ జీవధనరాజ - మేడ ?" యటంచు
మునిఁజూచి "నాకు ని - మ్మొదవుఁబాలింపు

మనఘాత్మ! వలసిన - యావులిచ్చెదను
యేమి వేఁడినిత్తు - ని"మ్మన్ననవ్వి
"యోమహీశ్వర! యావు - లొక్కటియేల? 3930
యిలఁగల సొమ్మెల్ల - నిచ్చెద నన్న
వెలయాన యొక దీని - వెంట్రుకకైన?
స్థిరధైర్యశాలి కం - చితకీర్తి యటుల
యరయంగ మాకునీ - యావు నిత్యంబు
మాహవ్యకవ్యహో - మక్రమంబులకుఁ
దా హేతువగు దీనిఁ - దగునయ్యయడుగ?
మంచిసొమ్ములుదెచ్చి - మాకు నర్పించి
మంచివారగుట ధ - ర్మంబు రాజులకు
మాయావుఁగనికని - మంచిదియనుచు
మీయంతవారికి - మేరయే యడుగ? 3940
దీనియధీన మా - త్మీయ జీవనము
దాన శరీరయా - త్రయు నడపుదుము
కాన మీరడుగుట - గాదు మాహోమ
ధేనువు మాకీయఁ - దీరదు మాకు
పురికేఁగుఁ"డన గాధి - పుత్రుండు గనలి
మఱుపడఁ గోపంబు - మఱియు నిట్లనియె.
బాగొప్ప నిలువెల్ల - పసిఁడియా గంధ
నాగంబులొక పదు - నాలుగువేలు
లాలితమణిమయా - లంకారరథము
లీ లోకమున లేని - వెనిమిదినూర్లు 3950
నవనవఖండ స - న్నాహంబులైన
పవనజవాశ్వముల్ - పదినొండువేలు

నాపాదశృంగ భూ - షాయత్తకనక
నూపుర కపిలధే - నువు లోకకోటి
వలసినయట్టి సొ - వర్ణరాసులును
వెలగాఁగ నిత్తు ని - వ్వేల్పుటావునకు
నిమ్మని" పల్కిన - "నిదియేఁటిమాట
యిమ్మఘంబులకు నా - యిట్టిసంతతికి
నాతిరువారాధ - నమున కిమ్మొదవు
నీతోడు వలయు దీ - ని నొసంగఁజాల 3960
వట్టిమాటలు మాని - వచ్చినత్రోవ
పట్టిపో" మ్మనిన వి - శ్వామిత్రుఁడలిగి

—కామధేనువు విశ్వామిత్రుబలంబులఁ దునుమాడుట :—

తనబలంబులఁ బిల్చి - "దామెనత్రాళ్లఁ
గొని కట్టి తెండుకై - కొండుప్రియంబు
వీరింటి ముంగిటి - వెల్లావు" నన్న
వారలు వలెత్రాళ్లు - వైచిబంధింపఁ
బలుపుచే బిగియించి - పట్టుక యీడ్చి
బలవంతులై పోవు - పట్టుననావు
చిక్కి వారలచేత - చింతిల్లి నన్ను
తెక్కలికాండ్రెల్ల - తెగిపట్టిరొక్కొ 3970
యపరాధమేమి సే - యఁగ వసిష్ఠుండు
కృపలేక వీరల - కిచ్చెనో నన్ను
ఏమినేరము చూచి - యీవీరభటులు
బాములకెల్లలోఁ - బఱచెనో నన్ను
నెఱుఁగవే కేమియు - నేఁ జేరఁబోయి

మొఱసేయ నమ్మ హా - ముని యానతిచ్చు
కరుణాసముద్రుఁ డీ - గాధేయుపాల
చెఱఁబెట్టు నేయేమి - సేయుదునింక?
నరయుదుఁగాక యే - నతని చిత్తంబు
పరికింప నాపాలి - భాగ్యమెట్టిదియొ" 3980
యనుచుఁదన్నరికట్టి - నట్టి దుర్జనులఁ
దనశక్తిచేత నం - దఱఁబడనిచ్చి
విదిలించుకుని తపో - విజ్ఞానరాశి
సదయాత్మున వ్వసి - ష్ఠమునీంద్రుఁ జేరి
"పరమధార్మికుఁడవు - బ్రహ్మపుత్రుఁడవు
కరుణానిధివి రమా - కాంత కల్పుఁడవు
శాంతమూర్తివి - సర్వసముఁడవు నేర
మెంత సేసిననన్ను - నిటుసేయనగునె?
ఏలయ్య? వీరిచే - నిటులీడిపించి
కాలికి మెడకంటఁ - గట్టించినావు 3990
తెగి యిట్లు నామీఁద - తెంపుచేసినను
తగినదండము సేయఁ - దగుఁగాదె మీకు
నీదుపాదంబుల - నీడయేకాక
యేదిక్కుగలదు నా - కెన్నిచూచినను"
ననుచుఁగన్నుల వెంట - నశ్రువుల్గురియఁ
దనచెంతవిలపింపఁ - దాఁదేటిచూచి
చెంగట తోఁబుట్టు - చెలియలి దుఃఖ
మంగదపడి చూచు - నన్నయుంబోలి
దూఱుచుండెడు కామ - దుఘమునుఁజూచి
చేరంగఁ దిగిచి వ - సిష్ఠుఁడిట్లనియె. 4000

''వారికి నిచ్చిన - వాఁడను గాను
నేరమించుకయైన - నీయెడలేదు
రాజు గావున నపా - రబలంబు వెంట
లేజాడఁ గొలువ దం - డెత్తి మామీఁద
నక్షోహిణీబల - మతనికిఁగలుగ
దక్షుఁడై నిన్నును - దండంబుసేసె
బలవంతుండాతఁడు - బ్రాహ్మలమేము
బలముగల్గిన నిన్నుఁ - బట్టుకపోవ
నూరకుండుమనె వాని - కొప్పనచేసి
కరుణించు మతఁడు వే - గ పడంగ నేల'' 4010
అన వినయంబుతో - నాయావు వల్కెఁ
''ననఘ! దివ్యంబు బ్ర - హ్మబలంబు మీఁది
క్షత్రబలం బెంత - కావున భువన
పాత్రంబు సరిలేని - బలము మీబలము
బలవంతుఁడన నేల - భవ్యాత్మ! నీదు
బలము చేతనె వాని - బలమడంచెదను
నాకు నానతి యిమ్ము'' - నావుఁడునట్ల
కాక పొమ్మన కామ - గవి మై విదిర్చి
హుంభారవ మొనర్ప - హూణ పుళింద
పుంభావశౌర్యద - ర్పులు కీకటులునుఁ 4020
దనదుకన్నులబ్రోలఁ - దరమివెన్నాడి
తనబలంబులఁగృతాం - తపురంబుఁజేర్ప
కోపించి యా కౌశి - కుఁడు వారినెల్ల
రూపణఁగించె నా - రూఢ శౌర్యమున
పవివిభాంగుల నుప - ప్లవులఁగీకటుల

యవనుల శకుల న - య్యావుగల్పింప
వారలు కింజల్క - వర్ణులైయెల్ల
మేరలు బొదివి దొ - మ్మిగఁజుట్టుముట్ట
వివిధాయుధంబుల - వివిధవస్త్రముల
వివిధభూషల మహా - విలయాగ్నిరీతి 4030
గాధేయుబలము నొ - క్కటఁబోవనీక
యోధులై సమయింప - నుగ్రసాహసుఁడు
కౌశికుఁడు నిశాత - కాండవహ్నులకు
నాశౌర్యనిధుల పూ - ర్ణాహుతిచేసి
సేనలుపోవఁజూ - చి వసిష్ఠమౌని
"ధేనువుఁబిల్చి నీ - దేహంబువలన
సృజియింపు మిప్పుడ - జేయసాహసుల
ప్రజల నున్నత భుజా - బలుల" నావుఁడును
కొమ్మల ముక్కున - గొరిజల చెవుల
హుమ్మను నూర్పుల - నొడిని వాలమున 4040
కన్నులం బొదుగున - కడుపున మెడను
చన్నుల కాళ్ల గ - జ్జల మూఁపునందు
శక కీకట పుళింద - సంవీర హూణ
కుకురు కాంభోజ ము - ఖ్యులఁగిరాతులను
నేలయీనినమాడ్కి - నిండఁబుట్టింప
కాలుబలంబెల్ల - కాలుబలంబు
గాధేయజననాథు - కడ దండిబారు
యోధులఁదలపడి - యుర్విపైఁగలప
వారలం దరమి వి - శ్వామిత్రసుతులు
నూరుగు రుగ్రథ - నుర్బాణులగుచుఁ 4050

జేరిన యంత వ - సిష్ఠ హుంకార
మారుతాహతిచేత - మ్రగ్గిరందఱును.

—: విశ్వామిత్రుఁడు తపంబునకరుగుట :—

పుత్రులుబలములుఁ - బోయినంజూచి
మాత్రాధికంబైన - మదిలోనిభీతి
చింతిల్లి మిక్కిలి - సిగ్గుతోవేగ
మంతయు పొలిఁబోవు - నంబుధియనఁగ
కోఱలువెఱికిన - కోపంబుచెడక
సారె గుందుచునున్న - సర్పంబుమాడ్కి
నుగ్రతేజమున రా - హుగ్రహగ్రస్త
విగ్రహుండైనట్టి - విమలార్కుఁడనఁగ 4060
ఱెక్కలువిఱిగి ధ - రిత్రిఁబోలేక
చిక్కినయట్టి ప - క్షివరేణ్యుఁడనఁగ
హతశేషుండైనట్టి - యాత్మజు నొకని
నతనిరాజ్యమునకు - నభిషిక్తుఁజేసి
హిమవంతమునకేఁగి - యీశ్వరుఁగూర్చి
ప్రమదంబుతోడఁ ద - పంబాచరింప
హరుఁడు ప్రత్యక్షమై - యతనిఁగావలయు
వరములిచ్చెద" నని - వచియింప నలరి
దేవదానవులైనఁ - దివిరి నాతోడ
లావున గెలువఁ జా - లక యోడిపఱవ 4070
కార్ముకాగమము సాం - గంబుగానేర్చి
ధర్మదివ్యాస్త్ర శ - స్త్రములునాకిమ్ము"

అన నట్లయిచ్చితి - నని యాశుఁ డరుగ
జననాయకుఁడు పర్వ - జలరాశివోలె

—: విశ్వామిత్రుఁడు వసిష్ఠుని పైదండు వెడలుట :—

నుప్పొంగి గర్వించి - యుగ్రబాణములు
కప్పి వధింతు వే - గ వసిష్ఠుననుచు
నతనియాశ్రమమున - కరిగి బాణాగ్నిఁ
బ్రతిలేక వనమెల్ల - భస్మీకరింప
మునులుశిష్యులు మృగ - ములుఁబక్షికులము
ఘనసాయజాగ్ని శి - ఖాపరంపరల 4080
గ్రాఁగి యాశ్రమ మూష - క క్షేత్రమైన
వేఁగి యెల్లఁరు మాని - వెనకచొచ్చుటయు
వెఱవకుమని మంచు - విఱియించునట్టి
తరణికై వడి వీని - దర్పంబుమాన్తు
కనుఁ " డనివచ్చి యా - గాధేయుఁజూచి
కినిసి "మూఢాత్మ! - యాకీడేలనీకు ?
చిరకాలముననుండి - చెడనియాశ్రమము
చెఱిచి నీవెక్కడ - చేరుదువింక "
ననుచు కాలాగ్నియో - యన దండధరుని
యనువున బ్రహ్మదం - డాన్వితుఁడగుచు 4090
రాఁ జూచి " నిలునిలు - రారాదు నీకు
పోఁజూచి ననుపారి - పోనీయ నిన్ను"
ననుచు నాగ్నేయాస్త్ర - మతఁడు సంధించి
కనలివైచిన ముని - గ్రామణివలికె.
"క్షత్రియాధమ! నీదు - సామర్థ్యమున్న

శస్త్రంబుఁ జూపుము - సంహరించెదను
నా బ్రహ్మబలముచే - నన్ను మార్కొన్న
నా బ్రహ్మ రుద్రాదు - లడ్డమైరేని"
అనుచు నంబువు చల్లి - యగ్ని చల్లార్చు
ననువున బ్రహ్మదం - డాగ్రంబువలనఁ 4100
బావకాస్త్రమడంప - పరమదివ్యాస్త్ర
కోవిదుఁ డతఁ డస్త్ర - కోటులన్నియును
నొక్కమొత్తంబుగా - నోడక వేయ
నక్కజపడి మెచ్చి - యమ్మౌనివరుఁడు
తన బ్రహ్మదండ మిం - త గదల్పుచుండ
పొనిఁగి యన్నియు రిత్త - వోయినం జూచి
బ్రహ్మాస్త్రమతఁడు వం - పఁగ భీతినొంది
బ్రహ్మాదిసురలెల్లఁ - బలవరింపంగఁ
జేరికిగొనక వ - సిష్ఠుండు కేల
దారుణంబగు బ్రహ్మ - దండంబుఁ దాల్చి 4110
భీకరాకారుఁడై - పేర్చి దండమున
లోకేశు నస్త్రంబు - లోఁగొను నంత
నమ్మహామౌని కో - పానలం బాత్మ
నిమ్ముచాలక మేన - నెల్లెడ వెడలి
రోమరంధ్రంబుల - గూఢమై జ్వాల
లామీద నిగిడి కా - లాగ్నియవోలె
కౌశికుతోడ జ - గత్త్రితయంబు
ప్రాశించ గతిమిన్ను - లంటినం జూచి
"చాలుఁజాలు వ - సిష్ఠ! చాలింపు కోప
మేల? యెల్లరఁ ద్రుంప - నీతని కొఱకు 4120

నీయంగమతి రౌద్ర - నిబిడతేజంబు
గాయుచున్నది మాన్పఁ - గలఁడెయొక్కరుఁడు.
ఉపసంహరింపు మీ - యుగ్రతేజంబు
తపియించె నిదె చతు - ర్దశభువనములు
చాల మాయందుఁబ్ర - సన్నుండ వగుము
మేలొందు" మన శాంతి - మేకొనునంత
తీరెబ్రహ్మాదుల - దిగులెల్లభీతి
పారె కౌశికుఁడు కో - పము వీటిఁబుచ్చి
"బలమన్నయది బ్రహ్మ - బలమె, క్షత్రియుల
బలమేలదానిఁగా - ల్పనె" యంచురోసి 4130
చెల్లరె యీతని - చే యీఁతకోల
యెల్లదివ్యాస్త్రంబు - లిటు మ్రింగిపోవ
యీవిల్లు తనకేల? - యీయమ్ము లేల?
యీవిరోధంబేల? - యిఁకఁజాలుతనకుఁ
బగిదీర్పఁజాలు త - పంబుచేసెదను.

—: విశ్వామిత్రుఁడు రాజర్షి యగుట :—

జగతిబ్రహ్మణ్యంబు - సంతరించెదను
కానకయితనితో - కలహించుపొందు
మానభంగంబెల్ల - మాయఁజేసెదను"
అనిమదిఁదలఁచి జా - యాసమేతముగఁ
దనయేలుబడిగాని - దక్షిణదిశకుఁ 4140
బోయి ఘోరారణ్య - భూములందపము
సేయుచునుండె కౌ - శికనృపాలుండు.
అనఘ హవిష్యందుఁ - డామధుష్యందుఁ

డును మరి దృఢనేత్రుఁ - డును మహారథుఁడుఁ
గలిగిరి తనయులు - కౌశికమునికి
నెలమిఁదపంబువే - యేఁడులు చెల్లె
నపుడు సన్నిధిచేసె - నబ్జగర్భుండు
తపముచే రాజర్షి - ధర్మమొసంగె.
పోయెఁ గ్రమ్మర వేలు - పులుగొల్వధాత
ఆయెడ గాధేయుఁ - డాత్మఁ జింతించి 4150
లెస్సగాఁ జేసితి - లే తపంబేను
లెస్సఁగా తమ్మిచూ - లియు వరంబిచ్చె
రాజనేనట నన్న - రాజర్షి యనుచు
రాజీవభవుఁడాడి - రసికుఁడై చనియె.
యెవ్వరిఁచేఁగాని - యింతటివరము
నవ్వుబాటుల కోర్చి - నాతోఁడఁబలికె.
పోయినం బోనిమ్ము - భూరితపంబు
సేయుదు బ్రాహ్మణ్య - సిద్ధియౌనటకును"
ననచు గ్రమ్మర నుగ్ర - మైనతపంబు
వనిఁ జేయుచుండె వి - శ్వామిత్రుఁడపుడు. 4160

—: త్రిశంకుని చరిత్ర :—

వసుమతి యేలు ని - క్ష్వాకు కులీనుఁ
డసమానుఁడు త్రిశంకుఁ - డను మహీవిభుఁడు
బొందితోఁడ నెని నాక - మున కేఁగదలఁచి
యందుకై యొకయజ్ఞ - మాచరించుటకుఁ
బూనివసిష్ఠ త - పోనిధిఁ జేరి
తానాత్మఁదలఁచు య - త్నము విన్నవింప

నాయన చేతగా - దనినఁ దత్క్షణము
పోయి తపోనిష్ఠ - పూనియున్నట్టి
ధన్యాత్ముల వసిష్ఠ - తనయుల భువన
మాన్యులఁజూచి న - మస్కృతింజేసి 4170
తలవాంచి వినయ వ - ర్తనముతో తనదు
తలఁపు వసిష్ఠుఁడు - తప్పించుకొనుట
వివరించి, "యిక్ష్వాకు - విభులకు నెందు
నవుఁగాములకు క ర్త - లైనట్టివారు
మీరుపురోహితుల్ - మీకన్న నొరులు
వేరి! మాకునుగతి - వెదకిచూచినను
మీకన్నమరి మాకు - మేలుకార్యములు
వాకొనఁ డొనఁగూడు - వారి నొక్కరిని
నన్నుఁజేకొని మీరు - నాకోర్కెదీర్పుఁ"
డన్ననూర్వురునవ్వి - యతనికిట్లనిరి. 4180

—వశిష్ఠపుత్రులుత్రిశంకుని నిరాకరించుట :—

"తగునె వసిష్ఠునం - తటిమహామహుఁడు
విగణించి నీచేత - విని తనచేత
కాదనునటె యిట్టి - క్రతువొక్కరుండు
కాదనక యొనర్పఁ - గలడెధరిత్రి ?
కోరిన పని బ్రహ్మ - కొడుకుచేగాక
తీరిననవ్వలఁ - దీగనేరుచునె?
సత్యసంధుని వసి - ష్ఠమునీంద్రుమాట
సత్య మీపనికొన - సాగదునీకు

పొమ్మన్న నాగ్రహించి - పోక త్రిశంకుఁ
డమ్మౌని సుతులతో - నంజక పలికె. 4190
"గురువుగాదని పల్క - గురుపుత్రులయిన
స్థిరమతి నామాట - చెల్లింపవలయు
నందరుఁ గాదన్న - నవ్వలమాకు
మందయి పోయిరె - మౌని శేఖరులు
వేఱెవొక్కరిఁజేరి - వేడి నా మఖము
తీఱుతు మీరు చిం - తిలిచూచుచుండ"
నన విని శక్తిము - న్నగువారలెల్ల
జననాథుఁజూచి - "యాచార్యాంతరంబు
చండాలుఁడే కాక - సలుపునె? కాన
చండాలుఁడవుగమ్ము - చను" మంచువారు 4200
శపియించు నంత త్రి - శంకుని మేన
నపుడ చండాలత్వ - మావేశమయ్యె.
నల్లని దేహంబు - నలఁగినచీర
పల్లవెంట్రుకలు కం - బళివలెవాటు
యినుపసొమ్ములు మేన - నెఱ్ఱగందంబు
గునుకులేనడ మట్టి - కుళ్లాయి నీలి
దట్టియు కేలిబె - త్తపుఁబొందెకోల
పట్టినకొఱడును - పంగనామములుఁ
గనుపట్ట నెవ్వరిఁ - గని మ్రొక్కులిడుచు
మనసులోనొదుగుచు - మత్తాయి గొనుచు 4210
పౌరుల మంత్రులఁ - బాసిపోవుటయు
వేఱొక్కటను దిక్కు - వెదకిన లేక
వచ్చియల్లంత వి - శ్వామిత్రుఁగాంచి

ముచ్చటమోకాళ్లు - మునిచిత్రముక్కటయు
కరుణించి యేమని - గాధేయుఁ డడుగ
చరణముల్ చూచి త్రి - శంకుఁడువల్కె
"గురుఁడును గురుపుత్ర - కులు చేతఁగాక
పరిహరించిన యేను - పట్టినపూన్కి
వేఱొక్కమానుల - వేఁడి యావెలితి
తీరుతునన్న నెం - తే కోపగించి 4220
"మాలవుగమ్మ" ని - మదిలోనకరుణ
మాలి శపింప ని - మ్మైన్నలవాటిల్లె.
నోచి యేఁజేసితి - నూఱుజన్నములు
ప్రోచితి నీతిచేఁ - బుడమియంతయును
పారంగఁదోలితి - పరిపంథినృపుల
భూరివైభవరాజ్య - భోగముల్ గంటి
కొలిచితి భక్తిచే - గురుదైవతముల
వెలయని యత్నముల్ - వృథగాఁగఁజనియె.
తనయదృష్టంబుచే - దైవయత్నంబు
"కొనసాగె విధిప్రతి - కూలమా కతన 4230
కౌశిక! నాదుదు - ష్కర్మానుభవము
నీశక్తిఁబ్రోచియా - నెగులు వారింపు
దైవంబు గెలువుము - దయఁజూడు మనిన"
భూవరుతో గాధి - పుత్త్రుఁడిట్లనియె.

—: త్రిశంకు నిమిత్తము విశ్వామిత్రుఁడు యజ్ఞ ప్రయత్నముఁ జేయుట :—

యేనున్నవాఁడ నీ - కేలభయంబు ?
మానుము నీయభి - మానఖేదములు

పరమధార్మికుండవు - బ్రహ్మర్షివరుల
సరవితోఁ నేఁగూర్తు - జన్నమీడేర్తు
గురుశాపమునఁజెందు - గుత్సితాంగమున
సురపురికిందఱుఁ - జూడఁబంపుదును 4240
యీమేనితోడ నీ - వింద్రు సన్నిధిని
నేమంబుతోనుండఁ - జేయుదునిపుడు."
అని తనపుత్రుల - నందఱఁబిలిచి
జనపతియజ్ఞంబు - సలుపుచున్వాఁడు
సవదరింపుఁడు వస్తు - సామగ్రిమీరు
జవమున నీ శిష్య - జాలంబుఁజూచి
"పొండుమీరెల్ల నీ - పుణ్యాశ్రమముల
నుండెడు మునులనా - యొద్దకుఁదెండు
సవన కర్మమున కా - సంయములందు
నవివేకియై యొక్కఁ - డవుఁగాదటన్న 4250
నామాట వివరింపుం - డని పంప వారు
నామునీంద్రులంబిల్వ - నందఱువచ్చి
నిలువ శిష్యులు చెంత - నిలిచి కేల్మోడ్చి
యిలఁగల్గు మునులెల్ల - నేతెంచి రిపుడు
తగదని యన్మహో - దయుఁడురాఁడయ్యె
పగవారు వసిష్ఠు - పట్టులందఱును
అనరానిమాటగా - ననిరి పోనాడి
వినుఁడెట్టులన్ననా - వృత్తాంతమెల్ల
"యాగంబుసేయించు - నతఁడుఁ క్షత్రియుఁడు
యాగంబు చండాలుఁ - డటసేయువాఁడు? 4260

వింత యీసభలో హ - విర్భాగములకు
వంతు వెంబడి సురల్ - వచ్చుట లాగొ ?
ఆ సవనమున బ్రా - హ్మణులు భోజనము
చేసి యేగతికేఁగఁ - జింతించినారొ?
బొందితో నంపక - పోదులే గాధి
నందనుఁడిట్టి చం - డాలుఁజేపట్టి"
అని మహోదయునితో - ననిరి వాసిష్ఠు
లన విని కౌశికుఁ - డట్టిట్టుపడుచు
నెలకొన్నతపముచే - నిర్దోషినగుచు
వెలసిన నన్నని - వ్విధమునఁబలికి 4270
"రెవ్వరు దూషించి - రెప్డు డవ్వారు
క్రొవ్వఱి భస్మమై - కుమిలిపోఁగలరు.
శారిగా యమపాశ - బద్ధులై యేడు
నూఱుజన్మముల యందు - ను సతుల్ సుతులు
శునకమాంసములు దిం - చును దయాహీను
లును ఘోరచండా - లునుఁగ్రూరులగుచు
నుందురుగాక మ - హోదయుం డార్తి
నందుచు బోయవాఁ - డై పోవుఁగాక"

—: త్రిశంకుకొఱకు విశ్వామిత్రుఁడు స్వర్గమును నిర్మించుట :—

అని సభలో నిల్వ - నాడి "త్రిశంకుఁ
డనఘుఁ డిక్ష్వాకువం - శాగ్రణి పరమ 4280
పావనుం డేను చే - పట్టినవాఁడ
యీవిభుండిప్పుడె - యీమేనితోడ

సురలోకమున కేఁగఁ - జొప్పడు మఖము
పరికించి సేయుఁ - డీ పట్టున "ననిన
మునులెల్లనొండొరు - మొగములు చూచి
అనుమానములు మాని - యాత్మఁజింతించి
కాలాగ్నికల్పుఁడీ - కౌశికమౌని
చాలఁగోపించిన - శపియించు మనల
నితని చేఁజిక్కితి - మేమనవచ్చు
నితని చండాలు న - య్యింద్రునిపురికి 4290
నంప యాగముసేయుఁ - డను చున్నవాఁడు
అంపరాదని పల్క - నాపదవచ్చు
నాడి నట్లాడుద - మని మహామునులు
కూడి ఋత్విక్కులై - కొనసాగ మఖము
కర్మముల్ నడపుచో - గాధేయమౌని
యర్మిలి యాజకుం - డై వేల్చునపుడు
మొదల హవిర్భాగ - ములకు రమ్మనిన
త్రిదశులు రాక గా - ధేయునిందింపఁ
గోపించి యాకౌశి - కుఁడు స్రువంబొప్పు
కేపారుచెయి చాఁచి - యిట్లని పల్కె. 4300
"రమ్ము త్రిశంకు భూ - రమణ! నామహిమ
నిమ్మెనితో దివి - కేఁగింతు నిన్ను
చూడుమీవ "నినంత - చోద్యంబుగాఁగ
యేడ తెక్కలు మొల్చె - నే వీనికనఁగ
మునులెల్లనాశ్చర్య - మునఁ జూచుచుండ
ననిమిషవాటికి - నరిగె నవ్విభుఁడు.
వచ్చినయాతని - వదనంబుచూచి

"పచ్చిమాలవు నీవు - పాపాత్మ ! యోరి
గురుశాపహతుఁడవు - కొంకకేరీతి
నరుదెంచినావు నా - యాస్థానమునకు ?" 4310
ననుచు మోదించి పొ - మ్మనిపించు నింద్రు
కినుకకోర్వక తల - క్రిందుగా నతఁడు
మొఱపెట్టుచును మెర - ములు వింతవింత
తిరుపులు దిరుగుచు - " దిక్కెగావయ్య
నమ్మితిఁ గౌశిక ! నాకుఁ - జేయిచ్చి
యిమ్మహిఁబడనీక - యెత్తుకోవయ్య "
అన మొఱయాలించి - " యట నిల్వు నిలువు
జననాథ ! పడవు వి - చారమేమిటికి ?"
అన దక్షిణాశ న - య్యాకాశవీథి
జననాయకుని నిల్పి - స్వర్గంబు బదులు 4320
స్వర్గంబు సురలు న - క్షత్రరాసులును
భార్గవగురు బుధ - భౌమార్కముఖులు
సరసిజాసనుఁడెట్టి - జాడసృష్టించె
సరిసృష్టిగావేరె - జతయేఱుపరచి
కల్పించి యింద్రునొ - క్కని తనమహిమఁ
గల్పింతు నేనట్లు - గాదె నీమహికి
లేకుండఁజేతు నీ - లేఖవల్లభుని
కాకున్న నను నెఱుం - గరు వేల్పులనుచుఁ
దలఁపుచో దివిజు లు - త్తమ ఋషీశ్వరులు
కలఁగుచువచ్చి యా - కౌశికుఁజూచి 4330
గురుశాపదగ్ధుఁడీ - క్షోణివిభుండు
సురలోకమున నున్నఁ - జూతురె నీవు

యీయనకొఱకునై - యింద్రుని మీఁద
నీయత్నమూహింప - నేల? చాలింపు
తగునిది తగదని - తలఁప కీరీతి
తెగి తపోహాని చిం - తింప వయ్యెదవు"
అన వారితో నిటు - లనియె కౌశికుఁడు.
వినుఁడు! చేసితిని యి - వ్విభునితో వ్రతిన
స్వర్గంబునందు నుం - చఁగ యే నొనర్చు
స్వర్గంబు సకల న - క్షత్రాదికములు 4340
అలధాత సృష్టి యు - న్నంతగాలంబు
నిలువననుగ్రహ - నియతులుగండు
చనుఁడున్న వారునై - శ్వానర మార్గ
మునకులోగాని యి - మ్మున నభోవీధి
నీవు సృష్టించు ని - న్నిటి నట్టనడుమ
నీవిభుండమరుల - కెనయైన మహిమ
తలక్రిందుగానుండఁ - దలఁచి యిందఱము
నిలిపినారము ప్రీతి - నీనిమిత్తంబు
పూని యెంతటికార్య - మును నిర్వహింప
మానులులోని స - మానులుగలరె? 4350

—: శునశ్శేఫు నంబరీషుఁడు పశువుగాఁ గొనుట :—

పోయి వచ్చెదమని - పోయిరాదిత్యు
లాయెడ కౌశికుం - డాత్మఁజింతించి
యిచ్చోట విఘ్నంబు - లెనైన్నఁగూడి
వచ్చుచున్నవి తపో - వర్తనంబులకు
వేఱొక్కచోటఁగా - వింతుఁదపంబు

ధీరవై ఖరినని - తెలిపె మౌనులకు
దక్షిణంబున కేఁగి - తపము గొన్నాళ్లు
దీక్షగావించి గా - ధేయుండు వెనక
పడుమర పుష్కర - ప్రాంతంబునందు
తడవుగా నత్యుగ్ర - తపముఁగావింప 4360
నాకాలమున నయో - ధ్యానాయకుండు
శ్రీకరుండగు నంబ - రీషుఁడన్ రాజు
సవనంబుసేయుచో - శతమన్యుఁ డలిగి
సవనాశ్వమునుఁగొంచు - జనియె వంచనను
సేయించు ఋత్విజుల్ - చింతలనొంది
యీ యాగపశువు వో - యిన యట్టికతన
నీదుర్ణయమ్ము మ్ర - న్పించనెల్లరకు
కాదు దీనికి శాంతిఁ - గావింపకున్న
పశురక్షకుఁడుగాని - పార్థివోత్తముని
విశద దోషంబులు - వెంటాడి చెఱచు 4370
నిందుకు నరపశు - విపుడు దెప్పింపు
మందుచేఁ దీఱునీ - మఘము లన్నియును
నన నంబరీష మ - హారాజు భీతి
గనకరథం బెక్కి - కదలి దేశములు
పుణ్యాశ్రమంబులుఁ - బురములు వనులు
పుణ్యభూములు రయం - బున వెదకుచును
భృగుతుంగమను గిరి - బిడ్డలతోడ
మగువతో వసియించు - మౌని ఋచీకుఁ
గని యంజలి యొనర్చి - కలనేమమడిగి
తనరాక వివరించి - ధరణీశుఁడనియె. 4380

"ఏనూరువేలావు - లిచ్చెద నీకు
సూనులందొకని ని - చ్చుటగల్గెనేని
దేశంబులెల్ల నుఁ - దిరిగితి పశువు
నాశించి యొనగూడ - దయ్యెనెయ్యెడను
నొకచిన్నవాని ని - యొసఁగదే వెలకు ?
నకలంకమతి" నన్న - నమ్మౌని పల్కె
"నే పెద్దఁజికమైన - నియ్యంగఁజాల
నా పెద్దసుతుని మా - నవనాథ ! నీకు
అనిన నాయన యింతి - నట్లనె యడుగ
ననియె నక్కోమలి - యంబరీషునకు 4390
యీఁబోలిన కుమారు - నిచ్చు నమ్మౌని
నేఁబిన్నకొడుకుని - నీఁజాలననియె.
కోరికతో పెద్ద - కొడుకుల మీఁద
కూరిమి తండ్రుల - కునుఁ గల్గియుండు.
ధారుణిఁగడగొట్టు - తనయుల మీఁద
కూరిమి తల్లుల - కునుఁ గల్గియుండు
అటుగాన తలిదండ్రు - లాడినమాట
లటువిని మధ్యస్థుఁ - డైన బాలకుఁడు
వంతుకురాక మె - వ్వరి వాఁడుగాక
యెంతయు నడుమంత్ర - మేలయ్యె ననుచు 4400
నపుడు శునశ్శేఫుఁ - డనునట్టివాఁడు
నృపతిఁ గన్గొని చాల - నెగులుతోఁబల్కె.
"నన్నునిచ్చిరి నీకు - నాతలిదండ్రు
లిన్నియూరక - నేల? యే వెంటవత్తు
పశువుగాఁగొని పొమ్ము - పలికినయట్టి

పశువుల నిమ్ము తా - పసవ రేణ్యునకు
వ్యర్థశరీరిగ - వాని నీరీతి
నర్థించి నన్నుఁ గ్ర - తార్థుఁ జేసితివి
బలితంపులేమిచేఁ - బలికిరిగాక
తలిదండ్రులొల్లని - తనయులుంగలరె ? 4410
వారలలేములు - వారించి నీదు
కోరికచెల్లింతు - కొనుకొమ్ము నన్ను"
అన నగ్నిసహితులై - నట్టిదేవతలు
మనములమెచ్చి య - మ్మౌనిబాలునకు
స్వర్గనైభవము లో - సంగిరి ధేను
వర్గంబుఁ దెప్పించ - వసుమతివిభుఁడు
నరపతిఁజూచి శు - నశ్శేఫుఁడనియె
తరమైన క్రయమిూక - తానేలవత్తు
రత్నరాసులు సువ - ర్ణంబౌకకోటి
నూత్నంబుగాఁగ ధే - నువు లొక్కలక్ష 4420
నా వారికిమ్మన - నరపతి యట్లు
యావిమలాత్మకుం - డడిగిన నిచ్చి
తనరథంబునమౌని - తనయు నెక్కించి
చనియె సంతోషిత - స్వాంతుఁడై యతఁడు.
గమనవేగమున పు - ష్కరతీర్థమునను
విమలచిత్తంబుతో - విడిసియున్నంత
నాశునశ్శేఫుఁడ - త్యాపన్నుఁడగుచు
కౌశికమౌని సా - క్షాదుమానాథుఁ
దనమేనమామ న - త్తరిఁ జూచి విభుని
యనుమతంబున నమ్మ - హామహుఁ జేరి 4430

తనదు కన్నీట నా - తనిపాదయుగళ
వనజముల్ గడిగి కై - వారంబుచేసి
అంబరీషునిరాక - యడిగిన తెఱఁగు
నంబయుగురుఁడుఁ ద - న్నతని కిచ్చుటయు
విన్నపంబొనరించి - విశ్వామిత్రుఁడవు
సన్నుతకీర్తివి - సత్యసంధుండవు
నాకీవుప్రాణదా - నంబు గావింపు
నీకుమేనల్లుండ - నీవాఁడ నేను
శరణుచొచ్చితి మీదు - చరణంబులకును
కరుణింపునన్ను వి - ఖ్యాతిఁగైకొనుము 4440
యీరాజు సవనంబు - నీడేర్చనన్ను
చేరఁదీసుక పున - ర్జీవితుఁజేయు
చేపట్టి నన్ను ర - క్షింపవేతండ్రి!
నీపాలనిడుకొని - నెనరువాటిల్ల"
నని లేవకున్నచో - నడుగులమీఁది
తనమేనయల్లు నం - తయుఁగటాక్షించి
యూరడించి సమంచి - తోపగూహనము
చేరఁజీఱఁగఁజేసి - చిత్తంబుగరఁగ
"నన్న! నీకేల భ - యంబు నేఁగలుగ?
నిన్నుఁగాచుటయెంత - నెగులొందనేల? 4450
వెరవకు" మనుచు న - వ్వేళకారుణ్య
శరధియైనట్టి వి - శ్వామిత్రమౌని
తనతనూభవుల నం - దఱఁబిల్చిపల్కె.
తనయులుగల్గుట - తల్లిదండ్రులకుఁ
బరలోకహితమొన - ర్పఁగఁగదా యిదియె

పరలోకసుఖము నా - పాలికెన్నఁగను
వీడు మేనల్లుఁడు - వీనిరక్షింప
వేఁడెద మిమ్ము న - న్విభునికిచ్చుటకుఁ
జావునకోడి నా - శరణంబుచొచ్చె
నే వీని కభయంబు - నిచ్చినవాఁడ 4460
యిందులోపల నొక్కఁ - డేర్పడి మాని
నందను ప్రాణంబు - నకు నడ్డపడుఁడు
యాగంబునకుఁబశు - నైనవానికిని
వేగంబె యేనిత్తు - విబుధలోకంబు
యిదె సమయంబునా - కిదియె సుపుత్ర
పదవి చేలభియించు - పరమలాభంబు
పరధర్మమును పితృ - వాక్యపాలనము
శరణాగతత్రాణ - సంపత్తి సకల
దేవతాతృప్తి పి - తృప్రీతియిట్టి
పావనశ్రీలుచే - పట్టడొక్కరుఁడు." 4470
అనిన గర్వంబుతో - నలఁతి నవ్వొలయ
జనకునిఁజూచి వి - శ్వామిత్రులనిరి.
"గారవించుటయు శృం - గారించి భక్తిఁ
దేటచూచుటయొ చే - తికి పండు ఫలము
యిచ్చుటో పెండ్లి - నేయించుటో చదువు
వచ్చెనా యనివిని - వారి మెచ్చుటయొ
క్రతువులు సేయించి - కలిగినసొమ్ము
హితబుద్ధితోఁబంచి - యిడుటయో యాత్మ
బోధంబుపిలిచి తె - ల్పుటయొ సద్వృత్తి
బోధించుటో నీవు - పుత్రులంజూచి 4480

పట్టుచుఁబట్టి యీ - పాపంబుమాట
యెట్లాడితిరి చావ - నేఁటికితమకు
నొనరునె యిట్లాడ - నొక్కనిచావు
తనమీఁదఁదెచ్చుకోఁ - దలఁచునె యొకఁడు ?
నొప్పుగాదిది తన - యుల ప్రాణములకుఁ
దప్పి చావుండను - తండ్రిగలాఁడె?
ఆడక నీకేమి? - యీమాటవినఁగ
కూడదుగాక మా - కునువెట్టితండ్రి!
మహిభోజనము లశ్వ - మాంసంబు సటుల
విహితంబుగా దిట్టి - విధమునఁబల్క 4490
యీ మునిబాలకుం - డెటువోయనేమి ?
యీ మహీవరు యాగ - మేమైననేమి ?
మీమాట మాతల - మీఁదటనున్న
దీ మొల్ల" మనిన మా - నీంద్రుఁడిట్లనియె
"ఓరి! వాసిష్ఠుల - యొద్దిక దుర్వి
చారులై శునకమాం - సంబులఁదినుచు
వేయేదులుండుఁ డి - వ్విపినభూములను
పాయక" యనుచు శా - పంబిడియపుడె
"రమ్ము! శునశ్శేఫ! - రక్షింతునిన్ను
నమ్ము మెల్లరు మెచ్చ - నాశక్తిఁజూచి 4500
జయమందు" మనుచు ర - క్షాబంధ మునిచి
పయనమై పొమ్మని - పశువిధానమున
శాల పవిత్రపా - శముల బంధించి
నాలోన రక్తమా - ల్యంబులువైచి
యొనరిన వైష్ణవ - యూపంబులోఁద

''నినుఁగట్టునపుడు వ - హ్నిఁదలంచుకొనుము
యింద్రు నుపేంద్రుని - హృదయంబులోన
సాంద్రభక్తిఁదలంచి - జపవిధానముల
రెండుమంత్రము లుచ్చ - రింపు మవ్వేళ
నొండురక్షించు ని - న్నొక్కటి మఘము 4510
కడతేర్చు'' ననుపల్కు - కౌశికుమాట
కడునమ్మి యుత్సాహ - కలితుఁడై వచ్చి
"తామసింపక రమ్మ - ధరణీతవేశ!
సేమంబు గైకొమ్ము - చెల్లింపు మఘము
పొదఁడన్న" మాటక - ప్పుడు వెఱఁగంది
మదిమెచ్చి రథముపై - మౌనిబాలకుఁడు
అంజక రా నయో - ధ్యాపురిలోన
రంజిల్లుశాల చే - ర ననంతరంబ
తనయూపమునఁగట్టు - తరి మౌనిబాలుఁ
డొనరంగ నమ్మంత్ర - యుగమాత్మలోన 4520
జపియించి యింద్రుని - జలజపత్రాక్షు
నపుడు పావకు నుతు - లాచరింపుచును
నున్నెడ నింద్రుఁ ''డో - హో! నిల్వుమనుచు''
మన్నించి యారాజు - మఘుశాల నిలిచి
''వలవదు మునిబాలు - వధియింపవిడువు
వెలుతులన్నియుఁదీఱె - వెలసె నీ మఘము
యాగఫలంబిత్తు'' - నని శునశ్శేఫు
నాగోత్రవైరి ద - యాళుఁడై పనిచి
అంబరీషుని కోర్కె - లన్నియునొసఁగి
యంబరంబున నేఁగె - నట గాధిసుతుఁడు. 4530

—: విశ్వామిత్రుఁడు మహర్షి యగుట :—

వేయేండ్లుతపము గా - వింపుచు నుండ
నాయెడనమరసై - న్యముచుట్టుఁగొల్వ
నజుఁడెంత ఋషివైతి - వని వచ్చిపల్కి
నిజధామమునకేఁగె - నిష్ఠఁగౌశికుఁడు
అపుడు ఘోరంబుగా - నాశ్రమంబునను
తపము పుష్కరము చెం - త నొనర్చుచుండ

—: మేనక విశ్వామిత్రుని కడకు వచ్చుట :—

అచ్చర మేనక - యనునది యటకు
వచ్చి నెచ్చెలులతో - వనకేళిస లుప
గాధెయుఁడా యింతిఁ - గనుఁగొని భ్రమసి
"యీధవళాక్షితో - నెనసినఁజాలు 4540
తపములు ఫలియించె - ధన్యుఁడనైతి
నిపుడుగా" దా కోర్కె - లీడేర్తె ననుచు
నడుపుల మురిపెంబు - నగవులతేట
తొడలచక్కదనంబు - తురుముప్రేఁకంబు
కలికిచూపుల బాగు - గబ్బితనంబు
కులుకులుఁజూచి సం - కోచంబుమాని
తొయ్యలి గాదిది - తొలుకారు మెఱుపు
వెయ్యేలయిదినాకు - వెలఁది యానేని
యేలనే భువనంబు - లేల? నేఁజేయు
గాలి మేఁపటముల - గాలించ పోవ 4550
తపముసేయఁగఘోర - తపన ప్రచండ
విపులాతపముల ని - ర్విపులాటవులను"

అని చేరఁగావచ్చి - హ స్తంబుచాఁచి
వనితామణికి స్వస్తి - వాదంబొసంగి
"యాఁరామముల నొంటి - నలసినవాఁడ
నోరామ ! నీచెంత - ననిచి లాలింపు
తీఱనియాఁకలి -తీఱంగనీవు
పారణయిడుము బిం - బఫలాధరమునఁ
బంచాగ్నిమధ్య త - పశ్శాంతి నీదు
మించుకౌఁగిటలో శ - మించంగఁజేయు 4560
మేనితాపముదీఱ - మీనాంకుకేళి
నాసందరసవార్ధి - యందుఁదేలింపు
నాయాశ్రమంబులో - నాదానవగుచు
నోయిందువదన ! నీ - వుండినఁజాలు
యెవ్వారిచేఁగాని - యేకోర్కులైన
నెవ్వేళగోరిన - నేనెత్తునీకు
మరునిశాఁకిలోఁగి - మానంబువదలి
శరణుచొచ్చితినీదు - చరణంబులకును
బంటనయ్యెద నన్నుఁ - బనిగొమ్మువాలుఁ
గంటి ! వేఁడిన యూడి - గములుచేసెదను" 4570
అని ప్రియంబులు వల్క - నయ్యెలనాఁగ
తనలోన మెచ్చి యెం - తయుసమ్మతించి
గాధేయుతపమెల్లఁ - గట్టి పెట్టించి
బోధంబుసెడఁగ న - మ్మౌని యాశ్రమమున
పదియేండ్లు క్రీడింపఁ - బావనుండతఁడు
మదిలోన నిది దేవ - మాయగానెఱిఁగి
అచ్ఛపలాక్షి యిం - ద్రాదులు పనుప

వచ్చినదనుచు భా - వమున నెఱింగి
తనయపరాధంబు - తాళుకొమ్మనుచు
వనిత వేఁడిన వెఱ - వకుమని కాచి 4580
యనిచి యుత్తర దిశ - హైమాచలంబు
మునిశిరోమణి చేరి - మొదలింటిరీతి
కౌశికీనది పొంత - ఘనమైన తపము
కౌశికుఁ డొనరింపఁ - గడచె వెయ్యేండ్లు.
అప్పుడు దేవత - లమ్మహాతపము
చెప్పినధాత కౌ - శికు పాలికరిగి
అనుపమంబైన మ - హత్వంబుగలుగ
"నసఘ! మహాఋషి - వైతివొమ్మనిన
బ్రహ్మయిట్లాడుల్ - పరగునె? నన్ను
బ్రహర్షియనుదాఁక - పరగినపూన్కి 4590
యేమాన నన్నజి - తేంద్రియుండనుము
నీమది మెచ్చుట - నిజమగునేని"
అనుటయు నైనప్పు - డనియెదుగాని
పనివడియేనెట్లు - బ్రహ్మర్షి వందు
కావనిపల్కి య - క్కమలజుఁడరుగ
నావేళనూర్ధ్వ మ - హాబాహుఁడగుచు
ఆలంబశూన్యుండు - ననిలాశనుండు
కీలికీలాసము - తీక్ష్ణుండునగుచు
వేసవి పంచాగ్ని - విమలమధ్యమున
మూసికన్నులు వర్ష - ముల బట్టబయట 4600
జలములలోనుండి - చలికాలములను
తలఁకక యత్యుగ్ర - తపము గావింప

వేయేండ్లు చనునంత వి - బుధనాయకుఁడు
సేయుఁగార్యము మదిఁ - జింతించిచూచి

—: విశ్వామిత్రుఁడు రంభను శపించుట :—

రంభనురావించి - "రంభ! కౌశికుండు
కుంభినిపై నతి - ఘోరతపంబు
చేయుచున్నాఁడది - చెఱిచిరావలయు
పోయిరమ్మన"వుఁడు - పోవ శంకించి
"కోపకాఁడల కౌశి - కుఁడుచేర వెఱతు
నీపాదమాన పో - నేరనచ్చటికి 4610
నా చేతఁదీఱ దు - న్నది హేమ యాఘృ
తాచి యుర్వశి తిలో - త్తమ మంజుఘోష
హరిణి ప్రమ్లోచి వీ - రందు నొక్కతెను
సురనాథ! పనుపు మం - చు"ను రంభ వలుక
వెఱపేల? యేవత్తు - వెంబడినీకు
మరుఁడుఁజంద్రుండును - మలయమారుతము
కీరంబు లామని - కేకులుఁ దేటి
బారులు నీయాప్త - బలమయిరాఁగ
నీచక్కఁదనముపై - నిండుశృంగార
మాచరించి మనోహ - రాంగముల్మెఱయ 4620
పామ్మెంతవాఁడు నీ - భ్రూవిలాసముల
నమ్ముని కింకరుఁ - డై యుండఁగలఁడు"
అని స్వకార్యనిమిత్త - మమరేంద్రుఁడనుప
మునిచెంగటికి జగ - న్మోహినివోలె
పాడకట్టునంత య - ప్పుడు దేఱిచూచి

సడలిపోనీక వి - శ్వామిత్రుఁడపుడ
" ఓసి! యింద్రుఁడ వంప - నుప్పొంగివెట్టిఁ
జేసినా తపమెల్లఁ - జెఱిచిపోవలసి
మాయలాఁడితనాన - మసలవచ్చితివె?
ఆయింద్రుఁడేఁడీ? నీ - కడ్డమౌఁగాక 4630
వింటివె యొక పది - వేలేండ్లు నీవు
కండకాటవులందు - కఠినభావమున
పాషాణరూపమై - పడి యటమీఁద
యీషణత్రయ దూరుఁ - డిచ్ఛావిహారి
యొకమునికృప మోక్ష - మొందెదు నీవు
తెకతేర విధి నిన్నుఁ - దెచ్చెనాకడకు
శతమఖురూపమై - చనుమన్న" శాప
హతిచేతఁ బాషాణ - మై యుండెరంభ.
అదిచూచి భీతిచే - నన్నిదిక్కులకు
మదనాదులైన ది - మ్మరులు వాఱుటయు 4640

— విశ్వామిత్రుఁడు బ్రహ్మర్షియైన విధము —

కౌశికుండంతలో - కడుచింతనొంది
"యేశాంతి వహియింతు - నింతటనుండి
కటకటా! చేసిన - కడిఁదితపంబు
చిటికవేసినయంత - క్షీణింపసాగె
కోపంబుచేనింకఁ - గ్రోధంబు మాని
యూపిరి విడువక - యూర్ధ్వరేతమున
నే జితేంద్రియుఁడనై - యెన్నేండ్లకైన
భోజనంబనక యే - ప్రొద్దుమౌనమున

నాకుబ్రాహ్మణ్య మొ - న్నదు వచ్చునట్టి
యాకల్ప పర్యంత - మైన నట్లుండి 4650
ప్రతిన చెల్లింతు త - ప్పక మేనఁబ్రాణ
వితతి రక్షింతు ని - ర్విఘ్నతపంబు
సేయుదు ననుచు వీ - క్షించి గాధేయుఁ
డాయతధైర్య స - హాయుఁడై యుండె.
అచ్చోటవేనేండు - లనశనుం డగుచు
నుచ్చరించుటలేక - యుగ్రతపంబు
చేసి తూర్పునకేఁగి - చీమలు చొరక
వేసిన యిసుక యు - ర్విని రాలనీని
కారడవినిఁ దాను - కాష్ఠంబు రీతి
యూరుపుసడలక - యుద్దీప్తుఁడగుచు 4660
చేతులుచాఁచి య - చేతనవృత్తి
రాతికైవడి దివా - రాత్రముల్ నిలిచి
యొకనాడు భుజియింప - నుద్యుక్తుఁడగుచు
నకళంకమగు హవి - రన్నభాగంబు
ముందరనుంచుక - ముని యారగింప
ముందరగా పులోము - ని కన్యమగఁడు
అతిథియైవచ్చి తా - నాతిథ్యమడుగ
నతనికి నయ్యన్న - మంతయుఁబెట్టి
ఉరకుండి క్రమ్మర - నుగ్రతపంబు
కొలఁదుకైవడి నుండ - కొన్నినాళ్లకును 4670
పొగలెగసెను శిరం - బున నటమున్న
ధిగధిగమంటలు - దివినల్లుకొనియె.
క్రాఁగెలోకములు మం - గలములమాడ్కి

వేఁగ లాజలరీతి - వివిధజంతువులు
పెనుఁదాపములఁబొర్లి - పెదవులెండంగ
ననిమిషులెల్ల న - త్యాపన్నులగుచు
కమలజు కడ కేఁగి - కౌశికుఁదపము
తమకువచ్చిన యాప - దలు విన్నవించి
"చేతనైనట్టు చూ - చితిమి గాధేయుఁ
డీతరి నీసృష్టి - యింతయుంజెఱచి 4680
తావేఱెనిర్మింపఁ - దలంచెనో? లేక
యావల నీపట్ట - మాసించినాఁడో?
యేమేమియెంచెనో? - యేమియు నెఱుఁగ
మీమేరఁగలకార్య - మెఱుకచేసితిమి;
అతని కోరికలిమ్ము - హతశేషమైన
క్షితియెల్లఁబాలింపు - జీవకోటులను
చెడనీక యింద్రుని - సింహాసనంబు
జడదారి వేఁడినఁ - జాలు నిప్పింపు
చలియించె కులగిరుల్ - జడిసెవాయువులు
కలఁగె వారాసులు - కాఁగెధరిత్రి 4690
అరచె భూతములు వి - హాయసం బవిసె
సొరిగె విమానముల్ - చుక్కలురాలె
తపనుండు మాసె నం - తకుఁడు భీతిల్లె
కృపఁజూడవయ్య! లో - కేశ! యింపరను
కాలాగ్నికీల లం - గలుగొన్నయట్లు
కాలకంధరుం డెచ్చు - కను విచ్చినట్లు
యేమని పల్కుదు - మెల్ల లోకములు
బాములంబఱచె న - పారతపంబు

కరుణింపు" మనిన వే - గమె వచ్చినిలిచి
" పరమ తపంబుచే - బ్రహ్మర్షివైతి 4700
వాయువొసంగితి - నతిశయంబుగను
నీయాడు నీవె మె - న్నిటఁదలంచినను "
అనిన విశ్వామిత్రుఁ - డంబుజాసనుని
కని "నీవరంబు ని - క్కము సేయుదేని
ఆది నోంకారంబు - నఖిల మంత్రములు
వేదముల్ నాకుఁ దె - ల్విడిగా నొసంగి
వేదమయుండును - వేదవిదుండు
వేదవేద్యుఁడు కర్త - వేదవిధాత
యైనవసిష్ఠ మ - హామౌనివచ్చి
పానిపట్టుక నన్ను - బ్రహ్మర్షి వనక 4710
యనుమానములు దీఱ" - వననట్ల యొసఁగి
తనయుఁడైన వసిష్ఠుఁ - దాఁబిలిపించి
యమ్మహామహునిఁ బ్ర - యత్నంబుతోడ
సమ్మతపఱప నా - సంయమీశ్వరుఁడు
" సందియంబేల ? వి - శ్వామిత్ర! గెలిచి
తందర నీవు బ్ర - హ్మర్షివైనావు
సత్యసంధుండవు ని - ష్ఠాగరిష్ఠుఁడవు
నిత్యశోభన తపో - నిధివి పూజ్యుఁడవు
అజునిమన్ననగంటి - వస్మదాదులకు
భజనీయుఁడవు నీకు - భద్రమాగాత " 4720
అనిన విశ్వామిత్రుఁ - డౌదల సోఁక
కనుకల్గి తత్పాద - కంజాతములకు
సాగిలిమ్రొక్కి " యా - చార్యుండవీవు

మా గాధిభూవరు - మాఱయినావు
భ్రమరకీటన్యాయ - పద్ధతి నన్ను
సమచిత్తమునఁ బ్రోవఁ - జాలితి వీవు
పూజింపఁగంటి నే - పుణ్యుండనైతి
నాజన్మ మెంత ధ - న్యంబయ్యె" ననిన
నతనిదీవించి బ్ర - హ్మయు వసిష్ఠుండు
శతమఖాదులు తమ - జాడలంజనిన 4730
యసమతపోనిధి - యైన కౌశికుఁడు
వసుధ మించినకథ - వాకొంటి నీకు
తెలియంగఁబల్కితి - తెలిసిన యంత
తెలియ రెవ్వారు గా - ధేయుని మహిమ.
అట్టి వాఁ డీతఁడీ - యనఘునిఁగొలిచి
పట్టయినారు శో - భనములకెల్ల
యీతనిగుణములు - నీతనిబలము
నీతనితపము నే - నెంతవర్ణింతు?
నపరాచలము చేరె - నర్కబింబంబు
కృపఁజూడుఁ డే వత్తు - రేపె మీకడకు" 4740
నన శతానందుఁ డి - ట్లందఱువినఁగ
నను రాఘవులచేత - ననుమతుండగుచు
పోయిన జనకుఁడ - ప్పుడు వలవచ్చి
పోయె నింటికి గాధి - పుత్రుండు వనుప
తనప్రధానులతోడ - తనయులతోడ
తనవారితోడ నం - తట దాశరథులు
తముఁజేరు మునులతో - తమ నెలవునకు
విమలాత్ముగాధేయు - వెంబడి నేఁగి

యచ్ఛోటసమయసం - ధ్యాదులు దీర్చి
యిచ్చలకితవైన - యెడలనున్నంత 4750

—: శివధనుఃప్రభావమును జనకుఁడు చెప్పుట :—

కొలువుండి యాజన - కుఁడు మఱునాఁడు
పిలువనంపిన నతి - ప్రీతిఁగౌశికుఁడు
తనవెంట రాజనం - దనులు రా వచ్చు
మునిఁజూచి యపుడర్ఘ్య - మును పాద్యమొసఁగి
యాసనంబిచ్చి సు - ఖాసీనుఁడగుచు
"నోసంయమీంద్ర! భృ - త్యుల మందఱమును
చెప్పినయటులఁజే - సెద మేమిగార్య
మిప్పుడు గావింతు - మొఱఁగింపుఁ"డనిన
యీ దశరథ పుత్రు - లీశానువిల్లు
నీదుమందిరములో - నెలకొన్నదనుచు 4760
విని చూచిపోనెంచి - విచ్చేసినారు
కొని తేరఁబంపుమా - కోదండ" మనిన
జనకుఁడిట్లనియె. "నో - సంయమినాథ!
తనయింటిలో నీశు - ధనువు గల్గుటకుఁ
గారణంబున్నదా - కత యేర్పరింతు
వీరలు మీరలు - వినుఁడంచుఁబలికె.
నిమికి నాఱవవాఁడు - నిజధర్మరతుఁడు
రమణీయమతి దేవ - రాతుఁడన్ రాజు
సవనమొనర్చి మె - చ్చఁగఁజేసి తనకు
దివిజు లొసంగఁగాఁ - దెచ్చె నీవిల్లు 4770

దక్షుండు యజ్ఞంబు - తానొనర్చుచును
దాక్షాయణీనాథుఁ - దాఁబిలిపించి
యాగభాగములింక - యాతఁడు రాకున్న
సాగదే నాకేమి - సవనంబటంచుఁ ?
గావింపుచుండ శం - కరుండు గోపించి
యీవింటిచే వారి - నెల్లవధింతు
నని మెంచుచో మాను - లమరులుఁ జేరి
తను వేఁడుకొనిన శా - ర్వాయనీ విభుఁడు
కోపంబు మాని కై - కొనుఁడని చేతి
చాపంబు బిలిచి ని - ర్జరులకునిచ్చె. 4780
దేవతలిచ్చిరా - దేవరాతునకు
నీ విల్లు తనయింట - నిడియె నవ్విభుఁడు.
ఆవెనకటి రాజు - లందఱుఁదమదు
సేవధిగాఁగ నుం - చిరి నేఁటిదనుక
సవనశాలాంతర - స్థలము శోధింప
భువి దున్నునెడ నొక్క - పుత్రికపుట్టె.
ఆయవనీకన్య - యాత్మజయగుచు
నాయింట సీత య - నంగఁబెంచితిని
వడిగలతనము స - త్త్వంబు నుంకువఁగఁ
బుడమికన్నియ నిచ్చు - పూనికె చేసి 4790
యేనున్న చో రాజు - లెల్లరు వచ్చి
పూని యీవిల్లు చూ - పుటయు లజ్జించి
కదలింప నెక్కిడఁ - గాలేక వారు
మదిలోనఁదా రభి - మానముల్ దాల్చి
తనయింటిలోన యీ - తఁడు కొండవంటి

పెనువిల్లుజూపి నే - బిడ్డనిచ్చెదను
యెక్కిడుఁడని పల్కి - యిందర వాసి
మొక్కపుచ్చుచుఁ జాల - ములుచయైనాఁడు
కలనిలో నీతని - గర్వాంబణంచి
బలిమిఁగొంపోద మీ - బాలకి ననుచు 4800
హత్తుక వారు నా - యవనిపై కోట
ముత్తికచేసిన - ముట్టడి దాఁకి
దవసధాన్యంబులుఁ - దగు రసవర్గ
మవల రారాక నా - యవనిలో లేక
జనులెల్లఁదల్లడిం - చఁగఁజూచి భక్తి
ననిమిషారాధన - మాచరింపంగ
వారు నాతపము భా - వంబుల మెచ్చి
యారూఢబలచతు - రంగబలంబు
నిచ్చినఁబగవారి - నెదిరించి పోర
విచ్చిపోయినవారు - వెతనొందువారు 4810
శరణొందువారును - సామభేదముల
మఱలిపోయినవారు - మడిసినవారు
నగుచుఁబోయిన పగ - యనుమాట లేక
జగతి మీకరుణచే - సవనమే నొకటి
కావింపుచుండ రా - ఘవులఁదెచ్చితివి
యావిల్లు శ్రీరాముఁ - డందియెత్తినను

—. రామచంద్రుఁడు శివునివిల్లు విఱచుట :—

నిప్పుడె భూమిజ - నిత్తు నేన ''నిన
తెప్పింపుమనుచు గా - ధేయుఁడాడినను

తనమంత్రులనుఁజూచి - ధారణీనాథుఁ
"డనుపమగంధ మా - ల్యాంచితంబయిన 4820
విలు వేగఁదెప్పించి - వీరికిఁజూపుఁ
డెలమితోఁ జనుఁ"డన్న - నేఁగివారపుడు
మేరుపర్వతమున - మెఱయు గహ్వరముఁ
గేరు నవ్విభుని బొ - క్కసమింటిలోన
యెనిమిదిబండ్లతో - నెసఁగు మందసము
వినుతనోర్బలు లైదు - వేలు మానసులు
తమప్రయాసముల నా - ధనచమత్కృతుల
సముఖంబునకుఁదెచ్చి - శకటంబు నిలుప
దేవతుల్యుండు మం - త్రియుతంబుగాఁగ
నా వేళ జనక మ - హారాజు వలికె. 4830
"కౌశిక! విల్లు రా - ఘవునకుఁజూపు
మీశానుదత్త మీ - యిష్వాసనంబు
నీవిల్లు మావంశ - నృపులు పూజింతు
రే వసుధానాథు - లెత్తంగలేరు
నరులేల? దేవదా - నవయక్షఖచర
గరుడ గంధర్వులు - కదలింపలేరు.
ఆయీశ్వరుఁడె కాక - యన్యులచేత
నీ యహీనశరాస - మేమనవచ్చు
అదె చూడుమని పల్క - మారామవిభుని
హృదయవర్తనము మా - కేర్పడుఁగాని" 4840
అన విని కౌశికుఁ - డారామవిభునిఁ
గని "కుమారక! భీమ - కార్ముకంబెత్తి
చూడుము నీవన్న - చో నాత్మలోన

ప్రీడఁగైకొని లోక - విశ్రుతంబైన
మందసఁదెఱచి రా - మవిభుండు మౌని
బృందారకాధీశుఁ - బేర్కొని పల్కి
"ఎక్కిడుచున్నాఁడ - నిక్కార్ముకంబు
చక్కఁగాఁగనుము వి - శ్వామిత్ర! నన్ను"
అన మౌని యట్లకా - కన జనకుండు
తన మది నలరి యెం - తయు నెచ్చరింప 4850
నడుచక్కివట్టి యు - న్నతిమీఱ నెత్తి
కడువేగ రసదాడి - గజమునుఁబోలె
నారిసారించి స - న్నాహంబు మెఱసి
గౌరవంబమర నా - కర్ణాంతముగను
నట వినోదంబుగా - నలవోక దోఁప
కటకాముఖ నిగూఢ - కరపద్ముఁడగుచుఁ
దొడికి యందఱును గ్రం - దుగఁజూచుచుండ
పిడిపట్టు మెల్లనె - బిగువుసళ్లుటయుఁ
బెటిలు పెటిల్లునఁ - బృథివి నింగియును
దిటదప్పనెందుఁ బ్ర - తిధ్వనుల్ నిండ 4860
బలుగొండ యశనిచేఁ - బగిలిన రీతి
కలగుండు వడఁగ జ - గంబులన్నియును
జనకుఁడు రామ ల - క్ష్మణులు గాధేయ
మునియునుఁదక్కఁ గా - ర్ముకవరాభంగ
భంగనిష్ఠురమహా - ర్భటి కోర్వలేక
అంగదనచ్చోటి - యఖిలజనంబు
భీతిల్లి మూర్ఛచే - పృథివిపైఁద్రెళ్లి
యాతరి నొక ముహూ - ర్తానంతరమున

నందఱువినుచుండ - నంజలి జేసి
యందుకై జనక మ - హారాజువల్కె 4870
" ఎఱిగితి మనఘాత్మ! - యీరాము బలము
గుఱుతింపను తలంపఁ - గూడదెవ్వరికి
మిగుల నాశ్చర్యమై - మించె శ్రీరాము
మగువయై జానకి - మావంశమునకుఁ
గమనీయకీర్తిరాఁ - గలిగె నాపూన్కి
సమకూడె నెందు పూ - జ్యతలు నేఁగంటి
యిప్పుడ మీమంత్రుల - నీవయోధ్యకును
నిపుణులఁబనిచిన - నీవెనువెంట
సుతులు వచ్చుటయు న - చ్చోనాఁడు నాఁటి
కతలు నాయింట యా - గము చూచుకొఱకు 4880
వచ్చి రాఘవుఁడు భా - వజవైరివిల్లు
చెచ్చెర తునుకలు - చేసినైచుటయు
సీత నిచ్చుతెఱంగు - శ్రీరాముపెండ్లి
కే తెరవలయు మీ - రింతులంగూడి "
అని దశరథునితో - నాడ నేర్పరుల
పనుపుఁ డిచ్చితి నేను - పసఫుఁగమ్మలును.
అనిన గాధేయుండు - నా శతానందు
ననుపఁజొప్పడు వారి - నరసి పంపుటయు

—: జనకభూపతి యయోధ్యకు దూతలనంపుట :—

వారయోధ్యకు నాల్గు - వాసరంబులకు
నారూఢ పవన జ - వాశ్వంబులెక్కి 4890

సాకేతమునకేఁగి - సమదేభ పుష్క
రాకీర్ణశీకర - వ్యపగతోత్తుంగ
ఘోటక ఖురపుట - కోటిధరా వి
పాటనోదర రేణు - పటలమైనట్టి
రాజగేహము హజా - రము చేర నేఁగి
రాజన్యమణి దశ - రథుఁడున్నయట్టి
కొలువుసావడి మఱం - గున నిల్చి యిందు
కులదీపకుఁడు జన - కుఁడు బంచినాఁడు
వారిప్రధానులు - వచ్చినారనుచు
మారాక దెల్పుఁ డే - మఱక రాజునకు 4900
చనుఁ" డన్న విని యువ - సరములవారు
జననాథునకు నవ - సమచరిత్రునకు
వినుపింపఁ బిలుపింప - వినయంబుతోడఁ
జని వారు దశరథు - సముఖంబుఁ జేరి
చేమొగిడించి పం - చిన శుభలేఖ
లామేరఁజూప రా - యసములవారు
అందుక "శ్రీమన్మ - హామండలేశ్వ
రేందు కులోత్తమా - హీనప్రతాప
జనకమహారాజ - చంద్రులంగారు
మనవంశ దశరథ - మను జేసు నగరి 4910
చాలుమానుసులకు - సంప్రీతిఁబంపు
మేలువార్త నిరుద్ధ - మితమున కేము
అందఱుఁబరిణామ - మచటి మీరాజు
నగదు యోగక్షేమ - మప్పటప్పటికి
వ్రాసి యంపునది మా - వైదేహిఁబెండ్లి

చేసెద మిపుడు మీ - శ్రీరామునకును
మీరాజువారును - మీపురోహితులు
చారువైఖరులఁ గా - సల్యాదిసతులు
రావలెనని తమ - రాజుతోఁ దెలుపఁ
గావలె "ననెడి వ - ర్ణణఁ జదివింప 4920
జనకప్రధానులా - జననాథుఁ జూచి
అనఘ! మారాజు పా - ధ్యాయులగ్నులును
హితగాధిసుత పురో - హితులు నుండంగ
ప్రతినఁ జెల్లింప నేఁ - బట్టి నిచ్చితిని
వీర్యశుల్కను రాము - విభునకు నతఁడు
శౌర్యాఢ్యుఁడై యీశ - చాపంబుఁదునిమె.
ఆపెండ్లికై మీర - లటకు రావలయు
నీ పుత్రులకుఁ బెండ్లి - నెఱవేర్చుకొనుము
సుత వైభవము నీవు - చూడంగవలయు
నితరు లందఱుఁ గూడ - నేమిటివారు" 4930
అనుచు విశ్వామిత్రుఁ - డాశతానందుఁ
డనుమన్న వారు - మాయయ్యఁగారొకరె
ఆనతిచ్చినవార - లనుచు (మీరిపుడు
లోననుకొనవ)ద్దు - లోకేశ!" యనిన
వారిమాట వసిష్ఠ - వామదేవులకుఁ
గూరిమి మంత్రుల - కును తేటపఱచి
పృథుశక్తి మెఱయించి - భీమకార్ముకము
మిథిలాపురంబులో - మెఱసెను డించి
మనరాముఁడున్నాఁడు - మహిపుత్రినిచ్చె
జనకుఁడు మీకెల్ల - సమ్మతమ్మనను 4940

జనకమహీనాథ ! - సాదృశ్యమహిమ
లనయంబు మనకభి - వ్యక్తంబుగాదె
కోరియు వేఁడిఁ జే - కూర్చుకోవలయు
నారాజు మనకు వి - ఖ్యాముగాఁగలండె ?
ఆలోచనము చేసి - యందఱుఁబలుకఁ
డేల ? తామసమన్న - నెంతయునలరి
సామాన్యుఁడే చూడ - జనకభూవరుఁడు
భూమిశ! నిమి వంశ - మునఁ బుట్టినాఁడు
నవ్వరత్నము కాంచ - నంబునుఁబోలి
యవ్వయ తుల్యయో - గాప్తిచేగూడె 4950
అన్యోన్యమునుఁబావ - నాన్వయులిట్టి
మాన్యబాంధవము సం - భావించుకతన
నోదవి యొక్క ముహూర్త - మున్నది లోనె
కదిసి "శుభస్యశీ - ఘ్రంబ" న్నకతన
తామసమేల ? యం - దఱకుఁబైనంబు
లీమేఱ వివరింపుఁ - డిదియె నిశ్చయము.
అన విని జనక మ - హారాజు మంత్రి
జనుల సగౌరవ - సన్మానములను
విడిదికింబనిచి వే - ళ్వేఱ నందరను
పుడమి ఱేఁడనిచి య - ప్పుడుకొల్వుదీఱి 4960
యంతఃపురంబున - కరిగి యత్తెఱఁగు
కాంతలకెఱిఁగించి - కరమర్థినుండె.

—: దశరథుఁడు మిథిలాపురికిఁబోవుట :—

ఆమఱునాఁడు స - మస్తబాంధవులు
సామంతులునుఁగొల్వ - సచివు సుమంత్రుఁ

గాంచి యిట్లనిపల్కె - " ఘనవ_ర్తకులను
పంచితివే మున్ను - పై నంబుచేసి
బొక్కసబండార - ములు దేరఁబనుపు
మెక్కుగా నుడుగర - లేర్పడందెమ్ము
అందంద విడుదులా - యత్తముసేయింపు
పొందుగా రసవర్గ - ముల నెచ్చరిలుము 4970
చతురంగబలములు - సవరణల్ చూడు
మతిశయంబుగసొమ్ము - లందరికిమ్ము
పల్లకు లాయ_త్త - పఱుపుము కొన్ని
చల్లనీరును నింపు - చలివెందిరులను
నక్కడక్కడనిల్పు - మన్నియంగళ్లు
చక్కని వెలజాతి - సతుల రమ్మనుము
కేవనులను బిల్చి - కెలంకులఁబ్రజకు
నే వలన గుడారు - లె_త్తవాకొనుము
రథముఁగై చేసి సా - రథినిఁదెమ్మనుము
పృథులాశ్వములఁబూన్చి - బిరుదులె_త్తించు" 4980
అనియెల్లవారుఁబా - యక కొల్చిరాఁగ
ముని వసిష్ఠుడు తన - ముందఱఁజనఁగ
వామదే వాత్రేయ - వాసిష్ఠ కణ్వ
జామదగ్ని మృకండు - సంయముల్ గదల
కరులపై నెక్కి ము - క్తాచ్ఛత్రములను
భరత శత్రుఘ్నులు - పజ్జలంగొలువ
భేరిమృదంగాది - బిరుదవాద్యములు
భోరుకలంగ భూ - భుజులు సేవింప
బలమెల్ల వెంటరాఁ - బరమహర్షమున
లలితప్రయాణ లీ - లం జేరవచ్చి 4990

రాజీవముఖుల పా - రముగాఁగ ముందు
లాజలతో విధి - లాప్రవేశంబు
చేసి యాజనకుండు - సేనలుఁదాను
భాసిల్ల నెల్లెడఁ - బౌఁజులుఁదీర్చి
పొడగని పూజించి - భూపాలచంద్ర!
కడుమంచిదినమయ్యెఁ - గనుఁగొంటిమిమ్ము
నీకుమారులఁగంటి - నేఁడువసిష్ఠుఁ
జేకొనిపూజలు - సేయంగఁగల్గె
వచ్చితి నాభాగ్య - వశమున నీవు
సచ్చరిత్ర! మఘంబు - సఫలంబునొందె. 5000
సర్వోన్నతుని రామ - చంద్రుంగాఁచితివి
యుర్వీశ! నీభాగ్య - మొకరెన్నఁగలరె?
అనునంత లోపల - నా గాధిరాజ
తనయుఁడు రఘుకులో - త్తములనుఁ దెచ్చి
వీరె " నీతనయులు - వీరశేఖరులు
కూరిమి నావెంటఁ - గూర్చిపంపితివి
ఒప్పగించితి మీకు - నుర్వీశ! యనిన
అప్పుడ! దశరథుఁ - డదుగులఁ వ్రాలు
తనయుల నిర్వుర - తాఁగౌఁగిలించి
" మునివర్య! కౌశిక! - మొదట నీమహిమ 5010
నెఱుఁగ కేమంటినో - యెన్నకమదిని
కరుణింపు "మన జ - నకక్షితీశ్వరుండు
" నీతనయుల శౌర్య - నిర్వాహకము
లీతని కరుణఁ జు - మీ! మనువంశ!"
అని తోడుకొని పోయి - యన్నగరమున

వినుత వైభవమైన - విడిదిలోపలను
జనకుండు దశరథ - జనపాలు నుంచి
తననగరికిఁ బోయి - తగినవైఖరుల

—: ఇక్ష్వాకు వంశక్రమమును వసిష్ఠుఁడు
జనకునకుఁ జెప్పుట :—

నారేయి వసియించి - యమ్మఱునాడు
ప్రారంభసవనక - ర్మము నిర్వహించి 5020
తనపురోహితుని శ - తానందుఁజూచి
జనకుఁడిట్లనియె నా - సైదోడు ఘనుఁడు
సలలితాత్మకుఁడు కు - శధ్వజనృపతి
పొలుపొంద సాంకాశ్య - పురినున్నవాఁడు
యిక్షుమతీ తీర - మేలుచున్నాఁడు
దక్షుఁడై యితని నం - దనలఁ దోకొనుచు
రిమ్మని తగినవా - రలఁ బిల్వఁబంపు
మిమ్మహోత్సవ మతఁ - డీక్షింపవలయు
ననుచు వేగుల వారి - నంపినవారు
ననుపమ రయముతో - నచ్చటికరిగి 5030
వాసవునాజ్ఞచే - వనమాలిఁబిలువ
నాసురల్ వోయిన - యందంబుమీఱ
నాపురంబున కేఁగి - యాకుశధ్వజుని
భూపాలశేఖరుఁ - బొడఁగాంచి తమదు
రాకదెల్పిన మహో - రథుఁడుపైనంబు
జోకచెసుక యట్ల - శుభయత్నమునకు
మహనీయ వస్తు సా - మగ్రితోనపుడ

సహాజన్ము వీటికిం - జని జనకునకు
మ్రొక్కి శతానంద - మునికిఁజాగిల్లి
యక్కజంబైన సిం - హాసనంబులను 5040
నన్నదమ్ములు విహి - తానులాపముల
మన్ననల్ గని సుదా - మనుఁడను మంత్రి
"తడయక నీవేఁగి - దశరథవిభునిఁ
దోడుక రమ్మ"నవుఁడు - తోడనే కదలి
యాపఙ్క్తిరథుఁజూచి - "యనఘాత్మ! యన్ను
మీ పురోహితులను - మీ యుపాధ్యాయు
లందఱ జనక మ - హారాజు బిలిచె
నందు విచ్చేయుఁ డిం - కాలస్యమేల?"
అనవిని దశరథుం - డప్పుడె కదలి
జనకుని యింటికిఁ - జనిన నవ్విభుఁడు 5050
యెదురుగావచ్చి య - నేక సత్కృతుల
మదివొదలింప స - మ్మాన వేశ్వరులు
కొలువు కూటంబులో - గురుతరరత్న
విలసితాసనము ల - వ్వేళఁ గైసేయ
సద్దుసేయకుఁడని - జనకునిఁజూచి
తద్దయు వేడుక - దశరథుండనియె.
"ఈ వసిష్ఠమునీంద్రుఁ - డిక్ష్వాకులైన
మావంశమునఁ బుట్టు - మానవేంద్రులకు
దైవంబు గురుఁడు - ప్రధానరక్షకుఁడు
సేవధిఁ గర్త యా - శ్రితుఁడు శిక్షకుఁడు 5060
నన్నియు నితఁడౌట - యప్పటప్పటికి
విన్నావుగాదె మీ - వేగులవలన

కావున మావంశ - కథయేర్పరించు
నేవేళగాథేయు - నింగితంబెఱిఁగి"
అనిన యంత వసిష్ఠుఁ - డా శతానంద
జనకులు వినుచుండ - సభలోనఁబలికె.
" అవ్యక్తుఁడైనట్టి - యాబ్రహ్మవలన
నవ్యయుండు మరీచి - యాత్మజుఁడయ్యె.
ఆమరీచికిని క - శ్యపుఁడు జనించె
నామహాత్మున - కా వివస్వతుఁడు 5070
తనయుండు వైవస్వ - త సమాఖ్యుఁడైన
మనువు జనించె న - మ్మనువు కిక్ష్వాకు
జనపతి యతఁడేలె - సాకేత నగరి
ననఘుఁడాతఁడు కుక్షి - యనురాజుఁగాంచె
నతనికిని వికుక్షి - యతనికి బాణుఁ
డతనికి ననరణ్యుఁ - డతనికి పృథుఁడు
నారాజుకు త్రిశంకుఁ - డతనికి దుందు
మారుండు యవనాశ్వ - మహిపుఁ డాయనకు
నతనికి మాంధాత - యతనికి సంధి
యతనికి ధ్రువసంధి - యలసేనజిత్తు 5080
లనువార లిరువురా - యవనీశ్వరునకు
జనియించి రాధ్రువ - సంధికి భరత
విభుఁ డాయనకుఁగల్గె - వెస నసితాఖ్యుఁ
డభినుతుండయ్యె న - య్యసితుండు చాల
బలవంతుఁడై రాజ్య - పరిపాలనమున
వెలయుచో వైరంబు - వెనిచి హైహయులు
శశిబిందులును తాళ - జంఘులుఁ గూడి

దిశ లాక్రమించి యెం - తే సాహసమున
నతని నోడించి రా - జ్యముఁ గట్టుకొనిన
నతఁడు గర్భిణులైన - యాత్మ గేహినుల 5090
యిరువురతోఁ గూడి - హిమవంతమునకు
నరిగి యంతటఁబోయె - నమరుల పురికి.
అందులోఁ గాళింది - యనెడి చూలాలి
చందంబు గనుఁగొని - సహియింపలేక
యితరకామిని విషం - బిడియె గర్భంబు
చ్యుతమయి పోవ తాఁ - జూపోపలేక
భార్గవ చ్యవన తా - పసవరేణ్యుండు
మార్గంబునందు రా - మగువ కాళింది
వచ్చి మ్రొక్కినఁ "బుత్ర - వతివి గ"మ్మనుచు
నచ్చాన దీవించి - యమ్మాని వలికె. 5100
"ఓయమ్మ! నీకుక్షి - నున్నకుమారుఁ
డీయెడ విషముతో - నెనసియున్నాఁడు
గరముతో జనియించుఁ - గలఁగకుమీావు
పరిణామ మొందుము - పట్టిఁ జేపట్టి"
అనిపోవ సగర నా - మాత్మజుఁగనియె.
ఘనుఁడాతఁ డసమంజుఁ - గాంచె బాలసుని
నతఁ డంశుమంతుని - నతఁడు దిలీపు
నతఁడు భగీరథు - నతఁడు కకుస్థుఁ
నాదొర రఘునాము - నతఁడు కల్మాష
పాదు శంఖణుని నా - ప్రభువులింగనిరి. 5110
అతఁడు సుదర్శను - నతఁడగ్నివర్ణు
నతఁడు శీఘ్రగుమారుఁ - డతఁడా మరువును

నతఁడు ప్రసుశ్రుని - నతఁ డంబరీషు
నతఁడు నహుషుని య - యాతి నవ్విభుఁడు
నతనికి నాభాగుఁ - డతనికి నజుఁడు
నతనికి దశరథుం - డా రాజమణికి
నీరామ లక్ష్మణు - లిట్లుజనించి
రారూఢ గుణవిశు - ద్ధాన్వయుల్ వీరు
పరమధార్మికు లన - పాయ విక్రములు
స్థితధైర్యశీలు రూర్జి - త యశోనిధులు 5120
సత్యసంధులు నీతి - సంపన్ను లెప్పుడు
నిత్యదానకళాతి - నిపుణు లుత్తములు
యీరఘు వంశజు - లిందఱి లోన
శ్రీరామచంద్రుఁడా - శ్రితరక్షకుండు
తమ్ములున్నట్టి యు - త్తములు వీరలకు
నిమ్ము కుమార్తెల - నేక లగ్నమున
అడుగుచు నున్నవాఁ - డల దశరథుఁడు
కొడుకుల కెల్లనీ - కూఁతులనిచ్చి
యిట్టి యల్లురఁ జూడ - నెన్ని జన్మములు
నెట్టివి సుకృతంబు - లీవుసేసితివో ? 5130
యిప్పింపుఁ డనవుఁడు - "నిచ్చెద ననుచు"
నప్పుడ జనక మ - హారాజువలికి
"ఆదిఁబెండ్లిండ్ల వం - శావళిక్రమము
మేదినిఁ దెలుపుటల్ - మేలగుఁగాన
నావంశకథ శతా - నందునిచేత
నీవేళ వినుఁడ"ని - యెచ్చరించుటయు.

—: జనకుఁడు వసిష్ఠునితోఁ దనవంశ క్రమమును జెప్పుట :—

" జనకుని వంశ ప్ర - చార మందఱును
వినుఁడ "ని వారల - వృత్తాంత మెల్ల
నెలమి వసిష్ఠు మో - మీక్షించి పలికె
నల దశరథ ముఖ్యు - లందఱు వినఁగ 5140
" అనఘాత్మ ! యిందు - వంశాభరణంబు
ఘనశౌర్య నిధి నిమీ - క్ష్మాతలేశ్వరుఁడు
జనియించె మిథయను - జనపతి యతని
తనయుండు మిథిల యా - తని పేర వెలసె.
ఆమిథికిని జన - కావనీనాథుఁ
డా మనుజేంద్రున - కల యుదావసుఁడు
నతనికి యతనికి - నందివర్ధనుఁడు
కృతపుణ్యుఁడైన సు - కేతుఁడాతనికి
నతనికి దేవరా - తావనీవిభుఁడు
నతనినందనుఁడు బృ - హద్రథాఖ్యుండు 5150
నాయశోనిధికి మ - హావీరవిభుఁడు
నాయనధృతిమంతుఁ - డైన సుధృతిని
కీర్తిమంతుని దృష్ట - కేతు నవ్విభుఁడు
నార్తరక్షణుఁడైన - హర్యశ్వనతఁడు
నరసన్నుతుం డాయ - నకు కీర్తిరథుఁడు
స్థిరశౌర్యుఁ డతనికి - దేవమీఢుండు
నతనికి సువిధుఁ డా - యన మహీధ్రకుని
ప్రతిభ మించినకీర్తి - రాతు నవ్విభుఁడు
నమ్మహీపతికి మ - హారోమవిభుఁడు
సమ్మతి నతనికి - స్వర్ణరోముండు 5160

నాథరావరునకు - హ్రస్వరోముండు
నాధీరునకు నిర్వ - రాత్మజులందు
నీ జనకుఁడు జ్యేష్ఠుఁ - డితనికిఁదమ్ముఁ
డాజిలో నుతికెక్కు - నల కుశధ్వజుఁడు
నితనిఁ బట్టముగట్టి - యీరాజుతండ్రి
హితమతిఁ గానలఁ - కేఁగిన వెనుక
మహిమ సంకాశ్యనా - మపురాధి నాథుఁ
డహితవృత్తి సుధన్వుఁ - డనియెడురాజు
యితనింటిలో నున్న - యీశచాపంబు
నితని తనూజాత - నీసీతఁదనకు 5170
నిమ్మన్న నివ్విభుం - డియ్యఁబొమ్మన్న
నమ్మానవేంద్రుఁ డీ - యనరాజధాని
మిథిలాపుర వరంబు - మీఁద దండెత్తి
పృథుశక్తి జగడింప - భీమసంగ్రామ
చండకోదండు దు - స్సహ దేవదత్త
కాండ ప్రకాండ భీ - కరదావదహన
హేతులు వెలివిరి - యించి యీజనకుఁ
డాతని శలభాయి - తాంగుఁ గావించి
యంకిలిలేక వాఁ - డర్థిఁ బాలించు
సాంకాశ్యపురిని కు - శధ్వజునుంచి 5180
వసుధయేలెడు వీరి - వంశ వర్తనము
పొసఁగఁ దెల్పితి నిట్టి - పుణ్యశీలుండు
సీత నూర్మిళను మీ - శ్రీరామునకును
బ్రీతి లక్ష్మణునకుఁ - బెండ్లిండ్లు సేయఁ
దలఁచెఁ గావున మఘ - తార యీప్రొద్దు

వలనొప్పఁగా సమా - వర్తనాద్యములు
సేయఁబంపుఁడు వారి - చేత నీమీఁద
పాయక యుత్తర - ఫల్గునియందు
ముదముతో నేటికి - మూఁడవనాఁడు
కదిసెను పెండ్లిలగ్న - ము ధ్రువంబుగను" 5190
అనినంత కౌశికుం - డా దశరథుని
ఘనువసిష్ఠుని జన - క నృపాలుఁగాంచి
యీ నిమివంశంబు - నిక్ష్వాకువంశ
మే నియమంబుల - నెన్నిచూచినను
సరి దశరథుఁడు నీ - జనకభూ విభుఁడు
సరివత్తురే గుణాం - శములఁ జూచినను
చక్కదనంబుల - జవ్వనంబులను
మిక్కిలి కులముల - మెఱయుఁగల్మిలను
రామలక్ష్మణులు ధ - రాసుతోర్మిళలు
కామించి పతిసతుల్ - గాఁదగువారు 5200
కల్యాణములొనర్పఁ - గా నింతమంచి
తుల్యయోగము లెట్టి - దొరకును దొరకు
మీభాగ్యమిదిగాక - మేదినియందు
శోభనంబుల మీఁద - శోభనంబగుట."
అని జనకునిఁ జూచి - "యనఘ! యింకొకటి
వినుము కుశధ్వజ - విభుని పుత్రికల
భరత శత్రుఘ్నుల - పరిణయంబులకుఁ
దరణి వంశాగ్రణి - దశరథ విభుఁడు
యీవసిష్ఠమునీంద్రుఁ - డీ ముహూర్తమునఁ
గావింపఁదలఁచి రా - కన్యామణులకు 5210

వారలు తగినట్టి - వారలు దివిజ
వీరపరాక్రముల్ - వీర శేఖరులు
కట్టడసేయింపఁ - గావలె "నన్న
"నట్టికానిమ్మ"ని - యాజనకుండు
" అయింటికీ యింటి - కరమరయేది ?
ఆయయోధ్యయు విదే - హము మాకుసరియె
నీవు వసిష్ఠమా - నియు విచారించి
కావలసినపనుల్ - గావించు కొనుఁడు
దశరథుండేను ని -ద్దరి సరిమాకు
వశులము వేఁడంగ - వలవ దెందులకు ? 5220
మాకు నొక్కస్వతంత్ర - మా ? అన్ని పనుల
మాకెట్లు సరిపోవు - మేలవి మాకు
వొప్పనే నెవ్వఁడ - నొక ముహూర్తమున
నిప్పుడ నలువుర - కిత్తు కన్నియల
మాచిత్తమున్నట్లు - మేకొంటి "ననుచు
వాచంయమునిఁ బల్కు - వరపుణ్యశీలు
జనకునిఁజూచి ద - శరథభూజాని
వినయ గౌరవములు - వెలయ నిట్లనియె.
" అన్నదమ్ములు మీర - లతిపుణ్యశాలు
లున్నతగుణవంతు - లుత్తమోత్తములు 5230
శ్రీకరుల్ బుధుల బూ - జించు భాగ్యంబు
మాకుమారకుల స - మావర్తనములు
వేల్పింతు మేమని - విచ్చేయుఁడనిన
వేల్పులెల్లనుచాల - వినుతులుసేయ

—: దశరథుఁడు గోదానాదులు సేయుట :—

తమనగరికి వచ్చి - దశరథ విభుఁడు
క్రమముతో నాందీ ము - ఖములు గావించి
వరుస వసిష్ఠు వి - శ్వామిత్రమునుల
విరచించు సంకల్ప - విధిపూర్వకముగ
నొక్కొక్కతనయు న - భ్యుదయంబుకొఱకు
నొక్కొక్కలక్షగా - నొప్పు ధేనువులఁ 5240
బంగారుకొమ్ములు - పసిలేఁగదూడ
లంగైన బలుగెంపు - టండెలు పసిఁడి
గొరిజలు తామ్రలాం - గూలముల్ కంచు
పరుస పాత్రలు సాధు - వర్తనల్ కలిగి
తొలుచూలిచూా కాను - దుఘమునుంబోలి
వలసినన్నియు పాలు - వలనుగాఁగురియు
నావుల నవనీ సు - రావళికిచ్చి
కావలసిన రత్న - కనకాంబరములు
నడిగినవారికి - నడిగినయట్లు
తడయక యొసఁగి యా - దశరథుఁడంత 5250
కమలభవుండు ది - క్పతులతోఁగూడి
యమరుకై వడిఁ గుమా - రాసక్తినుండె.
ఆదినంబునఁ గేక - యాధినాయకుని
గాదిలి సుతుఁడు కై - కకును సైదోడు
దొరకు వియ్యము భర - తుని మేనమామ
స్థిరయశోనిధి యుధా - జిత్తనురాజు
వచ్చిన నెదురేఁగి - వలయుమన్ననలఁ

దెచ్చితౌనన్న గ - ద్దియ మీఁదనునిచి
దశరథనృపతి యా - తని మోముఁజూచి
కుశలంబులడుగనా - క్షోణీశుఁడనియె. 5260
"తమరాజు నితర బాం - ధవులు నందఱము
ప్రముదంబుతోడ ని - ప్పటికి సేమమున
నున్నార మతని ని - యోగంబుచేత
నిన్ను నీభరతుని - నేఁజూడవలసి
యే నయోధ్యకువచ్చి - యీ తోలునాఁడె
జానకికల్యాణ - సంబరంబునకు
చనినవారని పల్క - సంతోషవార్త
విని యేను కన్నుల - విందుగాఁజూడ
వలసివచ్చితి "నన్న - వచనసంగతికి
నెలమి "సంతోషమా - యె" నటంచుఁబలికి 5270
ఆరాత్రివసియించి - యమ్మఱునాఁడు
శ్రీరామ విభుఁడు వ - సిష్ఠానుమతిని

## —: శ్రీ సీతాకల్యాణము :—

ధరణీశునాజ్ఞ సో - దరులతోఁగూడి
సరవిగా మంగళ - స్నానముల్ చేసి
సాంకవ మృగమద - సమ్మిశ్రమైన
కుంకుమపంకంబు - ఘుమ్మనవలఁది
నవరత్నభాసమా - నములైన యట్టి
వివిధాంగుళీయక - వితతిఁగీలించి
జవ్వాదితావు లె - సంగు సంపంగి
పువ్వుటెత్తులు సిగఁ - బొసఁగించిచుట్టి 5280

సరిలేని కట్టాణి - చౌకట్లతోడ
నొరయుఁజొక్కపుఁగెంపు - టొంటులుదాల్చి
శ్రీకర రోహణ - శిఖరికూటంబు
రేక మాణిక్యకి - రీటం బమర్చి
మరకత శ్యామ కో - మల కటీరమున
గరువంబుగాంచు బం - గరుచేలఁగట్టి
పరమయోగుల మనః - పద్మముల్ వ్రాలు
సరణి సుతారక - సరములువైచి
మనసులోఁజొచ్చి య - మ్మదనుండు నిలిపెఁ
దసతేజి నన చిల్క - తాళి ధరించి 5290
పలకవజ్రములఁ జొ - ప్పడుభాషికంబు
నెలరేక హరుఁడు పూ - నినమాడ్కి పూని
ధరణీభరము మాన్పఁ - దాదీక్ష దాల్చు
కరణి ముంగేల కం - కణము ధరించి
శ్రీరామవిభుఁడు గై - సేసి సోదరులు
చేర రాఁ గల్యాణ - శృంగారములను
జనకునిఁజేరి రా - జననాయకుండు
జనకు నింటికి వసి - ష్ఠపురస్సరముగ
వచ్చునమ్మునుపె య - వ్వైదేహరమణుఁ
డిచ్చలోఁ దనయల - నెల్లఁగైసేయ 5300
నియమింప నపుడొక్క - నిడువాలుఁగంటి
రయమునఁగాంచన - రత్నపీఠమున
చెంగట జతగూడి - చేరు నైదువులు
మంగళగాన సా - మగ్రితోఁగూడ
జానకి నునిచి కే - శములకీల్గంటు

చేనొడ్చి సవరంబు - చెలి చేతికిచ్చి
నెఱులుగూడఁగదువ్వి - నిడువాయదివిచి
కరమున చాంపేయ - గంధతైలంబు
చేడియగిన్నెదా - చిఱుఁగేల నంది
కూడుఁ గనిష్ఠికాం - గుళినఖాగ్రముల 5310
దారసన్నముగ నొఁ - దల మీఁదనుంచి
హారవాయితముగా - నరచేతనద్ది
కొఱగోళ్లఁగురులు చి - క్కులు దీర్చిపోఁగ
కరిముల నీలంపు - గాజులు మొఱయ
నుదురు చెమర్ప న - న్నునకౌనువణఁక
కదలుచు రవగెంపు - కడియము లొ్మ్రోయ
చన్నులహారముల్ - చౌకళింపంగ
నున్ననిగొప్పు వె - న్నునవీడిజార
తాటంకములడాలు - తళుకుఁజెక్కులకు
దాటంగఁబరిపరి - తాళవైఖరుల 5320
తలయంటు నెడ నొక్క - తలిరాకుఁబోణి
యలమిఁబెన్నెఱులగం - ధామలకంబు
రమణీయఁమగు నప - రంజికొప్పెరల
సమరుగొర్వెచ్చని - యంబుపూరములు
తంబిగలను ముంచి - తరుణినీరార్చె
కంబుకంఠికి జన - కతనూజకపుడు
తడియొత్తె నొక్క బి - త్తరి సన్నవలువ
మడుఁగుఁబావడ నొక్క - మలయజగంధి
వీవనం దడియూర్చె - విసరియొక్కరితె
యావెలందికి జడ - యల్లెనొక్కర్తె 5330

సరిలేని విరవాది - సరములుచుట్టి
విరిబోణి యొకతె య - వ్వేలంది యూాదలను
నవరత్న సూర్య చం - ద్ర కలాపయుగము
సవరించెనొక్కచం - చలనేత్ర జడను
నడిఁ జంద్రకావి పా - వడమీఁదఁబసిఁడి
పొడుతెంచు వెదచల్లు - బురుసా పటంబు
పసిఁడి కంగులు దీరు - పైఠిణీ రవికె
నొసపరిఁ దొడిగించె - నొకతె సీతకును
నిలువుటద్దము చెంత - నిలిపెయొక్కర్తె
తిలకించికస్తూరి - తిలకంబుదీర్చె 5340
పలచనగా కదం - బము పూసిమేల్మి
తళుకు గందవొడి మీఁ - ద నలందె నొకతె
సరిలేని ముత్యాల - సరులును కంట
సరియు నొడ్డాణంబు - సందిదండలును
కట్టాణి ముక్కర - కళుకుఁ గమ్మలును
మట్టెలుఁ గరము ల - మ్మణుల గాజులును
కంకణమ్ములు సూడి - గములు నందెలును
కింకిణీ రవములఁ - గెలయు మేఖలయు
ముత్తేల బొగడలు - ముక్కెఅనడుగు
లత్తుకలును నేర్పు - లను చంద్రముఖులు 5350
నవరణల్ చేసిరి - జనక తనూజ
నవలఁ బెండ్లికుమార్తె - లైనమువ్వురునుఁ
గై సేసి రీరీతిఁ - గన్యాకామణులు
చూచువారలు మెచ్చి - చోద్యంబునొంద
"శృంగారములకేమి - చెప్పితిఁగాక

అంగనామణి కన్య - లానల్వురందు
పరమకల్యాణి శో - భనగుణజాత
కరుణావలోక జ - గత్త్రియీ జనని
జనకనందన మహీ - జాత యాసీతఁ
గనుఁగొన్నకన్ను లే - కైవడి మరలు 5360
సొమ్ములకెల్లను - సొమ్మలై మించు
నమ్మనోహరగాత్రి - యతులితాంగములు
సీతచక్కదనంబు - చెప్పి వేఱొక్క
నాతిఁదలంచిన - నగుఁబాటుఁగాదె."
అంతట దశరథుం - డాత్మనందనుల
దంతులమీఁద ము - క్తాచ్ఛత్రములను
బిరుద ధ్వజంబుల - భేరీమృదంగ
మురవ దుందుభి ఘోష - ములవచ్చునపుడు
సామంత వివిధభూ - షణఘట్టనముల
హేమరజం బుర్వి - నెల్లశోభిల్ల 5370
వందిబృందముల కై - వారంబు మెఱయ
సందడిగా క్రంత - సతు లందికొలువ
ధారుణీసురలవే - దనినాద మమర
చేరిపుణ్యాంగనల్ - సేసలుచల్ల
పాదచారమున భూ - పతి తోడిదొరలు
కైదండ లొసఁగ చెం - గటఁజేరివచ్చి
హితమంత్రిజనపురో - హితులతోఁగూడి
యతులమౌ జనక మ - హారాజనగరు
చేరి " వసిష్ఠుని - చేతమారాక
యారాజునకుఁదెల్పుఁ - డ" నన ట్లయరిగి 5380

వివరింప జనక భూ - విభుఁ డెదుర్కొనుచు
వివిధసన్మానముల్ - వెలయ రాఘవుల
సవరణగల తన - సదనంబులోని
కవిరళప్రీతిమై - నట తోడితేర
నిగనిగమనునింద్ర - నీలంపుటరుఁగు
పగడాలకంబముల్ - పచ్చలలోవ
పసిఁడిచొక్కపుఁదీగె - పనిహారవులను
పసమీరు టంకులు - పలకవజ్రముల
మెట్టికల్ చుఱుకుమే - ల్మిపరంగి లాగి
కట్టంపుకెంపుల - తళుకు బోదెలును 5392
జీవదంతముల దం - చెలు ముత్తియముల
కోవలమేల్కట్లు - గోమేధికముల
జాలకంబులు బురు - సా తెరల్ చందు
వాలపుఁ దేనియ - వాచవిఁజొక్కి
ఘుమ్మను మగతేఁటి - కులముల రెక్క
తెమ్మెరల్ గలయించు - దివ్యసాంబ్రాణి
ధూపగంధముల ని - స్తులిత మాణిక్య
దీపంబులను సము - దీర్ణ చిరత్న
రత్ననానాచిత్ర - రంగవల్లికల
నూత్నవైఖరుల క - న్నుల విందుసేయు 5400
జనకభూవరు పెండ్లి - చవికె లోపలికి
తనయులతోవచ్చె - దశరథుఁడంత
నవనవానంద స - న్నాహంబుతోడ
రవివంశదీపకుల్ - రత్నపీఠముల
నాసీనులగు తరి - నంకురార్పణము

చేసి యక్షతముల - శ్రీచందనంబు
లాజలు నేయి పా - లాశముల్ తేనె
భాజనంబులును ద - ర్భములు మున్గాఁగ
హోమసామాగ్ని వ - హ్నులుఁదెచ్చియునిచి
శ్రీమించ రఘురాము - చేత వేల్పించి 5410
వసియింప జనకుండు - వైదేహిఁదెచ్చి
ప్రసవసాయకు పూజ - బాణమో యనఁగ
కల్యాణవేది చెం - గటికి రా నపుడ
హల్యాతనూజుండు - నలగాధి సుతుఁడు
తెరయెత్తిన నరుంధ - తీనాయకుండు
మఱియుఁ " గుర్వంతు తే - మంగళం "బనఁగ
" ఆయత్త "మనిని " స - ర్వాయత్త "మనెడి
యా యుపాధ్యాయుల - యనుమతిఁగొంత
తెరవంప శ్రీరాము - దృష్టి యాసీత
చిఱునవ్వు నెమ్మోము - శృంగారమనెడు 54:0
కొలనులోపలఁ బొడు - కొను పుండరీక
దళములోయనఁగ నెం - తయు వికసిల్లె
సిగ్గఁ యుగు నేల - చేడియపట్టి
యగ్గలికనుఁజూచు - నపుడు శ్రీరాము
లావణ్యజలధి న - ల్లనెదాఁటు మీాల
కైవడి నందమై - కనుపట్టెఁజూపు
యిరువురు నొండొరు - లిటుజూచునపుడు
సరసానురాగ వీ - క్షణము లొప్పమరె.
అటుచూచియిటుఁ జూచి - యతనుండునైచు
చఱులసవ్యాసవ్య - శరములోయనఁగ 5430

నావేళ తెర దివి - యంగ రాఘవుని
భావించి తా మధు - పర్కంబొసంగి
సర్వలక్షణవతిఁ - జంచలాగాత్రి
సర్వాభరణ సము - జ్జ్వలమహీపుత్రి
ననలుఁడు సాక్షిగా - నా రామవిభునిఁ
గని యభిముఖముగాఁ - గల్యాణి నునిచి
" అనఘ ! యీకన్య నా - యాత్మజ సీత
జనవిచ్చి సహధర్మ - చారిణిఁగాఁగ
నంగీకరింపు మీ - వ "ని రాముచేత
నంగనామణి కరం - బల్లనె కూర్చి 5440
" పరమపతివ్రతా - భరణ మీరమణి
వరియింపు ఛాయాను - వర్తిని " యనుచు
కనకభృంగారుక - ర్కరికాముఖమునఁ
దనరు కల్యాణమం - త్ర పవిత్రితములు
జలములు శ్రీరామ - చంద్రు హస్తమున
నెలకొన విభుఁడు క - న్యను ధారవోసె.
ఏపున రఘురాముఁ - డింతి కంధరను
చూపట్ట మంగళ - సూత్రంబుఁగట్టి
తళుకు ముత్యముల సీ - తారామవిభులు
తలఁబ్రాలువోసిరి - తమకముల్ మెఱయ 5450
నావేళదివి నిండె - నమరదుందుభులు
పూవులవానలు - పుడమిపైఁ గురిసె
తగ వినవయ్యె గం - ధర్వగానములు
మిగులంగ వలపు తె - మ్మెర లల్లుకొనియె
రహిమించె దేవతా - రమణుల యాట

విహితోత్సవంబయ్యె - విశ్వంబునకును
సీతఁజేపట్టి యా - శ్రీరామచంద్రుఁ
డాతతభక్తితో - నాశ్రయాశునకు
వలగొఁగ మున్మారు - వచ్చి మానులకుఁ
గులవృద్ధులకు నిజ - గురులకు మ్రొక్కి 5460
యున్నెడ లక్ష్మణుఁ - డూర్మిళాదేవి
నున్నతగుణవతి - నుద్వాహమయ్యె.
మాళవి భరతుఁడా - మంచి లగ్నమున
లాలితశ్రీల లా - లనఁబెండ్లియాడె
సమరాగముల మించి - శత్రుఘ్నుఁడపుడు
కమలాక్షి శ్రుతకీర్తిఁ - గల్యాణమయ్యె.
నలువురు రాజనం - దనులు నీరీతి
నలుగురా జనక నం - దనల వరించి
శోభనదినము ల - చ్చోనాల్గునాళ్లు
వైభవంబుల శాస్త్ర - వైఖరిఁదీర్చి 5470
ప్రాఁకెనయును నాక - బలి వసంతములు
వీఁకతోఁగావించి - విందులఁ దెలచి
వచ్చిన సకల భూ - వరులకు వలువ
లిచ్చి కుమారుల - యేఁగుఁబెండ్లిండ్లు
ధరణినెల్లెడ వెల్గ - దశరథవిభుఁడు
నిరతిమైఁగావించి - నిజగేహమునకు
శ్రీమెఱయఁగఁబ్రవే - శించి సమస్త
భూమీశులను వారి - పురముల కనిచి
ఆనందముననుండు - నప్పుడు గాధి
సూనుఁడు వారలఁ - జూచి దీవించి 5480

యను మతుండై తుహి - నాచలంబునకుఁ
జనియె నా తరువాత - జనకవిభుండు

—: దశరథాదు లయోధ్యకుఁ బోవుట :—

దశరథు ననిచి సీ - తకు నరణముగ
దశశతకన్యకా - దాసీ జనములు
లక్షయేనుఁగ లైదు - లక్షలహరులు
నక్షయంబగు పాఁడి - నమరుధేనువులఁ
గోటిరథమ్ములుం - గొన్ని వస్త్రములు
కోటియు గ్రామముల్ - గొన్నియాభరణ
కోటియు రత్నముల్ - కొన్నిదీనార
కోటియు వస్తువుల్ - గొన్నిశాలువులు 5490
పట్టెమంచములును - పరపులు మేలు
కట్టులు తెరలు చో - క్కపు గురాడములు
దివ్యోగంబులు చే - దీపముల్ గొలువ
జవ్వాది పిల్లులు - జాలవల్లికలు
చప్పరమంచముల్ - సానలు పచ్చ
కప్పురంబుల క్రోవి - గములుఁ బన్నీరు
చెంబులుం గందపు - చెక్కలు రత్న
కంబళంబులు పచ్చి - కస్తూరి వీణె
పెట్టెలుం జీరల - పెట్టెలు సొమ్ము
పెట్టెలు నపరంజి - బిందెలు పైఁడి 5500
కొప్పెరలును తంబు - గులు వట్టివేళ్ల
చప్పరంబులును వా - సన సురఁటీలు
గిండులు పడిగముల్ - కిన్నెరల్ వీణె

దండెలు తంబురాల్ - తలగడల్ పడక
కత్తులు బటువులు - గాజుగిన్నెలును
చిత్తరు తెరలును - చిటికె వార్వములు
చిలుకపంజరములు - సింగాణివిండ్లు
నిలువుటద్దములు మా - ణిక్యదీపములు
నుయ్యాలగొలుసులు - నుదిరిపావాలు
ముయ్యాడు చదరంగ - ములు సొగటాలు 5510
మొదలుగా నొసఁగి రా - ముని కొప్పగించి
మదిఁగలఁగఁగ బుద్ధి - మార్గముల్ వలికి
కడమకన్నియల కీ - గతి నరణములు
నడలనిప్రేమ నొ - సంగి బంగారు
పల్లకీలనమర్చి - పంచి యామునుపె
యల్లుండ్ర నలువుర - ననిచిన యంత
తనబలంబులతోడ - తనయులతోడ
తనదు కోడండ్రతో - దశరథవిభుఁడు
శ్రీకరలీల వ - సిష్ఠుతోఁగూడి
సాకేతసరణి రా - శకునముల్ గొన్ని 5520
విపరీతములుఁగాఁగ - విభుని కట్టెదుట
నపుడు గన్పట్టె భ - యంకరధ్వనుల
విహగంబు లాకాశ - వీథిఁగూయుచును
బహుళంబుగా సేన - పైనాడుచుండె
మృగములుగొన్ని భూ - మిఁ బ్రదక్షిణముగ
నిగుడఁ జరింపుచో - నృపతి భీతిల్లి
“ఏలయ్య? మునినాథ! - యీపక్షులెల్ల
కోలాహలంబుగాఁ - గూయిడఁదొడఁగె

పోశఁ బ్రదక్షిణం - బులుగా మృగంబు
లేకడ విహరించె - నేమిగాఁగలదో ? 5530
కలఁగె నామది సేన - కళవళంబందె
తెలియఁగఁ బల్కంగ - దే నిల్చి" యనిన
నావసిష్ఠమునీంద్రుఁ - డంతయు నెఱిఁగి
" ఓవసుధాధీశ ! - యోడకు మింక
క్రూరముల్గాఁగఁ బ - క్షులు వల్కుకతన
ఘోరభయంబు నీ - కునుఁ గల్గునిపుడు
వనమృగంబులు వల - వచ్చినకతన
ననుపమ సంతోష - మందెదు మొదల
రమ్మ"ని పోవ ధ - రాధూళులెగసె.
కమ్మె నల్గడఁ జీ - కటు లుర్విమీఁద 5540
విసరె నుక్కోలుగా - విషమవాయువులు
వసుధ నద్దపుఁ బిల్ల - వలెఁ గోఁచె నినుఁడు
మూఁకలమీఁద దు - మ్ములు కుప్పవడియె
నేక డాకడ యయ్యె - నెల్లదిక్కులును
దశరథుండును మౌని - తతి వసిష్ఠుండు
దశరథపుత్రులు - దక్కనందఱును
నొడలిలో బ్రాణంబు - లునికి సందియము
వడ నచేతనులైరి - బలకోటులెల్ల

—: పరశురామ సందర్శనము :—

నపుడు భయంకరు - ననలప్రతాపుఁ
దపనసంకాశు ను - ద్ధత జటాధరుని 5550

నచలకైలాస ము - హాశైలకాయు
రుచిర పరశ్వధా - రూఢ భుజాగ్రు
రాజులనెల్లర - రణవీథిఁద్రుంచి
రాజిల్లు భార్గవ - రాము నిర్దయుని
మేరువువంటి య - మేయకార్ముకము
పారావతమ్ముగాఁ - బట్టినవాని
గదిసి కుత్తుక చేఁదు - ఖలులపైనుమిసి
నుదుటి యింగలము క - న్నులఁ బంచిపెట్ట
పురిములమీఁద న - ప్పుడె కోపగించు
హరుని కైవడిఁజూడ్కి - కందనివాని 5560
నా జమదగ్నిజు - నటుగాంచి మాని
రాజులు భయనివా - రణ మంత్రజపము
గావించి తమలోన - గజిబిజి మనుచు
నావీరవరుమాట - లాడుచునుండ
రాముని శిష్యుఁడో - రాముని మీఁది
రాముని కోపమో - ర్వఁగ నెవ్వఁడొప్పు "
నని దశరథముఖ్యు - లాడ శ్రీరాముఁ
గనుఁగొని పల్కె భా - ర్గవరాముఁడపుడు.

—: శ్రీరాముని పరశురాముఁడు తిరస్కరించుట :—

" వింటిని హరువిల్లు - విఱిచిన నీదు
బంటుతనంబు నే - పదినాళ్లవెనక 5570
జగతిని యాశ్చర్య - చర్యయి చూడఁ
దగునని నీవెంపుఁ - దలచి వచ్చితిని
జమదగ్నిసంబంధ - చాపంబు నీదు

విమలసత్త్వము దాన - వెలివిరియఁగఁ
జాతముగాని తీ - సుక యెక్కువెట్టు
మీతరి నపుడు ని - న్నెఱిఁగినమీఁద
నెలమి నాచేతివి - ల్లెత్తినవెనుక
తలపడి ద్వంద్వయు - ద్ధంబు సేయుదము
వెఱచితివేని వా - విడిచి నాతోడ
నెఱిఁగింపు కాతు ని - న్నిది నిశ్చయంబు 5580
కాకున్న నాతోడ - కలనికి రమ్ముఁ
లేకున్నఁబోనీఁడు - లే భార్గవుండు"
అనుమాటలకు చాల - నవశుఁడై చేరి
వినయంబుతో మహీ - విభుఁడిట్టులనియె.
"ఓయయ్య! నేనునా - యొజ్జయుఁగూడి
నీయడుగులకు పూ - నిక నర్చలొసఁగ
నవియేల కైకొన - వాగ్రహంబేల?
భువి క్షత్రధర్మంబుఁ - బోకడవెట్టి
శాంతుండవై మౌని - చర్యల నుండు
నింతటి పుణ్యుని - కీయల్కదగునె? 5590
కారుణ్యనిధివి భా - ర్గవంశజలధి
నీరజారాతివి - నీవు నాసుతుల
రక్షింపఁదగుఁగాక - రామునిఁ గాక
పక్షుచూడుని నిట్లు - వలుకంగఁదగునె?
వాసవముఖ్యాది - వ్యగ్రశ్రేణి వినఁగఁ
జేసినట్టి ప్రతిజ్ఞ - చెల్లించుకొనక
జయరమాశయ కుశే - శయమన లోక
భయదమౌ రా దిండి - పరశువుఁదాల్చి

రానేల ? ధనువున - స్త్రములు శస్త్రములు
మాని కాశ్యపునకు - మహి ధారవోసి 5600
యీవు మహేంద్రాద్రి - కేఁగితి వనుచు
భావంబు లోనమ్మి - బ్రతికితిమనఁగ
నోసీక నా పాప - ములు పెడరించి
యీ నిన్నుఁ దచ్చె నిం - కేమి సేయుదుము ?
తమకెల్ల నత్యుప - ద్రవ హేతు వైతి
సమరులచే నిన్ను - నరికట్టఁదరమె ?
రామునితోఁటి వా - రమె యిందఱమును
రామచంద్రుండె మా - ప్రాణంబులెల్ల ''
అని దశరథుఁడాడ - నదలించి మించి
ఘనురాముఁజూచి భా - ర్గవ రాముఁడనియె. 5610
'' వినుము రాఘవ! జగ - ద్విదితంబులైన
ధనువు లీరెండు నా - ద్యములు దివ్యములు
నిర్మించె నివి తన - నేర్పున విశ్వ
కర్మ యందొక విల్లు - కాలకంఠునకు
దేవత లిచ్చిరి - త్రిపురముల్ గెలువ
నావిల్లు విఱిచితి - వతిశక్తి నీవు
సరియందు తోడ వై - ష్ణవ శరాసనము
హరికి నిచ్చిరి వేల్పు - లందరు దీని
నజుగీతో నింద్రాదు - లైన వేలుపులు
భుజశక్తి శౌర్యాది - స్ఫురణలచేత 5620
హరియెక్కుడో కాక - హరుఁడధికుండో
అరసి యేర్పఱుపు మీ '' - వనిపల్కుటయును
నారదు నంపింప - నానాఁట నతఁడు

వారలిద్దరికిని - వాదు గల్పింప
హరిహరుల్ వెడలి మ - హాసంగరంబు
సురలు వీక్షింప ని - స్తుల సత్త్వములనుఁ
బోరుచో నపుడు శం - భుని కార్ముకంబు
సారసాక్షుఁడు దివ్య - శరము సంధించి
వ్రేసినఁ జేసెత్తి - విల్లు సత్త్వంబు
దీసి జబ్బయి పోవ - దిగులుచేహరుఁడు 5630
వ్రానుపాటున నుండు - మాధవుశక్తి
యానిటలాక్షున - కగ్గలం బనుచు
హరినిఁ బ్రార్థించి మ - హా సమరంబు
పరిహరించి పినాక - పాణిచే విల్లు
దేవత లిప్పింప - దేవ రాతునకు
నావిభుఁ డద యుంచె - నాత్మదేహమున
నాయెడ భార్గవుం - డగు రుచీకునకుఁ
గాయజ జనకుఁడీ - కాండాసనంబు
నిచ్చెను జమదగ్ని - కెలమి మాతండ్రి
యిచ్చెను నాచేతికి - కిమ్మహా ధనువు 5640
నాజమదగ్ని ను - హామౌని శౌరిఁ
బూజించునపుడు దు - ర్బుద్ధి యైనట్టి
కార్తవీర్యుండు ము - ష్కరుఁడై వధించు
వార్తనే విని రాజ - వంశజులైన
యర్జునుం డాదిగా - నవని పాలకుల
నిర్జించి కాశ్యపు - నికి ధాత్రియెల్ల
యాగదక్షిణ గాఁగ - నర్పించి వీత
రాగుఁడనై మహేం - ద్ర నగంబు నందు

తపముసేయుచు నుండి - తాపస వర్యు
లిపుడు నీవెక్కడి - యీశ చాపంబు 5650
విఱిచితి వనిపల్క - వినివచ్చినాఁడ
గరిమఁ బరంపరా - గతమైన యట్టి
యీవిల్లు నీసత్త్వ - మేనుచూడంగ
యీవేళ యెక్కిడి - యెల్లరు మెచ్చ
శరముపూనిన మెచ్చి - సమరంబు సేతు
కరము చాఁపుము విల్లుఁ - గైకొను మిపుడు
తమతండ్రి పగఁదీర్చ - ధారుణీ విభుల
సమయించి శోణిత - స్రావంబుచేత
నెసఁగించి నదులు పి - తృశ్రేణికెల్ల
నొసఁగితి భక్తిఁ ది - లోదక క్రియలు 5660
రాజ కళేబర - రాజిచే మెట్లు
గా జతకట్టి స్వ - ర్గంబున కేను
పనిచితిఁ బితరులఁ - బగయెల్లఁదీరి
మునినైతి నాకుఁ గా - ర్ముక విద్య నేర్పె
నేనుఁ గుమారుండు - నెక్కటిఁబోరఁ
దానన్ను గెలిపించె - తలనాఁడు హరుఁడు
ఆదేవు శిష్యుండ - నగుట నీవతని
కోదండ భంగ ముం - కువ చేసి పెండ్లి
యాడి పోవఁగఁ గని - యడ్డగించితిని
కూడదు జుణిఁగిన - గొమ్ము కార్ముకముఁ" 5670

—: పరశురామ గర్వభంగము :—

నాపుడు దశరథ - నరపతి వినఁగ
నావేళరఘు వీరుఁ - డతని కిట్లనియె.

" నీమాట లన్నియు - నిజము మాతండ్రి
కీమాన భంగంబు - నిపుడ తీర్చెదను
యెక్కిడఁ బోయిన - నీశ చాపంబు
గ్రక్కునఁదునియలు - గా వ్రీలెఁగాని
విఱిచెదనని విల్లు - విఱుచుటగాదు
ధరణీ సురుఁడ వౌట - తగదు నీమీఁద
కోపింప దండింప - కోపంబునీకు
నాపయిఁ గలిగిన - న్యాయ దండనము 5680
సేయుము మారఘు - శ్రేష్ఠు లావులకు
నేయెడ ద్విజులకు - నేనాడు దెగరు "
అనిన " నీతఁడు విప్రుఁ - డనియు నేరాజ
ననియు నున్నది నీ య - హంకరణంబు
విల్లుచే నందక - వెడమాటలాడి
వెళ్లఁ జూచెదవో - వో విడువని " న్ననిన
కోపించి తెమ్ము ! - నీ కోదండమెంత !
యీపలుకుల ఫలం - బిపుడె కాంచెదవు "
అనిచేతి విల్లంది - యమ్ము సంధించి
కనుఁ దామరలఁ గెంపుఁ - గడలు కొనంగ 5690
నిను నేఁడు గాధేయు - నికిని మేనల్లు
మునికి బుత్త్రుఁడవని - మొదట విప్రుఁడవు
అనియునుఁ బూజ్యుండ - వనియుఁ దాళితిని
చనదునేఁ బూనిన - శరము రిత్తగను
నుడువుము తెగ వ్రేతు - నో నీపదంబు
లుడిగింతువో నీకు - నూర్ధ్వ మార్గంబు
యేగతి నీకింక - నేగతి మాన్తు

వేగ వాకొనుమన్న - వెలవెలంబాఱి
అమర నదీవేగ - మార్వాగ్నిచేతఁ
దెమలిన కైవడి - దీమసం బుడిగి 5700
అజహరీంద్రాదులై - నట్టిదేవతలు
భజియింపుచును మింటఁ - బరికించి చూడ
బలమెల్లఁ బోయియా - భార్గవరాముఁ
డల దశరథ పుత్రు - నాశీర్వదించి
"నన్నురక్షింపు మ - నాథ! శరణ్య!
విన్నవించెదను నా - వృత్తాంతమెల్ల
రాజసూయ మొనర్చి - బ్రాహ్మణావళికి
నీజగతీచక్ర - మెల్ల దక్షిణగ
నిచ్చినవాఁడ ని - దే కొక్కనాఁడు
నెచ్చట నుండరా - దీగతి చెలుప 5710
యేను మహేంద్రాద్రి - కేఁగంగఁజాలఁ
గాన నాపుణ్య మా - ర్గములడ్డగింపు
ఆవిల్లు విఱిచినా - యస్త్రాసనంబు
నీవు గైకొనుటచే - నిక్కంబుఁగాఁగ
వనజాక్షుఁడును మధు - వైరి యక్షయుఁడు
ఘనుఁడు విష్ణువునని - కని యెఱింగితిని
నీకు మేలగుఁగాక - నినుఁజూచు వేడ్క
లోకేశ ముఖదివ్య - లును వారె వచ్చి
యున్నవారిదె నీకు - నోడుటల్ మిగుల
మన్నన యగు నవ - మానంబుగాదు 5720
యేఁగెద నేను మ - హేంద్రాది కిపుడె
ఆఁగుము నాదు పు - ణ్యపదంబు లేసి

ననుఁగావు" మనిన బా - ణ ప్రయోగమున
మనువంశనిధి పుణ్య - మార్గంబు లేసె.
రాము వీడ్కొని మహేం - ద్రనగంబుత్రోవ
నామీరవలగొని - యరిగె భార్గవుఁడు.
సకల దిక్కులును ప్ర - సన్నంబులయ్యె
నకలంక మతులైరి - యఖిలసైన్యములు
పొగడి రింద్రాదు ల - ప్పుడు రాముఁజూచి
జగతికి నెల్లను - సంతోషమయ్యె. 5730

—: దశరథాదు లయోధ్య కరుగుట :—

తరవాత రఘుపతి - తనచేతి విల్లు
వరుణుని యందుఁగై - వశముగా నుంచి
చేరి వసిష్ఠుని - శ్రీ పాదమునకు
నారూఢ భక్తితో - సాష్టాంగ మెరగి
భయము దీరిన తండ్రి - పదములప్రాలి
రయమున సాకేత - రాజధానికిని
చతురంగ బలముతోఁ - జనుఁడన్న మాట
కతఁడు సంతోషించి - యాలింగనంబు
గావించి మాళి యా - ఘ్రాణంబుచేసి
దీవించి మరల ధా - త్రినిఁదా జనించు 5740
సరణిగా నెన్నుచు - సైన్యంబు గొలువ
బిరుద ధ్వజంబులు - పెరిమ వెలింప
నానక పణవ తూ - ర్యమృదంగభేరి
కా నినాదములఁ ది - క్తటములు మొరయ
జలయంత్రములను ధ్వ - జంబులఁ బుష్ప

కలిత మార్గముల నే - కడ నుర్విఁదనుప
వీథులు గైసేయు - వేడుకల్పొచ్చి
యాదశరథుఁ డయో - ధ్యాపురి చేరి
సంతోషమున పౌర - జను లెదుర్కొనఁగ
కాంతల వీచోపుఁ - గరువలి వోలయ 5750
చతురంగ బలములు - సందడిసేయ
అతివ లంచల మంగ - ళారతులెత్త
సీమంతినీమణుల్ - సేసలు చల్ల
సామంత రాజులు - చనువుతోఁ గొలువ
సంతుష్టులైన భూ - జనులు రాఘవుల
నెంతయుఁజూచి య - ట్టిటు పోకరాఁగ
సున్నవుమేలు మ - చ్చులను కైలాస
మున్నకై వడిఁగర - మొప్పెడు నగరు
ప్రేమఁ బ్రవేశింపఁ - బెండ్లికూఁతులకు
రామచంద్రాది పు - త్రచతుష్కమునకు 5760
వారిజముఖులు ని - వాళులు దివియ
భూరమణుం డంత - పురము చేరుటయుఁ
గొడుకులుఁ గోడండ్రు - కోరి మ్రొక్కంగ
సడలనిభక్తిఁ గా - సల్యాదులైన
యింతులు దీవింప - యిలవేలుపులకు
నెంతయు సాష్టాంగ - మెరగి మాన్యులకు
మ్రొక్కి శోభనదాన - మును చేసి వాసి
కెక్కిన తమతమ - యిండ్లలోపలను
వసియింప రఘుపతి - పత్నితోఁగూడి
యసమాన చంద్ర శా - లావళియందు 5770

పరపైన కెంపు టు - ప్పరిగలయందు
విరుల తావులుఁచల్లు - విపినంబులందు
కేళిదీర్ఘికలను - కృతకశైలముల
నాలోల దోలా వి - హార లీలలను
పడకయిండ్లను రేయి - పగలునుఁగూడి
యెడపని రాగంబు - లిగురులొత్తంగఁ
గొన్నినాళ్లు వసింపఁ - గువలయ విభుఁడు
మన్నించి "మీమేన - మామ రమ్మనుచు
యీ యుధాజిత్తుఁడి - ట్లెన్నేని దినము
లాయత భక్తి ని - న్నంపండు మనుచు 5780
కాదియున్నాఁడు వే - గమునఁ బొమ్మనిన"
ప్రాచీననిభు దశ - రథుఁజేరి మ్రొక్కి
తల్లులకెల్ల వం - దనములు చేసి
యల్లన రఘురాము - నడుగులఁ వ్రాలి
సరగున భరతుఁడు - శత్రుఘ్నుఁగూడి
యమ్మేనమామ ని - జావాసమునకుఁ
జనునెడ నారామ - చంద్రుండు ముదముఁ
బెనగొన తండ్రి చె - ప్పిన పల్కులోన
చుట్టాల సు రభియై - పోఁకొల్పి జనకు
పట్టున తల్లుల - పట్టున గురుల 5790
పట్టున పౌరుల - పట్టున హితుల
పట్టున మంత్రుల పట్టున సీత
పట్టున తమ్ముల - పట్టున ప్రజల
పట్టున నేకభా - వముతోడఁగలసి
యున్నెడ భూజను - లుల్లంబులోన

సన్నుతింపుచు రామ - చంద్రుచర్యలకు
మెచ్చుచునుండ భూ - మిజ మిూఁదఁబ్రమద
మెచ్చంగ నడకలు - నింగితంబులును
చెలువము ల్గుణములు - శృంగారములును
తలఁపులు నొకటిమై - తమకముల్ వెనుప 5800
సకలజన స్తుత - సద్గుణనిధిని
వికచాబ్జనయనఁ బృ - థ్వీజాత సీత
ధారుణీరమలు నం - దకపాణి నెనయు
మేర శ్రీరాముని - మెచ్చునందేలి

—: గద్య :—

విలసిల్లెనని వేద - వేద్యుని పేర
నలమేలుమంగాంగ - నాథీశు పేర
నంచితకరుణాక - టాక్షుని పేరఁ
గాంచమణిమ - యా కల్పుని పేర
వేదవేదాంతార్థ - విహితుని పెర
నాదిత్యదివ్య ప్ర - భాంగుని పేరఁ 5810
గంకణాంగదరత్న - కటకుని పేర
వేంకటేశుని పేర - విశ్వాత్ము పేర
నంకితంబుగ వేంక - టాధీశ చరణ
పంకజ సేవాను - భావ మానసుఁడు
హరిదాసమణి కట్ట - హరిదాసరాజు
వరదరాజు నితాంత - వరదానశాలి
రచియించు వాల్మీకి - రామాయణంబు

—: ఫలశ్రుతి :—

ప్రచురభక్తిని మదిఁ - బాటించి వినినఁ
జదివిన వ్రాసిన - సభలఁ జేర్కొనిన
మదిఁదలంచిన నెట్టి - మనుజులకైన 5820
ధారుణి మీఁద సీ - తా రామచంద్ర
పారిజాత దయా ప్ర - భావంబు వలన
హయమేధ రాజ సూ - యాదిమ యాగ
నియత ఫలంబులు - నిరతాన్నదాన
సుకృతంబు నిత్యాయ - శోవైభవములు
నకలంక తీర్థయా - త్రాది పుణ్యములు
సత్యవ్రత పదంబు - సకల సౌఖ్యములు
నిత్యమహాదాన - నిరుపమశ్రీలు
కలికాల సంప్రాప్త - కలుష నాశనము
కలుములు హరిభక్తి - గౌరవోన్నతులు 5830
శత్రు జయంబును - స్వామి హితంబు
పుత్రలాభంబును - భోగ భాగ్యములు
ననుకూల దాంపత్య - మంగనా ప్రియము
ధనధాన్య పశువర్గ - ధరణి సమృద్ధి
మానస హితము ధ - ర్మప్రవర్తనము
నానందములు ఖేద - మందకుండుటయు
నలఘు వివేకంబు - నతుల గౌరవము
వలయుఁ గార్యములకై - వశము లౌటయునుఁ
బావనత్వము దీర్ఘ - పరమాయువులును
కైవల్య సుఖము ని - క్కముగాఁగఁ గలుగు 5840

నెన్నాళ్లు ధారుణి - యెన్నాళ్లు జలధు
లెన్నాళ్లు రవిచంద్రు - లెన్నాళ్లు గిరులు
ఎన్నాళ్లు నిగమంబు - లెన్నాళ్లు విశ్వ
మన్నాళ్లు నీకథ - యరయ నారుషము
నాదికావ్యంబు బా - లాఖ్య కాండంబు
వేదసమానమై - విలసిల్లు నెపుడు.

ఇది

కట్టా వరదరాజ రచితమైన వాల్మీకిరామాయణ మందలి

బాలకాండము.

---

శుభమస్తు.

శ్రీ కట్టా వరదరాజు

# వాల్మీకి రామాయణము

---

## అయోధ్యాకాండము

శ్రీరాజితశుభాంగ - చిరగుణిసంగ !
హరికృపాపాంగ ! - యలమేలుమంగ
భావుక! శతకోటి - భానుసంకాశ !
సేవకాత్మ నివేశ ! - శ్రీవేంకటేశ !
అవధారు ! కుశలవు - లారామచంద్రుఁ
డవధరింపంగ రా - మాయణం బిట్లు
వినుపించు తత్కథా - వృత్తాంత మెల్ల
కనుపించు నవ్వలి - కథ యెట్టులనినఁ
తనతండ్రి పనుపున - తమ్ముఁడుం దాను
పనివూని భరతుఁడు - పయనమై కదల 10
చెంగట నయ్యుధా - జిత్తుని వెంట
బంగరురథముల - పై వచ్చియతని
పురము ప్రవేశింపఁ - బుత్రుల కరణి
అరమర లేకుండ - యమ్మేనమామ
నడపింపు మిగుల మ - న్ననల నుండియును
తడవాయె నెడవాసి - తల్లిదండ్రులను
నెప్పుడు పోవుద - మెన్నడు చూత
మెప్పుడు రఘురాము - నీక్షింపఁగల్గు

ననుచుండ దశరథుం - డ ల్లెడబాయు
తనయుల మీఁది చిం - తను సంతతంబు 20
నిరుపుర నరుణ మ - హేంద్ర సమాన
చరితుల చరితముల్ - చారుల వలన
నానాట వినుచున్న - నలువురు సుతులు
పూనికె మైఁజతు - ర్భుజములుఁగాఁగ
హరిమాడ్కి నలరుచు - నమరు లాలోన
పరమేష్ఠిమీఁదట - పంకజాక్షునకుఁ
గరుణ హెచ్చగు రీతి - కల్యాణశీలు
నరవిందలోచను - నారాముఁగూర్చి
మిక్కిలి ప్రీతుఁడై - మించుటయేమి
లెక్క ? గోవిందుఁడా - లీలల న్మించి 30
రావణాది నిశాచ - ర శ్రేణినెల్ల
కావరంబులు మాన్పఁ - గలిగిన కతన
నదితి యింద్రునిఁ గాంచి - యమరిన యట్లు
పొదలె రామునిఁ జూచి - పొలఁతి కౌసల్య

—: రామగుణ వర్ణనము :—

విలసిల్లె రాముండు - వీర్యాసమత్వ
కలనల దశరథు - గతిఁ జూడమించి
అతి శాంతి మృదుభాష - ణావలిఁగలిగి
హితబుద్ధిఁ బరుషోక్తు - లెవ్వ రాడినను
మాఱువల్కక యంత - మాత్రమహా మేలు
చేరి చేసిన వారిఁ - జేపట్టి యపుడు 40

మఱవక నేరముల్ - మఱచుచు నెల్ల
పరిజనులనుఁ బ్రోచి - బాణాసనాది
సాధన క్రియలందు - సహవాసులైన
యోధులందగు వేళ - నుపచరింపుచును
మంచిమాటలు బుద్ధి - మగఁటిమి తానె
కాంచితి ననియెంచి - గరువంబు లేక
కల్లలాడక వృద్ధ - గణముఁ బూజింప
నెల్లరుం దనయందు - నెల్లర మీఁద
తాను సత్యానురక్తిఁ - దగిలి సమస్త
దీనుల యందు నెం - తే దయఁగలిగి 50
క్రోధంబు లేక ధ - ర్మండునై పరమ
సాధులై బ్రాహ్మణ - సంతర్పణమున
నియమవంతుఁడయి - నిత్యశుద్ధుండు
నియతాత్ముఁ డిక్ష్వాకు - నృపనీతిధనుఁడు
కించులం దునిమి యం - కిలి లేక యుండు
మంచివారలఁ బ్రోచు - మర్యాదవాఁడు
మాని నిషిద్ధక - ర్మములు గ్రామ్యంబు
లైన కథాపంక్తు - లందనివాఁడు
అతులవాక్యముల బృ - హస్పతిఁ గేరు
మతిగలవాఁడు స - మస్వభావుండు 60
ఆరోగ్యభాగ్యంబు - లందినవాఁడు
శూరుండు తరుణుండు - సుముఖుఁడార్యుండు
కాలదేశంబులు - గని తగినట్టి
వేళలఁ గర్మముల్ - వెలయించు వాఁడు
చక్కదనంబున - సరిలేనివాఁడు

మక్కువ తారత - మ్యంబాత్మ నెఱింగి
పురుషుల నడపించు - పుణ్యవర్తనుల
సరిలేనివాఁడు శ్రే - ష్ఠగుణవంతుండు
ప్రజలకెల్లను దాని - ప్రాణమై సురల
భజియించి యచలిత - బ్రహ్మచర్యమున 70
నాగమంబులు నేర్చి - సాంగంబుగాఁగ
ఆగమాంతార్థర - హస్యముల్ దెలిసి
జనకజఁబెండ్లియై - శస్త్రాస్త్రరూఢి
జనకుని దశరథు - సరిమీరువాఁడు
ధీరుఁ డార్జవగుణా - ధికుఁడెట్టి యెడల
నేరుచు మెలఁగ ని - న్నిటసమర్థుండు
ధర్మార్థ కామత - త్పరుఁడు వివేక
నిర్మలచిత్తుండు - నిశితైకబుద్ధి
ఆచారరతుఁడు స - త్యప్రతిష్ఠితుఁడు
సాధువారలకు మె - చ్చులొసంగువాఁడు 80
వినయభూషణుఁడా త్మ - వృత్తి మన్యులకు
గనిపించక మెలంగు - గాంభీర్యశాలి
బలమునఁ గలిమిఁ గో - పప్రసాదముల
నలరినవాఁ డెందు - నాయంబు వ్రయము
కడు నెఱింగి మెలంగు - గదలింపరాక
నడపించు ప్రతిన మం - త్రరహస్యరక్ష
గావింప నేరుచు - ఖలులఁ గైకొనఁడు
వావిచ్చి పలుకఁ డె - వ్వరిఁగాని మాట
అలయఁ డేమఱియుండఁ - డన్యులదోష
ములుఁ దనయెడ దోష - ములు గాననేర్చు 90

పరుల కీడెఱుఁగుఁ జే - పట్టిన విడువఁ
డరులను తగుసమ - యముల దండించు
చతురుఁడు న్యాయార్థ - సముపార్జనమున
నతి రహస్యార్థంబు - లరయంగ నేర్చు
నాటకాలంకార - నైపుణిం బ్రోడ
చాటుకావ్య నిరూఢ - సాహిత్యవేది
ఉచితవ్యయమె సేయు - చుండు గజాశ్వ
నిచయావ రోహణ - నిరతవినోది
పురుషార్థపరుఁడు పెం - పున ధనుర్వేద
నిరతి సాంగంబుగా - నేర్చినవాఁడు 100
అతిరథుం డాత్మ సై - న్యవ్యూహ రచనఁ
బ్రతివీరులనుఁగెల్చు - పరమసాహసుఁడు
అకలుషాత్మకుండు దే - వాసురసాధ్యుఁ
డోకరి మేలునకుఁజూ - పోర్చినవాఁడు
అవమాన మెవ్వరి - యందునుం జేయఁ
డవసరంబునకిచ్చి - యాకొరల్ దీర్చు
నెల్ల గుణంబుల - కిరవైనవాఁడు
చల్లనివాఁడు కౌ - సల్యాసుతుండు
తాలిమిం బుడమి మే - ధను సురాచార్యుఁ
డాలంబులో నింద్రుం - డ సమశౌర్యమున 110
గరములచేత భా - స్కరురీతినిట్టి
వరగుణంబుల రఘు - వర్యుండు మెఱయ
జనులెల్ల శ్రీరామ - చంద్రుఁడే తమకు
నినుఁడు గావలెనని - నిచ్చలందలఁప

తనదు కన్నుల మ్రోల - దశరథనృపతి
తనయుఁ బట్టముగట్టి - ధరణి యేలింప
పర్జన్యు కైవడిఁ - బ్రజలఁబోషించు
దుర్జయుం డలఘుస - ద్గుణ గణాన్వితుండు
రామచంద్రుని యువ - రాజ్యపట్టమున
నేమించి నిలుపుదు - నేనని యెంచి 120
తనహృదయంబు ప్ర - ధానులకెల్ల
కనిపించి తెలిపిడి - గానేర్పరించి
యాలోచనము చేసి - యంతరిక్షమున
భూలోకమున చాలఁ - బుట్టు నుత్పాత
చయములు వినియును - చాలంగ ముదిమి
పయికొన్న తనదు స్వ - భావంబుచూచి
జనులకు నిటుసేయ - సమ్మతంబనియు
దనమనః ప్రీతియుఁ - దనయెడఁజేయు
రామునిభక్తిగౌ - రవమునుఁ దనకు
తామసింపక సేయుఁ - దలఁపు పుట్టింప 130
సకల భూపతులను - జానపదులను
ప్రకట నానాక్రమా - పారమానులను
రప్పించి కేకయ - రాజును జనకు
నప్పుడు తాఁ బిల్వ - నంపక తమరె
వినియెదరని యెంచి - విబుధేంద్రుమాడ్కి
ననఘు మాణిక్య సిం - హాసనాగ్రమున
వసియించి కొలువులో - వారినింజూచి
యసను వాక్పతురుఁడై - యప్పుడిట్లనియె.

—: దశరథుఁడు ప్రజలతో రామాభిషేక
విషయము ముచ్చటించుట :—

"మా రఘువంశజు - మానాథులెల్ల
ధారుణి జనులను - తనయుల యట్ల 140
యరసి రక్షించుట - లందఱు మీరు
నెఱిఁగి యుండురే కదా - యీరాజ్యమునకు
సంతోషమగు నట్టి - జాడ యేనొకటి
చింతించుటనుఁ జేసి - చెప్పెద మీకు
మా పెద్దలనుఁ బోలి - మహికెల్ల మేలు
ప్రాపింప నేకాత - పత్రంబుఁగాఁగ
నేఁటి పర్యంతంబు - నిశ్శంక భుజబ
లాటోపమున నేలి - యభినుతుల్ గంటి
నరువది వేలేఁడు - లయ్యెను మేని
ముదువెల్లఁ బొలివోయె - ముదిసిన కతన 150
నూరట వలచెద - నుల్లంబు లోన
మా రామచంద్రు బ్రా - హ్మణ ముఖ్యజనుల
సమ్మతి నిఖిలరా - జ్యమునకుఁబట్ట
మిమ్మెయిం గట్టి నే - నీక్షించువాఁడ
నను మీఱినట్టి యు - న్నత గుణారాము
మనువంశనిధిఁ జంద్ర - మండలవదను
సకలలోకము లేలఁ - జాలెడువాని
సకళకళాపూర్ణ - చంద్రుఁడౌ రాము
యువరాజుఁ జేసెద - నొప్పిదం బనుచు
నవనీ జనులు మీరు - నాడితిరేని 160

యేకసమ్మత మిది - యెట్లకో యనుచు
లోకసమ్మతికి నా - లోకించి నాఁడ
అందఱు నిది నిశ్చ - యంబని మీకు
నందమైనట్టు లూ - హ యొనర్చి యొక్క
మాటగాఁ గలిగిన - మాట డెందములు
మాటక యనుఁడ "న్న - మనుజేంద్రుమాట
జనులందఱు విని - జలధరంధ్వనికి
వనమయూరములు చె - ల్వముఁగాంచురీతి
రాజులు మానులు - బ్రాహ్మణుల్ ప్రజలు
రాజ తేజుని దశ - రథు నిట్టులనిరి. 170
" అనఘ ! మీరలు వృద్ధు - లగుట రాజ్యమునఁ
దను నిల్పునపుడు ము - క్తాచ్ఛత్ర మొప్ప
బట్టపు టేనుంగు - పై రామచంద్రుఁ
డిట్టె యీపురవీధి - నేతేర మేము
నెన్నడు విందు మో - యెప్పుడు మాకుఁ
గన్నులు చల్లఁగాఁ - గందు మో యనుచు
నెదురులు చూడంగ - నిప్పుడు మీరు
హృదయంబు మీరాన - తిచ్చుటం జేసి
యెంత సంతోషమ - య్యెను మహీనాథ !
అంతపుణ్యము సేతు - మా" యంచుఁ బలుక 180
జనుల కోరిక యను - సమ్మతం బాత్మఁ
గనియుఁ దానెఱుఁగని - గతి నిట్టులనియె.
" మీమనోవృత్తముల్ - మెల్లనె తెలియఁ
గామించి యేనాడి - గ్రక్కున మీరు
నాడిన మాటకు - నంతరంగమునఁ

జూడ సందియమును - సోద్యంబునయ్యె
ధర్మమార్గంబున - ధర యేలలేదొ ?
కూర్మిచే మిమ్ముఁ జే - కొని ప్రోవలేదొ ?
కంటిరో యొకకళం - కంబు నాయందు
కంటగింపుచు నన్నుఁ - గాదని రాము 190
రాజుఁగా మీరు గో - రఁగనేల" యనిన
రాజుతో హస్తసా - రసములు మొగిచి
సందేహము భయంబు - సందడింపంగ
నందఱు నేకవా - క్యముగ నిట్లనిరి.
"అనఘ ! యనంత క - ల్యాణగుణంబు
లనుఁ బరిపూర్ణుఁ డె - ల్లరకు సౌమ్యుండు
దుర్జతా శౌర్యుఁ డిం - ద్రునిఁబోలుకీర్తి
యార్జించు మేటి స - త్యపరాక్రముండు
సుమతి యిక్ష్వాకు రా - జులలోన మేటి
శమదమాప ద్ధర్మ - జనకాపఘనుఁడు 200
హరి సంగీత వి - ద్యాచతురుండు
పోరిలోన జయంబుఁ - బొందెడువాఁడు
మముఁగాంచు నపుడు సే - మములు వేఁడుచును
తమ ఖేదమోదముల్ - తననైనవాఁడు
నెళుపైన తన యురో - వీథియుఁ గెంపు
సలల క న్దామురల్ - చేతుల పొడువు
మ త్తేభగమనంబు - మధుర వాక్యములు
చిత్తజాకారంబుఁ - జిఱునవ్వు మొగము
సుభ్రూవిలాసంబు - సుమహితాపాంగ
విభ్రమంబులుఁ గురు - వింద దంతములు 210

చామన నెమ్మేను - చక్కని చరణ
తామరసంబులుఁ - దళుకు చెక్కులును
క్రొన్నెల నుదురును - కోటేరువెట్టు
చెన్నుమీరిన ముక్కు - చెంగావిమోవి
నలరాఘవుఁడు త్రిలో - కంబులు నేలఁ
గలవాఁడు కోపించి - కాలుని నైన
దండించు వాఁడు నీ - తాత్రాణ విభుఁడు
చండభానునకుఁ గ - శ్యపునకు నెపుడు
సరియైన శ్రీరామ - చంద్రుఁ డారోగ్య
పరిణామ సామ్రాజ్య - పదవుల నొంది 220
అతులితాయుష్మంతుఁ - డై యుండవలయు
సతతంబునని మేము - సకలదైవములఁ
గొలుచువారము గాన - కోరికమీఱుఁ
దెలుపుటల్ తప్పుగాఁ - దిలకింపవలదు
ఉత్తమోత్తము రాము - నొందు గార్యములు
చిత్తగించక మమ్ముఁ - జేపట్టియిపుడె
పట్టంబుగట్టు మే - పట్టున నీదు
పట్టిరాజ్యము సేయు - భాగ్యంబు గనుము "
అనువారి వచనంబు - లాత్మ భావించి
మనువంశ తిలకంబు - మఱియు నిట్లనియె. 230

## —: పట్టాభిషేకమునకు వలయు వస్తువుల గూర్చుట :—

" మారాము నుర్వీ స - మస్తంబునేల
మీారు గోరుట చాల - మెచ్చొదవించె
అటుల సేయుదు నని - యాచార్యముఖులఁ

జటివర్యులనుఁ జూచి - సంప్రీతిఁబల్కె
అగణితంబుగ వసం - తాగమం బగుట
చిగురించి పూచి కా - చి ఫలించె వనులు
పట్టాభిషేక సం - భ్రమమున కిట్టి
పట్టున వలయు న - పార వస్తువులు
రప్పింపుఁడన దశ - రథుని యానతిని
యిప్పుడె వారలు - నధికారజనులఁ 240
జూచి కావలయు వ - స్తువులు వేర్వేర
సూచింప హేమరా - సులు రత్నములును
రజత కాంస్యాది పా - త్రము లోషధులును
ధ్వజరమ్యమైన ర - థం బాయుధములు
నేయి లాజలును తే - నియలు గంధంబు
నాయత వస్త్రమా - ల్యములు క్షౌద్రములు
పాండురచ్ఛత్రంబు - పట్టమేనుఁగయు
నండవాయని చతు - రంగబలంబు
మణి మయ హేమ - చామరములుఁ జతుర
గణికాజనమును బం - గారుకలశములు 250
నూరును సాంగమా - నూతనవ్యాఘ్ర
చాయచర్మమును కాం - చన శృంగమైన
యొకవృషభము శృం - గ మొకటి కావలయు
సకల నానాద్రవ్య - సామగ్రిఁగూర్చి
యగ్నిహోత్ర గృహంబు - నందు చెంగటను
లగ్నంబు చేపని - లక్ష్మీకరముగ
నంగళ్లు వీధులు - నఖిల గేహములు
మంగళాలంకార - మహిమఁగై సేయఁ

గ్రముకేత్తుకదలీ ప్ర - కాండ శోభితము
రమణీయ నవరత్న - రంగవల్లికము 260
మకర తోరణ భాస - మాన మార్గంబు
చకచకాయిత సౌధ - చయదర్పణంబు
ప్రాలంబ మానవై - వణ చామరంబు
నాలోల పట్టాంశు - కాభి శోభితము
కనకాంబర వితాన - కాయమానంబు
ఘనసార కౌశికా - గరు ధూతచయము
వీణామృదంగాది - వివిధవాద్యంబు
గాణిక్య నూపుర - క్వణన కాంతంబు
మల్లికా చాంపేయ - మానకాస్వతము
పల్లవతోరణ - భద్రసూచనము 270
నగుచు నయోధ్యా మ - హాపట్టణంబు
పొగడొంద శృంగార - ముల విరాజిల్లు
పాలచేతనుఁ దేలి - బ్రాహ్మణకోటి
చాలభోజనముల - సంతుష్టినొంద
తన్నీరు తిత్తుల - తావి పన్నీరు
తిన్నని వీథులఁ - దెరలుగాఁజల్ల
హోమశాంత్యాదుల - నుర్వీసురాలి
కామించి శోభన - కర్మముల్ నడప
నట న_ర్తకములు ప - ణ్యా సరోజముఖులు
విటులు హజారంబు - వెలపలనిండ 280
నంతరంబుల రాజు - లా_ప్తబాంధవులు
సంతుష్ట చి_త్తమై - సబవులు నమర
గంధకారులు మాల్య - కారులు భటులు

బంధురగతి ప్రోలం - బాయక యుండ
అన్ని యత్నంబులు - నాయుత్తమగుట
విన్నవించిన మహా - విభుఁడు హర్షించి
రమ్ము సుమంత్ర! శ్రీ - రాముని దోడి
తెమ్ము నా వినయ వి - ధేయుఁడై యతఁడు
శ్రీరామచంద్ర! పి - ల్చెను మహీవిభుఁడు
రారమ్ము నెందుతీ - రదు తామసింప 290
నని తోడితేర నా - నామరశ్రేణి
తనుఁగొల్వ నున్న సు - త్రామునిరీతి
రాజులతో దశర - థుఁడు గొల్వుండి
రాజమార్గంబున - రా రామచంద్రు
తనమేడపైనుండి - దశరథ విభుఁడు
కని యరదంబుపై - గంధర్వరాజ
సముని లోకప్రశ - స్త మహా ప్రతాపుఁ
బ్రమదాత్మ నాజాను - బాహు మత్తేభ
సన్నిభ గమనుని - సత్యసంపన్నుఁ
గన్నులవిందయి - కనుపట్టువానిఁ 300
జంద్రబింబానను - జనమనఃకుముద
చంద్రుని జలధర - శ్యామ శరీరు
సర్వరక్షణ గుణో - జ్జ్వలుని సత్కీర్తి
సర్వోన్నతుని రామ - చంద్రునింజూచి
బీరెండ నలఁగి దూ - పిలిన మానవుఁడు
వారిదంబునుఁ జూచి - వడదీరినట్లు
తనియక కాంచు న - త్తరి సుమంత్రుండు
కనకరథం బలం - కారంబుసేయు

రాముని డించి క - రంబూఁతయొసంగి
భూమీశు సమ్ముఖం - బునకుఁ దో తేరఁ 310
దనపాదములవ్రాలు - తనయుపై ప్రేమ
ననలొత్త నాలింగ - నంబుఁగావించి
చెంగట మణిమయ - సింహాసనమున
సంగడి నునుపఁ గాం - చన శైలకూట
తపనుఁడో యన రఘూ - త్తముఁడుపొల్పెసఁగె
నపుడు నక్షత్ర గ్ర - హావళి చేత
శరదవసరమున - చదలు పైఁదోఁచు
పరిపూర్ణ చంద్రబిం - బంబు చందమునఁ
గొలువులో తనుఁబోలు - కొమరుఁ బ్రాయంపుఁ
దొలుచూలి తోడ నిం - ద్రునకుఁ గశ్యపుఁడు 320
పలికిన గతిఁ దత్స - భాసదుల్ వినఁగ
తలఁచిన చందంబు - దశరథుం డనియె.
"మొదటి పట్టపు దేవి - ముదిత కౌసల్య
కొదదీఱఁ గాంచిన - కొమరుండవీవు
తగినట్టివాఁడవు - ధారుణీ జనులు
మిగులనీ సేమంబు - మేకొన్నవారు
కట్టెదఁ బుష్య న - క్షత్రంబు నందు
పట్టంబు తేపు నా - పలు కాదరింపు
యౌవ్వరాజ్య మునకు - నభిషిక్తుఁ జేయు
నవ్వేళ నిది వ్యవ - హారంబు గాన 330
వినయాది గుణముల - వెలసిన నీకు
పనిలేదు బుద్ధి దె - ల్పఁగ నైన వినుము
వినయంబు నింద్రియ - విజయంబు కామ

—: దశరథుఁడు రాముని నభిషేకమునకుఁ
బ్రోత్సాహపఱచుట :—

మును క్రోధమును లోభ - మును మోహమును
మదము మాత్సర్యంబు - మానుట నృపుల
వదలని వ్యసనముల్ - వదలుట మంత్రి
ముఖ్యులం బ్రత్యక్ష - మునఁ గడలందు
సఖ్యంబు పాటించి - చనవు లిచ్చుటయు
కడజముల్ రాష్ట్ర దు - ర్గములు బొక్కసము
కడుఁ బరామరిసించి - కనుకట్టుటయునుఁ 340
బ్రజలఁ బాలించుట - పలికిన మాట
నిజముసేయుట పౌర - నికరంబు కలిమి
కని యోర్చుటయు మొదల్ - గాఁగలగుణము
ననయంబుగల రాజు - నందు రందఱును
నమృతంబు చూచిన - యమరులమాడ్కి
సమచిత్తులై మేలు - సమకూర్పఁగలరు
కావున నాబుద్ధిఁ - గైకొని యేలు
మీ వసుమతి యెల్ల - నీ వని" పలుకు
నృపుమాట రాముని - నెచ్చెలుల్ పోయి
యపుడు కౌసల్యతో - ననిన నుప్పొంగి 350
యమ్మహాగుణవతి - యావులు మణులు
సొమ్ములు గనకరా - సులు నుడుగరలు
వారల కొసఁగుచో - వసుధేశుఁ డనుప
నారాఘవుఁడు తన - యావాసమునకు
దొరలు నాప్తులును బం - ధులుఁ జేరికొలువ

నరిది వారల నిండ్ల - కనిచిన యంత
తమ గృహంబుల కేఁగి - దశరథవిభుని
సమయంబు చేకూడి - సఫలమౌ కోఱకు
దేవతాకోటిఁ బ్రా - ర్థింపుచు ప్రమద
భావులై యుండుచో - పార్థివోత్తముఁడు 360
దశరథవిభుఁడు ప్ర - ధానులతోడ
విశదాత్ముఁడగుచు నీ - వృత్తాంతమెల్ల
పలికి తా నగరి లో - పలి కేఁగి యేమి
తలఁచెనో కాని చెం - తకుఁ జేరఁ బిలిచి
"ఓయి సుమంత్ర! నీ - వొకఁడవే యిపుడు
పోయి రాఘవుని గొ - బ్బునఁ దోడితెమ్ము
చను"మన్న నతఁడట్ల - చని రామునగర
చనవరులగు నవ - సరము వారలకుఁ
దనరాక వివరించు - తరి వారు నటుల
చని విన్నపము సేయ - సంశయింపుచును 370
పిలిపించి "యేటికి - బిలిపించె రాజు
తెలుపుమీ"వనిన మం - త్రివరేణ్యుఁ డనియె.
"మీ రెఱుంగుదురు భూ - మీవరుడెఱుఁగు
యూరక నను఼ఁ బిల్చి - యొకఁడవు నేఁగి
రాముని఼ఁ బిలుచుక - రమ్మనెంగాని
యేమి గార్యమునకో - యెఱుఁగ మేమియును
విచ్చేయ వలయును - వేగంబె మీరు
వచ్చినఁ దెలియంగ - వచ్చు నంతయును"
ననినఁ జూతముఁ గాక - యన్నియు ననుచు
తన తండ్రికడ కేఁగి - దవ్వుల నిల్చి 380

బ్రొక్కిన రమ్మని - మొదలింటి రీతి
యక్కునం జేర్చి సిం - హాసనాగ్రమున
వసియింపఁజేసి భా - వము పల్లవింప
వసుధావరుఁడు రఘు - వరున కిట్లనియె.
"శ్రీరామ! యనుభవిం - చితి భోగభాగ్య
గౌరవంబులు వార్ధ - కముఁ బ్రాప్తమయ్యె
సాంగదక్షిణలతో - నన్ని యాగములు
సంగంబు మిగుల ధ - న్యముగాఁ జేసితిని
అభిమతంబైన నీ - వాదియౌ పుత్ర
విభవంబుఁ గాంచి భూ - వినుతు లందితిని 390
నడిగిన వారికి - నడిగిన కోర్కు
లిడి దేవఋషుల కేఁ - దృప్తి చేసితిని
తీర్చి కొంటివి ఋణ - త్రితయంబు ధరణి
నేర్చి యేలితి నెల్ల - నృపుల మీఁరితిని
నిన్నుఁ బట్టము గట్టి - నీవిల యేల
కన్నులు చల్లఁగాఁ - గనునందు గడవ
నేకోరికయు నేల? యిఁక మీఁద నాకు
నీకోర్కె సిద్ధించు - నెల్లింటి లోనఁ
గాని దుస్స్వప్నముల్ - గనవయ్యె భౌమ
భాను రాహు గ్రహ - బలమేలె దనుచు 400
జ్యోతిష్కు లెచ్చరిం - చుచు నున్నవారి
భూతలమ్మున తార - ములు నశనులును
రాలుచు నున్నవి - రాజులకిదియె
పోలనివనవిందు - బుధులచే నెపుడు
జనుల మానసములు - చంచల తరము

లనఘ ! నామదియు - నేనరయఁగఁ జాల
యిప్పటి కిట్లున్న - దిఁక తామసింప
నెప్పటి కిటులౌనొ - యెఱుఁగంగ రాదు
నానెమ్మదికి చల - నము రాక మునుప
పూనుము పట్టంబు - పుష్యంబులోన 410
తామసం బుడిగి సీ - తాసమేతముగ
నేమర నుపవాస - మెల్లి కావింపు
వ్రతనియంబుతో - వర దర్భశయన
రతుఁడవై యుండు మీ - రాత్రి నేమమున
శ్రేయోభివృద్ధులు - చేకూడు నెపుడు
పాయక ప్రాపించు - బహుళ విఘ్నములు
అట్టివి రాకుండ - నరయుదు రెట్టి
పట్టున నినుఁ జేరి - పరిమాప్తజనులు
తోడుతోడుత భర - తుఁడు రాక మునుపె
చూడఁగోరెద నీదు - శోభనం బేను 420
ఆయన మంచివాఁ - డందు పై నెపుడు
నీయందు నతనికి - నెయ్యంబుగలదు
ధీరాత్మకుఁడు జితేం - ద్రియుఁడు ధార్మికుఁడు
కారుణ్యశాలి ని - ష్కపటమానసుఁడు
యెటులైన మనుజుల - హృదయంబు దెలియ
దటుగాన త్రేపె నీ - కభిషేక మేను
కావింతు చనుమన్న - కరములు మొగిచి
యావేళ తనయింటి - కరిగి యవ్వెనక
దేవతలను గ్రహ - దేవతావళిని
భావింపుచును ధాతపరి - ధానయుగుచు 430

తాలిచి మానంబు - తనమేలువార్త
యాలించి ముదమొందు - నట్టి కౌసల్య
యింటికి తా నపు - డేఁగి సుమిత్ర
పంటవలంతి వెం - బట్టి లక్ష్మణుఁడు
యీవార్త విని వచ్చి - యెల్లవేలుపుల
భావంబులఁ దలంచి - ప్రార్థనల్ సేయు
వారలతోఁ గూడి వసి - యించుఁదల్లి
నారాఘవుఁడు చేరి - యలరుచుఁ బలికె.
"అమ్మ! మాతండ్రి రా - జ్యాభిషేకంబు
సమ్మతిఁగావింప - సమకట్టినన్ను 440
నుపవసింపుము సీత - యును నీవుననియె.
అపుడు వసిష్ఠాదు - లైనట్టి మునులు
మనప్రధానులు నిట్టి - మాటాడి నన్ను
పనిచిరి గాన తె - ల్వాంగ వచ్చినాఁడ
శృంగార మొనరింపు - సీతను మాకు
మంగళాకార సం - పద లాచరింపు
తామసింపకు" మని - తనయుండు వల్కు
నా మానవతి పర - మానందమంది
మున్ను తానోచు నో - ములు పండెననుచుఁ
గన్నులబాష్పాంబు - కణములు తొలక 450
"అన్న ! చిరంజీవి - వైరాజ్యమెల్ల
మన్ననఁ బాలింపు - మనుజేశు కరుణఁ
బట్టాభిషేకవై - భవములు వొందు
మెట్టునమ్మిన వారి - నెల్లరక్షింపు

నావగవారల - నడపుము కరుణ
బ్రోవు సుమిత్రకుఁ - బోరానివారి
జనియించితివి ప్రశ - స్తదినంబు నందు
మనసురా మెలఁగితి - మానవేంద్రునకు
సీతతో రాజ్యల - క్ష్మిని నీవువొంద
నాతపంబెల్ల పూ - ర్ణఫలంబుగాంచె'' 460
అనుచో వినీతుఁడై - యుండ నేయుండు
ననుఁగుదమ్ముని సుమి - త్రానందకరునిఁ
దనమేలు కార్యంబు - తనమేలుగాఁగ
మనసు లోనుంచు ల - క్ష్మణుఁజూచి పలికె.
"రావోయి సౌమిత్రి - రాజ్యపాలనము
నీవునేనుంగూడి - నిర్వహింపుదము
సతతంబు నాప్రాణ - సదృశుండవగుట
నతుల మహాలక్ష్మ - లందుము నీవు
నారాజ్యభారంబు - నాశరీరంబు
ధీరశేఖర ! నీయ - ధీనంబు సుమ్ము" 470
అనుచు తల్లులకు ప్రి - యంబులో మ్రొక్క
తనవెంట సీతయు - తమ్ముఁడురాఁగ
నిజగేహమునకేఁగి - నెమ్మి లక్ష్మణుని
సుజని సన్మాన్యునిఁ - జూచి పొమ్మనుచు
గృహమున కనిచి నాఁ - డెల్ల సంతోష
సహితుండై యున్నచో - మనుజేశుఁడచట
రామాభిషేక సం - భ్రమ చిత్తుఁడగుచు
ప్రేమ వసిష్ఠునిఁ - బిలిపించి పలికె.

—: వసిష్ఠుఁడు రామునుపవాసముండుమని చెప్పుట :—

"మీరలు పరమ ధా - ర్మికుఁడైన యట్టి
శ్రీరాముకీర్తి ల - క్ష్మీ వసుంధరలు 480
వరియించుటకు ను - పచారంబు జనక
ధరణీశ చంద్రుని - తనయతోఁగూడ
నుంచి రండనుచు ని - యోగింప నతఁడు
కాంచనరథము పై - కదలి రాఘవుని
నగరిలో సావళ్లు - నాలుగు గడచి
తగినవారలు బోయి - తనరాకఁ దెలుప
వేగంబులో రఘు - వీరుఁడువచ్చి
సాగిలి మ్రొక్కి-నం - జాలదీవించి
యరదంబు డిగ్గి రా - మాన్వితుఁడగుచు
పరమసంయమి - పైఁడి పావలుదొడిగి 490
కొలువుకూటము - చేరి గురురత్నపీఠ
తలమున వసియించి - తానిట్టులనియె.
"మీతండ్రి నీయందు - మిక్కిలికరుణ
చేత సామ్రాజ్యాభి - షిక్తునింజేయఁ
దలఁచినవాఁడు నీ - తాసమేతముగ
వలయును నీ వుప - వాసముండుటకు
నల నహుషుండు య - యాతినింబోలె
యిలకుఁ బట్టముగట్ట - నెంచె నిన్నతఁడు"
అని సమంత్రకముగా - నట్లుంచి యతని
యనుమతిఁ గదలి మ - హారథంబెక్కి- 500

వచ్చుచోఁ బురినెల్ల - వారువీథులను
పచ్చలతోరణ - పఙ్క్తులుగట్టి
చెఱకుఁగోలలు పోఁక - చెట్లును పండ్ల
యరఁటి క్రమాకులుఁను న్వా - రావళింగట్టి
మేరువు ల్కు రుజులు - మిన్నంటు పువ్వ
దేరులు మేల్కట్టుఁ - దెరలు నమర్చి
కెలంకులఁ గలయంటె - క్కెంబు లెత్తించి
కలయంపి చల్లి శృం - గారించు జనుల
కోలాహలంబుచే - ఘోషించు జలధి
పోలికె రాఘవా - భ్యుదయంబు కొఱకు 510
రచితోత్సవంబైన - రాజమార్గమున
సుచిత్రుఁడగు వసి - ష్ఠుఁడు వచ్చి వచ్చి
రాజగేహము చేరి - రథ మొయ్య డిగ్గి
రాజున్న యంతఃపు - రము ప్రవేశింప
వరవిహంగముల - వారిజాతములఁ
గరమొప్పు చున్నట్టి - కాసార మనఁగ
జలజాననా సహ - స్రములచే మిగుల
పొలుపొంద నయ్యంతి - పురములోనున్న
నృపుఁజేరి గురునకు - నింద్రుఁడు వోలె
నపుడు ప్రత్యుత్థాన - మాచరింపంగ 520
నతఁడు దాను సమున్న - తాసనంబులను
జతగాఁగ వసియించు - జననాథుఁజూచి
"ఉర్వీశ ! రాముని - యున్నెడ కేఁగి
యుర్వీతనూజతో - నుపవసింపంగ
నియమించి వచ్చితి - నిందు పట్టణము

జయమంగళములతో - సవరణమయ్యె
అంతియ కాదు నేఁ - డాబాలవృద్ధ
మెంతయుఁ భూజనం - బిచ్చలో నలరి
యెప్పు డస్తాద్రి కి - నినుఁడేఁగు మాకు
నెప్పుడు దెలవాఱు - నెప్పుడు రాము 530
పట్టాభిషేక మై - భవము చూడంగఁ
బట్టొద''మని యున్కి - పరికింపఁ దగియె.
అనుమాటలకుఁ జాల - నలరి యమాత్యుని
ననిచి సింహంబు గు - హా ప్రవేశంబు
సేయు కై వడి నృప - సింహుండు మణిమ
యాయతమ్మగు శయ - నాగారమపుడు
చుక్కల జవరాండ్రు - చుట్టునుం గొలువ
చక్కని సంపూర్ణ - చంద్రుండు జేరు
సరణిమైఁ జేరి య - చ్చట సుఖస్థితులఁ
బరమానురాగమై - భవములనుండె. 540

—: రామ పట్టాభిషేక ప్రయత్నము :—

సీతాసమేతుఁడై - శ్రీరామచంద్రుఁ
డాతరిసుస్నాతుం - డై హవిరన్న
భాజనంబొందల - పైధరియించి
రాజీవనయను నా - రాధించి యతఁడు
మది నలరంగ హో - మము చేసి కుశల
విదితమైనట్టి హ - విశ్శేష మెలమి
సేవించి రాముఁడా - సీతయు దాను
పావనంబువు దర్భ - పర్యంకసీమ

శౌరి సన్నిధియందు - శయనించి తెల్ల
వారు జామున నిద్ర - వదలి సమస్త 550
వందిమాగధ గీత - వాద్యముల్ వినుచు
వందితాలంకార - నైపుణి మెఱయ
నగరులోఁ దాను స్నా - నముచేసి మౌన
ముగ నుండి జపకర్మ - ములు నిర్వహించి
హరిఁబూజచేసి బ్రా - హ్మణులు పుణ్యాహ
పఠణతుల్ గావింప - భటులు సేవింప
మురవ భేరీశంఖ - ముఖ్య వాద్యములఁ
బురమెల్ల దిమ్మని - బోరుకలంగ
జనములు తమతమ - సదనంబులందు
ననుపమ సంతోష - మనుభవింపఁగను 560
మహనీయ తరకాయ - మానవితాన
బహుతర స్తంభరం - భాస్తంభనారి
కేళజక్రముక సం - కీర్ణేక్షుకాండ
పాళికాధ్వజ పటీ - పల్లవమకర
తోరణ కర్పూర - ధూమదిగ్గగన
నీరంధ్ర బహుచిత్ర - నిర్మితపట్ట
పటసముత్కర పరి - ప్రాప్తాంధకార
పటలాప కరణ దీ - పసహస్రమగుచు
రాజమార్గ మెసంగ - రాముండు మహికి
రాజయ్యె మన మెల్ల - బ్రదికితి మింక 570
మంచుచే మణుఁగు తా - మరవోలి మేన
మించిన ముదిమిచే - మేదినీ విభుఁడు
తాళలేకిక బొంద - తలకెల్లయనుచు

మేలెంచి తనయుని - మీఁదటనుంచె
నెంతటి ధార్మికుం - డెంత పుణ్యాత్ముఁ
డెంతటి యుచితజ్ఞుఁ - డెంతధన్యుండు
తలఁచినాఁ డీమంచి - తలఁ పవ్విభుండు
కలకాలమును మనఁ - గావలెనింక
కన్నులు మనకెల్ల - గలిగిన ఫలము
లిన్నిసంతోషంబు - లీక్షింపఁ గలిగె 580
జానకీపతి సర్వ - సముఁడు భూజనుల
సూనులఁగా నెంచి - చూచి రక్షించు"
అని ముదితార్ణవ - మట్లు ఘోషించు
జనపరంపరల వా - చా విశేషములు
కేకయరాజు కై - కేయికిం బ్రియము
చేకూర్చ నిచ్చిన - శ్రీ ధనంబైన

—: కైకకు మంధర దుర్బోధనము సేయుట :—

మందరవిని పైఁడి - మచ్చుపై నెక్కి
సుందరాలంకార - శోభితంబయిన
సాకేత నగరంబు - చందంబు చూచి
లోకీఁడు దా బయ - లు పడంగనీక 590
దుహితుని రామచం - ద్రుని దాదిఁ గాంచి
స్నేహంబు నటియించి - చిఱునవ్వుతోడ
"అక్కక్క కౌసల్య - యవ్వారిగాఁగ
యెక్కుడుగా సొమ్ము - లెల్లవారలకు
నిచ్చుచున్నది - యేమి గారణము ?

పచ్చతోరణములఁ - బట్టణంబెల్ల
నిండెనేమిటికి ? దీ - నికి హేతువెఱిఁగి
యుండిన నెఱిఁగింపు - మొకమాట" యనిన
మొకమాట చేత రా - మునిదాదిచాలఁ
బెకలియై సంతోష - వివశత్వయగుచు 600
తేపెపట్టంబు మా - శ్రీరామచంద్రుఁ
డీప్రొద్దు కుపవాస - మెల్లజనంబు
నెఱిఁగిన యర్థ మిా - వెఱుఁగవె? నీకు
నెఱిఁగింప కున్న దే - యేలికసాని
మందరచూడుమా ! - మనపట్టణంబు
బృందారక పురంబు - పెన్నుద్దియయ్యె
రామాభిషేక సం - భ్రమముచేవస్తు
సామగ్రి యొసంగెఁ గా - సల్య యందఱికి"
అనిన నోర్వఁగలేక - యామేడడిగ్గి
కనలుచు మందర - కన్నీరురాలఁ 610
బానుపు మీఁదటఁ - బవళించియున్న
మానినిం గేకయ - మనుజేశుపుత్రి
కైకేయి కడ కేఁగి - గద్గదకంఠ
కాకుస్వరంబుతోఁ - గదిసియిట్లనియె.
"పట్టెమంచంబును - పఱపు నామీఁద
పట్టుతలాడయు - పడకయుంగాని
యేమియు మనసులో - నెఱుఁగవు నీవు
తామసించిన నుప - ద్రవము నొందుదువు
యీాకీడు నీపాలి - కేదైవమింక
రాకుండఁజేయునో - రావమ్మ ! లేచి 620

దయవాఁడు నామీఁద - దశరథనృపతి
ప్రియలలో ననినీవు - పెద్దఱికములు
గరివించి పలుకఁగ - కాఁబోలు ననుచు
గురిచేసి నీమాట - కొనలకెక్కుడుము
పోళినదీ ప్రవా - హమునకు గ్రీష్మ
కాలంబుపోలి చ - క్కని నీదు మేని
చెలువంబునకు హాని - చేకూఁడె నీదు
తలఁపును దైవయ - త్నమును వేఱయ్యె
చెప్పితి గతజల - సేతుబంధనము
చొప్పుగా కిఁకనిట్లు - చూచినంగలదె ? 630
మించెఁగార్యంబు న - మ్మిన వారి పుణ్య
మెంచుట గాక నీ - కెట్లున్న నేమి ?
అని కురుమాపుఁడై - నట్టి చెఱంగు
తనమోముచేర్చు మం - దర వేగిరింప
నెలనవ్వు మోములో - నేల నీవింత ?
కలఁగెద వనుచు నా - కై కేయిపలికె.
కన్నుగొనల జల - కణములు రాల
విన్నఁచాలు గన వగ - వెక్కుడెచ్చెదవు
ఏమిగొఱంత యే - నేమంటి నిన్ను ?
నేమయ్యె నీకిట్టు - లేల పల్కెదవు ? 640
చాలదో నీకిత - సౌఖ్యంబు మందె
మేలంబుచే నేల - మించనాడెదవు ?
పోపోసి" యనిన నా - పూఁబోణిఁ జూచి
ఏవపుట్టంగనది - యిట్లని పల్కె.
"నాకునై యింత వి - న్న దనంబుగలదె

నీకునై వగచెద - నిదువాలుఁగంటి!
యనరాని యట్టి భ - యంబు నీకిపుడు
జనియించె మదిలో వి - చారింపనైతి
రాజురాజ్యమునకు - రామునిం దెచ్చి
రాజుఁజేయఁగ విచా - రము చేసినాఁడు 650
ఆమాట విని యయో - ధ్యాపట్టణంబు
చే మెఱయంగ గై - సేయుటంజూచి
దిగులు చేనేమియుం - దెలియక మేను
సగముగాఁగరఁగి వి - చారంబు చేత
నీకుహితంబుగా - నేఁగన్నయర్థ
మోకీరసల్లాప! - యుచ్చరించితిని
నీమేలుగీళ్లకు - నేలోను గాన
నీమాట మునుకల్ల - నెఱింగింపవలసె
రాజుల మర్మమె - ఱుఁగ శక్యంబె?
రాజీవముఖి! నమ్మ - రాదు వారలను 660
మదిలోనఁ గపటంబు - మాటి మాటలను
చదరులం బ్రియములం - జాలఁబన్నుదురు
మంచిమాఁటల నీకు - మనవిచ్చి నటుల
వంచించి యిరు - జెవి వాఁకొనకుండ
ఆకడ కౌసల్య - కఖిలభాగ్యములు
నేకాంతమునఁబిల్చి - యిచ్చుచున్నాఁడు
మంచితనంబున - మాహ వెన్వెంట
నంచెదనని యుపా - యంబు చింతించి
భరతునిం బొమ్మని - పనిచె మున్నుగను
ధరణీశులకుఁగల - దా? సమత్వంబు 670

రాముఁడ కంటక - రాజ్యంబుసేయఁ
గామించి పట్టంబు - గట్టుచున్నాఁడు
మగఁడని యెంచి న - మ్మఁగరాని యట్టి
పగవానితోఁ గూడి - పాయకున్నావు
పాముతోఁ జెలిమి ద - బ్బర వచ్చె నింక
యేమిసేయుదమమ్మ ? - యిగురాకుఁబోణి !
ఎఱిఁగియుండియు నీవు - పేక్షించితేని
భరతుండు నీవునా - పదలఁ గొందుదురు
నిన్నును నన్నును - నీకుమారకుని
కన్నడసేయక - కాచిరక్షింప 680
మదిలోన నెయ్యది - మార్గమో చూచి
అదినడపించు కొ - మ్మ''ని పల్కుటయును.
సాంద్రవిలాసయా - శారదసమయ
చంద్రరేఖయుఁబోలు - సకియ కైకేయి
దిగ్గున లేచి ధా - త్రేయిఁగౌఁగింట
బిగ్గఁజేర్చి మేనఁ - బెట్టిన యట్టి
సొమ్మెల్లనొసఁగి మె - చ్చులచేత "దేవి
కొమ్మ నావీనుల - కును చల్లనయ్యె
శ్రీరామపట్టాభి - షేకవృత్తాంత
మీరీతి నాకు నీ - వెఱిఁగించు కతన 690
నింతకు మిక్కిలి - యేది సంతోష
మంతియు చాలు క - ల్పాంతంబుఁగాఁగ
రామచంద్రుండె చి - రంజీవి యగుచు
యీమహీసకలంబు - నేలఁగావలయు
ప్రాణనాథుఁడు దశ - రథుఁడు నాకెంత

నాణెంబుగూర్చి యా - నందంబు చేసె
భరతుండు శ్రీరామ - భద్రుండు నాకు
సరియందులో రామ - చంద్రుఁడుత్తముఁడు
కౌసల్యఁగడవ రా - ఘవుఁడు నాయందు
జేసు మిక్కిలి ప్రీతి - చెప్పెడిదేమి ? 700
యీపాటి సంతోష - మెందును లేదు
నాపాలికీ మాట - నాకుఁదెల్పితివి ?
యేమిగోరిన విత్తు - నెయ్యిదివరము ;
కామింపుమని " పల్కు - గైకేయి మాట
విని రాముపైఁగల - వెనకటి కినుకఁ
గనిపింప మందర - క్రమ్మరంబలికె.
" పడఁతి ! నీయవివేక - పారవశ్యమున
కడలేని దుఃఖ సా - గరములో మునిఁగి
గట్టిమనంబు తో - గన్నడ గుట్టు
వట్టుక కార్యం - బు పెరిగినవెనుక 710
సేయుఁ గార్యంబు నీ - సేతనుంగాక
యీవెడగతి గూడి - యీసొమ్ములెల్ల
పాఱంగవైచు నె - పంబు చేనాకు
భారంబుగాఁదీసి - బాముసుంజండి
పైవేయు కైవడి - పైబడవైవ
నీవిచ్చుటాయనో - నేను నీచేత
దీసుకొంటిని యని - తిరుంగంగ వైచి
నీసేతఁజూచిన - నిడువాలుఁగంటి !
వచ్చుచున్నది నవ్వు - వైరి (దా)యాది
చిచ్చునుంబెరుగుచోఁ - జింతింపవలదె ? 720

కడునీకుఁబగవాఁడు - కౌసల్యగన్న
కొడుకెందు సవతుల - కొడుకులకైన
సంపదల్ చూచిన - సంతోషమొందు
చంపకగంధులు - జగతిపైఁగలరె?
భరతుండు రాజ్యంబు - పాలించె నేని
పరికింప రాముఁడా - పద నెల్లనొందు
రామచంద్రుండు ధ - రావరుఁడైన
నేమిగాఁగలవాఁడొ - యికభరతుండు!
అనువిచారంబుచే - నంటి నీ మాట
మనభరతుండు తన - మర్యాదగాన 730
తగినవాఁడగుటనెం - తయు మున్నెఱింగి
సుగుణియై సమయంబు - చూచుక నీతి
మర్యాద చూచి రా - మవిభుండు తనదు
కార్యంబు కొఱకేమి - గావింపఁగలఁడొ
భరతుని ననుచు నీ - పట్టికై చాల
మఱఁగుచున్నది నాదు - మది మదిరాక్షి
కొడుకు రాజ్యము సేయ - కోరికఁజూచు
పడఁతియా కౌసల్య - భాగ్యమెన్నుదునొ?
ఆసవతికి రాసి - వైయుండునీదు
వాసిపోవుటకునై - వగలనొందుదునా? 740
తొత్తుకిందటబడి - తొత్తులమైతి
మిత్తరి నని మమ్ము - నేవగింపుదుమొ?
నీకొడుకా రాము - నికి నూడిగములు
చేకొని సేయుటల్ - చింతసేయుదుమొ?
సీత చెప్పిన పనుల్ - చేసి నీకోడ

లేతరిం బడుపాటు - నెన్నఁజాలుదుమొ?
యెందుకై వగచెద - నేనుందు " ననిన
మందరతోఁగ్గైక - మఱియు నిట్లనియె.
"రాముఁడు సకలధ - ర్మజ్ఞుఁ డుత్తముఁడు
శ్రీమహితుఁడు గురు - శిక్షితాత్మకుఁడు 750
దయగలవాఁడు కృ - తజ్ఞుండు సత్య
నయవిశారదుఁడు దీ - నజనావనుండు
పరిశుద్ధుఁ డఖిలశో - భనగుణాన్వితుఁడు
ధరణీశునకు నగ్ర - తనయుఁ డార్యుండు
యా పుణ్యనిధి యె ప - ట్టార్హుండు గాక
ఏ పట్టునఁ దలంపు - నితరుండు దగునె?
తమ్ములం బ్రజలను - తండ్రి కైవడిని
సమ్మతిఁబాలించు - సకలసమ్మతుఁడు
యీమహోత్సవము నా - కిటు చూడఁగల్గె
నేమిఁటి కోర్వలే - కిటులాడనీకు 760
రాముఁడున్నన్నాళ్లు - రాజ్యంబు సేయ
నామీఁద భరతుఁడు - నవని బాలించు
రాముండు భరతుండు - రమణి యొక్కటియె
నామది కిటులాడ - నాయంబు గాదు
భరతునికై నట్టి - పట్టంబె సుమ్ము!
ధర యేలెనేని సీ - తాప్రాణవిభుఁడు
భ్రాతృవత్సలుఁడు చె - ప్పఁగ రాకుమిట్ట
ధాతువాదములకుఁ - దాళితి నిపుడు
తగు నాజ్ఞ సేయుంపఁ - దగునిన్ను నితఁడు
తెగరాము చేకాచి - తినిపొమ్మనంగ 770

ఆ నంగనాచి యు - ష్ఠాని వెచ్చనూర్చి
మానంగ లేక క్ర - మ్మఱనిట్టులనియె.
"అమ్మ! ధీరోదాత్త - వగుటచే నీవు
నెమ్మదిఁ దాఁచిన - నెమ్మదిఁ గలదె?
పొదలెడు చింతలోఁ - బొరలఁగఁ దలఁచి
యిది యకార్యముకార్య - మిదియన లేవు
రాముని తరవాత - రాజ్యమేలంగ
రాముని సుతుల క - ర్హంబగుగాక
భరతుఁడెవ్వఁడు? నీదు - పట్టి గాఁబట్టి
దరి లేని యట్టి చిం - తల నందవలసె 780
యీరాజ్య మిరువురు - నేలుదురనినఁ
బ్రారంభమదియ య - నర్థంబులకును
ఆది గాక జ్యేష్ఠుని - నభిషిక్తుఁ జేయ
మది నెన్నుదురు నీతి - మార్గకోవిదులు
నెన్నడు భరతుని - కిడుములం బడఁగ
నిన్నుఁ జూపెఁ దదీయ - నిటలాక్షరములు
యవనికిఁ గర్తయ్యె - యనద గానలసె
నవివేకకు జనించు - నట్టి దోషమున
హితమః తెల్పితి - నెఱుఁగక సీదు
కృతకర్మఫలము చేఁ - గీడొందవలసె 790
సవతి మేలున కింత - సహియించివచ్చు
నవమానములకు లో - నైన మాకేమి
నీమెచ్చులునుఁ జాలు - నీవాజ్ఞ సేయ
కీమేరఁ దాఁటుట - లేలాభమయ్యె?
రాముఁ డకంటక - రాజ్యంబు సేయు

శ్రీమాన్యుఁడై యేను - చెప్పిన బుద్ధి
భరతుండు కానల - పాలైనఁ గాని
తెలుఁగైన వెనకఁ జిం - తింపు మింతయును
కడనున్న సుతులనుఁ - గడవ చెంగటను
కడవాఁడు రేవ - గల్గాఁ గాచియున్న 800
చనవరి యగు వాఁడు - జనపాలకులకు
మునుపుగా నీవె రా - ముని యదృష్టమున
మన కర్మమున మేన - మామ యింటికినిఁ
బనిచి తీవెఱుఁగక - భరతునిఁ బిలిచి
ములుతీగె ఫలవృక్ష - మునుఁ గూడినట్ల
యలరి రన్యోన్య స - మాశ్రయంబులను
రామలక్ష్మణులు వో - రంతులువారి
కేమరలనుఁ బొంద - వెలమి చెల్మలను
అశ్వినీ దేవత - లనఁగ వీరెపుడు
శాశ్వతులగుదురు - సౌమిత్రి కెందు 810
కొదవ రానీఁడు ర - ఘుప్రవరుండు
మదినెన్న భరతుని - మననీఁడు గాక
నీకుమారునిఁ గూడి - నిజము శత్రుఘ్నుఁ
డేకీడు నొందునో - యెఱుఁగంగరాదు
సందియంబేల ? యి - చ్చటికి రానీక
యందున్న భరతుని - నడవుల కనుపు
రాముఁ డీతఱి వని - రాక యమ్మనుపె
నామాట చెవిజేర్పు - నారీలలామ!
భరతుఁ డీరాజ్యంబు - పాలించెనేని
పరికింప రాముని - పగవాఁ డతండె 820

అమీఁద నొకరాముఁ - డన నేల కినిసి
యేమి సేయఁగవచ్చు - నెవ్వరిచేత ?
సింగంబునకు వెఱ - చిన మత్తగజము
సంగతి భరతుండు - జానకీరమణుఁ
చేతఁ జిక్కక మున్న - సింహాసనంబు
తోతే బనిచి భర - తుని కొప్పగింపు
కాతేని భరతునిఁ - గాచి రక్షింప
నేది మార్గాంతరం - బెన్నుము మదిని
వెనకకు నీచేత - వెతలచేఁ జివికి
కనుపెట్టుకొనిన యా - కౌసల్య యెపుడు 830
నాపగ దీర్పక - యూపంగ లేదు.
కోపంబు నీకు - నీకొడుకునీకిపుడ
అనవధికంబైన - యవధి రాకున్న
మునుపుగా వనవాస - మున రాము నునుప
మన భరతునకు భూ - మండలంబెల్ల
ననుపుగాఁ జేకూడ - యత్నంబు చేసి
సవతులలో నీదు - సవతు లేనట్టి
యవిరళ సంతోష - మందుమీ'' వనిన
కలగినమది నర - గడియ మాత్రంబు
తలపోసి చూచి యు - త్తమతురంగమునుఁ 840
గ్రక్కున మరలించు - గతి నెమ్మనంబు
చక్కని జాడగాఁ - జననీక త్రిప్పి
'' మేలుమందర ! సత్య - మే నీవు వలుకు
మేలెఱుఁగక నిన్ను - మించనాడితిని
రాముని బనుతు న - రణ్యభూములకుఁ

గావించి పట్టంబు - గట్టుదు భరతు
మావారి కెల్ల నె - మ్మదిని సంతోష
మావహిల్లఁగఁజేతు - నదియెంత తనకు
నిందు నియ్యది జాడ - యెఱిఁగి యుండిసను
మంథర! యెఱిఁగించు - మా" యంచుఁబలుక 850
"నోయమ్మ! మఱచితి - వా! నీవు లేక
నాయాత్మ పరిశోధ - నంబు గాంచెదవా!
యెట్లైన నేమి యే - నెఱిఁగిన యర్థ
మిటులంచుఁబలుకనీ - యిచ్చ యామీఁద"
అని మఱిమఱియుఁ న - య్యతివ వేఁడంగ
దన పూన్కి చెల్లింప - దాసి యిట్లనియె.
"మును దండకారణ్య - మున వైజయంత
మను పట్టణంబులో - నమరు మాయావి
దానవపతి తిమి - ధ్వజుఁడు పెంపొందు
వాని మీఁదికి బల - వైరి దండెత్తి 860
పోరాడి తనచేత - పొలియింపఁగాక
వీరుని దశరథ - విభుఁడోడువిలువ
యీరాజు వెనువెంట - నేఁగవే నాఁడు
దారుణంబైన యు - ద్ధమి చూడవేఁడి
దేవతావళిఁ గూడి - తిమికేతు నాఁగి
యీవసుధాధీశుఁ - డెదిరి పోరాడ
జగడించు దానవ - శస్త్రఘాతములఁ
బొగరెల్లఁ జెడి గాయ - ముల రాత్రులెల్ల
పాళెముల్ చేరిన - ప్రజలను దనుజు
లాలోన వధియించి - యటపోవుచుండ 870

కోపించి దశరథ - క్షోణీశ్వరుండు
చాపంబుఁ గైకొని - శరపరంపరల
దానవేంద్రునితోడ - తలపడి పోరి
వాని వేటునఁ బెంపు - వదలి మూర్ఛిల్లి
యరదంబుపై వ్రాల - నప్పుడు తేరు
మఱలించి నీవు ర - క్షించి నేదఁదేర్ప
మెచ్చి యప్పుడు నీకు - మేదినీనాథుఁ
డిచ్చెఁ దా నొక వరం - బిటు లెచ్చరిల్లి
కమ్మర నెనఁయె - కలన సారథియు
సొమ్మసిల్లిన నీవు - సూత్రకృత్యంబుఁ 880
గావించి విభు తేరు - గడపుచు మదికి
నీవ చేవలు మెర - యించిన మెచ్చి
అపుడొక్క వరమిచ్చి - యడుగుమీ వనిన
నిపుడేల నడిగెద - నెపుడైన ననుట
మఱచితి వేమొ - మఱతురె యేను
మఱువలేదది యభి - మతము నీకిపుడు
ఆ వరంబులు రెండు - నడిగి రాఘవుని
కావరం బడఁగించి - కానల నుంచి
భరతునిఁ గట్టించు - పట్టంబు నీకు
పరిణామమొందుము - పలికినపలుకు 890
తప్పఁడెన్నఁడు మన - దశరథనృపతి
యెప్పుడు నీయెడ - హితుఁడైన వాఁడు
అలుక యింటికిఁ బోయి - యవశయనించి
పలుకకయుండుము - పతి వచ్చినపుడు
మచ్చికఁ దాపండు - మనసెందు నీకు

చిచ్చైనఁజొచ్చును - చెప్పితివేని
యడిగినదోఁ ప్రాణ - మైన నీకిచ్చు
నెడసేయఁగా నేరఁ - డెదురాడవెఱచు
నీచక్కఁదనముఁను - నీ విలాసములు
నోచెలి ! యెఱుఁగలే - కున్నావు గాక 900
ఏమిచెప్పినఁ జేయఁ - డే స్వామ్ములైన
కామించి యీవచ్చుఁ - గైకొనుమీవు
చలపట్టి యీరెండు - సంకల్పములును
వెలుతులుఁ దీఱక - విభుఁ జేరఁబోకు
అలుులైన శుభముల - నందుదువీవు
ఘటియించు రాజ్యభో - గము భరతునకు
భరతుండు దారయైన - బంధు లహితులఁ
బరివారములఁ జేరఁ - బట్టిరక్షించు
లాలనరూఢ మూ - లంబుగా నవని
పాలించు మితికట్టు - పదునాలుగేండ్లు 910
ఆపయి వచ్చియే - మనువాఁడు రాముఁ
డాపదలనుఁ బొంది - యడవిపాలైన
మఱలనేరఁడు పేరు - మాత్రంబులేకఁ
గరఁగిపోవును దిన - క్రమములచేత
నంత నకంటక - మైన రాజ్యమున
సంతోషమున నుండఁ - జాలునీ సుతుఁడు
పెఱికీ వరములు - వేఁడుము నీవు
మఱవకు " మనిపల్కు - మందరబుద్ధి
చెవినాని దాని నీ - క్షించి దుర్బుద్ధి
నవశాత్మయై కైక - యతనూజ్ఞ వలికె. 920

" నీకు నింతటిబుద్ధి - నిర్వాహకంబు
చేకూడి యునికి నా - చిత్తంబులోన
నెఱుఁగ కేమంటినో - యింకనామాట
మఱవు మీమదిలోన - మందర నీవు
సరిలేదు నీకు కు - బ్జలలోన నెందు
పరమ హితంబు నీ - పలికినమాట
మనరాజు హృదయమ - ర్మ మెఱంగవైతి
విననీక నడపిన - వృత్తాంతమెల్ల
కుబ్జలు వక్రలు - క్రూరలుగాని
యబ్జాస్య యనుకూల - లగువారు గలరె? 930
పవనాహతిని వ్రాలు - పద్మంబురీతి
నవనంద్యమై చాల - యలరునీ మొగము
మొనచూపె యుభయ - దోర్మూల కూలములఁ
జెనకునీ పెనుబోర - శింగారమునకుఁ
గృశియించి కాపెమి - క్కిలి కొంచమగుచు
శశిముఖి! నీకౌను - సన్నమైయుండె
పొడుపాటి కాళ్లు సొం - పుగ వెళ్లపైన
యడుగులతో నీవు - హంసంబురీతి
కటిఁబట్టుపుట్టంబు - గట్టి మేఖలయుఁ
గటక ముల్మెఱయ నా - కడకునే తెర 940
రతిమన్మథుల జయా - రంభ యాత్రలకు
జతగూర్చు తమ కుల - చందంబు మెఱయ
మూపురంబు నురంబు - మురవునుం జూచి
చూపులు మదికి మె - చ్చుల నామతించ
అలవడితివి శంబ - రాసురముఖులఁ

బలుమాయలకు మెచ్చఁ - బరగు నీమహిమ
నీవునన్ను భజించు - నియమంబుతోడ
నీవంటి కుబ్జలు - నిన్ను సేవించి
రాఁజేతు నీమూపు - రమునరో వింత
గాఁజేసి యనుతు బం - గారంపుఁదొడవు 950
వో రచన్నుల తోడ - నొప్పు నీయురము
బోర మీఁదటి కిత్తు - బురుసారుమాలు
కుఱుచయై మూపులఁ - గుడుకిలియున్న
యఱుతకు నేనిత్తు - నర్ఘహారంబు
తాళితి నను తప్పు - దాళిన నీదు
తాలిమికై బిల్ల - తాళి యిచ్చెదను"
అని వెలిపై పావ - కార్చియుంబోలి
తనరుమేలిమికెంపు - తాపితా పరపు
మీఁదట వసియించు - మృగశాబనేత్రి
తోఁదత్తరించి యా - దుర్గాత్మి వలికె 960
"అమ్మ! గజస్నాన - మటుగాకనీదు
నెమ్మది నాబుద్ధి - నిలిపితివేని
కోపగృహంబున - కనుబోయియుండు
మీపూన్కి చెల్లింప - కేమర వలదు"
అని తోడుకొని పోయి - యాయింటిలోన
నునిచి తా నవ్వల - నొదిగి యున్నంత
సుదతిమై భోగపు - సొమ్ములన్నియును
వదలించి మాసిన - వలువ ధరించి
దాసి చెప్పినయట్ల - తలపట్టువెట్టి
వాసన కట్టు బ - ల్పడిఁ గట్టిచుట్టు 970

నుడిగింపు విరిఁబోఁణు - లొక్కొక్కమూల
నడఁగి యుండఁగఁ గను - లందు బాష్పములు
ధారలుఁ గాఁగ మం - దరఁ జేరఁబిలిచి
" ఓరామ ! నామాట - యొకటి యాలింపు
భరతునిఁ గట్టుదు - పట్టంబు రాముఁ
డఱుముదు ఘోర కాం - తారవీథులకు
నీపూన్కి దప్పిన - వీక్షించినీవె
భూపాలుతోడఁ దె - ల్పుము తన తెఱఁగు
కడమ యేఁటికి యేడు - గడ రాముఁబిలిచి
యడవులకును జను - మనక నేమాన 980
నీదుమాటలు నాటి - నిండునాఁడెంద
మీఁదుచున్నది చాల - నీను మున్నీట
యిదియ కాకున్నచో - నేల ? యీతుచ్ఛ
పదవులు చలవట్టి - ప్రతిన చెల్లింతు
కానిమ్మనుచు తన - కరభంబుచేత
మానిని యురముఁ బ - ల్మారుఁ దాటించి
ముసుఁగు వెట్టుక కాకు - మొగులులోఁదగులు
లసమాన చంద్రక - ళా విలాసమున
మందరా వ్యాపాద - మాయానులాప
నిందితవిషదిగ్ధ - నిశితాస్త్ర హతిని 990
మేదినిఁ బవళించి - మిగుల రోషంబు
పాదుకొనంగ ని - బ్బరపుటూర్పులను
బుసకొట్టుచున్నట్టి - భోగిని యనఁగ
నసురుసురుగుచును - నవనిపైఁబడిన

కిన్నర రమణి పో - ల్కెను చుక్కలురివి
మిన్నుదోఁచిన మాడ్కి - మెరవడుల్ సడలి
కదలక మెదలక - కన్నులుమూసి
యెదనుబ్బు మందర - నింటికిబనిచి
యెదురులు చూచుచు - నిగురాకుఁబోణి
మది దశరథు రాక - మతియించునంత. 1000

—: దశరథుఁడు కైకేయిని చూడవచ్చుట :—

అప్పుడా దశరథుం - డాత్మవర్తనము
చెప్పి సుమంత్ర వ - సిష్ఠులు వనుప
తనదు సంతోష మెం - తయును కైకేయి
వినకున్న దనుచు న - వ్వేలఁదితోఁ దెలుప
వచ్చికైకేయి ని - వాస మొక్కరుఁడు
చొచ్చినదిక్కులుం - జూచుచురాఁగ
"నెక్కడ నున్నావొ - యెదు రేగవమ్మ!
అక్కక్క! మనయింటి - కదె రాజువచ్చె"
ననుచు నెచ్చెలు లాడు - నడినేర్చి పలుకు
కనక పంజరకీర - కథనముల్ వినుచు 1010
"అజకుమారక! భాస్క - రాన్వయజలధి
రజనీకర! సమస్త - రాజమూర్ధన్య!
దానదీక్షాధురం - ధర! వైరిరాజ
మాన నీరాకర - మథన కృపాణ!
సత్యవాక్యప్రతి - ష్ఠా సంప్రదాయ
అత్యంత నియత - ధర్మాచార నిపుణ!

దశరథేశ్వర! యవ - ధార " నుపద్య
కుశలమా శారికా - కులముఁ గన్గొనుచుఁ
బువ్వుల చప్పరం - బులనాడు తేఁటి
జవ్వనుల వినోద - సంగీతమునకుఁ 1020
జక్కఁగానట్టులు - చాఁచు కేకినులఁ
జొక్కటాటలకు మె - చ్చులనుఁ దేలుచును
కదియ హంసములుండి - కడదాఁటునపుడు
కదలు నుయ్యాల బం - గరు సరిపెణల
సకినలు వలుక ప - జ్జల దూఁరిపట్టు
బకదారి సరములు - బాలి మేకొనుచు
సుదపని హరువులం - జూపట్టి మదన
కదనంబులకు రంజి - కములైనపట్టి
సతులకుం బ్రాల్మాలు - సంయమీశ్వరుల
ప్రతిమలు బతిమాలు - బాగువీక్షించి 1030
నాటకశాలలు - నసరంగములును
దాఁటి సింహాసనాం - తరములుగడచి
కేళికావనములఁ - గెలఁకుల చంద్ర
శాలికావళి మీఁటి - చలువరా జగతి
జగతు లాలోకించి - జలజాకరముల
మొగడ తమ్ముల చక్ర - ములఁ దేటిచూచి
నవరత్న భాసమా - నంబయిన పెండ్లి
చవికెగన్గొని చెంత - సౌవర్ణచిత్ర
భాసమానంబైన - పడకిల్లు చేరి
దాసీసహస్రము - త్తలముతో నొదుగఁ 1040

గంచుకి వామన - గణ కుబ్జనికర
మంచెలం దగిన ప్ర - యత్నముల్ నడప
మొగ మొగమ్ములు చూచి - ముసగసలాడు
మగువలం గనుచుఁ దా - మర సాటి రేఖ
పాయ నాకాశంబు - పగిదిఁగ్రై కేలు
బాయు నయ్యలివేణి - పానుపుచేరి
మదిఁజాలఁగలఁగి "రా - మామణిఁగాన
మదియేమొ" యనుచుఁ గా - మాతురుండగుచు
నేవచ్చు నపుడు తా - నెదురుగావచ్చి
తావి పన్నీటఁ బా - దంబులు గడిగి 105()
బాటల సుమసౌర - భంబులుచల్లు
నీటుఁబయ్యదను నా - నెమ్మోము చెమట
వారించి చిగురాకు - వంటికెంగేలు
గారాము మీఱంగఁ - గైలాగొసంగి
పానుపు పైనుంచి - బడలిక దీఱ
జీనితావి సురంటి - చేనొయ్య విసరి
యనురాగ మొందించి - 'నక్కటా! ఏమి
పనికినోకాన మీ - పడకింటిలోన"
ననిజాలిఁ బొంది మ - హారాజు చాల
వనరుచు హెగ్గడి - వనితనుంజూచి 1060
"కైకయెక్కడఁ బోయె? - కానము వేగ
వాకొను" మనిన నవ్వ - సువిభుంజూచి
"అయ్య కోపగృహంబు - నందు ధరిత్రి
బయ్యదముసుఁగిడి - పవళించె నిపుడు.
యేమినిమిత్తమో - యెఱుఁగ లేమనిన

నామానవాధీశుఁ - డచ్చటికేఁగి
మూలంబు దెగఁగోయ - మొనసిధరిత్రి
వ్రాలినమల్లికా - వల్లిక యనఁగ
నవనవంబుగ విమా - నమునందుజారి
యవనిపైబడు కిన్న - రాంగనరీతి 1070
నవనిఁ జూడంగవచ్చి - యలసి తానచట
బవళించు దేవతా - భామిని కరణి
మహనీయ్య మధుపాన - మదమత్తయగుచు
మహివ్రాలు నచ్చర - మగువ చందమున
జవతురంగమ రతి - శ్రాంతిచే నలఁగి
రవణంబు దొఱఁగు తు - రంగికైవడిని
తడయక సింహనా - దము చెవిసోఁకి
కడుభీతి నోడిన - కరణివైఖరినిఁ
దలకొన్న మూర్తిచే - తనువేఁటకాని
వలకుఁజిక్కిన లేడి - వలెనిలమీఁద 1080
నత్తమిల్లిన కేక - యాత్మజుఁజూచి
మత్తేభగమనుఁ డ - మ్మనుజ నాయకుఁడు
చెంగటి కొయ్యన - చేరి యా రమణి
యంగంబుపైఁ దన - హస్తంబువైచి
యిలమీఁద వసియించి - హితమధురోక్తు
లలవడ దశరథుఁ - డప్పు డిట్లనియె.
" ఓరమణీమణి ! - యుర్విపై నేమి
కారణంబున నిట్టి - గతి శయించితివి?
యీతరినీయల్క - కేమి గారణము ?
హేతువెయ్యది వంత - నింతచింతిల్ల ? 1090

నెవ్వరు నీతోడ - నెదురాడి నిటుల
నెవ్వగ చేసిరి - నీకు నెవ్వారు?
యేనుండి నీ కేల - నిట్టి విచార?
మే నెపం బెంచి న - న్నిటుల నొంచెదవు?
సుందరి భూతంబు - సోఁకెనో నిన్ను
మందులిప్పింతు నా - మయ వికారంబొ
మగువ రప్పింతునో - మంత్రవాదులను
వగపేల పిలుతునో - వైద్యులనిటకు
నీకేమివలెనన్న - నేనొనగూర్తు
నాకడఁదొలఁగింతు - నప్రియార్థములు 1100
దండింపదగు వారిఁ - దాళికాచెదను
దండనీయులఁజేతు - తగనివారలను
బీదఁజేపట్టి కు - బేరుఁగావింతు
పేదనుఁజేయుదు - పృథివీశునైన
నేను నావారునీ - యిలయును నీదు
పూనికయట్టట్ల - పొందువారలము
తలఁచినయర్థమం - తయు సమకూర్తు
వలసి కోరినవట్టి - వస్తువులిత్తు
నీమీఁది నాప్రేమ - నెనరు మోహంబు
నోమానిని! యెఱింగి - యును చింతయేల? 1110
అనుమానములుమాని - యడిగెద నాదు
జనకుఁడు సుకృతంబు - సాక్షులుగాఁగ
భానుని రథమెంత - పర్యంతమవని
మానిని! చుట్టు నమ్మ - ధ్యోర్వియెల్ల
గరిమనేలుదు నేను - గాంధార సింధు

కురు కోసలావంతి - ఘూర్జర మగధ
సౌరాష్ట్ర సౌవీర - శకమహీవిభుల
గారవింపుచు నరి - గాపులుగాన
అట్టివారలుడాఁచి - నట్టియర్థములు
నెట్టుకావలెనన్న - నీకు నర్పింతుఁ 1120
గన్నీరునీకేల ! - కలవాణి లేచి
నన్నుఁజూడుము నీకు - నరులెవ్వరైన
కించుఁదనంబుతో - కీడు సేసినను
మంచుబో విరియించు - మార్తాండురీతి
తగునాజ్ఞచేసి ఖే - దము వాయఁజేతు
నగుమోముచూపు మ - ననముసుం గేల ?
కరుణింపు" మను మాట - కైకేయి మదిని
బరికించి నిష్ఠుర - భంగినిట్లనియె.
"పగవారునాకునే - పట్టున లేరు
తెగి యవమాన మొం - దింప రెవ్వరును 1130
అలుకకుం గారణం - బడిగితి గానఁ
దెలపక తీరదు - తెల్లంబుఁగాఁగ
నీవుసేయు ప్రతిజ్ఞ - నిజముగాఁబూని
కావించుమాట - నిక్కంబగు నేని
మఱికాని నీతోడ - మాటాడ" ననిన
మెఱుమెఱల్ దీరియా - మృగనేత్రిఁజూచి
నగుమోముతోడ మ - నంబు రంజిల్ల
మగువ నెమ్మోముఁ దా - మరమీఁదఁ జెదరు
కురులు వేనలితోడఁ - గూడఁగా దువ్వి
కుఱుఁజైఁటచెఱఁగుఁగ్ర - క్కునఁ బాయఁద్రోచి 1140

కరముకరంబుతోఁ - గదియుంచి యెత్తి
యరవిందలోచన - నాసీనఁజేసి
"నీకన్నఁబ్రియురాలు - నిక్కంబుగాఁగ
నాకు రాముని మించి - న ప్రియుండు లేఁడు
యీయర్థమెఱిఁగియు - నేఱుఁగనియటుల
నోయిందుబింబాస్య! - యుచితమే పలుక!
నిమిషంబునేఁబాయ - నేరనిప్రాణ
సముఁడైన మారామ - చంద్రుని యాన
కోరికె యిపుడె వా - కొను మిట్టులనుచు
కోరినయపుడె నీ - కు నొసంగువాఁడ 1150
యితరులౌ పుత్రుల - నింతులు మేను
హితులు సామ్రాజ్యంబు - నింతయు నాకు
నేఁటికిశ్రీరాము - నెనసియుండుటకు
సాటియె యట్టి కౌ - సల్య కుమారు
పైనానవెట్టి త - ప్పను నీదుచెలువు
మానవతీమణి! - మదిఁగానలేవు
ఆబలంబు సహాయ - మైయుండనీకు
నోబాల! సంశయం - బొకటేల? నీకు
నడుగుమీవన" మం - దరాదేశ మాత్మ
బెడరింప శమనునిఁ - బిలిచిన రీతి 1160
అనరానిమాట కా - మాతురుండైన
మనుజేశుఁ జూచియ - మ్మగువ యిట్లనియె.

—: కైకేయి దశరథుని వరము లడుగుట :—

"సత్యసంధుఁడు కీర్తి - శాలి ధార్మికుఁడు
నిత్యదానవినోది - నేఁడు మారాజు

పలికిన పలుకులు – పన్నగ యక్ష
నలినాప్తదేవదా – నవ సిద్ధ ఖచర
చారణతారకా – చంద్ర కింపురుష
ధారుణిగగనభూ – త వ్రాతమెల్ల
వినుఁడు మీరలె సాక్షి – వెనక నీరాజు
మననుగ్రహమ్మిచిన ధ – ర్మముఁదప్పవలదు 1170
అడిగెద భూపాల – యాదికాలమున
వడినొసంగితి రెండు – వరములు నాకు
నావరద్వయము నే – నప్పు నిల్పితిని
కావలసినవేళఁగై – కొందు ననుచు
నిక్షేపములుగాఁగ – నీ యెడనున్న
అక్షయవరము లే – నడుగుటఁదగదె
నరనాథ ! దేవదా – నవసంగరమున
నరదంబు నడపించు – నపు డిచ్చినావు
కలదు లేదోచూచి – కలిగినమదినిఁ
దలఁచుక యిమ్మ" న్న – దశరథవిభుఁడు 1180
కపటాత్మఁడగు వేఁట – కాఁడుకాఱడవి
నిపుణుఁడై మృగము పూ – నికనెఱింగింప
యాసద్దు విని మృగం – బని చేరితగిలి
మోసమొందిన మృగ – మునుఁబోలి యతఁడు
తనవరంబును వలఁ – దగులుట చూచి
కనికరంబేది కే – కయరాజ తనయ
మఱియు నిట్లనియె "నీ – మాటసత్యముగ
మఱవకయిచ్చిన – మననిత్తునీకు

యీకొన్నచోఁ బ్రాణ - మిచ్చెదఁగాక
కైకయు నేర్చునా - కల్లలాడంగ 1190
నీవె నూచెదవు వూ - నిన మాటదెలిపి
యావలనెట్లైన - నదియె సమ్మతము
రామాభిషేక కా - రణమైన వస్తు
సామగ్రి యిట్లుండ - సరగున నేఁడు
భరతునిఁ బిలిపించి - పట్టంబు గట్టి
గరిమతోఁ యువరాజుఁ - గావించు టొకటి
రామునిఁ బిలిచి య - రణ్య భూములకు
వేమౌనివర్యుల - వేషంబుఁదాల్చి
యేనుచూచుచు - నుండ నిప్పు డయోధ్య
లోననుండఁగ నిక - లోకులు నగఁగ 1200
పనుపుట యొక్కటి - పార్థివ! నీవు
తనకిచ్చు వరములు - తప్పరాదింక
శీలంబు యశము ర - క్షింపు మేనుఁజక
చాల నిల్కడ సత్య - సంధుండ వగుము
సత్యంబు పరలోక - సాధకంబగుట
ప్రత్యయలీలగాఁ - బలుకవే శ్రుతులు
"యిచ్చెద ననుము వా - యెత్తక బేలు
పుచ్చెదనన మోస - పోవునె కైక"

—: కైకమాటలకు దశరథుఁడు శోకించుట :—

యనుమాటలకు కాఁచి - నట్టిశూలముల
తనదు వీనులునాఁటఁ - దపియించు నటుల 1210

భ్రమసితినో? స్వ - ప్నంబుఁగాంచితినొ?
అమలినాత్మీయ్య మ - హాభోగ హేతు
నానాపదార్థవి - నాశమో? యేమి
గానున్నది యో యని - కళవళంబొంది
చిత్తంబు మఱచి మూ - ర్ఛిలి యంతఁదెలిసి
తత్తరింపుచుఁ దెల్విఁ - దప్పిభ్రమాన్పడుచు
బెబ్బులింగని చాల - భీతి చేఁబఱచి
యుబ్బలింబడి మృగ - మున్నచందమున
వాకట్టువడు మహా - వ్యాళంబు రీతి
ప్రాకటనిశ్వాస - భంగిరోఁదుచును 1220
తా నచేతనుఁడయి - ధరణిపై వ్రాల
దీనుఁడై యేమియుఁ - దెలియంగ లేక
కనలుచుఁగోపించి - కన్నుల కెంపు
జనియింపఁ దనదైన - జన్మంబు రోసి
సేకరించుకొని దా - క్షిణ్యంబు లేని
యాకైకపై నల్గి - యవనీశుఁడనియె.
“ ఏము రాముఁడు నీకు - నెగ్గైనకార్య
మేమిచేసితి మిట్టు - లేల వాఁవిషము
చినుకుచు వంశనా - శినినైతి నీవు
వనిత రామునిఁజూచి - వనితలంబునకుఁ 1230
బొమ్మను తలఁపెట్టు - వోఁడవు విషంబు
గ్రుమ్మరింపుచు త్రాఁచు - కొండమయుంబోలి
యున్న నిన్నెఱుఁగక - నుంచితి నమ్మి
యిన్నాళ్లు సతివని - యింటిలోపలను
కౌసల్యమారుగాఁ - గను నిన్ను రాముఁ

డీసెఱుంగఁడు తమ్ము - లెడనొక్కనాఁడు
సకలలోకహిత ప్ర - చారు నానుతుని
నకట! యేకొఱఁత సే - యంగ నిట్టులంటి
సతులను సుతుల రా - జ్యమునైన విడుతు
సతివ! వేఁడిననిత్తు - ప్రాణంబులైన 1240
రామునిఁబాయనే - రను లోకమెల్ల
సేమంబు రవిలేక - చెంద నేర్చినను
జలములులేకయు - సస్యంబు లురికె
బలువైన పంటలు - పండనేర్చినను
కమలాక్షి! శ్రీరాముఁ - గానకయున్న
నిమిషంబుప్రాణంబు - నిలువ నేరుతునె?
నానాఁట నీయెడ - నడచు రాఘవుని
మానితహితగుణ - మర్యాదలెల్ల
నాతోడఁదెల్పు దా - నవు నీవు పరమ
పాతకహేతు దు - ర్భాషలాడుదువె? 2250
భరతుఁ డొల్లని వాఁడె - భామిని! నాకు
ధరణికి రాముఁ గ - ర్తనుఁ జేసినపుడె
యతని మేలున కెట్టి - యహితంబుఁ దలఁప
మతియింపకుము నన్ను - మన్నింపు మీవు
పూని కావింపు మి - ప్పుడు నాదు ప్రాణ
దానంబు నీదు పా - దముల ప్రాలెదను
అక్కటా! యీ పిశా - చావేశబుద్ధి
గ్రక్కున నీకు నె - క్కడ నుండివచ్చె?
రాజీవనయన! మా - రఘువంశమునకు
నీజాడ యపకీర్తి - యేనాఁడు రాదు 1260

అహిత మెన్నఁడునుఁ జే - యవు నాకు నీవు
విహితమె యీమాట - వినరాదు నాకు
నడవుల కేనెట్టు - లంపుదు రాముఁ
బడఁతి రాముఁడు నీకు - భరతుండు వేఱె ?
నగరిలో నున్న క - న్యల నొక్కరైన
మగువ రాముని కెగ్గు - మదిఁ దలంపుదురె ?
ఎంచిరే యపవాద - మెవ్వార లైన
మంచి వాఁడను నట్టి - మాటయే కాక
గురుల శుశ్రూషచే - కోదండవిద్య
నరినృపాలకుల మ - హాప్రదానముల 1270
దీనుల మనల భ - క్తినిఁ దనియించు
వానికిఁ గీడాడ - వలదెట్టి యెడల
దమము సత్యమును కృ - తజ్ఞత నేర్పు
శమము నహింసయు - శౌర్యంబు మొదలు
నానాగుణముల ను - న్నతుఁడు కౌసల్య
సూనుండు గాన నె - చ్చో నాకు నతఁడె
గతిగాక వేఱొండు - గతిలేదు నాకు
నెతలెల్ల మాన్చి చే - విడక రక్షింపు
రాముని కీవ శ - రణ్యవై నాదు
సేమంబు వదలక - చేపట్టు మమ్ము 1280
యేమి కావలసిన - నిత్తుఁ గట్టెదుర
రాము నుండగ నిమ్ము - రాజీవనయన ! ”
అని పల్కు దశరథు - నదలించి కైక
యనుకంప లేక యి - ట్లని పల్కెనపుడు.
“ అనఘ ! నావలన దే - వాసురయుద్ధ

మున నీవు బ్రతికి యెు - ప్పునె కల్లలాడ!
మనువంశనృపులు ప్రా - మాణికు లట్టి
యనఘుల కపకీర్తి - యయ్యె నీకతన
పాప మసత్యంబు - పావనాన్వయముఁ
బ్రాపింపఁ జేసితీ - పట్టునకు నీవు 1290
వరములు మునుపిచ్చి - వచనంబు దప్పి
పరిహరించి యధర్మ - పరుఁడవై నావు
రాజర్షి వరులు నే - రము మోపి పలుక
నేజాడ నుత్తరం - బిత్తువో నీవు?
పోనిమ్ము తన కేమి? - బొంకితి నను
దాన నేమిగొ అంత - తలఁతు వామీఁద
త్యాగియై శిబి కపో - త నిమిత్తముగను
డేగకు మేను వేఁ - డిన నిచ్చెమున్ను
అంధకుఁడైన బ్రా - హ్మణునకు తాను
యంధుడౌచు నలర్కుఁ - డక్షులొసంగె 1300
నీశాకరము దప్పు - నే పొలిమేర?
యోరాజ! నీతప్పు - లోకరు దీర్చెదరె?
యిచ్చినట్టి ప్రతిజ్ఞ - యెంచి సద్గతికి
నిచ్చెన యగు సత్య - నిరతిఁ గైకొనుము
నీవు బొంకెద నన్న - నిజమతిం జేసి
నీవంశ నియమంబు - నిలపక మాన
కొడుకుఁ బట్టము గట్టి - కూరిమిఁ గలుగు
పడఁతిఁ గౌసల్యఁ - జేపట్టి దబ్బఱకు.
నొడిగట్టి నాకు ధ - ర్మోపదేశములు
విడువక పలికిన - విడువ నాప్రతిన 1310

రాముఁ బట్టము గట్ట - రాజసవృత్తిఁ
దా మీఱు కౌసల్య - తరి చూచి పోయి
చేతులు మొగిచి కొ - ల్చి యడంగి యుండి
జీతంబు వేఁడి గా - సిలు నంతకన్న
క్షణములో గరళభ - క్షణముఁగావించి
తృణమాత్రముగ వెత - దీఱిపోవుటయె
మేలు మాభరతుని - మీఁదటి యాన
చాలు నీతోడి సం - సర్గఁబుఁ దనకు ''
అని యాగ్రహంబు చే - నతిఘోరమైన
తనప్రాణ సదృశుఁడౌ - తనయుని మీఁద 1320
నానవెట్టిన వజ్ర - హతిఁబలె మేను
గ్రామనుపడంగ సొ - మ్మసిలి మూర్ఛిల్లి
యవనిపైఁబడి మాట - లాడక యుండి
యవనీశ్వరుఁడు ధై - ర్యసహాయుఁ డగుచు
గోరలూడ్చిన బుస - కొట్టు సర్పంబు
మీర '' యీకైక యే - మిటి కిట్టులయ్యె ?
యెవ్వతె చెప్పెరా - యీబుద్ధి దీని
కివ్వేళ నేమియు - నెఱుఁగ లేదయ్యె
దయ్యంబు సోఁకెనో - తనయదృష్టంబు
పయ్యాడి దీని నె - పంబైన యదియొ '' 1330
అని తెల్వి నొంది తా - నాకైకఁజూచి
మనుజ నాయకుఁడు క్ర - మ్మఱ నిట్టులనియె,
''పడుచు దనంబుచే - భామిని ! నీవు
చెడుబుద్ధి యెవ్వతె - చే నేర్చినావొ
భరతునికిని నాకుఁ - బ్రజలకు సేవ

మరలేక కావింప - నాశించె దేని
మాను మీ పలుకు నీ - మాట చేధరణి
తా నేలునే భర - త కుమారకుండు ?
రాముని కన్నఁ దీ - అని ధర్మయుక్త
మైమించె నేని నీవ - డిగిన వరము 1340
హితమని నామది - నెంచి కారుణ్య
మతిశయించి భయంక - రారణ్యములకుఁ
బొమ్మని తమము గ - ప్పు శశాంకుఁడనఁగ
నమ్మాటకు వివర్ణ - మైన రాఘవుని
మొగమెట్లు చూతును - ముచ్చట మంత్రు
లగు వారితోఁదెల్పి - యందఱు వినఁగ
రాముఁ జేసెద యువ - రాజు నేనన్న
యామతి రిపులచే - హతమైన యట్టి
బలము బో విడిచిన - పగిదిఁ బోవిడిచి
తలఁపులో నిట్టి యు - త్సవము చూడంగ 1350
వచ్చు దిక్కుల రాచ - వారలు తోడ
యిచ్చటి పెద్దల - నిందఱితోడ
రాముని మీఁద నే - రంబేమి యనిన
నేమని యుత్తర - మీనేర్చు వాఁడ
నీమాట చేత వ - నీప్రదేశముల
రాముఁ బొమ్మనుట ధ - ర్మము సత్యమైన
పట్టంబు గట్టెద - పట్టి నేనన్న
యట్టిమాటల సత్య - మై పోవకున్న
కౌసల్యఁ జేరి యే - గతి మోముఁజూతు ? 1360

నాసాధ్వి గుణము నీ - వరయ కున్నావె
పరిచర్య లొనరించు - పట్టున దాసి
యొరిమె నెచ్చెలి లాల - నోపచారములఁ
బడకల నలరించు - పట్టున వేశ్య
కడు నగ్నిహోత్రాది - కములందు పత్ని
సోదరి మేలు రాఁ - జూచు కార్యముల
నాదు మెచ్చగు భోజ - నములందుఁ దల్లి
యాలోచనము లందు - ననురూప ధర్మ
శీలంబులందు నా - చేయూఁతకోల 1370
పలుకులెల్ల ప్రియంబె - పలుకు నాకెపుడు
తలఁపులెల్ల హితంబె - తలఁచు నాకొఱకు
రాముని బాసి యో - ర్వదు నన్నుఁబోలి
యా మానవతి నెట్టు - లార్తిఁ బొల్పఱతు
రోగికి పథ్యంబు - రుచియింప నటుల
యా గుణవతి నెంచ - నైతి నీకొఱకు
నెఱుఁగక నిన్ను నే - నిఱుపెంపు చేసి
పరమ పతివ్రతా - భరణమైనట్టి
కౌసల్య నరసేయు - కలుష మీరీతి
నాసన్నదుఃఖమై - యనుభూతమయ్యె 1380
వనికి రాముని బంపు - వార్త దావినిన
తనమది నేమని - తలఁచు సుమిత్ర ?
వనభూములకు రఘు - వరుఁ డేఁగఁజూచి
తనపాటు గాంచి సీ - తావధూమణియు
హిమవంతమునఁ బతి - నెడవాసి యార్తి

దమకించు కిన్నర - తరుణియుంబోలి
యెంత చింతిల్లునో! - యెవ్వ రూరార్తు
రింతేల ? శ్రీరాము - నెడ బాసి నపుడ
తనమేనఁ బ్రాణముల్ - తడవుగానుండ
ననుమాన మేల ? నీ - వా తరువాత 1390

భరతునిఁ బిలిపించి - పట్టంబుఁగట్టి
ధరణి వాలింపు పా - తకురాల వగుచు
కానక విషముతోఁ - గలయు మద్యంబు
పానంబు చేసి యా - పద నొందురీతి
యాలుగా యని నమ్మి - యపమృత్యువైన
పోలని నీతోడి - పొందు చేసితిని
కపటగీతమున మె - కంబు వంచించు
నిపుణత చేత తే - నియ పూయుకత్తి
కైవడి నీవు చ - క్కని మాటలాడి
యీవేళఁ జెఱిచితి - వినవంశ మెల్ల 1400

కలుద్రావు విప్రుని - గతిఁ గన్న కొడుకు
ములుచనై నీకు న - మ్ముక పోవునన్ను
నొకనైన దిట్టక - యుందురో! రాముఁ
డొకరికిఁ గాని వాఁ - డో! యిట్లు వలుక
తన పురాకృత దురి - తంబుల చేత
తనుఁ గట్టుటకు త్రాళ్లు - తాఁదెచ్చినట్లు
చెడఁగోరి నిన్ను దె - చ్చితిఁ బెండ్లియాడి
పడఁతి బాలుఁడు పాముఁ - బట్టినయట్లు
పాపాత్ముఁడగు నాకుఁ - బట్టియె రాముఁ
డాపదలనుఁ జెంది - యనద గావలసె 1410

యాలిమాటలు విని - యథముఁడై బ్రదుకు
బ్రాలుమాలె నటంచుఁ - బలుకరే నన్ను
మొన్నఁజేసితిని రా - మునిఁ బెండ్లి సీత
చిన్నారి పాయంపు - సిగ్గరి వీరి
నింత చింతల ముంచి - యీపాటు వఱప
నింతి! నీకును నాకు - నేగతు ల్గలవొ?
అడవికిఁ బిల్చి పొ - మ్మని పల్క నపుడె
గడిదైన నిల్వఁ డి - క్కడ రఘూద్వహుఁడు
అందుకు నేఁబోవ - ననుఁగదా! రాముఁ
డెందు నంతేటి పుణ్య - మేను సేయుదునె? 1420
అటులైన సంతోష - మంది యేనుందు
నటువంటి వాఁడు గాఁ - డా కుమారకుఁడు
బ్రదికింపఁడే నాదు - పల్కు మీఱినను
హృదయ వర్తన మాతఁ - డెఱుఁగు టేలాఁగు!
అపవాదముల కోర్వ - వసువులు మేన
నపుడు మావారల - నందఱ నీవు
యెమేమి సేయఁగా - నెంచి తోఁ దాను
రాముండు నెడవాయ - రమణి కౌసల్య
శోకవారాశిలో - సుడి గొనుచుండ
నీకడ చూచి స - హింపఁగలేక 1430
ననుగమనము సేయు - నపుడు సుమిత్ర
తనయుల ముప్వురిఁ - దమ్ముముప్వురను
యిన్ని యార్తుల ముంచి - యిలయేలు మీవు
కన్నబిడ్డఁడు నీవు - కైక నెమ్మదిని
నాచేత నాయగ్ర - నందను చేత

నేచి వన్నియ కెక్కు - ని ఇక్ష్వాకు కులము
చెఱుపుమ నీమాట - చేసి నష్టైన
భరతునిచే నొల్లఁ - బరలోకవిధులు
పగదాయు మపకీర్తి - పాలైతి నిట్టి
మగువ చేపట్టి నీ - మది గాననైతి 1440

రాముఁ డశ్వములపై - రథముల మీఁద
సామజంబుల నెక్కి - చనువాఁడు నేఁడు
పాదచారంబునఁ - బ్రబల కంటకిత
పాదపావృత వనీ - పర్వతావనుల
వసియించు నెట్లు? సు - వారంబు వారు
పొసఁగ వండిన వంట - భుజియించువాఁడు
కందమూల ఫలాది - కములు సేవించి
యందునే క్రియ దృప్తుఁ - డయ్యెడువాఁడు?
కాషాయములను వ - ల్కలముల మాని
వేషంబుతో నెట్లు - విహరింపఁజాలు? 1450

పఱపుల మీఁదటఁ - బవళించు భోగి
పఱపైన తృణశయ్యఁ - బవళించు నెట్లు?
చంద్రశాలికల ని - చ్చల నుండు రామ
చంద్రుఁడే గతి పర్ణ - శాలలనుండు
నేమంచు బల్కితి - వీవేఁడిపలుకు
లేమానవులును స - హింతు రే వినిన?
కామినులందరు - కఠినాత్ములనుట
యీమేర తలదాఁకె - యిక నరివచ్చె
రాము నేఁబాయు కా - రణమున సుతుల
భూమిపై తండ్రు లె - ప్పుడు వదలుదురు. 1460

పతులఁ గైకొన రెండు - పడఁతులుఁ నీదు
కతనచే నిలకెల్ల - కట్టడయయ్యె
మగువ! జయంతస - మాను శృంగార
ముగ నిప్పుడలరు రా - మునిఁ జూచిజూచి
యడవికిం బొమ్మని - నల మున్న మేన
విడువకున్నవి ప్రాణ - వితతి చూచితివె?
వానలు గురియించు - వాసవుఁబాసి
భానునితోఁ నెడ - బాసి లోకముల
వ్యాపారమది ధ్రు - వంబైన సొంగాక
నోపవు మేనిలో - నుండఁబ్రాణములు 1470
రాముఁ బాసిన నీ ధ - రాజనావళికి
నీమేర నాచంద - మెఱిఁగింపనేల?
నేఁడేల తునియరో - నీ నాల్కయిట్టి
వేఁడి పల్కులు పల్క - వినరాని వెల్ల
యెలనాఁగ! యేమియు - నెఱుఁగని రాముఁ
జలపట్టి వెతఁబెట్ట - సమకట్టినావు
నీవెటు వోయిన - నేమిట్టులైన
నీవేల మారాము - నికి దాయవైతి
కులమెల్లఁ జెఱుచు నీ - కు హితంబు చేసి
కులదీపకుని రాముఁ - గొదవ సేయుదునె? 1480
యీకత్తి మీఁది సా - మేల? నీవేల?
నీ కీడుబుద్ధు ల - న్నియు నిన్నేముంచె
విడిచితి నీఁక నిన్ను - వేఁడితి వేని
విడుతు బ్రాణములైన - విడువ రాముని
యేల? నీకీ చలం - బీబుద్ధి మాని

బాల ! మాయందుఁ గృ - పాదృష్టి యునిచి
కోపంబు మాని నా - కొఱకు నీతప్పు
సైఁపుము మదిలోఁబ్ర - సన్నతనొంది
నాయాన నడుపుము - నాయాన యిత్తు
నీయాన వేఁడిన - నీదు కోరికలు" 1490

—: దశరథుఁడు సంతాపమును బొంది శోకించుట :—

అనికైకపదముల - యందఁ బ్రణామ
మొనరించి దీనుని - యోజ నెవ్వారు
లెన్నను వారలు - లేక దుఃఖమున
సొమ్మసిల్లుచును వ - సుంధర మీఁద
సేయు పుణ్యంబులు - చెడి దివినుండి
యీయెడఁ బడిన య - యాతియుంబోలి
వ్రాలిన ధర్మాల - వాలు భూపాలు
నా లోలనయన యొ - య్యన సేదఁదేర్చి
వరము లంతఁ దలంచి - వసుధపైఁ బొరలు
శిరమెత్తి తొడలపైఁ - జేర్చియూరార్చి 1500
కులిశాహతునిఁ బట్టి - కొఱవులుఁ జూఁడు
పొలుపున కైక తెం - పున నిట్టులనియె.
"సూనృతవాదివి - శూరవర్యుఁడవు
మాననీయుఁడవు - మానుష నిధివి
కల్లలాడవు నాదు - గారాబుప్రాణ
వల్లభుండవు దృఢ - వ్రతుఁడ వేలయ్య ?
యిచ్చెద నను వరం - బిమ్మన్న వేగ
నిచ్చితి వనక నీ - విన్ని నేరుపులు

న్యాయము నిష్ఠురములు - నయగారి పగలు
సేయుచు నన్ను వం - చింపఁ జూచెదవు 1510
యిచ్చెదవో లేదో - యిఁక నొక్కమాట
యుచ్చరింపుఁడు రాముఁ - డున్నాఁడు నీకు
కౌసల్య యున్నది - కడమ వారేల ?
వేసాలు చాలించి - వినఁ బల్కుఁ"డనిన
విని మహీపతి కోప - విహ్వలుండగుచు
కనలుచు కైకేయిఁ - గాంచి యిట్లనియె.
"సుందరి ! యొక రాక్ష - సుండు మీతల్లిఁ
బొందు నప్పుడు నీవుఁ - బుట్టితిగాన
నిజము కైకయ విభు - నికిఁ బుట్టవీవు
సుజనుఁ డాతఁడు నిన్ను - చూడంగరాదు 1520
కైకేయి ! యమరలో - కమునకు నేఁగ
నాకడ నున్న పు - ణ్యాత్ములందఱును
లక్ష్మణాగ్రజుఁ గుశ - లంబు వేఁడినను
పక్ష్మలేక్షణ ! - యేమి పల్కెడువాఁడ ?
తాళుదు నేరీతి - తపములు చేసి ?
చాల దక్షిణ లిచ్చి - సవనంబు నెల్ల
కావించి కడపటఁ - గన్నట్టి కొడుకు
నేవగ నీకొఱ - కేఁ బాయనేర్తు
దారుణశౌర్యజి - తక్రోధు మిగుల
నూరుపుగలవాని - నుత్పలశ్యాముఁ 1530
గమలపత్రాక్షు రా - కాచంద్రవదను
నమలిన మానసు - నాజానుబాహుఁ
గరుణాభిరాము జ - గజ్జనాధారుఁ

బరమపావను నీతి - పరు సత్యసంధు
రామునిఁ గనుఁ బ్రోల - ప్రాణముల్ చనక
యీమేన నిందాఁక - యెనసియున్నపుడె
యేమేమి చూతునో - యేల పెంచెదవు!
"రామాక్షి! లోకాప - వాదంబు తనకు
చాలించవే" యని - చాల శోకమున
నాలిమాటలకు లో - నై విలపించ 1540
జనపతి కవసాన - సమయంబు వచ్చె
నని తెల్పుగతిఁ గ్రుంకె - నర్కబింబంబు.
దశరథు చిత్తవృ - త్తము ధాత్రికెల్ల
విశదమౌ కరణిఁ బ - ర్వెను తిమిరంబు
సాంద్రకళావిలా - సముల సంపూర్ణ
చంద్రుఁ డెచ్చియు - రామచంద్రుఁ దలంపు
జనపతి యాహ్లాద - సహితుండు గాక
మనసును సత్యంబు - మల్లుఁ బోరాడ
వెడమతియై మిన్ను - విఱిగి పైఁబడిన
వడుపున నేమియు - వాకొనలేక 1550
దిక్కులు గగనంబుఁ - దేటికన్గొనుచుఁ
గక్కసంబున రోగి - గతి నారటించి
"ఓరాత్రి! నీవు మా - యూరిలోఁ దెల్ల
వారకిట్లుండంగ - వలెఁ జుమీ" యనుచుఁ
గరమెత్తి మ్రొక్కుచు - "కైకేయి! మొగము
పరమపాతకము చూ - పకుమీ" యటంచు
దీనుఁడై "చిత్తంబుఁ - ద్రిప్పవే చెలియ!
చానోప" ననుచు నం - జలి ఘటింపుచును

"దయఁజూడు మిది యాడి - తప్పుటల్ గాదె
నిమతితోఁ గొల్వులో - ని జనంబులెల్ల 1560
వినఁబల్కు నభిషేక - వృత్తాంత మింత
యనుమానమగునేని - యప్పగించెదను
రాముని చరణసా - రసయుగంబులకు
నోమానవతి ! నీవె - యనుపు రాజ్యమున
కాదేని రాము ని - క్కడి నుండనిచ్చి
నీదు పుత్రకునైన - నిలుపుపట్టమున
నటులైన సంతోష - మందెద వీవు
కిటుకులన్నియుఁ దీఱు - కీర్తి చేకూరు"
అని కరంబుల వ్రాల - నదలించి త్రోచు
వనిత యీసున మహీ - వరుఁడు మూర్ఛిల్లి 1570
క్రమ్మఱ నిలఁబడి - కాలునుం గేలు
నేమ్మేనుఁ గదలింప - నేరక యుండి
మందర నెమ్మోము - మాడ్కి నెత్తమ్ము
లందంద వికసిల్లి - యలులఁబోషింప
ఆవేళ వైతాళి - కావళి వచ్చి
భావించి గీతప్ర - బంధవైఖరుల
"తెలవాఱె ! దశరథా - ధిప ! మేలుకొనుము
కొలువిమ్ము రాజన్య - కోటికి నెల్ల
పట్టి రామునిఁగట్టు - పట్ట మీప్రొద్దు
పట్టయినావు శో - భనములకెల్ల" 1580
అనువారి మాన్చి హ - స్తాభినయంబు
జనపతి జేసి వి - షాదంబు తోడఁ

దరిలేని యట్టి చిం - తాసాగరమునఁ
బొరలుచోఁ దపనుండు - పొడమె తూఱుపున.

—: రాజు రాముని నడవికిఁ బంప నిశ్చయించుట :—

అప్పుడు కైకేయి - యవనీశుఁ జూచి
"ఒప్పునే యధిప! నీ - వొసఁగితి నన్న
వరము లే నడిగిన - వసుధపై నిట్లు
పొరలుచు సత్యంబుఁ - బోకడపెట్టి
లేవక కులమున - లేని లోభమున
నీవుండవచ్చునే - యింతమర్యాద 1590
యేలతప్పెదు? సత్య - మే ముఖ్యధర్మ
మాలింపవే పెద్ద - లాడుకొనంగ
సత్యంబె బ్రహ్మంబు - సత్యంబె శ్రుతులు
సత్యంబులో నిల్చె - సకలధర్మములు
కావున నీవు నా - కతన మేలొంది
నావరంబు లొసంగి - నయశాలి వగుము
మాటలేమిటికి? ము - మ్మాటికి నీకు
చాటిచెప్పెదను నీ - చందంబుచూచి
నీవు చూచుచునుండ - నేఁడె ప్రాణములు
నీవశంబుగఁ జేసి - నిన్ను మెప్పింతు 1600
పోమిమ్మావు నాఋణం - బున మెచ్చిమెచ్చి
యిమ్మన్న నీయక - యిందందుఁగాక"
యని తూలపోనాడ - నమ్మహామహుఁడు
తనదైన సత్యంబు - దామెనత్రాళ్ల
కైవడి తను నంటఁ - గట్టి వామనుని

కైవసంబయి బలి - గట్టు వడ్డట్టు
నేమియునన లేక - యెంత లేదనుచు
నామాటఁబలుక స - మర్థుండుఁగాక
చంచలహృదయుండు - సత్యాపదేశ
వంచితాత్మకుండు వి - వర్ణముఖుండు 1610
నై కాఁడిమ్రాఁకుతో - ననడు హంబున్న
జోకఁ దప్పించుకో - చొప్పేమిలేక
యతిశయదుఃఖంబు - నంది యాధర్మ
రతుఁ డిట్టులనియె నా - రమణి సత్కించి.
"అగ్నిసాక్షిగఁబెండ్లి - యాడిన నిన్ను
నగ్నిఁగ్రాగిన చని - యటులఁ జేవిడుతు ?
భరతుని నిట మున్న - పారవైచితిని
హరిహరి ! యెంత సా - హసము చేసితిమి
అల వసిష్ఠాదు లీ - యభిషేకమునకుఁ
బిలువ వత్తురు రవి - బీరెండ గాసె 1620
అభిషేకవస్తు స - మస్తసామగ్రి
నభిమానధనుఁడు - నా యగ్రనందనుఁడు
రాముఁడు పిడ నుత్త - రక్రియల్ దనకు
నేమించి కామించు - నీపూన్కిచేత
ఆరాము భాగ్య మి - ట్లగుటకు బొక్కు
పౌరుల శోకమేఁ - బరికింపఁజాల"
ననునంత ప్రొద్దు జా - మయ్యె నవ్వేళ
కినిసి కైకేయి శం - కింపక పలికె.
"అనఘ ! విషప్రాయ - మైన యీామాట
యననేల నా హృద - యము చూచుకొలకు 1630

నిక్కడికిని బిల్చి - యేఁ జూచుచుండఁ
గ్రక్కున రాముని - గానల కనుపు
భరతునిఁ బిలిపించి - పట్టంబుగట్టఁ
గరుణించి ముద్ర యుం - గరమిమ్ము నాకు
పగదీర్పు "మను వేఁడి - పలుకు గర్ణములఁ
బొగలెచ్చు ములుకులఁ - బొడిచినం గెరలు
తురగంబు గతిఁ గైక - తోఁ దొట్రుపడు మ
నరపతి చాల దై - న్యముననిట్లనియె.
"ఏల యిట్లాడెద - వేనోర్వఁజాలఁ
జాలు మన్నింపు మ - జ్ఞానంబు గప్పె 1640
తెలివియుఁ దప్పె నెం - తే సొమ్మసిలుచు
నిలువ నేరదు మేను - నిమిషమాత్రంబు
మా రాముఁజూడంగ - మనసయ్యె నిపుడు
మీటి వాకొనకు మే - మియు నింకమీఁద"
అనుచుఁ గన్నులు మూసి - యంతరంగంబు
తన యధీనము గాక - తలఁకుచున్నంత
యరుణోదయమునంది - యల వసిష్ఠుండు
సరయువునకు నేఁగి - స్నానం బొనర్చి
సందఱు శిష్యులు - నభిషేకవస్తు
బృందంబుతోడ సం - ప్రీతి నేతేర 1650
సుందరాలంకార - శోభితంబగుచు
బృందారకపురంబు - పెంపు రెట్టించు
నగరంబు సొచ్చి యా - నరనాథచంద్రు
నగరు ప్రవేశించి - నాల్గువాకిళ్లు
చొచ్చి పోవ సుమంత్రుఁ - జూచి "యేమిటకు

వచ్చినామని తెల్ప - వలయు రాజునకు
గంగోదకంబు సా - గరతీర్థములును
బంగరుకుండలఁ - బట్టియుంచితిమి
పావనంబగు నుదుం - బరపీఠమిపుడు
గావించియున్నది - కనకాసనమ్ము 1660
నానావిధముల ధా - న్యములు గంధాక్ష
తాసూనమాల్యాంబ - రాభరణములు
కన్నియ లెనమండ్రు - గంధేభ మొకటి
యున్నత తురగంబు - లోకనాల్గుగట్టు
నరదంబు ఖడ్గ బా - ణాసనాస్త్రములు
వరవాద్యనిచయంబు - వ్యాఘ్రచర్మంబు
హోమపదార్థంబు - లుత్తమాశ్వంబు
శ్రీమీఱు నవరత్న - సింహాసనంబు
ధవళాతపత్రంబు - తపనీయకలశ
నివహముల్ భూషణా - న్వితవృషభంబు 1670
నుభయచామరములు - నుచిత పట్టంబు
శుభకరంబులగు ప - క్షులు మృగంబులును
ఆవులు ఋత్విజు - లాచార్యవరులు
భూవరులు నమాత్య - పుంగవుల్ భటులు
వారకాంతినులును - నర్తకుల్ నటులు
పౌరులు మున్నుగాఁ - బట్టాభిషేక
వరవైభవముచూడ - వలసి సమస్త
వరవస్తువులతోడ - వచ్చియందఱును
కాచి యున్నారు వే - గమ దశరథుని
మాచెంగటికిఁ బిల్వు - మా" యని పనుప 1680

ఆ సుమంత్రుఁడు రాజు - నభినుతింపుచును
భూసురవృద్ధు నా - ప్తుని జోడుగూడి
యిరువురుగా లోని - కేఁగి యా యంతి
పురము వాకిలి మీఁరి - పోవుచునుండ
వారలు సంతోష - వార్తఁ జెల్పంగ
నారాజు సన్నిధి - కరుగుట నెఱిఁగి
వాకిట గొల్లలు - వలదని నిలుప
రాక యూరక యుండ - రాజు చెంగటికి
నచ్చి మిక్కిలి దుర - వస్థచే నునికి
యిచ్చలో నేమియు - నెఱుఁగక సౌఖ్య 1690
పరవశుం డగుటఁగా - భావించి చేర
నరిగి "ఓభానువం - శాంభోధిచంద్ర !
ధాతను నిగమముల్ - ధరణీధరారి
మాతలియును నంశు - మాలియు శశియు
వసుధను మేల్కొల్పు - వైఖరి మేము
వసుధేశ ! మీనిద్ర - వారింపవలసె
చేరితి మిటకొల్వు - సింగార మగుఁడు
తీరుపుఁ డిఁక నామ - తీర్థాదికములు
మేరువుపై నుండు - మిహిరునిం బోలి
సేరుఁ డుజ్వలరత్న - సింహాసనంబు 1700
చంద్రసూర్యులు రుద్ర - శమన కుబేరు
లింద్రాగ్ని వరుణాదు - లేవేళ నీకు
జయమంగళంబులు - సమకూర్పఁ గలరు
రయము మీఱఁగ లేచి - రావయ్య నీవు
మీకును మాకును - మేదినికెల్ల

ప్రాకట శోభన - ప్రభవ మైనట్టి
యీరాత్రి గడతేరు - నెన్నఁ డుదయించి
చేరెను సంకల్ప - సిద్ధి వాసరము
అభిషేక సామగ్రి - యాయత మయ్యె
విభవ సంపన్నమై - వెలసె నయోధ్య 1710
చేరియున్నారు వ - సిష్ఠాది మునులు
శ్రీరామపట్టాభి - షేకంబు చూడ
మెదు రెదురులు చూచి - యెల్లవారలును
మదిలోన నానంద - మగ్నులై నారు
రవిలేని దినము సా - రథి లేనిరథము
కవిలేనికీర్తి యం - కము లేనిపోటు
ప్రతిలేని వాదు తీ - ర్పరి లేనిసేన
ధృతిలేని తెగువ కూ - రిమిలేని చెలిమి
దొరలేనిసీమ చం - ద్రుఁడు లేనిరాత్రి
తరిలేని సంధ్యమం - త్రము లేని జపము 1720
సతిలేని గృహము వా - సనలేని పువ్వు
భృతిలేని కొలువు కో - యిలలేని వనము
శ్రుతిలేని పాట శూ - రులు లేని కోట
కతలేని రచన ని - ల్కడలేని మాట
యెల్లడ వృథయైన - యెన్నికగాక
యెల్లవారలు గూడి - యేమిటివారు ?
విచ్చేయుఁడ " నిపల్క - విని వినసట్ల
యిచ్చలోఁదన ఖేద - మినుమడి గాఁగ
కనువిచ్చి చూడ క - గ్గలమైన యార్తి
మునిఁగి ' యోయి! సుమంత్ర - మొదట నామనసు 1730

మిగుల నొచ్చినది యా - మీఁదట నీవు
పగవానివలె వాఁడి - బాణముల్ మేను
నాఁట నేసిన రీతి - నామదినొవ్వ
మాటలాడెదవేల ? - మానుమీ" వనిన
గజగజ వడఁగి వె - న్కకు వెనక్క వచ్చి
బుజముల చేతులు - పొదువుక మొదిగి
యున్నచో కైకేయి - "ఓయి సుమంత్ర!
నిన్నట నుండియు - నిద్దుర లేక
సంతోషమున వేగు - జాము పర్యంత
మెంతయు వేగించి - యింతకు మునుప 1740
నిద్రించు కతమున - నిను నొవ్వఁబలికె
భద్రాత్ముఁ డగురామ - భద్రు నిచ్చటికిఁ
బిలిపింపు చూడంగఁ - బ్రియమయ్యెనాకు
సలలిత మంగళా - చారసంపన్ను
నిప్పుడె తోడి తె - మ్మిల తామసము
తప్పకుండఁగ ముహూ - ర్తము పంపవలయుఁ
బొమ్మన్న సంతోష - మున నాతఁడరసి
కమ్మకజనులెల్లఁ - గ్రందుగాఁజూడ
వనధి తరంగముల్ - వడిఁద్రోచివచ్చు
ననుపమంబైన మ - హోమీన మనఁగ 1650
సందడిఁ ద్రోయుచుఁ - జని రఘువీరు
మందిరంబునకు సు - మంత్రుండు రాఁగ
నెదుర వసిష్ఠుండు - నెల్లరాజులును
గదిసి "సుమంత్ర! యె - క్కడకు నేఁగెదవు
అభిషేకవస్తువు - లన్నియుంగూర్చి

విభుని యాగము నందు - వీక్షించి యేము
కాచియుండంగది - గ్గనినీవు మమ్ము
చూచియుం జూడక - జుణిఁగి పోయినను
మామనవులు దెల్ప - మఱివేఱె యెవ్వ
రేమేర మాకొల్వు - లెక్కు రాజునకు" 1760
అనిన సుమంత్రుఁ డి - ట్లనియె "మీరెల్ల
ఘనులు పూజ్యులు రాజుం - గారికి నగుట
యెఱుఁగుము రాముని - నిచటికిఁ బిల్వ
నరుగుము నీవన్న - నమ్మహీ విభుని
ఆనతిం జనియెద - నైన నేమయ్యొ
గానిందు పోయిమీ - క్రమము దెల్పెదను"
అనిగిఱుక్కన వార - లచుపంగ మఱలి
చని కేకయతనూజ - సదనంబుచేరి
రాజుమంచముపై కు - రాడంబు చెంత
రాజిల్లు పట్టుతె - రయు వెలిగాఁగ 1770
నుండి తన్నెఱింగించి - "యోమహీనాథ!
మండలాధిపులును - మౌనిపుంగవులు
పనిపూని నీ విన్న - పము సేయుమనిరి
చనువాని నరికట్టి - సందడింపుచును
నందఱి తోనేమి - యందు" నటన్న
యందుకు దశరథుం - డతనికిట్లనియె.
"రామునిఁ దోడితే - రఁగ నేము పనుప
ఆమాట మఱచినీ - వటుపోయివచ్చి
బనికిమాలిన వారి - పలుకులు దెల్ప
పనిపూని యుటకు రాఁ - బరగు నేనీవు? 1780

యేలవచ్చితివి ? పో - మ్మిఁక నైన రాము
పాలికి తామసిం - పక పోయి పిలిచి
తోడితెమ్ము వాకిటి - దొరలు నిన్నేమి
యడిగిన వచ్చెద - మని పల్కు రనుము
పొమ్మన " నగరు గొ - బ్బున నిర్గమించి
యమ్మంత్రివరుఁ డయో - ధ్యా రాజవీథి
రాముని మేలు వా - ర్తలు గుముల్ గూడి
యేమేరఁజూచిన - నితరముల్ మఱచి
పలుకు నానాజన - భాషణంబులకు
నలరుచు రాము గే - హము చేరఁబోయి 1790
పసిఁడి హజార ము - ప్పరిగలుఁజిత్ర
వసన వితానముల్ - వజ్రాలపలక
రాకట్టు నేలలు - రంగవల్లికలు
దాకొన్న యపరంజి - తలుపులు మణుల
గోడలు పగడంపు - కొణిఁగెలుఁ కెలని
క్రీడాశుకీ హంస - కేకినీ వ్రజము
కదళికా క్రము కేక్షు - కాండ ప్రకాండ
సదమల స్తంభ రా - జన్మండపములఁ
గర్పూర కౌశుకా - గరుధూపములును
దర్పణమాలికాం - తర బొమ్మరములు 1800
చాంపేయ మల్లికా - సరదివ్యగంధ
సంపదలుం గల్గు - సదనంబుఁ జొచ్చి
కానుకల్ పూనియే - కడగాచియున్న
నానాజనములు మ - న్ననఁ దేఱిజూచి
తనుఁగని లేచి హ - స్తంబులు మొగుచు

జనపాలకులఁ దగు - సరణిమై గొనుచుఁ
గమనీయ పర్వతా - కరమయి(బ్రోల)
నమరు శత్రుంజయా - మనుభద్ర గజము
భావించి చతురంగ - బలములు బలసి
త్రోవయియాయక యుండ - త్రోపుఁ ద్రోపులను 1810
వచ్చి దాసీకుబ్జ - వామ నాంతరముఁ
జొచ్చి ప్రాంతతికమై - చుట్టాలగుంపు
ముదుసళ్ల సావడి - మొగదల నిలిచి
చదురాలి నెగ్గడి - సకియ రప్పించ
తనరాక వివరించు - తటినదిపోయి
వనజలోచను దీన - వత్సలు రాము
సీతాసమేతు నీ - క్షించి తెల్పుటయు
నాతలోదరి చేత - నతని రప్పింపఁ
దావచ్చియెదుటఁ బ్ర - ధాన వర్యుండు
రావణహరణకా - రణమైన వాని 1820
జాటినసిక మీఁది - సంపఁగె సరులు
సూరెల వలపు లె - చ్చుగ నిచ్చువాని
అక్కజంబగుచు ఘు - మ్మని తావు లీను
చెక్కులు జవ్వాది - చిన్నెలవాని
సీతకౌఁగిట నంటి - చెదఱు నెమ్మేనఁ
జాటిన కుంకుమ - సవరణవాని
నున్నని వీడెంపు - నును గెంపుమోవి
జెన్నుమీఱినయట్టి - చిఱునవ్వువాని
సడలని కరుణార - స ప్రవాహములఁ
కడవోని నెత్తమ్మి - కన్గవవాని 1830

మగువల హస్తచా - మర మారుతములఁ
దగ నసియాడుకుం - తలములవాని
ధరణి తనూజ యం - దములైన తొడలఁ
జరణ పద్మంబులు - చాఁచినవాని
బంగరు మంచము - పై తలగడను
శృంగారముగ మేనుఁ - జేర్చినవాని
నుడిగపుఁ జెలియిచ్చు - నొసపరియాకు
మడుపునకై కేలు - మలచినవాని
వెలఁదియొక్కతె వంతు - విధమునఁ బాడు
జిలిబిలి పాటలు - చెవినానువాని 1840
వలనొప్పు సుఖపార - వశ్యత నిదుర
మెలఁకువ నటమున్న - మేల్కను వాని
చిత్రాసమేతుఁడై - చెలువొందు కుముద
మిత్రు తేజంబున - మించినవాని
శ్రీరామచంద్రు నీ - క్షించి రమ్మనఁగ
చేరిచెంగట నిల్చి - చేతులు మొగిచి
"జలజాత నయన! కౌ - సల్యా కుమార
యిలపతి కైకేయి - యింటిలోనుండి
రామునిఁ బిలుచుక - రమ్మని బనిచె
నామోముచూచి వి - న్నపము చేసితిని 1850
వేగ మీరచటికి - విచ్చేయుఁ డనిన"
నాగుణశాలి వా - క్యము లాదరించి
యయ్యెడ లేచి శ - య్యనుఁ గూరుచుండి
నెయ్యంబు మైచెంత - నిలిచిన యట్టి
జానకితో రామ - చంద్రుఁడిట్లనియె.

—: సుమంత్ర ప్రేరితుఁడై శ్రీరాముండు
కైకేయి కడకువచ్చుట :—

మానసంబున నను - మానింప కపుడు
అతివ కైకేయి గృ - హంబులోనుండి
క్షితిపతి పిలువఁ బం - చె సుమంత్రుచేత 1860
కౌసల్య యట్లట్ల - కాననుఁ జూచి
యాసాధ్వి వాత్సల్య - మందు నాయందు
నాయభిషేక య - త్నంబు మాతండ్రి
మాయింతి తోఁదెల్ప - నతిశయప్రీతి
ననుఁదోడి తెమ్మని - నారు గాబోలు
చనియెద పినతల్లి - సదనంబునకును
కాని కార్యమునకుఁ - గడవానిఁగాని
యీ నయగుణశాలి - నేల పంపుదురు ?
ప్రాప్తుండు సత్య సం - పన్నుండునాకు
నాప్తుండు నగుట నీ - యనవచ్చినాఁడు 1870
అభిషేక మీప్రొద్దె - యగు నేనువారి
యభిమతం బెట్టిదో - యరసి వచ్చెదను
పరిచారకుల తోడ - పరిణామ మొంది
తరుణి సీవొక ముహూ - ర్తము నిల్వుమిచట ''
అనిపోవ తనకు రా - నను వైన యట్టి
తనగృహాంతర ముఖ - ద్వారముఁ గడచి
మొగమటుంగున నిల్చి - ముచ్చటచేత
మగని నెమ్మోము దా - మర చక్కఁజూచి
''స్వామి యింద్రుని బ్రహ్మ - సకల లోకములు
నేమించి పాలింప - నిలిపినయట్లు 1880

మామామ మిమ్ము స - మస్త ధారుణికి
సేమంబుగా నభి - షిక్తునిఁ జేయు
దిక్కులపాలించు - దేవతల్ నాల్గు
దిక్కుల నిన్ను భ - క్తినిఁ గావఁగలరు
యాయభిషేక మ - హా ముహూర్తమునఁ
బాయక మృగచర్మ - పరిధాన మొప్ప
నామృగ శృంగంబు - హస్తపద్మమున
సేమంబుతోఁ దాల్చి - నీవుండు నపుడు
దీక్షితుండగు నిన్ను దేవ - నేఁ జేరి
వీక్షింపఁగలదాన - విచ్చేయుఁడ ''నిన 1890
మానవతీమణి - మఱలిపొమ్మనుచుఁ
దాను సుమంత్రుండు - తననివాసంబు
ధారుణీధరగుహాం - తరము సింహంబు
తీరున వెడలి యం - తిక భూమినున్న
సౌమిత్రినాప్తుల - సకలబాంధవుల
సామంతులనుఁగూడి - జనులుసేవింప
వరమణిజ్వాలాల - వాలమధాంధ
కరివరోపమతు - రంగచతుష్కభయద
శార్దూలచర్మచం - చత్పరిస్తరణ
దుర్దాంతరిపు రాజ - దోర్గర్వహరణ 1900
సారథికంబునౌ - స్యందనవరము
నా రామువిభుఁడెక్కి - హైమచామరము
సౌమిత్రివీవ ని - స్సాణరావముల
భూమి యల్లలనాడఁ - బురుహూతుమాడ్కి
వందిమాగధులకై - వారంబు లెసఁగ

ముందర చతురంగ - ములు సందడింపఁ
గరులపై కేతన - కలశాగ్రహతినిఁ
దరణిముఖగ్రహ - తారకల్ చెదర
మేడలపై నుండి - మీనలోచనలు
వాడని పువ్వుల - వానలఁగురియ 1910
చేరి పుణ్యాంగనల్ - సేసలుచల్ల
పౌరుల జయజయయా - ర్భటి మిన్నుముట్టఁ
దనగేహమునుండి - తండ్రిచెంగటికిఁ
జనుచోట మణిమయ - సౌధవీథికల

—: రాముఁడు తండ్రి వద్దకు వచ్చుట :—

కడుపు చల్లంగ నీ - కల్యాణశీలుఁ
గొడుకుఁగాఁగన్నట్టి - కోసలతనయ
యీమహితోత్సవం - బీక్షింపఁదొల్లి
యేమిపుణ్యంబు లె - న్నేని సేసినదొ?
పట్టభద్రుని రామ - భద్రుని చెట్ట
పట్టి యీసామ్రాజ్య - పదవులందుటకు 1920
సీతయేమేమి నో - చినదో తొల్మేన
నీతనిచరణంబు - లెప్పుడుంజూచి
సేవింప మనము చే - సినయట్టి భాగ్య
మావేలుపులకైన - నదియేలకలుగు?
ఈపుణ్యావర్తనుం - డిలయేల నితని
ప్రాపున నెల్లకో - భనములందుదుము"
అనికరంబులు చాఁచి - "యయ్య! శ్రీరామ!
కనుచాటులేక యా - కల్పంబుగాఁగ

మీతండ్రితాతల - మిగిలిన యిట్టి
మీతరంబునఁబుట్టు - మిహిరాన్వయులను 1930
నందఱ మించి యీ - యవనిఁ బాలించి
యిందులనయ మార్గ - మిచ్చనేమఱక
ఆచంద్రతారార్క - మైన సత్కీర్తి
యేచాయవెలయ మ - హీపుత్రిఁగూడి
తల్లితండ్రులమాడ్కి - తమవంటి జనుల
నెల్లను రక్షింపు - మీ" యనిచాల
వినుతులుగావింప - వినియింతమైన
మనసులోనుబ్బక - మన్ననఁజూచి
శోభనద్రవ్యమం - జులములౌవిపణి
వైభవంబులకు భా - వము వికసింప 1940
మానిభూసురవృద్ధ - మండలాచరిత
మానితాశీర్వాద - మహనీయుఁడగుచు
బురవీధివచ్చున - ప్పుడు రాముఁజూచి
తిరుగునే మనసులు - దృష్టులు ప్రజకుఁ ?
కన్నులు తమకెల్లఁ - గలిగినఫలము
గన్నకై వడిఁజూడఁ - గల్గె నన్వారు
యీ రాముఁజూడని - హీనులు మనుజ
దానవులనుచు నా - త్మలనెంచువారు
ఆరతులెత్తరే - యదె రామవిభుఁడు
చేరికిగాఁగ వ - చ్చెనటన్నవారు 1950
యీతరిసేవింప - నెఱుఁగనివారు
రాతిపుట్టువులు నీ - రసులనువారు
యిమ్మహీపతిచూడ్కు - లెవ్వానిసోఁక

వమ్మానవుఁడు నిందు్యఁ - డని యెంచువారు
నై జనుల్ నలువంక - ననుచరింపంగ
రాజమార్గమునందు - రఘుకులో త్తముఁడు
సభలును దేవతా - స్థలములుం జూచి
యభిముఖుండై వల - యై వచ్చివచ్చి
చుక్కలుగోరాదు - సున్నపుమేడ
లెక్కియమ్ముఁలు నివ్వ - టిల్లు భూరమణు 1960
నగరిలోకొన్నియం - తరములుగడచి
దిగదిగమను రత్న - దీప్తుల సమరు
కై కేయియింటి చెం - గటఁ దేరుడిగ్గి
వాకిటిముదుసలి - వారినీక్షించి
వారలుబెదిరి తే - వఁగఁ గనుసన్న
వారించి వెనువెంట - వచ్చురాజులను
నందరనునిచి తా - నంతి పురంబు
నందు ప్రవేశింప - హరిణాంకురాక
నాసించు జలరాశి - యనఁ దనరాక
ఆసించి సకలసై - న్యము నంతరముల 1970
యేఁడుగాఁగ నిమేష - మేరదులుచూడ
ఆఁడుఁబుట్టువె కాని - యన్యంబులేని
బడిఁదల్లియిలుచొచ్చి - పానుపుమీఁద
బడి దీనుఁడై ముఖా - బ్జము వాడువాఱి
వెలవెలనై కన్ను - విచ్చకచాల
నలసి కై కేయీ స - హాయుఁడై యున్న
తనతండ్రిపదము లొఁ - దలసోఁక మ్రొక్కి

పినతల్లియడుగులఁ - జేర్కొనిప్రాలి
కరములుమొగిచిచెం - గటనుండునపుడు

—: కైక రామునితోఁ దన యభిప్రాయము జెప్పుట :—

ధరణీశ్వరుండు కం - దామరల్ దెఱచి 1980
చూచి "రామా!" యని - సుతుని నెమ్మోముఁ
జూచుచుఁగడుపులో - చుమ్మలుచుట్ట
పురపురఁబొక్కుచుఁ - బొరలి కన్నీరు
కురియనేమియుఁ బేరు - కొని పల్కలేక
యూరకె ప్రమాన్పడి - యున్నట్టితండ్రి
నారామవిభుఁడు భ - యంబుతోఁజూచి
త్రోవలో పామునుఁ - ద్రొక్కినవాని
కైవడి దిగులొంది - గజగజవడఁకి
"నెన్నడులేనట్టి - యీదైన్యమేల ?
నన్నుఁగన్ననృపాలు - నకుఁగల్గె" ననుచు 1990
పంచేంద్రియంబుల - పాటవంబెల్ల
నించుకయునులేక - యిలప్రాలువాని
కలఁగిన మనసుతో - కవ్వపుఁగొండ
కలఁకనొందిన వార్ధి - గతి నున్నవాని
రాహుగ్రహంబుచే - గ్రస్తుఁడై యున్న
యాహరిణాంకుఁడో - యన నొప్పువాని
తడఁబాటుతో నస - త్యంబులుఁబలికి
కడునార్తుఁడగు మౌని - గతిఁబొల్చువాని
భావించియేలకో - పదములప్రాల
దీవెన లీయండు - దేటికన్గొనఁడు 2000

యొరుల పైఁగినుకచే - నుండియు నేను
దరియవచ్చినఁబ్రమో - దమునొందు నెపుడు
ననుఁజూచియిట్టి దీ - నతఁజింతనొంది
జననాథుఁడేల ? ప్ర - సన్నుండుగాఁడు
యేమమ్మ ! కైకేయి - యీమహీవిభున
కేమేమి నేరంబు - లేనుచేసితిని
కాననే నపరాధి - గాఁగదా ! యితని
కీనెగులునుఁగోప - మేల జనించె ?
ఈ యనఘాత్ముని - నీవైన వేఁడి
నాయెడఁజేయు మ - న్నన నియ్యకొలుపు 2010
యెప్పుడునాయందుఁ - గృపయుంచు నృపతి
యిప్పుడేల యుపేక్ష - నిటులున్నవాఁడు ?
నాతోమృదూక్తులా - నతియియ్యఁడేల ?
యీతనిచిత్తమీ - వెఱిఁగియున్నావె ?
ఈరాజునకుసేమ - మేకదా ! నేఁడు
శారీరపీడలె - సంగకున్నదియె ?
భరతశత్రుఘ్నుల - పరిణామవార్త
లరసియున్నారెకా - యమ్మ ! వారలను
సేమంబుతో సుర - క్షితులెకా నగర
యీమహీపతి చిత్త - మింతగాసిలిన 2020
సంతోషపటపక - క్షణమైనమేని
పొంతనుండవు ప్రాణ - ములు తనకిపుడు
తనకుదైవంబును - తంద్రియునైన
జనపతి యిటులుండ - సహియింపఁగలనె ?
యెవ్వరీ విభునకు - నెగ్గుగానడచి

దివ్విధమని యాన - తీవమ్మ ! తనకు
మదిమదినుండక - మందెమేలమున
నెదురాడి పరుషోక్తు - లీవుపల్కితివో ?
పిలువనంపినరాజు - ప్రియవచనములు
పలుకకయిపుడొక్క - పగిదినున్నాఁడు 2030
హేతువుదెలిసిన - నివ్విధంబనుచు
నాతోడఁదెలుపు మా - నవతీలలామ !"
అన విని కైకేయి - యడఁకువలేక
వినుమని యారఘు - వీరుతోఁబలికె.
" ఈ రాజునకుఁ గోప - మింతయుఁగాన
మేరిపై నేరమొ - క్కింతయులేదు
వేఁతేయున్నది మహీ - విభుని చిత్తంబు
పోరామి నీకు ని - ప్పుడుగలదేని
నీ నిమిత్తంబుగా - నెలకొన్న భయము
మానఁజేయము తండ్రి - మాటచెల్లించి 2040
అహితంబు నీకు నా - కదియె హితంబు
మహిపాలకుండు ప్రే - మఁబ్రతిజ్ఞ చేసి
యేమనిపల్కఁడు - నితనితో ననుచు
నీమేర మొగమాట - నిటులున్నవాఁడు
యీరాజు తొల్లినాకి - చ్చెనువరము
లోరామ ! వేఁడితి - నోడకయిపుడు
నాకనిచ్చితినని - నమ్మికల్ సేసి
ప్రాకృతగతి రిచ్చ - వడియున్నవాఁడు
యేమిసేయుదునని - యిటునటుఁగాక
యీమహీశుని సత్య - మిటులుండఁజేసె 2050

పట్టి యాలోచనల్ - వలవని జాగు
పెట్టుక యిటుల నం - బేద మైనాఁడు
దాఁచనేమిటికి ? స - త్యంబురాజునకు
నీచేత నిలుచునో - నిలువదో యెఱుఁగ
జనపాలుఁడిట్టి య - సత్యదోషమున
మునుఁగకుండఁగఁజేయు - ము కుమార! నీవు
హితుఁడవై చేసెద - నేనంటివేని
యితనియభిప్రాయ - మెఱుఁగఁబల్కెదను
తగవుతోఁ దండ్రి స - త్యంబు చెల్లించు
తెగువ నీమదిలోన - దృఢమయ్యెనేని 2060
జనసమ్మతంబును - సద్ధర్మమూల
మును పితృనిర్దిష్ట - మును నైనమాట
నీతండు మదిఁగొంకి - యిట్లన కన్న
నీతోడవివరింతు - నిక్కంబుఁగాఁగ
నీమదిఁగానక - నేఁబల్కరాదు
రామ ! వాకొను "మని - రాజువినంగ
కట్టిడియై పల్కు - కైకేయి మాట
వెట్టపుట్టఁగతన - వీనులు సోఁక
రామచంద్రుఁడు దశ - రథుఁ డార్తిమునుఁగ
గామిడియై నట్టి - కైకకిట్లనియె. 2070
" ఏలమ్మ ! నన్నునీ - విటులాడియిట్టి
యాలోచనలు సేతు - రా వెఱ్ఱితల్లి !
యీ రాజుపనుపుచే - నింగలంబైనఁ
బోరునఁజొత్తునం - బుధిఁబ్రవేశింతు
ద్రుంగుదు విషమైన - మిగిలినవేల ?

యింగితంబెఱిఁగింపు - మెఱుఁగవు గాక
అకట! రాముఁడును రెం - డాడునా పనికి
యొకయెడనైననీ - యుల్లంబులోన
కలిగినమాట వే - గమె తెల్పు" మనుచు
నిలువ నాడినబుద్ధి - నేరనికైక 2080
సత్యబుజుత్వాది - సద్గుణైశ్వర్య
నిత్యుఁడా శ్రీరాము - నెమ్మోముఁజూచి
"వినుము! రాఘవ! తొల్లి - విబుధాసురలకు
సనిమైన యపుడు మీ - యయ్య నాచేత
బ్రదికి వరంబులు - పాలించె రెండు
మదిలోన నిన్నాళ్లు - మఱచియుండితిని
అప్పుదీరుపుమని - యా వరంబులకు
నిప్పుడు పదునాలు - గేండ్లు కానలకు
నినుఁ బంపనొక్కటి - నేఁడు మాభరతుఁ
గని మనుపట్టంబు - గట్టుట యొకటి 2090
అడిగిన నిచ్చితి - ననిపల్కి నిన్ను
తడయక పిలిపించి - దాక్షిణ్యమొప్ప
తానాడలేక యీ - దశరథ నృపతి
దీనుఁడై యున్నాఁడు - తెల్పితినీకు
నీవును నీమాట - నిల్పి వంశంబు
పావనంబుగ తండ్రి - పలికిన పలుకు
సత్యంబు గాఁజేసి - చనుము కానలకు
నత్యంత సంతోష - మందింపునన్ను
డాఁపనేమిటికి? జ - టా వల్కలంబు
లీప్రొద్దె ధరియించి - యీవు పట్టంబు 2100

విడిచి పోయిరివేని - వేగ నొక్కటియుఁ
జెడకుండు నీయభి - షేకంబు కొఱకు
యీ సంతరించిన - యిన్ని వస్తువులు
దాసి యాభరతుఁ బ - ట్టంబు గట్టుదురు
తనకిచ్చు వరములు - తప్పఁ గారాక
నినుఁజూచి యొకమాట - నేఁడాడలేక
యేమి సేయుదునని - యీచింతచేత
రామ ! మీతండ్రి యా - రటము నొందెదును
యిది నిక్కమ"ను మాట - యెప్పుడు వల్క
నదివిని యప్రియం - బను చింతలేక 2110
చిరధైర్యశాలియై - శ్రీరామవిభుఁడు
దొర వినఁ గైకేయి - తో నిట్టులనియె.

—: కైకతో రాముఁడడవికిఁ బోయెదనని చెప్పుట :—

" తల్లి ! మిక్కిలి లెస్స - తండ్రివాక్యములు
చెల్లించితిని నార - చీరలుగట్టి
యిదె చనుచున్నాఁడ - నేను కానలకు
నదియేల ననుఁజూచి - యలరఁడీ రాజు
నాయెడఁ గృపయుంచి - నరనాథు మదికి
నోయమ్మ ! సంతోష - మొందింపు నీవు
అకట ! రాజట ! తండ్రి - యఁట ! నాకునట్టి
యకలంక చరితు వా - క్యము సేయుటరుదె 2120
మేలయ్యె నాకు నా - మీఁద దాన నీకు
వేళంబ భరతు నీ - వేళ రప్పించి

పట్టంబుఁగట్టుము - భరతుని కన్న
నిట్టిరాజ్య సుఖంబు - లేఁటికినాకు
నతనికినై ప్రాణ - మైన యేనిత్తు
నితరునిగా నన్ను - నిట్లరచేసి
నీవు వల్కినమాట - నెమ్మదిలోన
నావదిన్నటుల ఖే - దావహంబయ్యె
నేమి యిమ్మన్న నే - నియ్యనే యతఁడు
సామాన్యుఁడే ప్రాణ - సదృశుండు నాకు 2130
యేలమ్మ ! యిందుకై - యింతప్రయత్న
మీలీల నొప్పింతు - రే మహీ విభుని
నేద దేర్పుము నన్నుఁ - జేపట్టి రాజు
ఖేదంబు మాన్చి యం - కిలి నొందనీకు
అమ్మ ! పోయెద దండ - కారణ్యమునకుఁ
బొమ్మన వలవదీ - భూపతి నన్ను
నీవుపల్కుట చాలు - నిక్కవంబ "నిన
నావేళ సంతోషి - తాత్మయై పలికె.
"భయభక్తి లెఱుఁగుదుఁ - బతి యెడఁగలిమిఁ
పయనమై పొమ్ము ద - బ్బర లేదు నీకు 2140
యీరాజు సిగ్గుచే - నిట్టననోడి
యూరకయున్న వాఁ - డోర్చి యింతటికిఁ
కెరలఁడు గుటికెత్రిమిం - గిన సిద్ధుఁ డగుచు
తరలఁడు నను కాని - దాసిఁగా జేసి
నినుసంప భరతుని - నేఁబిల్వనంపి
తనపూన్కి చెల్లించు - దనుక నీరాజు

నిజమున కాహార - నిద్రలు సుఖము
త్యజియించి చలపట్టి - తలఁకకున్నాఁడు
జాగుసేయక నీవు - క్షణమైన పురిని
వేగంబ చను" మన్న - వేఁడి పల్కులకు 2150
నుర్విపైబడి మూర్ఛ - నొందినరాజ
సార్వభౌమునిఁగాంచి - చాలఁ జింతించి
చెంత కొయ్యనచేరి - చేతులునెత్తి
కొంతయూరట చేసి - కూర్చుండఁ జూచి
తలఁకి కశాహతో - త్తమతురంగంబు
పోలుపున దశరథ - పుత్రుఁడిట్లనియె.
"రమణి! నాకర్థాతు - రత లేదు మాని
సముచరిత్రుఁడను రా - జ హితంబువేడి
యెంతటి కార్యంబు - నేఁజేయువాఁడ
నెంతటి పుణ్యంబు - లేదు గావనిరి 2160
తల్లిదండ్రులకు చి - త్తములు రామెలఁగి
యుల్లసిల్లుటకు నా - యల్ల మీవెఱిఁగి
యిటు లానతిత్తురే - యెఱుఁగకయున్న
పటుబుద్ధి నడుగు మా - పార్థివోత్తముని
భరతుండు వచ్చిన - ప్పటికి మీయన్న
చరిత మిట్టిదియని - సమ్మతి వినుము
వేడు మెవ్వరినైన - వేయేల కదలి
నేఁడె పోయెదను వ - నీ భాగములకు
కౌసల్యతో జన - క తనూజతోడ
నోసాధ్వియేఁబోయి - యొకమాటఁ దెలిపి 2170

చనిమె" దన నీయను - జ్ఞ యొసంగునాకు
పనివిందు నేనిల్పు - భరతుఁ బట్టమున
నెచ్చరికను భర్త - నెవ్వేళఁగాంచి
మెచ్చురాసేవ నెమ్మెయిఁ - జేయు మనుము
నయ్యచిత్తంబు రా - నశ నాదులందు
నెయ్యెడ భయభక్తి - నీవు వర్తిలుము"
అనునంతలో తాల్మి - యదికట్టలేక
జననాయకుఁడు రామ - చంద్రుఁ గట్టెదుట
నెలుఁగెత్తి బెట్టుగా - నేడ్చినఁ జూచి
నిలుపోపరాక - తానిలిచితి నేని 2180
తప్పు కార్యంబని - తల్లిదండ్రులకు
నప్పుడ వలవచ్చి - సాష్టాంగ మెరగి
మఱలి చూడక కైక - మందిరంబపుడు
చిఱునవ్వు మోముపైఁ - జిట్టెడ వెడలి
కోపశోకంబుల - గుందు లక్ష్మణుని
చూపుల నూరార్చి - చూచుచోనెల్ల
ముత్తమానభిషేక - ముఖ్య వస్తువులు
చిత్తగింపుచుఁ బ్రద - క్షిణముగావచ్చి
లాలిత సామ్రాజ్య - లక్ష్మిఁ బాసియును
శ్రీలెంచి యతులవి - శేషలక్ష్మలను 2190
మేనిచెల్వామర భూ - మియు వైభవములు
మానికై వడిఁ బాసి - మదిరంజిలంగ
నే వికారము లేక - యెవ్వరి వెంట
రావలదనుచు ఛ - త్రము చామరములు
బిరుదులు టెక్కెముల్ - భేరిమృదంగ

మురవాదులును మును - మున్ను వారించి
మృదువచనముల భూ - మి జనాళినెల్ల
హృదయ రంజనము వ - హింపఁ జేయుచును
తనవారు మిగుల చిం - తల నొందకుండ
మనసు చల్లఁగ జేయు - మాటలాడుచును 2200
తల్లియింటికి సుమి - త్రా పుత్రుఁగూడి
యల్లన వచ్చుచో - నట మున్నుగాఁక
నగరిలోనున్న కాం - తా జనంబెల్ల
పొగులుచు కైకేయి - బూమెలం దగిలి
అక్కటా! రాజుకామాం - ధుఁ డైనీతిఁ
దక్కి యీయింతికి - దక్కి రాఘవుని
వెడలి పొమ్మను మాట - విని యూరకుండి
వెడబుద్ధియై లేని - వెతలఁ బొందెడును
రామునికా యీయ - రణ్య ప్రయాణ
మేమని ? విధి నెంత - మెటులోర్వ గలము 2210
కౌసల్య మాఱుఁ గాఁ - గనుచుండు మనల
నీసెఱుంగఁడు మన - మేమి సేసినను
నొరులు గోపించిన - నోర్చిసైరించు
తరతమత్వ ములనం - దఱఁ బ్రోవనేర్చు
అనివత్సములఁ బాయు - నట్టిధేనువులు
యనువున విలపించు - నార్తరవంబు
రాజన్య శోకాగ్ని - రవులు కొల్పంగ
రాజీవనయనులు - రామ లక్ష్మణులు
వినియును విననట్లు - వృద్ధసేవితము
జనిన గృహద్వార - సవిధంబుచేరి 2220

వారు ప్రత్యుద్ధాన - వైఖరుల్ నడప
నారసి మన్నించి -యవ్వలికక్ష్య
భూసురవృద్ధులఁ - బొగడనివారు
చేసిన మంగళా - శీర్నుతులంది
అవలి యంతరమున - కరిగిన నచటి
యువతులు కౌసల్య - యున్నెడకేఁగి
తమరాక వివరింపఁ - దారనువెంట
దమతల్లి యుండు చెం - తకుఁ జేరునపుడు.

—: కౌసల్యతో నడవికిఁ బోయెదనని రాముఁడు చెప్పుట :—

ఆరేయి సకల దేవా - రాధనములు
నారాయణ స్మర - ణములు సేయుచును 2230
ఆదినంబెల్ల బ్రా - హ్మణ సమర్చనము
లాదిత్య చంద్ర బృ - హస్పతి ప్రముఖ
నానాగ్రహ ప్రస - న్నత్వనిదాన
మానిత శాంత్యాది - మంగళాచార
నియమితంబగు వస్తు - నికరంబుచూచి
ప్రియసోదరుఁడు కంటఁ - బెట్టినసీవు
కరమున వారించి - కలఁక యడంచి
యిరువుర గదియరా - నెదురులు చూచి
అప్పుడాసన్న ప - ట్టాభిషేకమున
కుప్పొంగి తనకున - భ్యుదయంబుఁగోరు 2240
తల్లిపాదములపై - దలమోపిమ్రొక్క
చల్లని చూపుల - సాధ్వి కౌసల్య
తనయుని నిండారఁ - దనదు కౌఁగింట

నునిచి మూర్ధాఘ్రాణ - మొనరించి యలరి
"రామ! పురాతన - రాజర్షి వరుల
యామేరఁ గీర్తియు - నాయువుఁ గలిగి
వివిధ వైభవముల - వెలయుదుఁగాక
యవనీశ్వరుని కృప - నభిషేక మొంది
సత్యసంధుఁడు రాజు - సామ్రాజ్యపదవి
నిత్య సద్గుణశీలు - నికి నీకు నొసంగి 2250
పరమాయు రున్నతిఁ - బరగిలోకైక
విరచిత స్తుతులచే - విలసిల్లుఁగాక
అన్న యాకొంటివి - యన్నమే నిడఁగ
మన్నన భుజియించి - మందిరంబునకు
నరుగు మీవ" నిపిఁ - టలన్నఁదమ్ములకు
సరిగాఁగ నునుపఁ గా - సల్య వాక్యములు
వినిసిగ్గుతో మోము - వెలవెలఁగాఁగఁ
దన తలవాంచి యే - దండకాటవికిఁ
జనువాఁడ నినుఁజూచి - చనియెద ననుచు
జనని! వచ్చితినేను - జానకితోఁడ 2260
యీవార్త యిప్పుడే - యెఱిఁగించి వనికిఁ
బోవఁగా వలయు గొ - బ్బునఁ బంపు మిపుడు
చనదింక మునివ - రాసనములంగాని
కనకాసనములపైఁ - గదిసి కూర్చుండ
సహజంబులగు కరాం - జలు లింతెకాని
విహితమే యపరంజి - పెడఁదపళ్లెములు
కందమూల ఫలాది - కము లింతెకాని

యందంబు గాదురా – జాన్నభోజనము
నీకు నీలక్ష్మణు – నికి మహీసుతకు
నేకడఁ దరివచ్చె – నిడుములం బడఁగ 2270
పదునాలు గేఁడులా – పదలెల్ల నొంది
వదలక యేనుండ – వలయుఁ గానలను
భరతునిఁ గట్టను – పట్టంబు రాజు
ధరణి కెల్లను నన్నుఁ – దరమె కానలకు"
అన మొదలంటంగ – నసిచేతఁ దునియు
ఘనతర శాఖి శా – ఖనుఁ బోలి యపుడ
ధరణిపైఁబడిన బృం – దారక రమణి
తెఱఁగున మూర్ఛిలి – తెలివిడి లేక
యిలనున్న కౌసల్య – నెత్తి యూరార్చి
అలయికఁ బొడవెట్టు – నశ్వ యనంగ 2280
ధూళిగ్రుంగిన మేని – దుమ్ముతాగట్టు
చేలచే దుడిచి స – చేతనం జేయ
రామునిఁజూచి తీ – రని యార్తి వెనిచి
సౌమిత్రి వినఁగఁ – గౌసల్య యిట్లనియె.
" గొడ్డువీఁగినయట్టి – కొమ్మలకెల్ల
బిడ్డలు లేరను – పెనుచింతగాని
యితరదుఃఖములు వా – రెఱుఁగరు నీదు
కతమున శోకసా – గరమగ్ననైతి
రాజునకే పెద్ద – రాణివాసమను
పూజనీయత లెందుఁ – బొరయ లేనైతి 2290
అనువిచారములచే – నడలెదునాకు
నినుఁగూర్చియిటమీఁద – నిర్విచారముగ

నుండంగ లేనంచు - నుండితి నిటుల
పండెనే నానోము - ఫలము లన్నియును
సవతులందఱు నన్ను - చవుకగానెంచి
యవమానవాక్యంబు - లాడుచునుండ
వినుచుంతఁగడవ యీ - వెలఁదిపుట్టువుల
గొనియు నీఁగించు నె - గుల్మరికలదె
నీవున్నయపుడె యి - న్నిదొసంగులైన
నావల మన సిత్తు - రా? వీరునన్ను 2300
కైకేయికిని దాసిఁ - గావలెనొండె
యాకొమ్మ దానిదా - స్యము సేసి బ్రదుక
వలెనొండెఁగాని యే - వలనఁ జూచినను
కలదె రాఘవ! నాకు - గతివేఱెయింక?
కైకేయిచల్లని - కడుపునఁబుట్టి
లోకంబు నీవె గ్గా - లుటకు రప్పించి
కట్టడి నగునాడు - కడుపున నేల
పుట్టించె నిను ధాత - పొరపొచ్చముగను
మగఁ డొల్లనట్టి య - మ్మగువల కెందు
జగమెల్ల వెదకఁ బూ - జ్యత లేలకల్గు? 2310
పరిజను లెల్లను - భరతునిం గొలిచి
సరకు సేయరు నన్ను - సవతుల మొగము
చూచియే శిరము వం - చుక సంచరింప
నాచాయ కైకయేము - ని పల్కఁ గలదా?
కొడుక! నీకును తండ్రి - కోరియు వేడి
వడుగు చేసిన తర - వాత నెమ్మదిని
నేనుండితిని పది - యేడేండ్లు కైక

చేనింక నేనేమి - సేగులందెదనొ ?
నీమోము చూడక - నిమిష మాత్రంబు
రామ ! యేక్రియఁ దాల్తు - ప్రాణముల్ మేన 2320
నియమవ్రతంబు ల - న్నియును గావించి
నియతి నుండుట లెల్ల - నిష్ఫలంబయ్యె
యీమాట వినియు నేఁ - జేలకో యవిసి
యేమియుఁ గాకున్న - దిపుడు నామనను
యేటి వెల్లువచేత - నిడియు గట్టునకుఁ
బోటియై దినదినం - బులఁ దీరవలసె
పంచాననము లేడిఁ - బట్టిన యటుల
కొంచు నేఁగఁ దదేల - కో నేఁడు జముఁడు
యమపురి చోటులే - దయ్యెనో తనకు
సమయంబు లందునా - శము లొందువారి 2330
కరణి యే చందమో? - కాన నత్తెఱఁగు
విరియదు మే నయో ! - వినిమయంబగుచు
వ్రతదాన నియమ ప్ర - వర్త నాద్యములు
వితలయ్యె వెతలయ్యె - వేడుక లెల్ల
చవుటనేలను వెదఁ - జల్లు బీజములు
హావశికం బోలివోవ - నాత్మ పుణ్యములు
నావు లేఁగనుఁ బాసి - యఱచినయట్లు
చావులేకునికి వి - షాద వేదనల
వేగింపఁ జాల నీ - వెంట నరణ్య
భాగంబులకు వత్తు - పైనమై యిపుడె" 2340
అనిమోము మీఁదఁ బ - య్యెద కొంగుఁ జేర్చి
తనచెంత కిన్నర - తరుణియుం బోలి

యెలుఁగెత్తి యెగవెక్కి - యేడ్చుచునున్న
కలఁగు చిత్తంబుతోఁ - గౌసల్యఁజూచి
యీసును రోషంబు - నినుమడి గాఁగ
నాసుమిత్రా పుత్రుఁ - డలుక నిట్లనియె.

—: కౌసల్యను లక్ష్మణుఁడూరడించుట :—

"ఓయమ్మ! శ్రీరాముఁ - డూరకే యేల
శ్రేయోభి వృద్ధులు - చెదిరి పోనాఁడి
యడవుల కేఁగ నా - యాత్మకు నిట్టి
వెడబుద్ధి సరిపోదు - విషయాతురుండు 2350
స్త్రీలోలుఁడును నైన - క్షితిపతికైక
చాలనిర్బంధింపఁ - జనవు చెల్లించి
మాటాడ నేరఁడు - మన రాముమీఁద
నేరమిట్లని పల్క - నేర్చునే యొకఁడు
ద్రోహంబుఁ గల్లయు - దోషంబు వెదకి
యూహించి పై మోప - నోపునే రాజు
త్రికరణాచారుండు - దేవతుల్యుండు
సకలసద్గుణగణై - శ్వర్య పూర్ణుండు
నయశాలి సుజన స - న్మాన్యుఁ డుత్తముఁడు
దయగలవాఁడు సీ - తా ప్రాణవిభుఁడు 2360
నీతనయుఁడు నైన - నిర్దోషు రాము
నీతండ్రివలెఁ బుత్రు - నేతండ్రివదలె?
ఆలికి లోఁగిన - యతని మాటలకు
భూలోకమున లోఁగు - పుత్రులున్నారె?
యీ రాజు గతి యన్య - లెఱుఁగక మున్న

కోరి రాజ్యము గట్టు - కొందము మనము
కేల కోదండంబుఁ - గీలించి యేను
వాలాయముగ నిల్వ - వలెఁగాక రామ
ప్రతికూలుఁ డొకఁడు - డే పట్టంబుగట్టి
క్షితికెల్ల నిను నభి - షిక్తుఁగావింతు 2370
అందుకుఁ జూపోప - నట్టి వారలను
చిందఱ వందఱ - చేసి వధింతు
బలిమిచే భరతుని - పక్షంబువారిఁ
జలపట్టి పోనీక - సంహరింపుదును
అటుమీద ని య్యయో - ధ్యా పట్టణంబు
చటులత నిర్మను - ష్యంబు చేసెదను
దానఁదీరక యున్న - ధరణి యంతయును
యే నస్త్రవహ్నికి - నిత్తు నాహుతిగ
శత్రుపక్షము వాఁడు - జనపతి నికట
శత్రుఁ డీతఁడె కాన - సంకెలల్ నైతు 2380
కాదేని యొకమాటఁ - గడ తేర్తుఁ బట్టి
యీదుష్ట మానసు - నిదియె నాపూన్కి
తప్పిన గురునైన - దండింపు మనుచుఁ
జెప్పి రాగమశాస్త్ర - సిద్ధాంతవిదులు
కైకేయి ప్రేరేపఁగా - మెత్తఁబడిన
నీకు నిట్టి యవస్థ - నేఁడు వాటిల్లె
యే రాజనని మది - నెంచియో యీతఁ
డీరాజ్య మాలికి - నీయఁ జింతించె
నినుఁ జేలుపుచ్చిన - నేఁబగ మైన
తన కేది శక్తియో - ధరణి నిచ్చుటకు ? 2390

నోమానవతి! నిక్క - మొకమాట వినుము
రామునియందె పో - రామి నాకెపుడు
తప్పదు నాదు కో - దండంబు నాన
చెప్పితి సుకృత సా - క్షికముగా నీకు
నామాట మీఱి వ - నంబుల వెంట
రాముఁడు పోవునే - రముమీఁదమోపి
యితనికిఁ బ్రీతిగా - నీ శరీరంబు
హుతవహార్చులకు నా - హుతి సేయువాఁడ
యేనుఁ గల్గఁగ నీకు - నీచింత యేల ?
మానిని! మానవ - మ్మా!" యంచుఁ బలుక 2400
ఆ సుమిత్రా పుత్రుఁ - డాడు మాటలకుఁ
గౌసల్య రఘువీరుఁ - గాంచి యిట్లనియె.
"అన్న! రాఘవ! తమ్ముఁ - డాడినమాట
విన్నావె కదనీకు - వినఁ గూడ దేమొ
ఆలోచనముచేసి - యది హితంబైన
మేలెంచి నాదుని - మిత్తంబుఁ గాఁగ
నడపింపు కాదేని - ననువెత బెట్టి
నడికి నోర్చినకైక - చనవు చెల్లింపు
ననుడించి నీవు వ - నంబులకేఁగ
చనునయ్య యెఱుఁగవె - సకల ధర్మములు ? 2410
మాతృ శుశ్రూషయే - మఱిక కశ్యపుఁడు
ఖ్యాతిగా నమర లో - కసుఖంబు లందె
దశరథు మాటచం - దమున నామాట
కుశలంబు దలఁచి నీ - కునుఁ జేయుటొప్పు
తల్లి యేకద పర - దైవతం బనుచు

నెల్లెడ నిగమంబు - లేవేళఁ బల్కు
వనికిఁ బోవఁగ నేల ? - వం దెదునాడు
మనసు చల్లఁగఁ జేసి - మనుము కుమార !
కాదంటివే జన - క తనూజఁ గూడి
యాదండకాటవు - లందు నీదండ 2420
నాకుల నలముల - నాఁకలిదీర్చి
శోకంబు లేనట్టి - చో వసింపుదము
విడిచి పోయెదనన్న - వేగఁ బ్రాణములు
విడుతునేఁ బ్రాయోప - వేశంబు చేసి
పిప్పలాదుండను - పృథివీసురుండు
తప్పి సముద్రుఁ బా - తకుఁ జేయురీతి
మాతృ హత్యాదోష - మహితుండు ఘోర
పాతకి యనుపింతుఁ - బ్రజలచే నిన్ను
వనముల కరుగంగ - వలదు చాలింపు ''
మను తల్లితోడ ని - ట్లనియె రాఘవుఁడు. 2430
'' వేఁడెద నిన్ను వే - వేలైనఁ దండ్రి
నేఁడు వల్కినమాట - నేమీఱఁ జాల
గురుని యోగంబుచే - గోహత్యచేసి
దురితంబులనుఁ బాసెఁ - తొలుత కండుండు
తనతండ్రి ముదుసలి - తపము తామోచి
ఘనుఁడు పూరుఁడు వంశ - కరుఁడై యొసంగె
తమపితృహితము నా - ధారుణీంద్రవ్వి
సమసియు సగరులు - సద్గతిఁ గనిరి
జనకుని పంపున - జనయిత్రిఁ ద్రుంచి
మునుభార్గవుఁడు లోక - మునఁ బుణ్యుఁడయ్యె 2440

పితృవాక్య మొనరించి - పృథివి ననేకు
లతిశయ విఖ్యాతు - లందిరి మఱియు
నేనట్ల తండ్రికి - హితమాచరింపఁ
బూనితి దాన నె - ప్పుడు హానిరాదు
అమ్మ! నీకిటులాడ - నగునే" యటంచుఁ
దమ్మునిఁజూచి సీ - తా విభుఁడనియె.
"ఓయి! లక్ష్మణ! నీకు - నుల్లంబు లోన
నాయందుఁగల ప్రేమ - నామదిం గలదు
యెఱుఁగుదు నీశౌర్య - మెఱిఁగియు నీతి
దొఱఁగి యిట్లాడుటల్ - ద్రోహంబుగాదె 2450
ధర్మంబె లోక - హితంబు ఘనంబు
ధర్మంబునందె స - త్యము బాదుకొనియె
తండ్రియాజ్ఞ మెలంగ - ధర్మంబు తల్లి
దండ్రుల మాటలు - దప్పింపరాదు
కైకేయిమాట ని - క్కము రాజుమాట
యీ కీడుమాట - నీ విటులాడదగునె
వలవదీపలుకని - వారించి తల్లి
కెలఁకునఁజేరి భ - క్తి నమస్కరించి
"దేవి! నాకునుఁ బ్రసా - దింపు మనుజ్ఞ
యే వనభూముల - కిపుడె పోవలయు 2460
నిప్పుడౌగాదని - యేమన్న తనకుఁ
దప్పిన దానవు - తల్లివిగావు
నీ దీవెనలచేత - నే వనవాస
ఖేదముల్ మానిసా - కేతంబు చేర
వలయుఁగావున స్వస్తి - వాదంబొసంగి

యెలమితోఁ గానల - కేఁగి రమ్మనుము
పదునాలుగేఁడులు - పదునాల్గుగడియ
లదియెంత నాకు - నీ వనిపినం జాలు
ఆకసంబున నుండి - యవనికి వచ్చు
నాకల్పకీర్తి య - యాతి చందమున 2470
మఱలివచ్చెద నీదు - మది యలరింతు
మరి తరవాత నీ - మాట చేసెదను
నీవు సుమిత్రయు - నీ లక్ష్మణుండు
నా వసుధాపుత్రి - యందఱుఁగూడి
మనరాజు చెప్పిన - మాటలో నడచి
మనువారమిది - సుఖీ మర్యాద మనకు
ననుకూల మగు నన్న" - యా రాము మాట
తనమది నెంచక - తల్లియిట్లనియె.
"నీవులేనట్టి నా - నియమంబులేల ?
యీవిశ్వ జనులచే - యెన్నికయేల ? 2480
తగవేల ? సుఖమేల ? - ధర్మంబులేల ?
పగయేల ? హితమేల ? - పదవులదేల ?
అమరలోకంబైన - నదియేల ? సర్వ
సమచరిత్రునిఁ సత్య - సంధుఁ గుమారు
నిన్నుఁ జూచుచు నెంత - నేయున్నఁజాలు
నన్నియు నేనొల్ల - నన్యంబులైన"
అని నిశ్చయంబుగా - నాడిన తల్లి
యనుపమదైన్య వా - క్యంబు లాలించి
కొఱవిఁ జూచిన యేను - గునుఁ బోలి చాల
వెఱచి యా శ్రీరామ - విభుఁ డిట్టులనియె. 2490

'అదియేమి లక్ష్మణ! - యన్మయన్నట్ల
మదికిఁ దోఁచినయట్టి - మాటలాడెదవు?
తొల్లిమన్వాదులు - దుఃఖంబు సుఖము
నెల్లెడం బ్రాపింప - హేతువుల్ గాఁగ
ధర్మార్థ కామసం - తతి నెందు పలికి
రర్మిలితోడ నే - నది సమ్మతింప
నాదు సిద్ధాంత ని - ర్ణయ మెటులన్న
నాదిఁ బల్కిన ధర్మ - మాచరించెదను
నందుచే నితరంబు - లన్నియుఁగల్గు
నిందుకు దృష్టాంత - మెటులంటివేని 2500
వలచినదై వశ - వర్తిని యగుచు
వెలయు పుత్రులఁగన్న - వెలఁది యొక్కరిత
కలిగిన ధర్మార్థ - కామసౌఖ్యములు
గలిగించు కరణి నొ - క్కట (గలిగించు)
సకలజనద్వేష - జనక మర్థంబు
ప్రకటమౌ నింద కా - స్పదము కామంబు
అటుగాన నేయే ప్ర - యత్నంబులందుఁ
బటుమతి ధర్మత - త్పరుఁడు గావలయు
గురుఁడు వృద్ధుడు తండ్రి - కువలయేశ్వరుఁడు
పరికింపఁ దానయౌ - పార్థివోత్తముఁడు 2510
నానతిచ్చిన యర్థ - మాదలయందు
బూనికావించుట - పుత్రధర్మంబు
మనతండ్రి కౌసల్య - మగఁడట్టిరాజు
మనకెల్లగతి గాక - మరివేఱ కలదె?
రాజు జీవంతుఁడై - రాజ్యంబుసేయ

నేజాడ నావెంట - నేవత్తుననుచు
కౌసల్యపలికెడుఁ - గంటివే ! " యనుచు
" నోసాధ్వి ! దీవెన - నొసగుము నాకు
వనవాసమీడేర్చి - వచ్చెదఁదిరిగి
తనకేల ? నొల్లన - ధర్మరాజ్యంబు 2520
యీరాజ్యకాంక్షచే - యేఁగీర్తివదల
నేర నే "నని తన - నిశ్చితార్థంబు
తమ్ముఁడు విను చుండఁ - దల్లితోఁబలికి
నెమ్మదిలోపల - నే ప్రదక్షిణము
చేసి పోవుదు నని - చెంగట మిగుల
గాసిలి బుసకొట్టు - కాలాహిరీతి
యున్న లక్ష్మణుఁ జూచి - యూరార్చి చాల
మన్నన సాత్త్వికమతి రాముఁడనియె.

—: లక్ష్మణుని రోషమును రాముఁడుఁపోగొట్టుట :—

" శోకరోషంబుల - సుడి గొనియుండ
నీకేల ? విభు మాన - నీయుఁగాఁ గనుము 2530
వలవ దీయభిషేక - వార్త చిత్తంబు
నిలుపఁబట్టుము నా వ - నీప్రయాణంబు
నభిషేకయత్నంబు - నటులచేకూర్చి
యభిమతింపుము కైక - యనుమానముడుపు
గణుతింప నాసాధ్వి - కడనాహితంబు
క్షణమైనఁ దామ - సించఁగ రాదు నాకు
తలితండ్రులకు నహి - తము కలనైన
దలఁచుట లేదు స - త్యపరాక్రముండు

సత్యసంధుండు - నైన జనకుండె సుమ్ము
ప్రత్యక్షదైవంబు - పరికింపనాకు 2540
నతనికి పరలోక - హానిలేకుండ
ప్రతిపాలనముసేతు - పలికినపలుకు
సత్యంబునకు రాజు - సంతాపమంద
సత్యంబు నేఁజూచి - సహియింపఁగలనె?
కావున వని కేఁగఁ - గలవాఁడ నిపుడె
భావించి యాదేవి - భరతునిందెచ్చి
గ్రక్కున పట్టంబు - గట్టుకోనిమ్ము
మిక్కిలి వేడుక - మెఱయించువాఁడ
జడలు వల్కలము లి - చ్చటఁదాల్చి పురము
వెడలునప్పటి నాదు - వేషంబుచూసి 2550
నా వనవాస మే - నరులకునైన
భావంబులనుఁ కోరఁ - బడు వారికెల్ల
జాగేల? మనసులు - చల్లఁగాఁజేతు
వేగంబుగా వట్టి - వెత నింతెకాక
చేకూడు రాజ్యంబు - చెదరిపోవుటకు
దాకొన్నదైవ య - త్నంబు ఋణంబు
దైవానుగూల్య మి - త్తరిఁగల్గెనేని
కావింపనేర్చునే - కైకయిత్తెఱఁగు
కైకేయి యెడనాకు - కౌసల్యకన్న
నేకడ భయభక్తు - లెచ్చుగానడతు 2560
భరతుని కన్న నా - పట్టున నెపుడుఁ
గరుణయు నెనరు న - గ్గలము కైకకును
అదినీవు నెఱుఁగుదు - వట్టి కైకేయి

చెదరనాడుట విధి - చేయ్దిగాకున్న ?
నాకిట్టిరాజ్యహా - నత యిట్టిబుద్ధి
కైకకుం గలుగుట - కర్మకృత్యంబు
యిందుచే దైవంబు - హెచ్చని జనుల
కందరకునుఁగాన - నయ్యో చూచితివె ?
అన్నికార్యములు దై - వాధీనబుద్ధి
నెన్ననేరకత్రోయ - నెవ్వారితరము ? 2570
భయముఁ గ్రోధము నులో - భమును లాభంబు
జయ మపజయమును - శర్మంబు వెతయు
మొదలైన వ్యాపార - ములు కొనసాగు
నది ధ్రువంబుగ దైవ - యత్నంబుసుమ్ము
మునులును తమ తపం - బులు పోవనాడి
యనయంబు కామమో - హక్రోధములకు
లోనౌటధారుణి - లో జనులొకటి
గానెంచ వేఱొండు - గా నౌటయెల్ల
దైవయత్నమె కాన - తనరాజ్యహాని
నేవలఁబరితాప - మేల పొందుదును ? 2580
శుభము చేకుర దిట్టి - చోఁ గాన నీవు
నభిషేకసంప్రాప్తి - యభిలాష ముడిగి
యందుకై తెచ్చిన - యట్టి తీర్థములు
నం దభిషేకింపు - మడవి కేఁగుటకు
వనవాసమున కేఁగు - వానికినేల ?
తనకు నీ మంగళా - ర్థ సువర్ణపూర్ణ
కలశోదకస్నాన - కలన యట్లైన
తలఁచివేఱుగఁగైక - ధరణీశు దూరు

నీవుచింతింపకే - నీటిచేనైన.
నీవేళ నాతలం - పెఱఁగికావింప 2590
నామతంబున రమ్ము - నామది మిగుల
కామింపుచున్నది - కానలుచేర
నేరాజ్యమొల్లక - యేఁగరె తొల్లి
ధీరులు వనులకెం - తేమేలుఁదలఁచి
అదియె నామదికిఁబ్రి - యంబయి తోఁచె
నిదిదైవగతిక్రైక - నేలదూరెదవు?"
అనిపల్కఖేదమో - దాయత్తచిత్త
వనరుహుఁడైతల - వాంచి యుష్ణానుచు
నురగంబురీతి ని - ట్టూర్పులు నిగుడ
హరిమాడ్కిచూడ భ - యంకరుఁడగుచు 2600
కోరవోవుచు ముడి - గొన్నకన్బొమల
గారదాఁకిన మీను - గతి మూళిఁగదల
కన్నులచెంగావి - గన్నమోమెత్తి
యన్నతోలక్ష్మణుఁ - డప్పు డిట్లనియె.

—: దైవబలంబుకన్న పురుషకారమే ప్రబలమని
లక్ష్మణుఁడు చెప్పుట :—

"తండ్రికిం దప్పని - తఁడు రాజ్యకాంక్ష
వేంద్రమైనది రాము - విభుని చిత్తంబు
మనలఁబ్రోచునె యిట్టి - మర్యాదవాఁడు
మనముల నితని న - మ్మఁగరాదటంచు
జనులెంతురో యను - శంకచే నీవు
వనులకేఁగెదనన్న - వలవదియ్యెడల 2610

అసమర్థమగుదైవ - యత్నంబు శౌర్య
లసమానుఁడగురాజు - లక్షింపదగునె ?
అలవడియున్న తేఁ - క్షాత్రాచారరూఢి
గెలువుము దైవంబుఁ - గేకయరాజ
తనయ బుద్ధులు విని - దశరథవిభుఁడు
కననీఁడు కపటంబు - కల్ల నెయ్యమున
మంచివారునుఁబోలి - మచ్చిక సేసి
కించుఁదనంబునఁ - గీడాచరించు
వారలుగలరట్టి - వారల నెఱుఁగ
కే రీతి మోసపో - యెద వాత్మనమ్మి 2620
యభిషేకమిది నిశ్చ - యముగాక మున్నె
యభిలషించి వరంబు - లడిగెనే కైక
యీ మాటవినికద - యిప్పుడు వేడె
నామున్నె నీకిచ్చె - నవని భూవరుఁడు
ఆలితో నేకాంత - మాడినమాట
మేలెంచి సత్యంబు - మేకొనువాఁడు
అసత్యమెటుపోయె ? - నందఱువినఁగ
జేసెద నిను నభి - షేకమన్నపుడు
యిందుల కేరీతి - నేఁదాళియుందు
నిందితుండైయువి - నీతివాఁడైన 2630
కామాతురుండైన - ఖలుఁడైన చిత్త
మేమరి భ్రమసిన - నెవ్వారి పలుకు
నడపింపరాదని - నయశాస్త్రవిదులు
నొడువుదు రితఁడట్లు - నోరెత్తవెఱచి
యాటదానికి లొంగి - యధముఁడై వాని

మాటకు నీయట్టి - మానుషాధికుఁడు
కైకేయి దొరసానిఁ - గానెంచి యామె
యేకీడుదలచిన - నేమియుననక
నాపదలొందెద - ననియున్న నీదు
పాపంబు చూచియేఁ - బరితపించెదను 2640
కోరగఁదగు మేలు - కోరక కీడు
గోరువారల కెల్ల - గురుఁడవై నావు
అన్నిటఁగొఱమాలుఁ - నంబేద రీతి
నెన్నదుదైవంబ - యిటుచేసెనునుచు
యిదిదైవకృతమని - యెంచెదవేని
మదిలోన నీవు నా - మతము చెల్లించి
అట్టికార్యముదైవ- యత్నంబుఁగాఁగ
గట్టిగా మదినెంచి - కావింపుమఱుల
పురుషయత్నముచేతఁ - బొలుచు ధీరుండు
తఱిమిఁదాఁద్రోయును - దైవయత్నంబు 2650
అట్టిపౌరుషశక్తి - నలరు నాకతన
యెట్టిచోదైవంబు - నెఱుఁగనయ్యెడును
నీ మేలుగనఁగోరు - నిఖిలలోకులను
నామతంబ తలంచి - నడవఁజేసెదను
దైవబలంబు మ - త్తగజంబుఁ ద్రిప్పు
మావంతు గతి నేను - మరలఁద్రిప్పెదను
యేనిన్నుఁగట్టెద - నిపుడు పట్టంబు
దీని కెవ్వరు సమ్మ - తింపకయున్న
హరిహరబ్రహ్మాదు - లడ్డమైరేని
పొరిగొందు నపుడనా - భుజశౌర్యమొప్ప 2660

ముల్లోకములఁ నొక్క - మొత్తమై మీఁదఁ
జెల్లఁగిల్లినఁద్రుంతు - భీకరాస్త్రమున
వనవాసములనుండ - వలెనని నిన్నుఁ
గనువారినేనుంతుఁ - గానలయందు
వేవేలువర్షముల్ - విశ్వమంతయును
నీవేలి తరువాత - నీకుమారకుల
మహికిఁబట్టముగట్టి - మఱిపొమ్మవనికి
యహితుఁడౌభరతుని - కవని గానీను
యీరాజుమాటచే - నియ్యకోవేని
ధారుణి నాదు ప్ర - తాపంబుచేత 2670
నీముద్రతల మోచి - నిష్కంటకముగ
రామ ! యేఁబాలింతు - రానీయ నొకని
నిర్వహింపకయున్న - నేనన్నమాట
యుర్విపై గలయూ - యుధోపజీవులకు
వెలితిమైచనువాఁడ - వినుము నా ప్రతిన
చలముతో నిదినాకు - సాధించుటెంత ?
కానిచో నీ విల్లు - ఖడ్గబాణములు
నే నలంకరణార్థ - మేతాల్చుటెల్ల ?
సాధనాంతరములు - శత్రులనెల్ల
సాధింపఁ గాక పూ - జలుసేయఁగొఱకె ? 2680
ధనువునేఁదాల్చినఁ - దా బంటననుచు
ధనువొందునే దేవ - తా నాథుఁడైన
మనుజులలో మారు - మలసి నాతోడ
మొనసేయనున్నారె - మూఁడులోకముల ?
బలిమిచేఁ జతురంగ - బలము నాచేత

పొలియునప్పుడు గజం - బులు వడియుండ
మెఱుపులతోఁగూడు - మేఘంబు లవనిఁ
దెరలినగతినున్న - దేఱి చూచెదవు
శరదారుణానల - జ్వాలలచేతఁ
బరసైన్యనగహనంబు - భస్మీకరింతు 2690
విశదంబుగాఁగ నా - విక్రమంబిపుడ
దశరథుపూనికె - దప్పింపఁ దలఁచె
కేయూరకుంకుమాం - కితమైనయట్టి
యాయతాత్మీయ బా - హాయుగళంబు
నీయవసరముల - నీప్రోచుఋణము
పాయఁద్రోయక యేమి - పనులకామీఁద ?
నాభుజాకండూతి - నను నెచ్చరించె
నాభరతునిఁ జూపు - మని పెచ్చుపెఱిగి
పనిగొమ్ము తామసిం - పక నీకు నేల ?
యనుమానములు తల్లి ! - యనుమతి వినుము. 2700
నావిన్నపంబు మ - నంబునఁ జేర్చి
దేవ ! కాదని యాన - తి యొసంగవలదు "
అనిపల్కు లక్ష్మణు - నాగ్రహం బెఱిఁగి
యనునయోక్తుల రాముఁ - డతని కిట్లనియె.
" అన్న ! లక్ష్మణ ! నాకు - ననుగుణంబైన
యెన్నిక నిమది - నెన్నుమీ " యనుచు
మాటాడుకుండ ప - ల్కారు నేనిన్ను
కూరిమితో వేడు - కొనను నీవిట్లు
నాతలం పెఱిఁగియు - ననుమీఱి పలుక
నీతియె '' యనుచు క - న్నీరు వోఁదుడిచి 2710

సౌమిత్రి నూరార్చు - సమయంబునందె
రామునిఁజూచి ధా - రాళంబుగాఁగ
కన్నుల వెన్నీరు - కాలువల్ గట్ట
సన్నుతశీల కౌ - సల్య యిట్లనియె.

—: రాముఁడడవులకు బోవ కౌసల్య యంగీకరించుట :—

"రామ ! నాకును దశ - రథునకుఁ బుట్టి
యేమేర నీవుంఛ - వృత్తి నుండెదవు ?
నినుఁగానలకుం బంపు - నృపతి నెవ్వారు
కనికొల్చి నమ్మియే - గతినుందువారు
ధరణీశు సత్యమై - తన యదృష్టంబు
దరమించె నిన్నుఁ గాం - తార వీధులకు
" రాకుమీావన " వెంట - రాకేలయుందు
నేకై వడిఁ దరింతు - నీశోకజలధి 2720
కన్నతల్లినిఁ కాని - కైకచే నేల
నన్నొప్పగించి కా - నలకు నేఁగెదవు ?
వలదంచు" మిక్కిలి - వాపోవఁ జూచి
తలఁకక రఘుకులో - త్తముఁ డిట్టులనియె.
"ఓయమ్మ ! నావెంట - నుగ్రాటవులకు
నీమెడ నీవురా - నృపతి ప్రాణములు
నిలుప నేరఁడుగాన - నీయట్టి సతికిఁ
దలఁప వచ్చునె యీాయ - ధర్మ వర్తనము
రాజుఁ బోషింప ధ - ర్మము గాదటన్న
భూజన నిందలం - బొందుదు మెపుడు 2730

వనవాస మొనరించి - వచ్చెద నీదు
పనుపు చేసెదఁ దీర్చి - పదునాలుగేండ్లు"
అనియెంత వేఁడిన - నడలుచు లేటి
యనువునఁ దోఁడక పో - మ్మని తపింపుచునుఁ
దెలివి చాలని తల్లి - దెసచూచి చాలఁ
గలఁగుచు రాముఁడు - కన్నీరు రాల
కరుణ వెంపునఁ బోవఁ - గాఁ గాళ్లురాక
తెలఁగేది లక్ష్మణుఁ - డేటి చూచుచును
చెదఱుఁ గుత్తుకతోడ - సీతావరుండు
మదిచిక్కఁబట్టి తా - మఱియు నిట్లనియె. 2740
"అమ్మ! యీరాజు గ - లంత గాలమును
నెమ్మదియేఁగాక - నెగులేల మనకు?
భరతుండు సద్ధర్మ - పరుఁడటమీఁద
పరిచర్య సేయునీ - పట్టున మిగుల
కానల కే నేఁగఁ - గదుం జింతనొందు
మానవనాథు నే - మఱకుమీ నీవు?
అతివ లేమేమి పు - ణ్యములు చేసినను
పతిసేవ సేయు శో - భనములు లేవు
పెనిమిటిఁ గొల్వక - పెక్కు ధర్మంబు
లొనరింపఁ బాపంబు - లొందు నింతులకు 2750
మగఁడె దైవముగాని - మఱి దైవమనుచు
మగువలకే యాగ - మములఁ బేర్కొనరు
ప్రాణవల్లభుఁ డిహ - పర సౌఖ్యదాత
యేణాక్షులకుఁ గాన - నితరంబులేల?
వల్లభునకుఁ గాని - వనిత పుణ్యంబు

లెల్ల బొల్లైపోయి - యేఁగు దుర్గతికిఁ
దన నాయకునకు హి - తం బాచరించు
వనిత కోరికలు కై - వశము లన్నియును
కై కమీఁది యసూయ - గలిగి యుండినను
నీ కహితంబులు - నెరయఁ జేసినను 2760

వనికి రాముని బంప - వచ్చునే యనియు
మనసు నొవ్వఁగఁ గాని - మాటలాడకుము
పృథివీశు మదినొవ్వ - బిట్టు వల్కినను
వృథసుమ్ము కులశీల - వృత్తంబులెల్ల
శాంతిక పౌష్టికా - చార కర్మముల
నెంతయు నాకు మే - లెంచి భూసురుల
పూజసేయుచు నెల్ల - ప్రొద్దునేమఱక
రాజుఁబోషింప ధ - ర్మంబు తప్పకుము
నేవచ్చు నన్నాళ్లు - నృపతి సౌఖ్యమున
జీవంతుఁడై యున్న - జెప్పెడిదేమి? 2770

భాగ్య మంతయును - నీ పాలనేనిల్చి
యోగ్యకామిత సిద్ధు - లొందఁ జాలుదువు
అమ్మ యాఁగాదని - యనక నామనవి
సమ్మతింపు" మటంచు - సాఁగిలి మ్రొక్క.
" భావించి మదిఁజిక్కఁ - బట్టి లెమ్మనుచు
దీవించి నీమది - ద్రిప్ప లేనైతి
అన్న సేమముగాంచి - నరుగుము వనుల
కున్నత జయకీర్తి - లొంది క్రమ్మఱుము
కాలంబు దొడ్డది - గావున నిట్టి
యాలోచనలు గల్గె - నైనట్టులయ్యె 2780

పొమ్ము నీకెల్ల వే - ల్పులుఁదోడునీడ
లెమ్మెరల నసాధ్య - మెయ్యదినీకు ?"
అనిరాముఁ జూచియే - కాగ్ర చిత్తమున
" ననఘ ! జటావల్క - లాదులతోడ
వనవాస మీడేర్చి - వత్తువుగాక
పునరాగమనలక్ష్మిఁ - బొందుదుఁగాక
చేరరమ్మ "ని పిల్చి - శిరము మూర్కొనుచు
గారాన కౌసల్య - క్రమ్మఱఁబలికె.

—: కౌసల్య శ్రీరామునిదీవించుట :—

" రామ ! సత్పథుల - క్రమమున నీవు
సేమంబుతో వని - శ్రేణిఁ జరించి 2790
నీ సుకృతంబెందు - నిన్ను రక్షింప
గాసియెందును లేక - క్రమ్మరుమయ్య !
వనదేవతలను భా - వన చేసినీవు
కనికొల్చు వారెల్లఁ - గాతురు నిన్ను
గాధేయుఁ డిచ్చిన - కమనీయ శస్త్ర
సాధనంబులు నిన్ను - సంరక్ష సేయు
తలిదండ్రు లందు నీ - తలఁకనిభక్తి
యలఘు సత్యమును దీ - ర్ఘాయువు వొసంగు
ద్వాదశార్కులును న - వ బ్రహ్మలవని
యాదిత్యులును రాత్రు - లహములు దిశలు 2800
స్థావర జంగమ - చయము వాయువులు
దేవర్షి పితృపూర్వ - దేవతావళియు
వనధు లద్రులును - సంవత్సర మాన

దిన ముహూర్తకళావ - ధిక కాలదశలు
నారద దిక్పాల - నాగ గంధర్వ
భారతాదిక వర్ష - పక్షి పుంగవులు
ఆకాశమున వార - లంతరిక్షంబు
నాకేశుఁ డజుఁడు పి - నాకపాణియును
నదులు ద్వీపంబులు - నలినాకరములు
నదములు దైత్య దా - నవ పిశాచములు 2810
ఆగమంబులు ఋషు - లష్టవసువులు
నాగసింహ వ్యాఘ్రు - నానామృగములు
వనులఁ గ్రుమ్మరు నిన్ను - వాత్సల్య మొప్పఁ
గనితోడు నీడలై - కాచి యుండుదురు ''
అనిగంధ పుష్పాక్ష - తాదులు ఘృతము
ననువైన తెల్లని - యావాలు దెచ్చి
కౌసల్య పరమ మం - గళ కారణముగ
భూసుర కోటి న - ప్పుడ పిలిపించి
హోమముల్ సేయించి - హోతలచేత
నేమేరలను బలు - లిప్పించి స్వస్తి 2820
వాచనం బొనరించు - వారికి శోభ
నాచారముగ దక్షి - ణాదు లొసంగి
" అన్న! వృత్రాసురు - నణగించు నపుడు
మున్నింద్రునకు దేవ - ముఖ్యు లందఱును
నేమంగళము లిచ్చి - రిప్పుడు నీకు
నామంగళము లెల్ల - నవుఁగాక రామ!
అమృతంబుఁ దేబోవు - నప్పుడు వినత
ప్రమదంబుచేఁ బిల్చి - పక్షి నాథునకు

యేమంగళము లిచ్చె - నిప్పుడు నీకు
నామంగళము లెల్ల - నవుఁగాక రామా! 2830
క్షీరాంబు రాసి ద్ర - చ్చిన తరువాత
స్వారాజుఁ జూచి య - బ్జాత లోచనుఁడు
నేమంగళము లిచ్చె - లిప్పుడునీకు
నామంగళము లెల్ల - నవుఁగాక రామ !
అదితి వామనుఁడయి - హరి జనియించి
మద మత్తుఁడగు బలి - మర్దించు నపుడు
నేమంగళము లిచ్చె - నిప్పుడు నీకు
నామంగళము లెల్ల - నవుఁగాక రామ !"
అని శిరంబున శోభ - నాక్షత లునిచి
తనయుని సందిట - తా రక్షగట్టి 2840
వనవాస ఖేదంబు - వదలి క్రమ్మఱిన
నినుఁ బూర్ణచంద్ర స - న్నిభుఁ బురవీథిఁ
బట్టపు టేనుంగుపై - రాఁగఁజూచు
నట్టి సంతోష మే - నను భవించెదను
పోయి వత్తువుగాక - పొలిమేరవనులఁ
బాయక తీర్పు మీ - పదునాలుగేండ్లు
దూరమేగెదు సుమీ ! - తూణీరధనువు
లారసి మఱువకు - మన్న యేవేళ"
అనుచు కౌఁగిటఁ జేర్చి - యఖిల దేవతలఁ
దనయుని మీఁదట - తానావహించి 2850
శ్రీరామునికి ప్రద - క్షిణముగా వచ్చి
మోరఁగా నిలిచిన - యుల్లాసమొంది
తనుఁ గన్నతల్లికి - దండ ప్రణామ

మొనరించి కన్నుల - నురల బాష్పములు
తెప్పల నణఁచి ధా - త్రిని యూరడించి
అప్పుడ జననీ మ - హాయతనంబు

—: రాముఁడు సీతకడకుఁబోయి వనగమనము చెప్పుట :—

వెడలి సీతకు నిట్టి - వృత్తాంతమెల్లఁ
దడయక వివరింపఁ - దలఁచి రాఘవుఁడు
నగరు వెల్వడి రాఁగ - నగర మార్గమునఁ
బొగులుచు జనులు గుం - పులు గట్టిచూడ 2860
చేరుమున్నుగ నభి - షేక విఘ్నంబు
లేరిచే రాకుండ - నెల్ల వేలుపుల
మనసులోఁ గొల్చుచు - మాటమాటకును
తనరాక కెదురులు - తాఁ జూచుచున్న
ధారుణీ తనయ చెం - తకుఁ దలవాంచి
యేరామలను మొగం - బెత్తి కన్గొనక
సిగ్గు వాటున నుండఁ - జేరి యా సీత
డెగ్గడిల్లుచు నిట్టి - బెడిదంపు మాట
నేరీతిఁ బల్కుఁదు - నీయింతి కనుచు
నోరాడకున్న మ - నోనాథు తోడ 2870
నేమియు నెఱుఁగక - యెద వడి సీత
రామునిఁజూచి ధీ - రత నిట్టులనియె.
"అనఘాత్మ! నేఁడు బా - ర్హస్పత్యమైన
జనసుత పుష్య న - క్షత్రంబు మీకు
నభిషేకమున కర్హ - మని విప్రులెల్ల

విభునితో ననుమాట - విని యున్నదాన
శతశలాకాశ్విత - చ్ఛత్రంబు రత్న
చతురంతయానంబు - చామరద్వయము
వందిమాగధగీత - వాద్యముల్ పణవ
దుందుభికాహళా - స్తోకరావంబు 2880
నభిషేకవస్తు వి - న్యస్తహస్తాగ్ర
శుభకర్మనిరత భూ - సురసమృద్ధియును
చతురంగబలమును - సామంతమంత్రి
హిత పురోహిత రాజ్య - బృందంబునాల్గు
హయములంగల యుత్స - వార్థ రథంబు
నయకారణము మృగేం - ద్రాసనోత్తమము
పట్టభద్రలలాట - పట్టియు మ్రోలఁ
బట్టపుటేనుంగుఁ - బాసియ దేల
వెలవెలఁగా మోము - విచ్చేయుకతనఁ
గలఁగుచున్నది మిమ్ముఁ - గని నామనంబు 2890
నానతియిండ ''ని - యాపన్నయైన
జానకితో రామ - చంద్రుఁడిట్లనియె.
" సత్యప్రతిజ్ఞుండు - సద్ధర్మవేది
యత్యంతధార్మికుఁ - డైన మాతండ్రి
వనవాసమునకేఁగ - వచియించెనన్ను
తనకు పూర్వంబున - దత్తంబులైన
వరములు కైకేయి - వరునిఁ బ్రార్థించి
భరతు నయోధ్యకుఁ - బట్టంబుఁగట్ట
నడిగిన పదునాలు - గబ్దముల్ నన్ను
నడవి నుండఁగఁబంచి - యాకైకపట్టి 2900

బట్టంబుఁ గట్టుకోఁ - బడితల్లి పరము
కట్టడ సేసినం - గడుసమ్మతించి
యేనువచ్చితి నీకు - నెఱిఁగింప నీవు
మానసంబున శోక - మగ్నవుగాక
మున్నాడి భరతుని - ముందఱ నీవు
నన్ను భూషింపక - నడవు మెట్లనిన
ధన్యుఁడానృపతి యే - తరితన్నుఁ గాక
యన్యులనుతియింప - నవియేలసైఁచు
నాభరతుండు ధాత్రి - యంతయునేలు
ప్రాభవంబుననిన్నుఁ - బాటింపకన్న 2910
నందఱ తోడిదే యని - నిన్నుఁబ్రోచు
నందు నేమరియున్న - నది తాళుకొనుము
ఆయన కనుకూల - వైయుండు నీవు
నీయుమా భరతుండు - చెప్పినయట్ల
భరతునికిని రాజు - పాలించె నెల్ల
ధరణియుంగాన నా - తఁడె కర్త మనకు
బోవుదునే వనం - బునకు నిత్యంబు
దేవతార్చనము భూ - దేవతాప్రీతి
దశరథుపూజ య - త్తలకెల్ల సేవ
కుశలబుద్ధినిఁ జేసి - కొలువు మేమఱక 2920
కౌసల్య చింతలఁ - గరఁగకయుండ
బాసటవై ప్రోచు - పగిది యేమఱకు
భరత శత్రుఘ్నులు - ప్రాణముల్ నాకు
తరుణి ! తమ్ములుగారు - తనయులు సుమ్ము
వారలు చెప్పిన - వైఖరి నడచి

గౌరవంబొందు మే - కడ నన్వయమున
రాజుల చిత్తంబు - రా సేవచేసి
తేజంబుఁగాంచుట - తెల్లమెల్లరకు
నించుకదప్పిన - నెంత లేదనుచు
నెంచి సహింపరు - హృదయంబులోన 2930
ననుకూలురై యుండు - నన్యులనైన
మనసిచ్చి చనవిచ్చి - మన్నింతురెపుడు
కడనున్న తనయుల - కడకుఁ ద్రోయుదురు
పుడమియేలెడువారి - బుద్ధులీ తెఱఁగు
నటుగాన భరతుని - ననుసరింపుచును
పటుమతివై భయ - భక్తుల మెలఁగు
నిజమున నుండుము - నీవీక్షణంబు
విజనాటవుల కేను - వెడలి పోవలయు
నెవ్వరు నప్రియం - బెన్నకయుండ
పువ్వుఁబోణి! మెలంగు - పోయివచ్చెదను" 2940
అని రఘువరుఁ డాడు - నట్టి మాటలకు
వనజాక్షి ప్రణయకుపూ - ర్వకముగాఁబలికె.

—: అడవికి రావలదనగా సీతకోప మొందుట :—

"దేవ! నాతో నిట్టి - తెఱఁగున మీరు
భావింప లాఘవా - స్పద మయోగ్యంబు
నపహాసకర మప్రి - యంబు నైనట్టి
యపలాప వచనమె - ట్లానతిచ్చితిరి?
తల్లిదండ్రులు నన్న - దమ్ములు బిడ్డ
లెల్లరుఁదమ పురా - కృతపుణ్యపాప

ఫలములు తమపాలఁ - బంచుక యందుఁ
దొలఁగక యనుభవిం - తురు దాఁచియుంచి 2950
ఆరీతిఁగాదుగ - దయ్య వల్లభులు
ప్రారబ్ధ నిజకర్మ - ఫలములన్నియునుఁ
బంచుకొందురు సరి - పాలుగా భార్య
లంచు నాగమవేత్త - లాడుచుందుదురు
యిహపరంబులఁ - బ్రోవ నీవుఁడేకర్త
మహిళల కిటులాడ - మర్యాదయగునె ?
పురుషులపుణ్యంబు - పొత్తుకాంతలకు
పరిహరించిననేల - పాయుదునిన్ను ?
నీవుకానలకేఁగ - నిచ్చుననుజ్ఞ
దేవ నాకుననుజ్ఞ - తెలియదే మీకు 2960
నెవ్వరు నెందుల - కెవ్వరునన్ను
నవ్వేళడించి పో - నెట్లగునయ్య ?
కంటకాటవుల మీా - క్రమమున నేను
వెంటవచ్చుట గాక - వేఱుగాఁగలనె ?
రాఁదగ వనెడి నే - రమి సేయ లేదు
లోఁదాల్మిచే నీర్ష్య - లు నసూయలెల్ల
మానిన గతి నట్టి - మాటయుమాని
యానతియిమ్ము నే - ననుసరించుటకు
దగదప్పులను నీరు - ద్రావి యవ్వెనక
మిగిలినజలము భూ - మినిఁ జల్లినటుల 2970
నను విడనాడిన - నాకేదిదిక్కు
మనసులోఁబరికింపు - మా రఘువీర !

అణిమాదికములైన - యైశ్వర్యములును
గణుతింప నమరలో - క సుఖంబులెల్ల
పొందుట కన్నను - పురుషునిసేవ
యంటునేమఱకుండు - నదియె యుత్తమము
అతివకుఁ గులవధూ - న్యాయమిట్లనుచు
కతలందు వినియునుఁ - గనియెఱుంగుదును
నీ చరణాంబుజ - నియత సేవనమె
యాచారవిధి నాకు - నన్యమేమిటికి ? 2980
కట్టిడి వనుల మృ - గంబులలోనఁ
పుట్టినయింటనుఁ - బోలియుండెదను
నీవెంట రానిచో - నెమ్మదికింపు
గావు త్రిలోక భా - గ్యములు పొందినను
నియమవ్రతంబుల - నిన్నుసేవించి
భయదాటవులఁ దరు - ప్రసవమంజరుల
వాసనలనుఁగూడి - వాసించుచైత్ర
మాసదక్షిణపవ - మానాంకురములు
పొలయ సేదలు దేఱి - పొదరిండ్లలోన
మెలఁగ నీతోఁగూడి - మెచ్చులయ్యెడును 2990
నడవులనెవ్వారి - నైనరక్షింప
కడునేర్పుశక్తియుం - గలిగిననీవు
ననుఁబ్రోవఁజాలవే - నను డించిపోదు
నని యన వలవదీ - యడవులయందు
కందమూల ఫలాది - కములు సేవించి
యుందు నింతియెకాని - యొల్లనేమియును
లేనివి యడిగి తా - లిమి లేక యలసి

యేనిన్ను వెతఁబెట్ట - నెట్టిచోనైన
నెందులకు విచార - మేల ? సీతార
విందలోచన కీవు - విభుఁడవుగాన 3000
నిను నెడబాయక - నెమ్మదినున్న
వను లెల్ల నుద్యాన - వనములునాకు
కృతకాచలంబులు - గిరులు నాకెపుడు
శ్రితసఖుల్ వన మృగీ - శ్రేణులన్నియును
పూవుఁబాన్పులు తృణం - బులశయ్యలెల్ల
నీవున్నస్థలమయో - ధ్యాపట్టణంబు
లాలిత కందమూ - లములు రాజాన్న
మేల నిన్నెడవాయ - నితరభోగములు ?
గిరులును చరులును - కింజల్కమంజు
సరసిజాకరముల - చలువనీడలను 3010
కానలఁగోనల - గైరికంబులను
నానార్ఝురీనదీ - నదములయందు
నామదిలో ప్రాణ - నాయక ! నేఁడు
కామించితిని నిన్ను - కలసిచరింప
వలదన్న ప్రాణముల్ - వదలుదు నిన్నుఁ
దలఁపుచు నొక ముహూ - ర్తము పాయఁజాల ''
ననుచుఁగన్నీటితో - నడలు భూపుత్రి
గని రఘువీరుండు - కరుణనిట్లనియె.

—: సీతకు రాముఁడు వనవాస కష్టమునుఁ జెప్పుట :—

'' ఉత్తమకులజాత - పుణ్యవ్రతనూజ
విత్తటి నాదు గే - హిని వయ్యునీవు 3020

ధర్మంబు మదిలోనఁ - దప్పక నాదు
శర్మంబుగోరి యి - చ్చట వ్రతాద్యములు
నడపుచునుండక - నావెంట నేల
యడవుల కేవత్తు - వనిపల్కెదీవు
యేలచేసెదవునా - కింత ఖేదంబు
చాలింపు వలవ ది - చ్చట నుండుమీవు
సామాన్యమే ? వన - స్థలనివాసంబు
భామినిదుఃఖాను - భవకారణంబు
నేనుంచి నటు లుండు - టే నీకు ధర్మ
మానది కాదని - యనరాదు నీకు 3030
హితము వల్కెద సుఖ - మేడది వనుల ?
నతివ ! బాలవు గాన - నంటివిమాట
ఘుమఘుమారావ సం - కుల ఝురీలహరి
తిమిరాతి భయదకు - త్కీలగహ్వరము
ప్రబల హర్యక్ష గ - ర్జాస్ఫూర్జితంబు
నిబిడ ఘుర్ఘుర రవా - న్విత వరాహంబు
భల్లూక గుటగుటా - ర్భటి భీకరంబు
ఝిల్లీసముత్కీర్ణ - ఝంకరణంబు
గంధ సింధుర ఘటా - ఘన ఘీంకృతంబు
సైంధవ ద్వేష దు - స్తర పల్వలంబు 3040
సముదగ్ర వాత్యాప్ర - చండ మారుతము
కమలాప్త బింబ తి - గ్మకరాతపంబు
యేకపదీ కంట - కేంధనాపూర్ణ
మా కంతవారి మా - ర్గాపగాశతము
పీత శోణిత సుప్త - భీమ శార్దూల

మాతత నిమ్న గా - యతజలగ్రహము
దుర్దమ కర్దమ - స్తోమాంతరంబు
మర్దితాజాది గో - మాయు సంకులము
నిబిడ పాదపలతా - నీరంధ్రకాష్ఠ
మబల సంచార క్రి - యాదురాసదము 3050
నిర్జనాయత పథా - న్వితమరు దేశ
మూర్జితబంధాన - వోపరోధంబు
నలఘు ప్రవృద్ధాశ - నాయా కరాళ
మలసత్వ తృష్ణాభ - యవృథావహము
అపగత సౌఖ్య ని - ద్రాహార శయన
మపరిమి తోటజా - యతన వృశ్చికము
బాల ! నీవెక్కడ - భయదవనాంత
రాళ సంచరణ ధూ - ర్వహ ఖేదమేడ ?
వలసిన యెడఁ దృణా - వనులందు బొరలి
యలసి రాలిన పండు - టాకులు మెసవి 3060
సెలయేరులందు దె - చ్చిన నీరుఁ గ్రోలి
కలెఁగొను నడవి యీఁ - గలు మూఁగ జడిసి
చీమల దోమల - చేగాసి నొంది
పాముల గాములఁ - బ్రాణాశ వదలి
జడలు వల్కలములు - సంధించి చలికి
ముడిఁగి కార్చిచ్చుల - మూలల నొదిగి
యతిథి భాగము లిచ్చి - యమరులం గొలిచి
వ్రతనియమంబుల - వసివాడి చిక్కి
కామలోభ క్రోధ - గతులు వర్జించి
యేమేర నిల్చిన - యెడనిల్పరాక 3070

కొందునేనియు భయము - బెఱుఁగక మానసు
నందు తాలిమిపూని - యాపదలోర్చి
రానేలలం గ్రుమ్మ - రఁగ నేల నీకు ?
బాల ! యోడుదువె ! నా - పలుకు గాదనిన
కావున నీబుద్ధి - గాదు చాలింపు
నీవనవాసంబు - నిన్ను వేఁడెదను”
అని రామ విభుఁడాడ - నశ్రు పూరములు
కొనగోర మీఁటుచు - కుత్తుక రాయు
ప్రాణేశు వదనంబు - పై జూపు లునిచి
యేణాంకముఖి సీత - యిట్లని పలికె. 3080

—; సీత భర్తతో నడవులకు రాక తప్పనని నొక్కిఁ జెప్పుట :—

“ నన్ను రావలదని - నాకు నచ్చోట
నెన్నని భయము లూ - హించి పల్కెదరు
మీ సహవాసంబు - మేకొని యందు
నే సుఖంబున జంతు - నిచయంబులెల్ల
నిన్ను కోదండ పా - ణినిఁ జూచి నపుడ
నన్నియు బెదరి పో - కవి యేలనిల్చు ?
నీదు ప్రాపున నున్న - నిర్జర ప్రభుఁడు
నో దేవ ! దృష్టింప - నోపునే నన్ను ?
ప్రాణనాథులఁ బాయు - పడఁతుల కెందు
ప్రాణముల్ నిలుపను - పాయంబు గలదె ? 3090
భయము చెప్పెదు మీఁద - ప్రాణముల్ దొరగు
భయము నిమేష సం - ప్రాప్తమైయుండ

రాకేలయుందు పూ - ర్వమున బ్రాహ్మణులు
వాకొన్న వారేను - వనులఁ జరింప
నా పిన్ననాఁడె వి - న్న తెఱంగు జనక
భూపాలు నగర ని - ప్పుడు దలంచితిని
లలిత సాముద్రిక - లక్షణ విదులు
తెలియంగ ననుఁజూచి - తెలిపిరి మొదల
వనవాస సంప్రాప్త - వార్తనే నదియ
వినిబుద్ధి యెఱిఁగిన - వెనక చింతింతుఁ 3100
దప్పింతునని యెన్ని - దలఁచితి వేన
తప్పునే కాఁగల - దైవ యత్నంబు
నందుకు ననుగుణం - బైనది నాదు
డెందంబు మిమ్ముఁ గూ - డి మెలంగ నెంచి
అవనీసురుల మాట - లవియేల తప్పుఁ
దవిలి క్లేశము లొందఁ - దరియమ్యె నిపుడు
వనముల నిడుములె - వ్వరికైనఁగాక
నినుఁ గొల్చివచ్చుదా - నికి నాకుఁ గలదె?
నాతల్లి చెంత మా - నగరిలో నుండు
నాతరినొక జోగు - రాలు దావచ్చి 3110
నావనవాసంబు - నాఁడె వాకొనియె
నీవేళ సరివచ్చె - నిచ్చలో నిపుడు
గంగానదీ కూల - కమనీయ గహన
మంగళప్రదలతా - మంజునికుంజ
కిసలయ తల్ప సం - క్రీడా వినోద
రసభావములచేఁ గ - రంగి నీతోఁడఁ

గలయుటల్ కన్నులఁ - గట్టినయట్లు
తలఁపులో కోరికల్ - తలచూపఁ దొడఁగె
నడవులఁ జరియించు - నప్పుడే నీకు
నుడిగముల్ గావింప - నూహా చేసెదను 3120
లోకేశ ! కానల - లోన నీతోడి
లోకమానది పర - లోక సాధకము
అధిపతియే దైవ - మని యాగమములు
విధియించెఁ గాన యే - వేఁడిన మనవి
తగవని వినుటొప్పు - తలిదండ్రు లెందు
తగునని యొకనికి - ధారవోసినను
ఆకన్యయే కదా - యధిపతి నెల్ల
లోకంబు నందు సు - శ్లోకుఁ గావించు
నకట ! పతివ్రత - నైన నన్నేల
తెకతేరడించి పోఁ - దెగువ చేసెదవు ? 3130
నీసుఖ దుఃఖముల్ - నేఁబంచి కొనగఁ
జేసిన యజుఁడు వ్రా - సిన యట్టివ్రాఁత
నీవు గాదనవచ్చు - నే సెలవిమ్ము
భావించి వత్తు నీ - పదములు గొల్చి
కాదన్న నొకత్రాట - గరళ కూటాన
లాదులం బ్రాణంబు - లర్పింతు నీకు
ధర్మజ్ఞుఁడవు నీకుఁ - దగునయ్య యీయ
ధర్మవాక్యములనీ - తాలిమి లేక
సమ్మతింపని నాథు - సన్నిధియందు
నామ్లానసలోచన - యశ్రు బిందువులు 3140

చనుమిట్టలను రాల - సాంత్వనంబొప్ప
ననునయాలాపంబు - లాడు ప్రాణేశుఁ
గోరగించిన వాఁడి - కొలుకులఁ జూచి
ధీరాత్మ యగుచు ధా - త్రీజాత యలిగి
ప్రణయాభిమానముల్ - బయలు పడంగ
గణుతి సేయక యువు - గాము లిట్లనియె.

—: సీత రామునాక్షేపించుట :—

"నిన్ను మాతండ్రి పూ - నిక దప్పలేక
తిన్నని పాయంబు - తీరునుంజూచి
మగవాలకంబుతో - మలయుచునున్న
మగువ యాఱుఁగక - మదిలోననమ్మి 3150
యల్లునిఁ గానెంచి - యతఁడు నన్నిచ్చె
తెల్లమాయెను నీదు - తెఱఁగెల్ల నిపుడు
రవితేజుఁడా రఘు - రాముఁ డన్నట్టి
యవివేక వాక్యంబు - లనృతంబులయ్యె
నీవె దిక్కనియున్న - నెలఁతను డించి
పోవ నేయార్తి ని - ప్పుడు నీకువచ్చె
కాలాగ్ని కల్పునే - గానకయుంటి
నేలక నాదోష - మేమి గాంచితివో ?
యిదినేర మన్న నే - నెఱుఁగుదుగాక
వదలనూరక నన్ను - వర్జించితేని 3160
సత్యపతివ్రతా - చారయై తొల్లి
సత్యవంతునిఁ గూడు - సావిత్రి యనఁగ

యేననువ్రత నయి - యేతెఱ కేల ?
మానుదుఁగుల శీల - మర్యాదలెల్ల
వదలిన వెలయాలి - వలె నిన్ను నేల
మదిమది నుండి యే - మఱి యెడబాతు
జాయోప జీవియా - సాని నట్టువుని
చాయ నిల్లాలిని - సడలఁ జూచెదవు
ఒక తెనుఁ ననుఁ బ్రోవ - నోపనివాఁడ
నకట ! యేఁటికిఁ బెండ్లి - యాడితివయ్యా ! 3170
నను నొక్కరునికిచ్చి - నయమునఁ దొలఁగి
చనఁజూచి నావేమొ ? - చనరాదుగాక
వలసిన నిన్ను నే - వ్వఁడు మోసపుచ్చి
బలవంతుడగుచు నా - పద లొందఁజేసి
నీచేతి రాజ్యంబు - నీదుపట్టంబు
గోఁచి చేతికినిచ్చి - కోరికకై కొనియె
నట్టివానికి బంటవై - యుండుమీవు
పుట్టసాఁకఁగ నేర్పు - పొడమకయున్న
నాకేల యొకని క్రిం - దనణంగియుండ
వాకొంటి వనరాని - వచనముల్ నన్ను 3180
నిన్నేల పోనిత్తు - నీవెంటవచ్చి
యున్నచోటున నుండి - యూరిలోనైన
నడవి లోపలనైన - నద్రులనైన
కడపట స్వర్గలో - కము నందునైన
జతకూడి యుండు నీ - చరణముల్ గొలిచి
వెతలేక నామాట - వినుమింక నొకటి

అడవులఁ జరియించు - నందుకు నీకు
కడుభీతి వొడమెనే - కాని యించుకయు
వెలిపను మాటయే - వెంట యేనేలుఁగ
పలివును కంటక - పదములునాకుఁ 3190
బడియలు రత్న కం - బళములు గంద
వొడిసుమ్ము గాలికిఁ - బొదివినధూళి
పచ్చిక పానుపుల్ - పట్టె మంచములు
మచ్చిక నీవు స - మ్మతముతో నొసఁగు
నాకునలమ్ము నా - కమృతమౌ నిల్లు
వాకిలిఁ దలఁపక - వత్తు నీవెంట
తల్లిదండ్రులను మదిఁ - దలఁప నేనొల్ల
కలిగినయందు నాఁ - కలిఁ దీర్చు దాన
నానిమిత్తంబు చిం - తలును వంతలును
మాని తోడుక పొమ్ము - మనవి చేకొమ్ము 3200
నిన్నుఁగూడి యెచట నుం - డిన స్వర్గసుఖము
నిన్నుఁబాయ స్వర్గంబె - నిరయ స్థలంబు
పగవాని కేలయొ - ప్పన సేయనన్ను
తగవౌనె యేను నీ - దాననుఁగానె?
యింకఁగాదని యం - టివే జాలలెస్స
యంకిల దీరెస - మస్తంబు నందె
సీత యేమాయనో - చెప్పెడి వార
లితరి లేరని - యెంచి చింతిలుచు
నీవు వనంబులో - నెగులొందకుండ
యీవేళ మెప్పించి - యేక చిత్తమునఁ 3210

పయనంబు సేతునీ - పలుకుచెల్లించు
దయితలు సంకెలల్ - ధవులకునెల్ల
కావున విడనాడి - కదలుము వనికి
వేవేగ నీచి_త్త - వృత్తమేర్పఱపు
నన్ను మాన్చెదుగాని - నాదుప్రాణములు
వెన్నాడి రా నీవు - విడనాడఁ గలవె?
అదియుఁ జూచెద - వేల యనుమానమింక
మదిఁగలమాట ప్ర - మాణంబుఁగాఁగ
నానతిండన'' నిట్టు - లనిపల్క లేక
మానంబుతో మాఱు - మాట చాలించి 3220
చింతింపుచున్న దా - క్షిణ్య వారాసి
యింతిఁగన్గొని ఖేద - మినుమడి గాఁగ
నిలుపోపఁ జాలక - నెమ్మేన క్షణము
నిలుపంగ ప్రాణముల్ - నేరుపు లేక
ఆపన్నయై చాల - నడలుచు బిట్టు
వాపోవుచును పయి - వ్రాలికౌఁగిటనుఁ
బెనచి ముల్కులు - నాఁట బెదరి వేదనలఁ
గనలి కూయిడుచున్న - కరణియో యనఁగ
తమ్మితేకులు మరం - దము చిందురీతి
నెమ్మేన వేఁడి క - న్నీరు రాల్చుచును 3230
జలముల బాసిన - జలజంబురీతి
కలకలనవ్వు చ - క్కని మోము వాఁడ
కలకంఠకాకలి - కారావఘణితి
నెలిటిమాటలవెక్కి - వెక్కి యేడ్చుచును
తన యనపాయత్వ - ధర్మంబు దెలుపు

కనకకోమలగాత్రిఁ - గౌఁగిటఁజేర్చి
కానిమ్మని యవేల - కారుణ్యశరధి
జానకి వీనులు - చల్లఁగాఁబలికె.
"ఏలచైతన్య మి - ట్లేమరి నీవు
బాలాలలామ ! కో - పమున నేడ్చెదవు ? 3240
యేనిన్ను నెడబాతు - నే యింద్రభోగ
మైన నాకేల నీ - యండ లేకున్న
వనులకు నేనేఁగ - వలసిన కతన
వనిత ! నీమదిఁజూచు - వాఁడనై యుంటి
చిత్తంబులోనేను - చేసిన నేర
ముత్తమగుణవతి ! - యోర్చిసైరింపు
జగములు నిర్మింప - సమయింపఁజాలు
పొగడికల్గన్న యం - బుజగర్భశక్తి
యెంత యంతటికన్న - యెచ్చైనశక్తి
మంతుని నన్ను నీ - మాటలాడుదురె ? 3250
జ్ఞానాధికుఁడు కీర్తి - సడలనియటుల
యేనేల యిట్టిచో - నెడవాతునిన్ను
వనవాసములనుండ - వనజభవుండు
వనిత ! నీతలయందు - వ్రాసినవాఁడు
అదియేలతప్పరా - నన్ను నిన్నేల
వదలుదు నెఱుఁగకే - వగ వగ పేల ?
అతివ ! వానప్రస్థు - లడవులయందు
సతులతోనుండరే - సంసారులగుచు
వారికేదోషముల్ - వచ్చె నీవరము
కోరినదే కైక - కొసరుదీఱంగ 3260

నర్యము వెనుక భా - యదేవివచ్చు
మర్యాద నావెంట - మానిని! రమ్ము
నిలువరాదిచ్చోట - నేఁడెపోవలయుఁ
దలిదండ్రులాజ్ఞయా - దలఁదాల్తు వెపుడు
తనగురుండును తల్లి - దండ్రులెవ్వరికి
వనితస్వాధీనదై - వతములు సుమ్ము.
అటులుండ నితర దే - వారాధనంబు
లెటులఁగావింతురో - హీనమానవులు
లలన! ముల్లోకంబు - లను వారితోడఁ
దులగాఁ బవిత్రవ - స్తువులేలకల్గు? 3270
నిట్టిపుణ్యులఁగొల్వ - సేవలంగాక
గట్టిగా సకలభా - గ్యములు చేకూడు
యిహపరంబులు గురు - లేకాక దిక్కు
వహియించుకొని ప్రోవ - వశమె యన్యులకు?
గురుసేవచేత చే - కురని యర్థంబు
ధరలేదుగాన యిం - దగునాచరింప
యిదిసనాతనధర్మ - మిందీవరాక్షి!
వదలక నావెంట - వత్తువుగాక
దండకారణ్యయా - త్రకుఁగొంకులేక
అండగానీవున - న్ననుసరించుటను 3280
వన్నియదెచ్చితి - వంశంబునకును
కన్నె! నాకును నీకుఁ - గన్నవారికిని
చాలదే సహధర్మ - చరివైతివెంత
మేలునీబుద్ధికి - మిగులమెచ్చితిని
మదిరాక్షి! వేగ బ్రా - హ్మణభోజనములు

నదనుతోనగ్ని హో - త్రాదికర్మములు
జపములు హోమముల్ - శాంతులుఁదీర్చి
తపసులం బిలిచి యా - త్రాదాన మొసఁగి
శయనీయ రత్నభూ - షణ వస్త్ర కనక
మయ పాత్రికాదులా - మనసొమ్ములెల్ల 3290
నడుగువారికి పేర - టాండ్రకు నొసఁగి
కడునమ్మిమనల నే - కడఁ గాచువారి
అందరవలసిన - యర్థంబు లిచ్చి
ముందుగాఁగదలి ర - మ్ము ప్రయాణమునకు"
అని యూరడించి పొ - మ్మన పల్కు మగని
యనుమతింబరమ క - ల్యాణియా సీత
తనయింటిసొమ్ములం - దఱకునొసంగఁ
గని యదిసమయంబు - గావునఁజేరి
అన్నపాదముల సా - ష్టాంగంబువ్రాలి
సన్నుతభక్తి ల - క్ష్మణుఁడిట్టులనియె. 3300

—: రాముఁడువనములకు రావలదని లక్ష్మణునకుఁ జెప్పుట :—

"శ్రీరామ! నిజము - సేసితిరే పయనము
మీరన్నగతి దైవ - మే గెల్చెనన్ను
చనుదురుగాక యే - శరములు విల్లుఁ
గొని మీపదాబ్జముల్ - గొలిచివచ్చెదను
మునుపుగాగహన భూ - ములఁద్రోవ వెంటఁ
జనుచు దృష్టమృగాళిఁ - జమరివైచెదను
యేయెడ మిముఁజూడ - నెడవాయఁగలుగు
నాయిర్ధద్రసామ్రా - జ్యమైన నేనొల్ల

ననుమతియిండన్న" - ననునయోక్తులను
తనదురాకకు నమ్మ - తము నొందకున్న 3310
రాముని చరణ సా - రసముల వ్రాలి
సౌమిత్రిచిత్తంబు - చలియించఁబలికె.
" మనతండ్రిపలికిన - మాటగాదనఁగ
మనకుధర్మముగాదు - మారాడవలదు
వనికిఁబోవుదమని - వాత్సల్య మొప్ప
ననుఁగూర్చిపల్కుటల్ - నమ్మియుండితిని
మున్ననుజ్ఞయొసంగి - మొగమాట లేక
నన్నువీడఁగనాడ - నాయమే నీకు ?
యిపుడేల వద్దన - నీమాటవలుకు
నపుడు మిక్కిలి సంశ - యంబయ్యె నాకు 3320
రాకమాన" నటన్న - రాముండు సుగుణ
సాకల్యశాలి ల - క్ష్మణునకిట్లనియె.
" సద్ధర్మపరుఁడవు - సైదోడ వెపుడు
బుద్ధిమంతుండవు - పుణ్యశీలుఁడవు
చలమేలప్రాణ - సముఁడవిట్లయ్యు ?
కలగి యీక్రియబల్క - గారణంబేమి ?
నీవును నావెంట - నేవచ్చినపుడు
దేవికౌసల్య యే - తెఱఁగున బ్రతుకు ?
తలఁప నెవ్వారు సుమి - త్రనుఁ బ్రోచువారు ?
పలుకుమా మనవారి - బ్రదుకుచందంబు 3330
పర్జన్యుఁడవని తా - పముఁదీర్చినట్ల
దుర్జయశౌర్య ! నీ - తోడుగావలదె
కామాతురుఁడు రాజు - కైకేయికొడుకు

భూమికెల్లనురాజు - బ్రోచునేవీరి ?
భరతుండుతమ - తల్లిపలుకులోవాఁడు
సరిగాఁగనడపునే - సవతితల్లులను !
నీరాకకన్నవ - న్నియగాదె నాకు
పోరానితల్లులఁ - బోషించితేని
అరలేనిభక్తినా - యందుగల్గుటకు
గుఱుతుగా నిరువురి - కొలలురాకుండ 3340
నన్నునీడేర్ప న - నంతపుణ్యంబు
వన్నియు వాసియు - వచ్చునీకిపుడు
చలమేలవలదన్న - సౌమిత్రి !" యనుచుఁ
బలికినక్రమ్మరఁ - బలికె లక్ష్మణుఁడు.
"భరతుండు మీప్రతా - పంబున వారిఁ
గరుణతోఁబోషింపఁ - గలఁడేల యింత
చింతకౌసల్యకు - శ్రీధనంబైన
స్వాంతమైనది గ్రామ - సాహస్రకంబు
ననువంటివారి నెం - దఱనైనఁబ్రోవ
తనశక్తిగలిగిన - తల్లికైవగచి 3350
పసవునకిచ్చిన - పల్లెలునూరు
రసఖండములు సుమి - త్రకుఁగల్గియుండ
నాయమ్మలకులేని - యవధిగల్పించి
పాయఁజూచెదవు - నాపలుకియ్యకొనక
యేయమ్మ ! జానకి ! - యెప్పుడునీదు
సేమంబుఁగోరి కా - చి భజించుటెల్ల
యింతమాత్రమె యయ్యొ - నే నన్ను వెంట
సంతరించుకపోక - జాలిద్రోచెదవు

నీకన్నప్రాణముల్ - నిలువవు సుమ్ము
నాకు శ్రీరాముఁగా - నకళంకమైన 3360
యొకమాటయునవమ్మ ! - యొచ్చంబురాదు
నికటంబునందునుం - డి యుపేక్షయేల ?
యెఱుఁగవే శ్రీరామ ! యెల్లధర్మములు
పరికింప నిన్నడ - బాయకుండుటలె
నాకు ధర్మముగాక - ననుడించిపోవ
మీకుధర్మముగాదు - మేలెంచితేని
వనవాసములకేను - వలసినవాఁడ
వనితతోఁజనుచున్న - వాఁడవు నీవు
పారయువిల్లును - బాణముల్ దాల్చి
మీరునిల్చినచోట - మేదినియాడ్చి 3370
మిట్టపల్లములొక్క - మేరఁగాఁజెక్కి
చుట్టిన చీమలుం - జొరరాకయుండ
ములుకంప యొనరించి - ముందరనొక్క
చలువపందిరిపర్ణ - శాల యేర్పఱచి
మిమ్మునచ్చటనుంచి - మీకుఁగావలయు
కమ్మదావులవిరుల్ - కందమూలములు
తీయనిఫలములు - తేటతానీళ్లు
నేయెడవలసిన - నేఁదెచ్చియిచ్చి
యానందమున సౌఖ్య - మనుభవింపుచును
జానకీయుతముగా - శయనించునపుడు 3380
గిరికందరంబులఁ - గ్రీడించునపుడు
శరమేర్చిచేవిల్లు - సజ్జంబుచేసి
తగునట్టినెలవునఁ - దరలక రేయుఁ

బగలు నేమరకుండుఁ - బనిగొమ్మునన్నుఁ"
అనినరాముఁడు చాల - హర్షించి యతఁడు
తనవెంట రా నమ్మ - తమున నిట్లనియె.
"వినిపించఁదగు నెడ - వినిపించి పయన
మనిపించి కొనుము నీ - యాప్తులచేత
జనకయజ్ఞంబున - జలధినాయకుఁడు
తనకిచ్చినట్టి కో - దండముల్ రెండు 3390
కనకతూణీరముల్ - కవచంబు హేతి
మునువసిష్ఠునిగృహం - బున పూజలంది
యున్నవి దెమ్మన్న - నూర్మిళారమణుఁ
డన్నియు నతనిగే - హమునకు నేఁగి
ఆమునియొసఁగంగ - నవిగొంచువచ్చి
రామునికట్టెదు - రను దెచ్చియునుప
చూచి హర్షించి మె - చ్చుచు నింక మనకు
నీచాయతామసం - బేల నీవిపుడు
పిలిపింప భూసుర - బృందంబుమనలఁ
గొలిచినవారికి - కోర్కెలీవలయు 3400
మనయింటఁగలుగు స - మస్తధనంబు
నునిచియెవ్వరికని - యొప్పగించెదము.
ఆచార్యపుత్రుసు - యజ్ఞునింబిలువు
మేచాయనర్థుల - నెల్లరమ్మనుము
వలసినవిచ్చి పో - వలయునువెడలి
వలదు" తామసమన్న - వచ్చిలక్ష్మణుఁడు
అగ్నిహోత్రగృహంబు - నందువసించు
నగ్నిసంకాసు సు - యజ్ఞునింగాంచి

ప్రణమిల్లి "మిము గావ - భద్రుండుబిలిచె
క్షీణమైనతామసిం - చఁగరాదు రండు."　3410
అనవినియతఁడు మా - ధ్యాహ్నికవిధులు
చనఁదీర్చివచ్చి ల - క్ష్మణుఁడునుఁదాను

—: రాముఁడు దానములుఁ జేయుట :—

శ్రీమించిసకల ల - క్ష్మీధామమైన
రామునినగరిని - రామునిఁజూచి
సీతాసమేతుఁడై - శ్రీరామచంద్రుఁ
డాతతభక్తితో - నంజలిచేసి
తమయాత్ర వివరించి - తారహారములు
కమనీయకుండలాం - గదభూషణములు
యిచ్చిజానకిచేత - నిప్పించెసామ్ము
లచ్చపుభక్తితో - నతనిభార్యకును　3420
పట్టెమంచంబులు - పఱపులు మేలు
కట్టులు తలగడల్ - కనకాసనములు
అందలంబులుఁజతు - రంతయానములు
కుందనపుంగట్ల - కొమ్ములతోడి
శత్రుంజయాదిగ - జంబులు వేయి
పాత్రవై ఖరిసమ - ర్పణముగానింప
రామలక్ష్మణుల ధ - రాతనూజాత
నామాని దీవించి - యరిగినయంత
"రమ్ము! లక్ష్మణ! నవ - రత్నంబు" లనుచు
సొమ్ములచే నగ - స్త్యుని గాధి సుతుని　3430

జలములచేత స - స్యంబులపోలి
అలరింపు పిలిపించి - యన్నియు నొసఁగి
సిరులు కౌసల్యయా - శ్రితులకు వారి
తరముల గురులైన - తైత్తిరీయులకు
వాహన భూషణ - వసన సౌవర్ణ
బాహుళ్య మొసంగి - సంపన్నులఁ జేయు
కడునమ్మి మనములఁ - గాచియున్నాఁడు
తడవులనుండి చి - త్రరథుఁడన్మంత్రి
ఆయనకును సువ - ర్ణాంబరాభరణ
దాయివై మదికి సం - తసము ఘటింపు 3440
మలరంగ కఠశాఖ - యధ్యయనంబుఁ
గలుగు నాశ్రితులైన - కాఠ విప్రులకు
నర్థిఁ గలాప శా - ఖాధ్యాయు లగుచు
నర్థించు (నా) కాపు - లగుభూసురులకు
నిత్యాధ్యయన కర్మ - నిరతులు బ్రహ్మ
నిత్యులు నగువటు - నికరంబునకును
ఆవులునుం బలు - నజము-ఖ హరులు
లావుటెద్దులు దెచ్చి - లక్షల కొలఁది
కౌసల్య మెచ్చ ల - క్షలకు దీనార
రాసి దక్షిణలు గా - రప్పించి యిమ్ము 3450
యీసీత వెంబడి - నేతెంచువారి
కేసొమ్ము లడిగిన - నిమ్ము ధన్యులుగ
నీవలసిన వారి - నెవ్వాలుదీఱ
కావలసిన యట్టి - కనకంబు లిమ్ము
చను" మన్నయపుడు ల - క్ష్మణుఁడు శ్రీరాము

వసుమతి దానసిం - హాసనం బెక్కి
త్యాగధ్వజం బెత్తి - తముకు సేయించి
వేగంబె తమసొమ్ము - వెచ్చింపుచుండ
తనుఁజూచి పరికించు - తనపగవారిఁ
గని రఘువీరుఁడు - కరుణ నిట్లనియె. 3460
"వనవాసమున కేఁగి - వత్తుము మఱలి
మనమున నేల యు - మ్మలికింప మీకు
నాకెంత యాపదు - నాలుగేండ్లనఁగ
మీకేమి కొఱఁత యే - మిటికిఁ జింతిలఁగ
నామందిరము లక్ష్మ - ణ కుమారు నగరు
సేమఱ కేవేళ - నెచ్చరిల్లుచును
కావుఁడీ" యనుచు బొ - క్కసముల వారి
నావేళ పిలిపించి - యాదరం బొప్ప
మనలక్ష్మణుండు బ్రా - హ్మణులకు నెల్ల
ధనములు నొసఁగ నే - దానంబు సేయ 3470
మిగిలిన ధనమెల్ల - మీ వశంబగుచు
నగరిలోనున్న భం - డారమంతయునుఁ
దెమ్మన్న వారలు - తెచ్చి శ్రీరాము
సమ్ముఖంబున నుంప - సకలయాచనక
గాయక నటక మా - గధ బాలకులకు
నేయర్థ మడిగిన - నిచ్చి వెచ్చించి
ఘనుని జైవాతృకు - గర్గ వంశమునఁ
దనర జనించు చం - ద్ర సహస్రజీవి
త్రిజటుఁడ న్విప్రుని - తెఱవ దారిద్ర్య
రుజనతి మాలిన్య - రూపిణి యగుచు 3480

మగనిఁ జేరఁగ వచ్చి - మనరామవిభుఁడు
జగదేకదాత యీ - జనుల కందఱికి
కోరికలిచ్చుచో - గొడ్డలి గడ్డ
పారయు పారచి - ప్పయుఁ గొడవలియు
మోచుక వనమూల - ములు ద్రవ్వితెచ్చి
యేచాయఁ గడలేని - యిడుమలం బడుచు
కడుపున కన్నంబు - కట్టుకో చీర
ముడువఁ గాసును లేక - ముదిసి ముప్పునను
అలమట పడనేల - యడుగుము పోయి
వలసినవిచ్చు భూ - వర కుమారకుఁడు'' 3490
అనియాలు బోధింప - నాత్రిజటుండు
పెనుఁజింపి గుడ్డలు - పిఱుఁదునఁజుట్టి
చంటను వెంటవా - చఱచుబిడ్డలను
కంటగింపుచు భార్య - కడకు నేతేర
గూనువంచుక యూఁత - కోలయుఁదాను
దీనుఁడై నగరు సొ - త్తెంచి నాల్గేను
సావళ్లు గడచి య - చ్చట దడ లేక
పోవుచు సీతావి - భునిఁ జేరఁ నేఁగి
"బిడ్డలుగలవాఁడ - పేదవిప్రుఁడను
గొడ్డలి నాయాస్తి - కోనయుంగూడు 3500
నెన్నడు లే దుంఛ - వృత్తినుండుదును
నన్నుఁ బ్రోవుమనాథ - నాథ ! వేఁడెదను
ఆలిబిడ్డలచేతి - యాపదమాన్పి
పాలింపు నన్ను కృ - పాదృష్టిఁ జూచి

అవలేఁతనవ్వుతో - నారఘువీరుఁ
డనుకంప చిగురింప - నతనికిట్లనియె.
"వలసిన యావులు - వలసినసొమ్ము
వలసిన వారిక - వ్వారిగా నేఁడు
సౌమిత్రియొసఁగె నె - చ్చటనుండినీవు
లేమిఁజెప్పెదు సొమ్ము - లేదు మానగర 3510
తరిదప్పనైన ని - త్తరి నన్నునడిగి
చిఱుతపోవుదువేని - చేయూఁతకోల
యీయాలమందపై - నిప్పుడు విసరి
చేయెత్తిపార వై - చిన నెందు వడియె
నందుకులోనైన - యావులన్నియును
తొందుడుకులు మాని - తోలుకపొమ్ము
యిచ్చెద నీశక్తి - యిపుడె చూచెదము
విచ్చేయుఁడ"నినని - విప్రుండుబొంగి
గోసిసారించి గ్ర - క్కున బయల్ దేరి
చేసన్ననిల్లాలిఁ - జెంతకుఁబిలిచి 3520
వడిమీర పాఁతనో - వతిగుడ్డలెల్ల
మడతలువెట్టి ప - ల్నరు వడిపెట్టి
గట్టిగానడుము వం - గక యుండఁజుట్ట
చుట్టి యింతి బిగింప - శూరుఁడై యతఁడు
బిగువుతోఁబ్రాణముల్ - పిడికిటఁబట్టి
తెగియూఁతకోలచేఁ - ద్రిప్పివైచుటయు
బిరబిరనదిపోయి - పెనుమందలోన
సరయూ తటంబున - జప్పుడుగాఁక

వాకవృషభముచెంత - నుర్విపైఁబడిన
సకలేశుఁడగు రామ - చంద్రుండు మెచ్చి 3530
అద్దిరా! యీ బాఁప - నాస" యటంచు
వద్దవై దేహిన - వ్వఁగ రఘూద్వహుఁడు
చేయి నొచ్చెనో యల - సితి రంచునతని
డాయంగ వచ్చినిం - డఁగ గౌగిలించి
ఆమందఁగలయావు - లన్నియునొసఁగి
యామహాని జూచియు - ట్లనియాదరించె.
"పరిహాసకముగ నేఁ - బలికినమాట
ధరణీసురేంద్ర! చి - త్తమున సహింపు
యిదివేఁడవచ్చురా - దిదియంచు నీదు
మది ననుమానంబు - మాని కావలయు 3540
సొమ్ములువేఁడుమి - చ్చోనిత్తు "ననిన
సమ్మోదమున మునీ - శ్వరుఁడిట్టులనియె.
"అడిగెడికోలఁది యే - యనఘుని దాన
మడుగనేర్తురె యిన్ని - యావు లిమ్మనుచు
నతిమానుషములు నీ - యతులితశౌర్య
వితరణంబులు చాలు - వేవేలుమాకు
సుఖివింగమ్మని" వోవు - చో రామవిభుఁడు
సఖులకు భృత్యాదా - సవితానమునకుఁ
గలిగినధన మెల్ల - గ్రామంబులొసఁగి
తలతలనందఱఁ - దనియంగఁజేసి 3550
తమ్ముఁడుఁదాను సీ - తయుఁ దండ్రికడకు
సమ్మదంబున నేఁగ - సదనంబు వెడలి.

—: సీతాలక్ష్మణులందోడ్కొని పోవ నన్నుజ్ఞవేఁడ
రామునుఁడు తండ్రికడకు బోవుట :—

జానకిసంతతా - ర్చనముల భాస
మానంబులైన భీ - మశరాసనములు
నతుల నిషంగద్వ - యంబు ఖడ్గములు
హితభక్తిఁదాలిచి - యిరువురివెనక
సౌమిత్రిఁగొలిచి రా - జనకజంగూడి
రామచంద్రుఁడయోధ్య - రాజమార్గమున
పురజనులెల్ల గుం - పులు గట్టివీధు
లరికట్టుకొని వింజ - మాకిడినట్లు 3560
చూడఁజోలేది మ - చ్చులును మేడలును
మాడుగులును నెక్కి - మతులఁజింతిలుచు
"అకట! నల్లడఁజతు - రంగబలంబు
లకలంకమతిఁగొల్వ - నలరుచువచ్చు
నాదిగర్భేశ్వరుం - డగు రామవిభుఁడు
వైదేహితో నొంటి - వచ్చెకాల్నడను
నొరులకునైశ్వర్య - మొసఁగు సామర్థ్య
గరిమంబుగలుగు రా - ఘవుఁడద్దిరయ్య!
తనతండ్రిరాజ్యమం - తయు నేలుచుండ
ననదకై వడినొంటి - నరుదేరవలసె 3570
వైమానికులు మింట - వచ్చుచోనైన
తాము చూచెదమని - తలఁపరానట్టి
రాముని పట్టంపు - రాణివాసంబు
భూమిజఁ బురజనం - బులు చూడవలసె

పరిమళంబులువోసి - పసిఁడిమేడలను
పరమదివ్యాంబరా - భరణముల్ దాల్చి
చెలులుగొల్వ మెలంగు - సీతయేరీతి
మెలఁగునోగహనభూ - మిని నాథుఁగూడి ?
అనరపతి పిశా - చావిష్టుఁడైన
వానికై వడి నంప - వచ్చునెవీరి ? 3580
గుణహీనులైనట్టి - కొడుకులేమైన
గణుతింపకిటుసేయఁ - గలతండ్రిగలఁడె ?
యీసర్వగుణముల - కిరవైనరాముఁ
బాసిపొమ్మనియెట్లు - వల్కెనోరాజు
సతతంబు పద్దుగై - శ్వర్యసంపదల
నతిశయించిన రాము - నలమటల్ చూచి
గ్రీష్మవాహినులఁగ్రాఁ - గిన యల్పవారి
నూష్మచే జలచర - వ్యూహమంతయును
తపియించు గతివీరు - దఱిలిపోఁజూచి
యిపుడోర్వనేర్తురే - యీపురజనులు 3590
వేఱుఁగొట్టినచెట్టు - విరులచందమున
పౌరులందఱువాడు - బాఱియున్నారు
శ్రీరాముఁడే తమ - జీవనస్థితికి
నారయ మూలమై - యాధారమగుట
తడయకపుత్రమి - త్ర కళత్రములతో
యడవులకీ రాము - ననుసరింపుచును
ధనధాన్యపశువస్తు - తతితోడఁగూడి
జనులెల్లఁబోలని - చ్చట నివాసముల

నారామముల మూపి - కాది జంతువులు
క్రూరసర్పములు నె - క్కొనియుండుఁగాక! 3600
రామునింగూడి య - రణ్యంబులందు
భూమీజనంబులు - పురముగానుండ
అచ్చటిజంబుక - వ్యాఘ్రాదిమృగము
లిచ్చటివాడల - నిరవొందుఁగాక!
ఎవ్వరులేనట్టి - యీపాడుపురము
దవ్వులనున్న యా - త్మజుని రప్పించి
పట్టంబుగట్టుక - పతియునుఁదాను
నట్టిచోఁగైక రా - జ్యముసేయుఁగాక!
యీరాముఁడున్నట్టి - ఎడ పట్టణంబు,
కారడవి యితండు - కడనుండుపురము 3610
మనములఁజూచి జి - హ్మాగములు వెఱచి
వనములనెడవాపి - వచ్చియిచ్చోట
చెడి దిక్కులేనట్టి - సింహాసనములు
విడకచుట్టును పరి - వేష్టించుఁగాక!
ఝిల్లీరవక్రూర - ఝుంకారరవము
పిల్లఁగ్రోవులనాఁదు - పెంపుగానించి
నిదురమేల్కనువేళ - నిరతంబు భరతుఁ
డదియె మంగళగాన - మనియెంచుగాక!"
అని వాడవాడల - నాడాడ నాడ
జనులమాటలు తన - శ్రవణముల్ సోఁక 3620
కరుణించి విని నిర్వి - కారుఁడై మత్త
కరిరాజగంభీర - గమనంబుతోడ
మొగమువాంచు సుమంత్రు - ముందరఁజూచి

“ రమ్మనుసుమంత్ర ! - మారాజునుంజూడ
సమ్మోదమొదవ ని - చ్చటికి వచ్చితిమి
మాతండ్రితోడ నీ - మాటయేర్పఱచి
ప్రీతితో మమ్మర - ప్పింపుమీ ” యనిన
అర్థుడై రాహుగ్ర - హాగ్రస్తుడగు వి
కర్తనుగతి నీఱు - గప్పినవహ్ని
కరణి నిర్జలతటా - కమురీతిఁబొంగు 3630
తరుగువారధిమాడ్కి - దశరథనృపతి
రామునికై విచా - రముతోడనుండ

— శ్రీరాముఁడు మఱల తండ్రికడ సెలవు పుచ్చుకొనుట :—

చేమోడ్చితాను వ - చ్చిన యట్టిరాక
ధరణీసురాళికి - దానముల్ చేసి
పరిజనంబులఁబోచి - బాంధవావళికిఁ
జెలులకుఁదల్లికిఁ - జెప్పివారనుపఁ
దలఁపులో మిముఁజూడఁ - దలఁచి వాకిటను
జానకీలక్ష్మణ - సహితుఁడై వచ్చి
భానుసంతతిఁగూడు - భానునికరణి 3640
నుత్తమరాజగు - ణోత్తరుండై వి
యత్తలంబునఁబొందు - లన్నియు మాని
యత్యంత పరిశుద్ధుఁ - డై ప్రమోదమున
సత్యసంధుండు రామ - చంద్రుఁడున్నాఁడు ”
అన విని దశరథుఁ - డడలుచు నతనిఁ
గనుఁగొని నగరిలోఁ - గల కులాంగనల

నందఱఁగోడితె - మ్నతివలునేను
నిందుసన్నిభు రాము - నీక్షింపవలయు
పొమ్మ"న్ననతఁడంతి - పురమునకరిగి
అమ్మాట వివరించి - యచటమున్నాట 3650
యేఁబండ్రు కులసతు - లింతి కౌసల్య
తోఁబొదువుక రాఁగఁ - దోడ్కొనివచ్చి
భూమీశుచెంతన - ప్పుడు నిల్పె నతఁడు
రామునిం బిలిపింప - రామలక్ష్మణులు
సీతయురాఁజూచి - సింహాసనమున
నాతరి నిల్వలే - కవనిమూర్ఛిల్లి
పడియుండు నెడ రఘు - పతి చేరనేఁగ
పడఁతులందరుఁ గలా - పంబులు మొరయ
"హారామ! హారామ! యనునార్తరవము
భోరుననిండ న - ప్పుడు రఘూద్వహుఁడు 3660
జానకిలక్ష్మణ స - హితంబుగాఁగ
దానునుబిట్టురో - దనమాచరించి
తనతండ్రివచ్చుట - తల్పంబునందు
నునిచిసీతయుఁదాను - నుపచరింపఁగను
తెలివిగైకొని కన్ను - దెఱచిన విభుని
వలగొని యారఘు - వర్యుఁడిట్లనియె.
"వనవాసమునకేఁగు - వాడనై మిమ్ముఁ
గనుగొనవలసి యి - క్కడికి వచ్చితిని
నన్నుఁగన్గొని దీవ - న లొసంగి ననుపు
యెన్ని చందంబు - ల నేవఁదన్న 3670

యీసుమిత్రా పుత్రుఁ - డీ సీత వెంట
రాసమకట్టి వా - రలు వచ్చినారు
యీజానకి కనుజ్ఞ - యిమ్ము లక్ష్మణుని
తేజోధికునిఁ జూచి - దీవించి పనుపు
మందరికినిఁ గర్త - యైన రాజీవ
నందనుగతి భూజ - నంబుల కెల్ల
రాజవు మాకుఁ గ - ర్తవుఁదండ్రి వగుట
కీజాడ మీారాన - తిచ్చిరి రటుల
నడచువారము గావు - న ననుజ్ఞయిమ్ము
తడవేల" యనుటయు - దశరథుం డనియె. 3680
"కామాతురుండను - కైకకు లొంగి
యేమున్న వరమిచ్చి - యిటునటుఁగాక
ఆర్తినొందిన వాఁడ - నట్టిదుర్బుద్ధి
వార్తలు చెవి నాన - వలపదునీవు
లెక్కసేయక యెంత - లేదు వొమ్మనుచుఁ
గ్రక్కున పట్టంబు - గట్టు కొమ్మీావు
నామాట వినుమన్న - నమ్రుఁడై లేచి
భూమీాశునకును న - ప్పుడు రాముఁ డనియె.
"పలుకుదు రే యిట్లు - పార్థివ! మీారు
గలిగిన పదివేలు - గాలంబులకును 3690
ఆడి తప్పుదురయ్య - యరిగెద వనికి
నేడె నాపంతంబు - నెనయ జెల్లించి
తరవాత మీాపద - ద్వయములు చూడ
మరలి వచ్చినవెన్క - మఱిసేతు నటుల"
అనవిని కైక తా - నడ్డంబు దూరి

జనపాల! యిఁక తామ - సంబేల? రాముఁ
బొమ్మను" మనిపల్కఁ - బోయి రండనుచు
నమ్మానవాధీశుఁ - డాడి నట్లాడి
యారేయి కౌసల్య - యేనునుగూడి
యూరడిల్లఁగ యిందు - నుండివేఁకువను 3700
అన్న! సేమంబున - నరిగి క్రమ్మరుము
నినుఁ బొమ్మనునది - నిక్కంబు గాదు
కైకేయి పోరకుఁ - గాక పొమ్మనుచు
వాకొంటినది యెన్న - వలదు నిక్కముగ
నాసుకృతమె సాక్షి - నమ్మితింజిచ్చు
తోసరియగు నిట్టి - దుష్టాత్మురాలి
చేత నిర్బంధంబు - చే నినుఁబాయు
హేతువు గనలేక - యిచ్చుకోర్చితిని
చాలు నింతేల నా - సత్యంబు నీవు
పాలింతు నని కైక - పలుకు చేసెదవు 3710
హితము గాదిది నాకు - నేలకుమార!
వెతల పాలుగఁ జేసి - వెడ బుద్ధినైతి"
అనిన లక్ష్మణుఁగూడి - యంజలిచేసి
వినయంబునను రఘు - వీరుండు పలికె.
"ఎల్ల రాజ్యంబును - నేలుటకన్న
నుల్లంబులోఁ గాన - నుండఁ గోరెదను
కోరెద కైకేయి - గోరిన వరము
మీరిచ్చు నదియె నా - మేలుగానెంచి
భరతునిఁ గట్టుఁడు - పట్టంబునాకు
పరమ లాభంబు మీ - పల్కు నిల్పుటలు 3720

తొలఁకు మానినయట్టి - తోయధిరీతి
కలఁక నొందక యుండఁ - గావలెఁగాక
యిట్టు లాడుదురె మీ - కేల విచార
మెట్టైన వనుల కే - నేఁగకమాన
నీరాజ్య సుఖమైన - నీసీత నైన
స్వారాజ సామ్రాజ్య - సౌఖ్యంబెయైన
మానుదుఁ గాకేల - మానుదు నీదు
పూనికె చెల్లింపఁ - బూనిన వ్రతము
యిది సత్యమని యెన్ను - మింక నాపూని-
వదల క్షణంబైన - వసియింప నిచట 3730
శోక మోహంబు లి - చ్చో మాను మేను
కై కేయికి హితంబుఁ - గావించువాఁడ
దేవతా వళికైన - దేవుండుతండ్రి
గావువ మీమాట - గడవ నోడుదును
యొరుల ఖేదము మాన్ప - నోపిననీవు
ధరణీశ ! నాకునై - తలఁపంగఁ దగునె ?
పనిలేదునీకు తా - పము సుఖవగుము
తనకేమి కొఱత కాం - తారంబులందు
కందమూలముల నాఁ - కలి దీర్చిమేలు
నందెద పదునాలు - గబ్దముల్ చనిన 3740
పోయివత్తునె యన్న" - భూపతి రాముఁ
బాయఁజాలక కేలు - వట్టిరాఁదిగిచి
కౌఁగిటనునిచి శో - కమున మూర్ఛిల్లు
చోఁగాంచి రఘుపతి - శోకింపుచుండ

కౌసల్య మున్ను గాఁ - కైకేయిదక్క
వాసంబులో రాణి - వాసంబులెల్ల
విలపింప సౌమిత్రి - వెత నొందసీత
కలఁగుచు పుట్టెడు - కన్నీరుగార
చూచి సుమంత్రుఁడే - డ్చుచుఁ దెల్వి కొంది
లోచనంబులనుఁ జ - ల్లున నిప్పులురల 3750
జేగురింపగ మొగంబు - చెమరింపమేను
సొగునిట్టూర్పు వె - చ్చఁదనంబు లీన
కటకముల్ గదలను - త్కట కోపుఁడగుచు
కిటకిట మొనబండ్లు - గీఁటుచుఁగైక
దిట్టమై నిలుచున్న - తెఱఁగాత్మఁరోసి
చుట్టు సందడుఁ విన - జూచి యిట్లనియె

—: సుమంత్రుఁడు కైకను నిందించుట :—

" రాజు చిత్తము నీవె - ఱంగఁగ లేక
రోజంత ! యెంతకు - నొడిగట్టినావు
కులమెల్లం జెఱచి నీ - కునుఁ గర్తయైన
యిలపతిఁ బొలియింప - నెత్తుకొన్నావు 3760
యిట్టుచేసిన మీఁద - నేమేమిసేయ
దట్టి గట్టితివా పా - తకురాల వీవు
కలఁగఁ బారని యట్టి - కలశాంబురాశి
చలియింపకున్న కాం - చన భూధరంబు
అని పరాజయము లే - నట్టి దేవేంద్రుఁ
డన మీఱునట్టి మ - హారాజు నిట్లు

వెతఁ బెట్టెదవు తన - విభు మీఱి నడుచు
సతివ పుట్టువు నిర - యముల కాస్పదము
కొడుకు నిమిత్తమై - కుల మెల్ల నీవు
చెడఁజూచెదవు ధర్మ - - శీలముల్ వదలి 3770
భరతునిఁ బిలిపించి - పట్టంబు గట్టి
ధరణి యేలితి వేని - తగనిచో మేము
కాలూఁది నిలరాదు - గావున నిచట
చాలించి రాముని - జాడ నేఁగెదము
పాపాత్మురాల! యే - పగిది నీపెద్ద
మోపుగా నిను ధాత్రి - మోచెనో కాక
యివ్విప్రులును మాను - లేవేళ నిన్ను
ప్రవ్వఁదిట్టిన తిట్లు - పొరిగొనకున్న ?
చాయలవెలయు ర - సాలంబు నరికి
డోయిట వేఁపచె - ట్లుకుఁబాలు వోయ 3780
నదిచేఁదు మానని - యటుల కౌసల్య
వదలని పైదయ - వాఁడైన కతన
నాకర్మ ఫలము దా - ననుభవింపుచును
నీకునై మీఁదెత్తె - నృపతి ప్రాణములు
జననికింగల యాభి - జాత్యంబునీకు
నినుమడి గాఁగల - దిఁక దాఁచనేల ?
ముసిఁడిచెట్టునఁ దేనె - మొలచునే తల్లి !
యస మెల్లఁ దింపు సే - యఁగఁబుట్టి తీవు
నీజనని తెఱంగ - నేకులచేత
నేజాడ వినికని - యెఱిఁగి యుండుదును 3790

ఆకథ వివరింతు - నదియెట్టు లనిన
వాకొందు శ్రవణప - ర్వంబుగా వినుము.
ఒకయోగి వర్యుచే - నువిద! మీతండ్రి
సకల జంతువుల భా - షలెఱుంగునట్టి
వరములు గైకొన్న - వరమాని యతనిఁ
బరికించి యొరులకీ - భావంబు నీవు
చెప్పినచో గత - జీవుండ వగుదు
వప్పుడే యనిపల్క - నటుతరవాత
కొన్నినాళ్లకుచీమ - గుంపులో పసిఁడి
వన్నియగల చీమ - వనితతానొక్క 3800
కందువ మాటాడఁ - గా విని మెచ్చి
యందుకై నవ్విన - యపుడు కైకయునిఁ
జూచి మీతల్లి "యి - చ్చోనేల నవ్వి
తీ చీమఁ గనియన్న - నెఱిఁగింపఁజూచి
తలఁచుక కారాదు - తరుణి నేఁ దెలుపఁ
బలికి నప్పుడ తన - ప్రాణముల్ బోవు
ననినఁ గోపించి మీ - యమ్మ యమ్మగనిఁ
గనుఁగొని యివి గొన్ని - కల్లలుగాక
యెందైన తమరు ము - న్నెఱిఁగినమాట
పొందుగాఁ దెలిపిన - ప్పుడె హానిఁజెందు 3810
వారలు గలరె? యీ - వార్త నాతోడ
నేరుపాటుగఁ దెల్పు - మింతటిలోనఁ
బోవుప్రాణము లున్నఁ - బోయిననేమి?
చావుకు వెఱచినఁ - జావ కుండెదవె
యామీఁద నీవెటు - లైన నాకేమి?

యీామాట వివరింప - కెటులుండనిత్తు
వేగఁబల్కు మటన్న - వెఱచియా మొదటి
యోగి చెంతకుఁబోయి - యోమానిచంద్ర!
నేవచ్చు తెఱఁగిది - నేఁడు నావఁత
భావమిట్టిది యని - పలికిన నవ్వి 3820
"మేలుమేలే సాధ్వి - మేదిని మఱియు
నాలని మొగఁడని - యాడుకోవలనె
అని తలయూచి - ఓ యధిప! వర్జింపు
మనుమానమేల యి - ట్లాడిన దాని
మొగము చూడఁగరాదు - మోదించివానిఁ
దెగఁజూచి యింట బం - దిగమునవైచి
వలయు నింతులఁగూడి - వరమిచ్చినాడు
పలు క్షేమఱక సౌఖ్య - పరుఁడవుగమ్ము
పొమ్మన్న" నతఁ డంతి - పురికేఁగిదాని
సొమ్మెల్లదోఁచి యీా - సున దయలేక 3830
తొత్తుల చెఱసాలఁ - ద్రోపించెనితని
యుత్తనుత్తము రాలి - నటువలెఁజేసి
యిలయెల్ల నేలుచు - నిపుడున్నవాఁడు
తలఁపని వట్టి పా - తకురాలియందు
పుట్టితి విపుడు నీ - బోధన చేత
నిట్టి యాపదలకు - నిరవయ్యె నితఁడు
కొడుకులకునుం దండ్రి - గుణములునాఁడు
బడుచులు తల్లికిఁ - బాటిల్లు గుణము
మజ్జాతియని యాగ - మంబులు వలుకు
విజ్ఞోకు గాదునీ - విధము నట్టిదియె 3840

నామాట వినినీవు - నరపతిం బ్రోచి
యీమహీ జనులకు - హిత మాచరింపు
పాపంబునకుఁ జొచ్చి - పతి నపవాద
కూపంబులోఁ గట్టి - కూలఁ ద్రోయకుము
వదలఁడు నీకిచ్చు - వరము లీరాజు
పదవులన్నియు సమ - ర్పణ సేయునీకు
మగని ప్రాణము లిచ్చి - మముఁ బ్రతికించి
పొగడికల్ గని సర్వ - భోగభాగ్యముల
నందఁటిలో మించి - అమ్మ ! నామాట
చిందు సేయకనీవు - చేపట్టి తేని 3850
వన్నెయు వాసియు - వచ్చునునీకు
నిన్నుఁ జేపట్టిన - నృపతికిఁగాన
నుత్తమ గుణురాము - నుర్వి పాలింప
నుత్తరు వోసగుమి - ట్లుచితంబుగాదు
ముట్టఁ జిక్కిన తండ్రి - ముదిసి ముప్పునకు
నిట్టిచో శ్రీరాము - నెడవాసి తేని
అపకీర్తి పాలౌదు - వాపదల్ గాంతు
వపమృత్యు వగుదు వీ - వ వనీశ్వరునకుఁ
గావున రాఘవుఁ - గట్టు పట్టంబు
భూవరుఁడట మీఁదఁ - బోవు కానలకు 3860
నిటు సేయ కులధర్మ - మిది నీకు హితము
కటకటల్ బడుదువు - కాదంటివేని
అని నయంబు భయంబు - నందందఁ దోప
మనుజేశు నెదురను - మంత్రుఁ డాడంగ
అదరక బెదరక - యణఁకువ లేక

యదినియ్య కొనక - యామందర బుద్ధి
నందర బ్రదుకుల - యడియాస లుడుప
క్రింటు చూపులఁగ్రైక - గెంటక యుండె.
ఆ దశరథుఁడు రా - మాంగ సంగతిని
సేదదేరి విషణ్ణ - చిత్తుఁడై చాల 3870
నసురుసురై ధైర్య - మవలంబనముగ
విసువుతో కైకేయి - విన మంత్రిఁజూచి
“రమ్ము ! సుమంత్ర ! యీ - రాముని వెంట
పమ్మిన చతురంగ - బలమునుఁగూర్చి
సకలవస్తు విశేష - సామగ్రియందు
ప్రకటించు నంగళ్లు - పణ్య భామినులు
పాళెము వెంటఁ బో - పయనంబుచేసి
చాల రామునియెడఁ - జనవరులైన
వారికెల్ల విశేష - వస్తువులిచ్చి
పోరాని మనచుట్ట - ముల వెంటఁగూర్చి 3880
పురములో వెనువెంటఁ - బొందగువారి
పరిజనులను నల్ల - ప్రజల వెంటరుల
శకట యంత్రాయుధ - సాధనా వళుల
నొకటఁ గొఱంతలే - కుండఁ బొమ్మనుచు
విపిన జంతువులను - వేఁట లాడుచును
నిపుణత జుంటితే - నియలు గ్రోలుచును
పనస రసాలాది - ఫలము లానుచును
మునుల పుణ్యాశ్రమం - బులఁ జరింపుచును
సరసి నదీనద - స్థలులఁ గ్రుమ్మరుచు
గిరిగహ్వరంబులఁ - గ్రీడలాడుచును 3890

మంజరి ప్రసవసం - పదల నింపెసఁగు
కుంజరాంతరంబులఁ - గూర్కుచు నాదు
గారాపు తనయుండు - క్రమియించుఁగాక
యీరీతిఁ బదునాలు - గేండ్లు కానలను.
ధనధాన్య పశుదాస - దాసీ జనంబు
ననుపుము సవనంబు - లాచరింపుచును
జానకీ సహితుఁడై - సంయమీశ్వరుల
లోనఁ బుణ్య పురాణ - లోలుఁడైయుండు
తల్లి యిప్పించిన - తనయన్న రాజ్య
ముల్లంబులోనఁదా - నుల్లాగ మొంది 3900
భరతుఁ డేలఁగ నిమ్ము - పగవారిదైన
పురము రాముని కేల - పోనిమ్ము వనికి ”
అనుటయు విని కేక - య తనూజ చాల
తనలో భయంబు ఖే - దంబు దైన్యమును
నవమానమునుఁ బొంది - యశ్రులు చింద
పవడంపు మోవి ని - బ్బరపు టూరుపుల
యెండి బీటలు వాఱ - యెలుఁగు రావడఁగ
నొండేమియును వల్క - నోపకయుండి
వంచిన తలయె త్తి - వంచకురాలు
సంచుఁ గుత్తుకతోడ - జననాథుఁ బలికె. 3910
“వడుపు పోయిన నీళ్ల - వడువును బెండు
వడి మీఁగడ దొఱంగు - పాలచందమున
నిస్సార మైనట్టి - నీవిచ్చు ధరణి
లెస్సగా భరతుఁడే - లెడునంటి రిపుడు
మీసత్యమే నమ్మి - మేదిని యడిగి

మోస మొందితిని రా - ముఁడె యేలనిమ్ము
వట్టి యారునుదూరు - వలవని నిందఁ
గట్టుకొంటిని మిమ్ము - గడపనర్థించి
పదివేలు వచ్చె మా - భరతునిమాట
మదినింకఁ దలచిన - మర్యాదగాదు" 3920
అని సిగ్గు విడిచిగా - యకమును దాఁగ
తనమును గట్టువా - తనమును మీర
నాడినయంత మ - హారాజుకైక
మోడిమాటలు విని - మొగమాట పలికె.
"నీవు చెప్పినయట్ల - నేఁజేయ నిట్టి
గావుక నటనముల్ - గయ్యాళి వగలు
నేరుపులునుఁ జూపి - నేఁడు నన్నింత
యారాటముల ముంప - నందేమి ఫలము"?
అన విని యినుమడి - యగుచు నాగ్రహము
పెనఁగొన దశర - థుఁ బేర్కొని పలికె. 3930
"నను వెట్టి దానిఁగా - నరనాథ! యెంచి
కనుబ్రామఁ జూచె - దే కడనైన లేదె
ననువంటి సతులు నం - దనులనుఁ గన్న
నినువంటి దొరలును - నీయొక్క తలనె
పుట్టెనే? మీకులం - బున సగరుండు
పట్టి జ్యేష్ఠతనూజుఁ - బారఁదోలుటలు
వినలేదె నినువలె - వేడబంబులను
మునుఁగడాయె నతండు - ముద్దుగాఁ బెనిచి
వనికి రాముని బంప - వలదసత్యమున
మునిఁగి కౌసల్యకై - మొగమోడిపల్క" 3940

అని తన్ను నిందించు - నందటిలోనఁ
గినిసి వాదించుఁ గై - కేయి వాక్యములు
బుద్ధిలోఁ గదురోసి - పోరామిఁ జేసి
సిద్ధార్థుఁడను మంత్రి - శేఖరుం డనియె.

—: సిద్ధార్థుడు కైకకు నీతిఁజెప్పుట :—

" అమ్మ! సీమకు లేని - యట్టి సామెతలు
నమ్మాఁదఁ గొన్ని దృ - ష్టాంతముల్ చూపి
చెప్పి నోరాడఁ జూ - చెదవు మమ్మెల్ల
చెప్పిన యటులెల్లఁ - జేయుటఁ జేసి
అసమంజుఁ డూరిలో - నందటి చిన్న
నిసువులంగొని యేటి - నీటిలోవైన 3950
అదినిమిత్తము తండ్రి - యనిచెఁ గానలకు
నిది దోషమని రాము - నెడనెన్ను మొకటి
కందు గుందునులేని - కలువలతేని
చందంబుగల రామ - చంద్రునింజూచి
యొకరైన వీటఁ జూ - పోపనివార
లొక నీవెదక్క వే - ఱొక యెడలేరు
మనరాజనఁగ నెంత - మది నధర్మంపుఁ
బనిసేయఁజెడునింద - పదవి వాఁడైన
నటుగాన నభిషేక - యత్నంబు చెఱచి
కటకటా! యానిందఁ - గడతేరఁగలరె? 3960
వలవరో రాజులు? - వలపించు కొనరొ?
వెలఁదు లన్యాయము మీ - విత మెందుఁగాన

మేలమ్మ! యపవాద - మింత పొందెదవు?
మేలెంచి నామాట - మేకొనవమ్మ!
పట్టిన చలమె చే - పట్టుట యొండుఁ
బుట్టుల మతమైనఁ - బుడమికి నెల్లఁ
గానికార్యము సేయఁ - గాదు కాంతలకు
మానంబె ధనము నీ - మగఁడొక్క-రాజ
సామాన్యుఁడే? సిగ్గు - సైరణ వలయు
రామామణులకెల్ల - రమణులలోన 3970
యిన్నాళ్లు పతిభక్తి - నెచ్చుగా నడచి
చెన్నటిబుద్ధి వ - చ్చె నదేల నిపుడు"?
అని దీనుఁడైన సి - ద్ధార్థుని మాట
విని కైకతో మహీ - విభుఁ డిట్టులనియె.
"యింతి! నీకును నాకు - నిహపర సౌఖ్య
మెంతయు సిద్ధార్థుఁ - డిపు డన్నమాట
బ్రదికించు కొనుము నా - పాలిటం గలిగి
మదినిన్ను నమ్మిన - మగని రక్షింపు
యీమాట నీవిప్పు - డియ్యకోవేని
రాముని వెంట న - రణ్య భూములకు 3980
పోవుదు నేను నీ - పుత్రుని మహికిఁ
గావలసిన యట్ల - కంటకంబైన
పట్టంబు గట్టింపు - పడఁతి! నీచిత్త-
మెట్టిదెన్నిక నుండె - నీడేర్పు మటుల"
అనువేళ తండ్రికి - నంజలిచేసి
వినయంబుతో రఘు - వీరుఁడిట్లనియె,

—: రామాదులు కైకయిచ్చిన నారచీరలు ధరించుట :—

" ఏల మీకీచింత - యీసాధ్వి కేను
మేలెంచి విపిన భూ - మికిఁ జనువాఁడ
అట్టివానికి చతు - రంగ బలంబు
పట్టణంబున జన - ప్రకర మేమిటికి ? 3990
ఏనుఁగ నడిగిన - యిచ్చువాఁ డేల
దీనుఁడై త్రాపికిం - దెఱకువ మాను
ధరయెల్ల విడిచి కాం - తార భూములకు
నరుగుచో నికనేల - యన్య వస్తువులు ?
నారచీరలు రెండు - నాకు నేచ్చోటఁ
బోరాని సాధనం - బు లొసంగుఁ డ"నిన
సిబ్బితిం బోకార్చి - చిడిముడితోడ
గొబ్బున " నివి గట్టు - కొండ "ని యెదుట
చీరంబు లొసంగిన - శ్రీరామవిభుఁడు
చేరి తా మును ధరిం - చిన దుకూలంబు 4000
కడకోసరించి వ - ల్కలములుఁదాల్ప
తడయకట్టిన సుమి - త్రాకుమారకుఁడు
కైకయొసంగు వ - ల్కలములుఁదాల్ప
రాకేందువదన ధ - రాతనూజాత
వలచూచు లేడి కై - వడి భీతినొంది
జళుకుతోఁగన్నీరు - జలజలరాల
చేతికిచ్చిన నార - చీరలుచూచి
భీతితో శ్రీరాముఁ - బేర్కొనిపలికె.
" ఏరీతి మునికన్య - లిటువంటినార
చీరలతో వన - శ్రేణినుండుదురు ? 4010

యేసేర నివిగట్ట - నెఱిఁగిన నాదు
మేనిపైఁగట్టుండు - మీర" నిపలుక
నప్పుడా రఘుపతి - యావల్కలంబు
లొప్పుగా మునుదాల్చి - యున్నట్టిచీర
మీఁదఁగట్టినఁజూచి - మిక్కిలివెతల
నేఁదుచు నగరిలో - నింతులందఱును
చూచి యోర్వఁగలేక - శోకించి రాముఁ
జూచి "నీవేల? యీ - శోభనాకార
బడరానిపాటులఁ - బరచెదీ రమణి
నడవికిఁబొమ్మనిఁ - యనిచిరేయొకరు 4020
వలవదిచ్చటనుంచి - వని కేఁగునీవు
కలవాణి నీ సీత - కన్నులంజూచి
యుడుకారి యేమెల్ల - నుండెదమిల్లు
వెడలిరమ్మందురే - విరిఁబోణినిట్లు
మీవెంటవచ్చు సౌ - మిత్రికానలకు
నీవెఱుఁగనియట్టి - నీతియున్నదియె!
వలదన" వినక - యావైదేహి మేన
వలువపై వల్కల - వసనంబులునుచు
రాముని వారించి - రాజువినంగ
సేమంబుదలఁచి వ - సిష్ఠుఁడిట్లనియె. 4030
"లలన కైకేయి! కు - లంబెల్లఁ జెఱిచి
చలపట్టి యంతయు - చక్కఁజేసితివి
వలపోవలె సీత - యీరాజ్యమెల్లఁ
బాలించిమగఁడెక్క - భద్రాసనమునఁ
దానుండుగాక యీ - దశరథాత్మజుని

మేనిలోఁగగము సు - మ్మీ ! మహీతనయ
సీత యర్ధాంగ ల - క్ష్మి రఘూత్తమునకు
యీతన్వియు నతండు - నేక దేహంబు
గడుసరివై యిట్లు - గాదంటివేని
యడవుల శ్రీరాము - నడుగులవెంట 4040
యేను సుమంత్రాదు - లీదశరథుఁడు
నీనగరవసించు - నింతులందఱును
పరిజనంబులుఁగూడి - పయనమై పురము
భరతుండు రాముని - పాడుచేసెదము
అనవలసినమాట - యంటిమిగాక
నినుఁదేఱిచూచునే - నీకుమారకుఁడు ?
తానువల్కలములు - ధరియించివచ్చు
జానకిశ్రీరామ - చంద్రులున్నెడకు
నారీతిశత్రుఘ్నుఁ - డరుదెంచు నీవు
నీరామమై జన - నికరంబులేమి 4050
యీపట్టంబులో - యేకాకివగుచు
పాపాత్మురాల ! యా - పదలనొందుదువు
నీకవ్వతెవు ? రాము - నికిఁగీడుసేయ
కావలసిప్రియంబుఁ - గైకొనిరాజు
నినునేలుమని యిచ్చె - నేధాత్రియెల్ల?
మనసులో నిది నీకు - మారుండు దెలసి
అందుకులోఁగిన - యతఁడెట్టివాఁడ
యందులోనొక్కఁడో - యరయఁగావలయు
నారచీరలుగట్టు - నారాముదేవి
వారింపకున్నయి - వ్వసుధయోరుచునె ? 4060

సొమ్ములుచీరలి - చొప్పటఁదెప్పించి
యిమ్మని కీవరం - బిచ్చెనేయితఁడు
మునివేషమెక్కడా - ముని కింతెగాక
వనితకునేల? సే - వకులరప్పింపు
పల్లకీఁ దెప్పింపు - పరిచారకులను
గొల్లల వెంబడిఁ - గూర్చి కావలయు
వనవాస సముచిత - వస్తువులిచ్చి
పనుపుము కైకనా - పలుకాదరింపు"
ముని వసిష్ఠుఁడు వల్క - నవనితనూజ
పనికి నేఁగఁదలంచు - వల్లభుమనసు 4070
వేఱెయుండుటఁజేసి - వినివిననట్ల
యూరకయుండె దా - నుచితవైఖరిని ,
ఆమాట యందుక - యధిపతి నతని
భామినుల్ వినరాని - పలుకులువలుక
నింపనలకులోఁగి - నెగులుతోమేని
యందు రాజ్యమునందు - నైహికఫలము
లందు నూర్జితకీర్తి - యందుఁబ్రాణంబు
నందు నించుకయైన - యాసఁబోవిడిచి

—: దశరథుఁడు సీతకు నారచీరలు వలదని
కైకేయిని వేఁడుట :—

అలిమోమిాక్షించి - యకట! నాయెదుట
నేలకట్టించితి - వీ సీతమేన 4080
నారచీరలు రాము - నకు నీయఁజూచి
యూరకప్రాణంబు - లుండఁజూచితివో ?

యీవరంబిచ్చితి - నే కోమలాంగి
పావనచారిత్రఁ - బరమకల్యాణి
సీత నంచిత సుఖో - చితసుకుమార
నూతనలావణ్య - నుత నయోవిభవఁ
గన్నులంజూచి యే - గతి వల్కలములు
మిన్నకచేఁదెచ్చి - మీఁదవై చితివి
వనులకుం బొమ్మన - వచ్చునే జనక
తనయ నీవంటి పా - తకురాలిమోము 4090
చూడక తొలఁగిపోఁ - జూచుట గాక
వేడుక చెల్లెనే - వెలఁది ! నీ మదికి
వెదురునఁబుట్టిన - వీతిహోత్రుండు
వెదురెల్లదహియించు - విధమున నేఁడు
ముప్పున నీకిచ్చు - మొదటివరంబు
తప్పరాదని పల్కఁ - దనకిటులయ్యె
సీతచేతికి నార - చీరలిప్పించు
పాతకంబెటువోవు - పడుము దుర్గతిని ''
అనిపల్కశ్రీరాముఁ - డంజలిచేసి
తనతల్లిఁ బేర్కొని - తండ్రితోఁబలికె. 4100
'' ఓ దేవ ! మాతల్లి - యున్నది నీదు
పాదపద్మంబులు - భక్తిఁగొల్చుచును
యేను వనంబుల - కేఁగినవెనుక
దీనయై మిగుల నా - ర్తి వహింపనీక
కైకేయిఁజూపకఁ - గరుణనొఁగాము
లేకడంజూడక - యేవచ్చుదనుక

ప్రాణముల్ మేనిలోఁ - బట్టుకయుండఁ
బ్రాణదానముచేసి - పనుపుమునన్ను
అభయహస్తమొసంగుఁ - డ" నుచుఁ గౌసల్య
నభిముఖంబుగనుంచి - యడుగులవ్రాల 4110
నామహీశునిఁ సుమం - త్రాదు లింతులును
సౌమిత్రియును శోక - జలధిలో మునుఁగ
గొంతధైర్యముఁ దెచ్చు - కొని మహీవిభుఁడు
చెంతలవారి నీ - క్షించి యిట్లనియె.
"తొల్లియనేకుల - ద్రోహినై మేను
తల్లితండ్రులను పు - త్రకులతోఁబాపి
సంసారసుఖము మఱ - చననీక చెఱచి
హింసచేసితిఁగాన - యీకాలమునకు
నాదోషమీరీతి - ననుభవించెదను.
కాదన్నఁబోవునే - కర్మఫలంబు 4120
యీకైకచేబాధ - లిన్నియుం దాళి
పోకయున్నవి ప్రాణ - ములు శరీరమున
ఎంతచేసితి బాపు - రే! కైక విశ్వ
మంతయుఁ జీఁకటు - లయ్యె నీకతన"
అని యొక్కమాఁదు "రా - మా" యని యేమి
యనఁజూచెనో కాని - యావలిమాట
నాడనేరక మూర్ఛ - నరగన్ను వెట్టి
వాడినమోముతో - వాతెఱయెండ
నొకమూహూర్తమునకు - నొయ్యన తెలిసి
తొకతొకతో సుమం - త్రునకు నిట్లనియె. 4130

## —: రాముని వనగమనమునకు దశరథుఁడు సమ్మతించుట ; సుమంత్రుఁడు రథమును దెచ్చుట :—

" తేజీల సమకట్టి - తెమ్ము వేవేగ
రాజయోగ్యంబైన - రథమువాకిటికి
రథముమీఁదట నీవు - రామునితోడ
నధివసించి యయోధ్య - కామడమేర
ననిచివత్తువుగాక - యధముఁడౌతండ్రి
పనుపుచేసిననిట్టి - పాటురాకున్న ?
కొడుకులయుత్తమ - గుణములన్నియునుఁ
గడపటనది దుఃఖ - కారణంబులుగ
నెంచితిఁజను " మన్న - నేఁగి సుమంత్రుఁ
డంచలనున్న మ - హారథంబొకటి 4140
ఆయుత్తమొనరించి - యపుడె తెచ్చుటయు
నాయవనీభర్త - యటునిటుఁజూచి
కడనున్నలోని బొ - క్కసములవారి
కడగాంచి చేరరాఁ - గనుసన్న చేసి
వారితో నీసీత - వనికి నేఁగెడును
మీరలు నగరిలో - మేలిసొమ్ములును
చీరలు వీరు వ - చ్చి యయోధ్యచేరు
మేరకుఁజాల భూ - మిజకు నిండించిన
మాటమాత్రనె వారు - మణిభూషణముల
పేటికల్ కోకల - పెట్టెలుదెచ్చి 4150
తనచెంతనిలిపిన - దశరథవిభుఁడు
గొనుమంచుఁదన పెద్ద - కోడలికొసఁగ

నాసామ్ములందు ధా - ర్యములైనవెల్ల
భూసుతంజేరి య - ప్పుడు వధూమణులు
నుడుకుచుంగై క చూ - షోపక మారు
మెడవెట్టుకొనంగనె - మ్మేని నిండంగ
రత్నాంగి తొడుగుమే - రను భానువంశ
రత్నమారాముని - రాణికై సేయ
దినమణిప్రభ చేత - దీప్తమానింగి
యనువునంగై కేయి - యావాసమెల్ల 4160
జానకిభూషణ - జాజ్వల్యమాన
మై నిగనిగలీన - నత్తంగారికిని
మ్రొక్కిన సీతను - ముచ్చటదీర
నక్కునంజేర్చిమో - మాదల నుంచి
దీవించి రఘువీరు - దేవేరితోడ
నావేళ కోసలేం - ద్రాత్మజవలికె.
"పదవులుం దప్పిన - పతులంజీరికిని
మదినెంచిరసతులా - మదవతులెల్ల
కలిగినవేళ సౌ - ఖ్యంబులం దేలి
యలమట గోరంత - యైనం బొందినను 4170
మగనిదూషింపుచు - మానుగాంగనరు
మగువల మొదటిసం - పదలెన్నుకొనరు
ఆటవారలబుద్ధు - లరయంగరాదు
పాటలాధర ! చెలుల్ - పాపరూపిణులు
తలంతురు పాప చిం - తలు క్షణంబైన
నిలుపనేరరు తమ - నియమముల్ మదిని

కులమును శీలంబు - గుణము రాగంబు
వలసి వేఁడినసొమ్ము - వరుసనిచ్చుటయు
బూదిలో హోమమై - పోఁజేసి మగఁడు
పేదగిల్లినయంత - బిలువనూఁకొనరు 4180
కొంచపుమాటలఁ - గోతురు మనసు
వంచింపఁజూతురు - వాదులాడుదురు
అగ్నిసాక్షిగఁబెండ్లి - యాడెఁదమ్మనుచు
లగ్నంబుసేయ రు - ల్లమున నించుకయుఁ
కన్నీరునింతురు - కలహముల్ వెనిచి
యన్నమాటలకెల్ల - నాడుదు రెదురు
ఉత్తమసతులైన - నొకపాటివాని
విత్తమేమియులేని - వీఱేఁడినైన
ముసలినేనియు రోగ - ములఁ జిక్కెనేని
యసమర్థుఁడగునేని - యన్నవస్త్రముల 4190
మాత్రంబునెడలేక - మానిని! హేయ
గాత్రుఁడైనను మహా - గమధర్మమెఱిఁగి
తనపాలి పెనిమిటి - తనదైవమనుచు
మనసులో మొగఁడైన - మానవాధముని
మేరువుగానెంచి - మేదినిగీర్తి
స్వారాజు నగరిలో - నకలభోగములు
ననుభవింతురు గాన - నబల! రాఘవుఁడు
ధనవకతుఁడైన ని - ర్ధనుఁడైన నీకు
వల్లభుం డగుటదై - వంబు దాతయును
తల్లిదండ్రులు సమ - స్తము రాముఁడనుచు 4200

నెంచి చిత్తమునొవ్వ - నీయక యనుభ
వించు మీ విహపర - విభవంబులెల్ల
అమ్మ! యేనొకమాట - యనవేఁడియుంటి
నెమ్మది నఖిలంబు - నీ వెఱుంగుదువు
నినుఁజూచి మెలఁగంగ - నేర్తురీ ముందు
వెనుకల కిల్లాండ్రు - విశ్వంబునందు
తల్లి! మాయెడ దయ - తప్పక మనసు
చల్లఁజేయుము రామ - చంద్రున కెపుడు
తలపువ్వు వాడక - ధవుని వెంబడిని
అలివేణిపోయి ర - మ్మ"ని పల్కుటయును 4210
ధర్మయుక్తంబైన - తన యత్తమాట
యర్మిలి విని సీత - యాఁకువఁ బలికె.
"దేవి! మీశిక్షఁ బా - తి వ్రత్యధర్మ
మీవిధంబని వింటి - యిటుల యుండెదను
హరిణాంక కళచంద్రు - నదియేల తలఁగు
నితరమా ధర్మంబు - నేనట్లు వదల
మొరయునే తంత్రిక - మ్ములు లేనివీణె?
తరలునే చక్రముల్ - దప్పింప రథము?
పతిహీతంబే మరి - పడఁతులకిట్లు
గతిగల్గు మనిన నే - గతిగల్గనేర్చు? 4220
తల్లిదండ్రులు సుతుల్ - తనవారలైన
నెల్లరు మితముగా - నిత్తురు ఫలము
నపరిమితంబైన - యఖిల సౌఖ్యములు
కృపనిచ్చు పతిగాన - నితరంబులేల?
మొదట నాతండ్రి స - మ్ముఖమున వింటి

వదలక పతియు దై - వముగ శాస్త్రముల
నారీతి మెలఁగుదు" - మనువేళ నశ్రు
పూరముల్ కన్నులఁ - బొరల నున్నట్టి
తల్లులలో నున్న - తల్లి కౌసల్యనము
చల్లఁగా శ్రీరామ - చంద్రుఁ డిట్లనియె. 4230
"అమ్మ! నీవు విచార - మందక రాజు
సమ్మతంబంది పూ - జలు సేయుమిపుడు
నీవొక్క నిశియందు - నిదురించి లేచు
కై వడిగా యేను - కానలయందు
జరుపుదు పదునాల్గు - సంవత్సరములు
సరకుగా మదినెంచ - క్షణమనితోఁచె
వ్యథలెల్ల మాని యే - వచ్చి యిప్పాట
రథముమీఁదట మనో - రథము లన్నియును
చేకూడి రాఁగ నీ - క్షించెదు రేప
నీకేమి గొఱంత క - న్నీరు రాల్పకుము" 4240
అనిచాల నూరార్చి - యాతల్లికన్న
నినుమడిగా దుఃఖ - మేద్పుచునున్న
యందఱ తల్లుల - యడుగులమీఁద
నందంద వ్రాలి వా - రాశీర్వదింప
"నోయమ్మలార! మీ - రొక్కట వెలితి
సేయక నన్నుఁ బో - షించి పెంచితిరి
ఇన్నాళ్లు నేరంగ - యేను మీయెడల
నెన్ని నేరంబు లే - మేమి చేసితినొ?
ఆతప్పు లెల్ల మీ - రాత్మల మఱచి
మాతృధర్మంబు లే - మఱక రాఘవుఁడు 4250

కడకేఁగెనని మీఁకుఁ - గలిగిన కరుణ
సడలక యడలు కౌ - సల్య నూరార్చి
రాజు చింతలచేఁ గ - రంగక యుండ
భోజనాదికములతో - పూజనక్రియలఁ
గనుకల్గి యుండుఁడు - గహన భూములకుఁ
జనుఁడని మాఁకను - జ్ఞయొసంగుఁ" డనిన
కలఁగి వాపోవుచుఁ - గ్రౌంచి స్వరముల
నెలుఁగెత్తి మున్నాట - యేఁబంద్రు సతులు
నృత్తగీతనినాద - నిబిడమౌ నగర
నత్తరి బహు రోద - నారావమొప్పె 4260

—: శ్రీరాముఁడు వనవాసమునకుఁ బ్రయాణమగుట :—

శ్రీరామ లక్ష్మణుల్ - సీతయునట్టి
వారల నూరార్చి - వలగాఁగవచ్చి
దశరథ పదపద్మ - దండప్రణామ
కుశలులై యనుపించు - కొనివారు మఱియు
కౌసల్యఁగని నమ - స్కారంబొనర్చి
యాసుమిత్రకు మ్రొక్క - నప్పుణ్యసాధ్వి
రామ హితార్థియౌ - ప్రాణసమాను
సౌమిత్రి నాయతా - జాను సుబాహుఁ
జేరి కౌఁగిటఁజేర్చి - శిరమాఘ్రాణించి
కూరిమి సుతునిఁ జే - రోఁకొని యిట్టులనియె. 4270
" అన్న ! కానల కేఁగ - నన్నకు నీకు
నన్నలువ లిఖించె - నదియేలతప్పు?
తాను రాఘవుఁడు సీ - తా సమేతముగ

పూని కానలనుండఁ - బోవు చున్నాఁడు
మది వీరిసేమ మే - మఱక యేవేళ
గదిసి కంటికిఱెప్ప - గతినుండు మీవు
గలిమి లే కుండినఁ - గలిగిన నీకుఁ
గలకాలమును గతి - కాకుస్థ కులుఁడు
తనకు జ్యేష్ఠునిఁగొల్వ - ధర్మంబు లోక
మున సజ్జనునికి మీ - మొదటి రాజులకు 4280
దానంబు దయయు స - త్యము యాగదీక్ష
పూనుట రణములోఁ - బోలియుట వారి
నిజగుణంబులు గాన - నీవు రాఘవుని
భజియింపుచు శరీర - పర్యంతమైన
నెంత లేదని కాచు - నెడ కను కల్గి
సంతోష మొందింప - జానకీ విభుని
రామచంద్రుని దశ - రథు గా నెఱుంగు
మామాఱుగా నెన్ను - మా! జనకజను
అడవి యయోధ్యగా - నరయుము వలయు
నెడ కేఁగి సుఖివిగా - వే! తండ్రి! నీవు" 4290
అనువేళ మాతలి - యమరేంద్రుతోడ
ననినరీతి సుమంత్రుఁ - డారాముఁజూచి
"శ్రీరామచంద్ర! మీ - చిత్త మెట్లుండె
నారీతి నేర్తు నే - నరదంబు నడప
వనుల కేఁగఁగ నేఁడె - నత్తురుగాక
చలనేల? వ్యర్థవా - సర మీయయోధ్య"
అనుమాట విని - రాము ననుమతి మేన
జనకనందన విభూ - షణములు దాల్చి

మున్నుగా తా రథం - బునఁ బ్రవేశింప
నన్నిసొమ్ములుఁ బెట్టి - యను నిండ నుంచి 4300
రాజు సీతకుఁ బంప - రామలక్ష్మణులు
తేజోధికులు తాము - దెచ్చినయట్టి
యాయుధ వనసాధ - నాదులు వరుస
చేయెత్తి యందియి - చ్చిరి సుమంత్రునకు
నన్నియు రథముపై - నతఁడుంప నరద
మన్నదమ్ములు నెక్కి - నంత సారథియుఁ
తెరువు వోనిచ్చుచోఁ - దెరువెల్ల నిండి
పౌరులందఱు శోక -పరవశు లగుచు

—: రాముని వనగమనమునకై పౌరులు శోకించుట :—

నార్తనాదము లయో - ధ్యా పట్టణమున
మూర్తీభవింపఁ గ్ర - మ్మక వచ్చు జనులు 4310
వేఁగిరించక రామ - విభుని రథంబు
సాఁగనిమ్ము సుమంత్ర ! - చనవిచ్చిమాకు
రాముని వదనసా - రసము గన్గొనుచుఁ
జేమోడ్చి వెంట వ - చ్చెద మనువారు
"కౌసల్యహృదయ మ - క్కట ! యుక్కగరచి
చేసినారా"యని - చింతించువారు
"కనకాచలము పతం - గప్రభవోలె
ననుసరించెను సీత"యని పల్కువారు
"ఓయిలక్ష్మణ ! రాము - నుల్లంబు మెచ్చఁ
జేయుచు సేవ చే - సెదు గాన నీకు 4320

నుచితధర్మంబు న - భ్యుదయకారణము
నచలిత స్వర్గలో - కానందకరము
అయ్య! నీసరిసాటి - యగుభాగ్యవంతుఁ
డెయ్యెడ వెదకిన - నెఱఁగ" మన్వారు
" రామ! నీచరణసా - రసములు గొలిచి
యేమువచ్చెదము సు - మీ!" యనువారు
నగుచుండ దశరథుం - డారామచంద్రు
మొగము చూచెదనని - ముదితలుఁదాను
రథమువెంబడి హజా - రమునకు వచ్చి
శిథిలమా మతి వధూ - శ్రేణి శోకింప 4330
దీనుఁడై వచ్చి ధా - త్రీనాథుఁజూచి
భానుతేజుఁడు రామ - భద్రుఁడిట్లనియె.
" వచ్చుచున్నాఁడు - వాఁడె మాతండ్రి
యిచ్చోట వేగఁబో - నిమ్ము రథంబు"
అని రాఘవుండన - నల్లన తేరు
చనఁగ నిమ్మని జనుల్ - చాలఁ బ్రార్థింప
తా సూతకృత్య మ - త్తరిఁ జేయు కతన
నాసుమంత్రుఁడు నిట్టు - నటు విచారింప
ప్రబలధరాధూళి - పటలంబు జనుల
నిబిడవాహినియుఁ గ - న్నీటనణంగ 4340
దుముకు మీనములచేఁ - గొలఁకుచున్న
కమలంబుల మరంద - కణములోయనఁగ
గనుఁగొనునింతుల - కన్నీటనైన
పెనురొంపిని రథాంగ - బృందంబుఁ గ్రుంగ
చేరుదమని యాసఁ - జేరు భూపతికి

దూరంబుగా సుమం - త్రుఁడు తెరువునను
నరదంబుపోనీక - యట నిల్వుఁడనుచుఁ
బరిజనంబుల మహీ - పాలుండు వనుప
నామాట విని ' రామ ! - యధిపతియాజ్ఞ
యే మీర రాదిందు - కేటు సేయవలయు ? 4350
నానతిం డన '' రాముఁ - డదియేఁటిమాట
పోనిమ్ము తేరు గొ - బ్బున నంచుఁబలుక
నిలుపవచ్చిన వారు - నిలిచి క్రమ్మరిన
తొలఁగిపోయెను తేరు - దూరంబుఁగాఁగ.
అపుడుకన్నీటితో - నరదంబుఁజూచి
నృపతి నేమీరేఁను - నికరంబుఁజూచి
నిలువయ్య ! కుమార ! - నిలుము సుమంత్ర !
తొలఁగకు'' మనుచుఁ గు - త్తుక యెల్లనెండ
నాలుకఁదడిలేక - నరపతి వెతల
మూలంబు దెగు వృక్ష - మునుఁబోలిపడిన 4360
శోకంబుచేత న - చ్చోవధూజనులు
హా ! కోసలేంద్రక - న్యామణి ! యనుచు
హా ! రాజలోకసిం - హస్వామి ! యనుచు
హారామ ! మీరి యే - లా ? పోయెదనుచు
దీనులై విలపింపఁ - దిరిగి చూచుచును
తానేఁగునెడ తల్లి - దండ్రులపాటు
చూడక యశ్వాకి - శోరంబు పలుపు
ద్రాడుననున్నట్లు - ధర్మపాశమున
గడుఁజిక్కి వెనువెంటఁ - గాల్నడ తండ్రి
నడలుచు వచ్చుచో - నంకుశాహతిని 4370

మత్తేభమలయుఁ క్ర - మంబునం దనదు
చిత్తంబు మిక్కిలి - చింతవహింపఁ
బోవలదని పల్కు - భూవరువలనఁ
బోవనిమ్మను రాజ - పుత్రుపల్కులను
కదుఁజిక్కువడి బండి - కండ్ల నెన్నడుమఁ
బడిన కైవడి మంత్రి - భావంబుఁదవిలి
రాజుపల్కులనిల్ప - రాదు పొమ్మనెడు
రాజన్యమణియైన - రామునిమాట
నానుమంత్రుఁడు సేయ - నదికంటఁబోవు
నాగచివులువచ్చి - రనుమాటగాని 4380
నిలిపిరో చిత్తముల్ - నిలిపిరో రాము
నిలిపిరో తమదు క - న్నీరురాలంగ
ఆమంత్రులేతెంచి - యవనీశుతోడ
" రామునిరథము దూ - రంబునంజనియె
దవ్వువచ్చితిరి చి - త్తము నిల్పబట్టి
యివ్వేళనగరికి - నేతెందు మఱల "
నను ప్రధానులమాట - లాలించి యవల
చనుటకు పద - శక్తిచాలని కతన
నిలిచిన తలిదండ్రి - నెమ్మదిలోనఁ
దలఁచి మ్రొక్కుచు రఘూ - ద్వహుఁడు పోవుటయు 4390

రాముని వనగమనమున కంతఃపుర స్త్రీలు శోకించుట :—

నారాము నెడఁబాసి - యంతఃపురంబు
నారులా దశరథ - నరపతివినఁగ
నాళీకనేత్రుం డ - నాథనాథుండు

చాలనందఱఁ బ్రోవఁ - జాలినయతఁడు
ఓయమ్మలార ! యి - ట్లొంటి రాఘవుఁడు
కాయంబుఁగంద నె - క్కడికిఁబోయెడును ?
తనకొఱు లలిగినఁ - దానొక్కరందుఁ
గినిసినవారి యం - కిలిమాన్చిచాల
నుపలాలనముసేయు - నోర్పరి వీత
కపటుఁడీ రాముఁడె - క్కడికి నేఁగెడును ? 4400
తనలోన ఖేదమో - దంబు లొక్కటిగఁ
గనుచుండు రాముఁడె - క్కడికి నేఁగెడును ?
కన్నతల్లియె కాఁగ - గనుచుండు మనలఁ
గన్నట్టితండ్రి యె - క్కడికి నేఁగెడును ?
కైకేయిబాధకుఁ - గాక రాజనుప
కాకుత్స్థతిలకుఁ డె - క్కడికి నేఁగెడును ?
తనబుద్ధిచలియించి - తండ్రిపొమ్మనిన
కనలేకరాముఁడె - క్కడికి నేఁగెడును ?
ఎన్నడు సూతుమో ? - యెన్నడువచ్చుఁ
గన్నులయెదుటికె - క్కడికి నేఁగెడును ? 4410
ఆశచేఁ క్రమ్మర - నడిగినే తన్ను
కౌశికమౌని యె - క్కడికి నేఁగెడును ?
ఆసుమిత్రాపుత్రు - నవనిజంగూడి
కౌసల్యపట్టి యె - క్కడికి నేఁగెడును ?"
అని చెప్పవేయక - యారాముఁజూడఁ
గనుఁగొని విలపించు - కామినీమణులఁ
జూచి మిక్కిలి రాజు - శోకవారాశి

వీచులంబడి దరి - వెదకిన లేక
ఆపన్నుఁడై యుండె - నాసమయమున
నాపట్టణంబులో - నగ్నిహోత్రములు 4420
సలిపెడువారు భో - జనమజ్జనములు
దలఁచినవారును - తల్లులపాలు
ద్రావువత్సములు మేఁ - తలకు నాసించు
నావులు కవణంబు - లందెడుకరులు
నీరాను దేజులు - నిజకుమారకులఁ
గూరిమితోఁజూచు - కొమ్మలు లేక
అసమయంబునఁబంక - జాప్తుండుతోలఁగ
వసుధఁ గావిరులు న - ల్వంకలఁబొదువ
గ్రహతారకముల పొ - గల్ గనుపింప
మిహికాంశుబింబంబు - మేనెల్లఁగంద 4430
నుదధిప్రచండ వా - యువులఁజలించు
విధమునంగలఁగె న - వ్విభు పట్టణంబు
ఆవేళ తలిదండ్రు - లందలి మమత
యావంతయునుమాని - రర్భకులెల్ల
సతులమీఁదటి యాస - చాలించిరెందు
పతులెల్ల కైకేయి - భావంబుదలంచి
అన్నదమ్ములు తమ - యనురాగమెల్ల
సున్న చేసిరిమోము - చూడనొండొరులు
నిద్రాదిసుఖము ల - న్నియునుఁజాలించి
భద్రకర్మంబులు - బాసిరందఱును 4440
నెఱకలు దునిసి మ - హీధ్రముల్ వడిన
తఱిదెల్పనో యన - ధరణికంపించె

## —: దశరథుని విలాపము :—

ముదుసలిరాజు రా - మునిఁ జూచి చూచి
యెదవడి తేరువో - యెడు జాడచూచి
తేరునుంగానక - తెరువున నెగయు
ధారుణీరేణు సం - తతి చూచిచూచి
కన్నీరు దొట్టిన - కాన కేమియును
కానక యిదియు రా - ఘవుఁడేఁగుదిక్కు
గా నని మేమవై - ఖరిఁ జూచిచూచి
విన్నఁదాటున దుఃఖ - వివశుఁడై యుండె. 4450
భూమీశుఁజూచి య - ప్పుడు మదిఁగలఁగ
వామాక్షి కౌసల్య - వలపలి యెదను
కైలాగొసంగిన - కైకేయి యెడమ
కేలున కూఁతగాఁ - గెంగేలొసంగ
చేరవచ్చిన గరి - సించి పొమ్మనుచు
"నో తాఁగ! నీవునా - యొడలంటవలదు!
నీవుపత్నివిఁగావు - నేఁబతిఁగాను
నీవారి నెల్ల ము - న్నే వదలితిని
నినుఁజూడఁగారాదు - నీకుమారకుఁడు
తనకుఁదీర్పఁగరాదు - తరవాతఁగ్రియలు 4460
పటిమాటలు త్యజి - యించితి మిమ్ము
మాటనేఁటికి నీదు - మాటగాదింక"
అని విడనాడి తా - నవలి మోమైనఁ
గని సుమిత్రాదేవి - కైదండయొసఁగ
నప్పుడు దశరథుం - డీ మాటపలికె

నప్పుడు కౌసల్య - యడలురెట్టింప
మునివేషమున నేగు - మోహనాకారుఁ
దనయుగ్రనందనుఁ - దలఁచి తలంచి
అవనీసురుని జంపి - నట్లు మేనెల్లఁ
దవిలి యగ్నిజ్వాల - దరికొన్నయట్లు 4470
సంతాపమునుఁబొంది - జనపతి మిగుల
చింతిల్లుచును రఘు - శ్రేష్ఠుని రథము
పోయినజాడలోఁ - బొరలుచు దుమ్ము
కాయమంతయు నిండఁ - గప్ప దీనతను
ఖువిగదా! రాఘవుం - డెక్కిన రథము
జవమునందివియు న - శ్వముల పాదములు
అని తద్రజంబుమై - నలముచు రామ!
వనులకు నేఁగితి - వా! యంచు వగచి
భూనుతపరిమళం - బులు వేసి భాస
మాననానారత్న - మయభూషణములు 4480
పూని క్రొవ్విరి సరం - బులుఁ జుట్టిమేన
చీనిచీనాంబర - శ్రేణిధరించి
మగువలు హేమచా - మరములు వీవఁ
దగు హంసతూలికా - తల్పంబులందు
మెలఁగు రాఘవుఁడు భూ - మిని శయనించి
తలగడల్ గాఁగఁ బ్ర - స్తరములుమర్చి
తరువులక్రింద ని - ద్రలు వోయిలేచి
శరిరవంబనఁగ భూ - త్కారంబు చేసి
యెటులుండు వాఁడకో? - యింతి వైదేహి
కటకటా! యెుకనాడుఁ - గానల గుఱుతు 4490

గానని జనకుని - గారాపుఁబట్టి
దీనయై వనములఁ - ద్రిమ్మరునపుడు
పులులు మెలుఁగులం - బొడగని భీతిఁ
గలఁగుచు రఘువీర! - కావుమీ! యనుచు
నేరీతి మెలఁగునే - నేమి సేయుదును?
మారాముఁ జూడక - మన నెట్లువచ్చు
తన పురాకృత దురి - తము లిట్టులెంత
పనిచేసెనని మహీ - పతి కైకఁజూచి
"పాపాత్మురాల! యీ - ప్రాణముల్ మేన
నోపవు నిలువ నిం - కొక మాటవినుము 4500
తాలేనిచోట నై - ధవ్యంబు పూని
యేలుచుండు మయోధ్య - యేకచిత్తమున"
అనివల్కి తలవాంచి - యశ్రులురాల
జననాయకుఁడు మృత - స్నాతునిరీతి
వచ్చుచు పురమున - ల్వంకలుఁ జూడ
నెచ్చటఁ జూచిన - నెవ్వారులేక
పాడరి యున్నట్టి - భవనముల్ మూసి
పూడవైచిన ద్వార - ములతోడిగుళ్లు
కట్టినయట్టి యం - గళ్లు మిన్నేల
ముట్టిన రోదనం - బులుచూచి వినుచు 4510
జనుల సందడిలేక - జరడులు బాలు
లును జ్వరితులు నింతు - లును గోచరింపఁ
గనుఁగొని రాజమా - ర్గంబునవచ్చి
జనకజరామ ల - క్ష్మణులు లేనట్టి
నగరు ప్రవేశించి - నరపతి యార్తిఁ

బొగులుచుఁ గెలనియా - ప్తుల మోముచూచి
"తనకు నెచ్చోటఁ జి - త్తమునకుఁ దాల్మి
జనియింప దైనఁ గౌ - సల్య మందిరము
చేరుపుఁ"డన విని - క్షితిపతినట్ల
ద్వారపాలకులు సాం - త్వనముతోఁ దెచ్చి 4520
ఆయింతి నగర శ - య్యా ప్రదేశమున
నాయెడ నునిచిన - యమ్మహీ విభుఁడు
చిత్తంబులోఁ దాల్మిఁ - జెందక చేతి
విత్తంబు గోల్పోవు - విధమున సుతులు
జానకియును లేక - చంద్రతారకలు
తోఁచఁబాయు నభంబు - తోసరి వచ్చు
నామందిరంబులో - నందఱుఁజూడ
"రామా" యనియెలుంగు - రాయంగనేడ్చి
ఏపుణ్యులో రాము - నింకొక్కనాఁటి
కీపుర వీథిలో - నేతేరఁజూచు 4530
తపములుసేయు ను - త్తము లట్టివారి
యపరిమిత శ్రీల - నఖిల భోగములఁ
గలకాలమును మనఁ - గలవారుగాక
కలఁగునేయట్టి భా - గ్యం బన్యులకును"
అని పలవింపుచు - నర్ధ రాత్రమున
జననాయకుండు కౌ - సల్యతోఁ బలికె
"రామునివిడఁవ నే - రక వెనువెంట
రామ! నాదృష్టి దూ - రంబుగాఁ జనియె
కన్నుల నేమియుఁ - గనరాదు చెంతి
నున్న నిన్నునుఁగాన - నూరటచేసి 4540

నీదు కరంబునా - నెమ్మేన నుంచి
సేదదేఱ్చు మటన్న - జీవి తేశ్వరునిఁ
గ్రక్కునఁ జేరి యా - కౌసల్య యతని
చెక్కులు నురమునుఁ - జేతుల నివిరి
రామునిమీఁది వి - రాళిఁ జింతిల్లు
నామహారాజుఁ బా - యక యిట్టులనియె

## —: కౌసల్య విలపించుట :—

"కుపసు మూడ్చిన త్రాఁచు - కొదమయో యనఁగ
కపటంబు పేరిటి - గరళంబుఁదాల్చి
కైకేయి యున్నట్టి - గతి ప్రాణ నాథ!
నాకుఁజూచిన నెమ్మ - నము భీతినొందె 4550
వరమడిగిన నేమి - వనముల కేల
తరమించె నురక - నా తనయుపై నలిగి
తనుఁ గొల్చియుండఁడో - తా మోముచూడ
ననిన యుండఁడో నాగ్ర - హంబులోనైన
తననేరుచెప్పి చెం - తలవారి నడుగు
కొనినైన మెలఁగఁడో - కొన్నాళ్లు పురిని
పర్వకాలముల వెం - బడి సోమయాజి
పర్వ పురోడాశ - భాగంబుఁదెచ్చి
యసురల పాల్సేయు - నట్టి చందమున
పొసఁగునే రామునిఁ - బొమ్మనిత్రోయ? 4560
కొడుకులు తనపెద్ద - కోడలునిట్లు
నిడుములం బడుదురే - యో జవ్వనముల
నెన్నడు వత్తురో - యిచటికి నుఱలఁ

బున్నమ రేల నం - బుధి యుబ్బుకరణి
వారలంగని యెల్ల - వారు నానంద
వారిధిఁ దేలి చె - ల్వము గాంతురొక్కొ ?
ఉప్పరిగల యందు - నుత్పలగంధు
లెప్పుడీ పురవీథి - నెడమీక కూడి
సీతా సమేతుఁడై - శ్రీరామచంద్రు
డేతేర కవదాన - లిరువంకఁదాల్చి 4570
శృంగంబులను మహా - శిఖరిఁ గన్పట్టు
సింగారమునఁ జేతి - సింగాణు లమర
వెనుక లక్ష్మణుఁడు రా - విరులును లాజ
లును కరంబులను జ - ల్లుచుఁ జూతురొక్కొ ?
నయశాస్త్ర విదుల యం - దటి లోనఁ బెద్ద
వయసు నిల్కడను దే - వతలతో నుద్ది
యిట్టి రాఘవుఁడు మూఁ - డేండ్ల ప్రాయంపుఁ
బట్టికై వడి కనుఁ - బండువుఁగాఁగ
నాచెంత నుండు చం - దంబు నే మఱలఁ
జూచి యింకొకనాఁడు - సుఖముందు నొక్కొ ? 4580
తల్లులఁ గొడుకులఁ - దా నెడల్ చేసి
తొల్లి యెవ్వరికింత - దొసఁగుచేసితినొ ?
లేఁగఁగానక కోల్పు - లికిఁ జిక్కినావు
తోఁగూర్చెఁ గైకేయి - తోఁగూడి యజుఁడు
అతిశయ గ్రీష్మంబు - లందు భాస్కరుఁడు
కతకత నిలయెల్లఁ - గ్రాఁగించురీతి
యీపుత్ర శోకాగ్ని - యెంతయు మదిఁ

దాపంబు నొందించెఁ - దరియింపఁ గలరె! "
అనిచాల నాపన్న - యైన కౌసల్యఁ
గని యాసుమిత్ర చెం - గట నిట్టులనియె 4590

—: కౌసల్యను సుమిత్ర యూరడించుట :—

"అక్క! లోకస్తుతుం - డైన రాఘవుని
చక్కం దనంబును - సద్గుణంబులును
నెఱిఁగి యుండిన పతి - కింత శోకంబు
మఱియుఁ గల్పింప నీ - మాటలాడుదురె?
కొడుకు లందఱు నీదు - కొడుకులుగారె
అడల నేఁటికి యొక్కఁ - డని పలుమారు
తనతండ్రి యానతిఁ - దాల్చి రాఘవుఁడు
తనకుధర్మము మఁది - దలఁచి జానకియు
యిహాపరంబులకు మే - లెంచి లక్ష్మణుఁడు
విహిత వైఖరి నట - వికి నేఁగినారు 4600
వారికి నై చింత - వలదు నీకింత
యూరడింపుము రాజు - నుపతాపమణఁచి
జగతిపైఁ గీర్తిధ్వ - జంబు శోభిల్లఁ
బొగడికల్ గను నీదు - పుత్రుని మీఁదఁ
గాఁకపుట్టఁగ నెండ - గాయునే తరణి?
సోఁకునే బిట్టుగా - సుడిసి వాయువులు
ఏమి సేయఁగవచ్చు - నెవ్వారికైన
రాముని భుజపరా - క్రమ మెన్నఁగాతి
అట్టి నీదు కొమారుఁ - డన్నిదిక్కులనుఁ
గట్టిగా సేమంబు - గైకొన గలఁడు 4610

చందమామ యొసంగు - చల్లందనంబు
కందనీయదు పాద - కమలంబు లవని
వనిత ! తిమిధ్వజా - హ్వయనిశాచరుని
తనయుని వైజయం - త పురంబులోన
తునుచుదివ్యాస్త్రముల్ - తోయజాసనుఁడు
మనరామునకునిచ్చె - మఱియందుమీఁద
యాలక్ష్మణుఁడు వెంట - నరుదేర రాము
నాలంబులో నింద్రుఁ - డైన మార్కొనునె !
ఈతండ్రికడ మన - యింటిలోనున్న
రీతిగా వనులఁజ - రించి రాఁగలఁడు 4620
రామునిచేతి శ - రంబు గన్గొనిన
సామాన్యమే నిల్వ - శత్రురాజులకు ?
రామునియాజ్ఞ మీ - ఱఁగ నెవ్వఁడోపు
సామాన్యుఁడె యమాను - షపరాక్రముండు
ఇనునికినినుఁడు వ - హ్నికి వహ్ని భాను
తనయునకును భాను - తనయుండు క్షమకు
క్షమ కీర్తికినికీర్తి - శాశ్వతదైవ
తములకుఁ దాదైవ - తము శ్రీకిశ్రీయు
నైన నీతనయుఁడి - య్యవనియు లక్ష్మి
జానకియునుఁ గొల్వ - సత్వరంబుగను 4630
పట్టాభిషిక్తుఁడై - ధర్మలాలాట
పట్టంబుతో మన - పట్టణవీధి
తరుణు లారతులెత్తఁ - దారఁగఁజూచు
పరమకల్యాణ లా - భము లొందఁగలవు

లక్ష్మీసమాన యి - లాసుత గూడి
లక్ష్మణుండు భుజావ - లగ్నకోదండ
యుగళుఁడై ముందర - నుండు రామునకు
జగతి నసాధ్యమె - చ్చట గల్గనేర్చు ?
వనవాసమీడేర్చి - వచ్చి నీచరణ
వనజయుగ్మమునకు - వనితతోఁగూడి 4640
మ్రొక్క శ్రీరాముని - ముచ్చటదీరఁ
గ్రక్కున నానంద - కలితబాష్పములు
కన్నులంగురియంగఁ - గౌఁగిటంజేర్చు
నిన్నుఁగన్గొనువేడ్క - నేఁగాంచుదాన
ము దెవచ్చె మనరాముఁ - డేలశోకంబు
వదలవమ్మా !" యని - వాకొనుచుండ
శరదావసరమున - జలములల్పముగ
ధరియించునట్టి కా - దంబినిం బోలి
యాసుమిత్ర వచించు - నట్టిమాటలను
కౌసల్య యూరట - గాంచెనెమ్మదిని. 4650

—: రాముఁడు తనవెంటవచ్చు పౌరులనూరడించుట :—

ఆవేళ రఘురాముఁ - డఖిలజనంబు
సేవింప దా వన - సీమకుం జనుచు
నందఱఁజూచి ప్రి - యంబున పుత్రు
లందలివాత్సల - మమరనిట్లనియె.
"మీరేల ? విపినభూ - మికి నాదువెంట
దూరమేతేర వ - త్తురె యిండ్లువిడిచి

భరతుండు నయమున - బాలుఁడౌఁగాక
పరమవిజ్ఞానసం - పన్నుండు ప్రభుఁడు
మంచివాఁడు వివేకి - మాన్యుఁడు తాల్మి
మించినవాఁడు న - మ్మిన వారి నెఱుఁగు 4660
ప్రజలఁబ్రోవ నెఱుంగు - పౌరుషశాలి
నిజవరి గుణము ల - న్నియుఁ గలవాఁడు
నాకుఁదమ్ముఁడు గాన - నామాఱుగాఁగ
మీకు నాయనమాట - మేకొని కొలిచి
మనుట ధర్మముగాన - మనకెల్లనతఁడె
పనిగొని రక్షింపఁ - బాల్పడినాఁడు
మాతండ్రియతనికి - మహియిచ్చె భరతు
చేతిలోవార మీ - చెప్పినమాట
మీఱుచేయుటయె నా - మెచ్చు నాకొఱకు
మాఱాజు భరతుఁడు - మనసులయందు 4670
కడలేనిచింతలఁ - గరఁగకయుండ
కడుఁజేరి రేవగల్ - గాఁ గాచియుండి
మెలఁగుఁడీ" యని భూ - మీజనంబెల్ల
తొలఁగక రాముని - తో నిట్టులనిమె.
" ఏమేలయెడవాతు? - మీనవంశ! మిమ్ము
భూమీశుఁడెక్కడఁ - బోయిననేమి?
భరతుఁడేఁటికి మాకు - పట్టణంబేల?
దొరవీవెకాకయం - దునకెవ్వరైన"
అనునందులోవృద్ధు - లైన బ్రాహ్మణులు
వెనుకొని రాముండు - విననిట్టులనిరి. 4680

“రథమునఁగట్టు తు - రంగంబులార!
పృథువేగమున మీఱ - లేల పోయెదరు?
మనరాజునకు ధరా - మరులకునెల్ల
జనులకు హితముఁగాఁ - జనక కానలకు
రామునిఁగొనితెండు - రథముమఱల్చి
మామీఁదికృప” నన్న - మాటలాలించి
యున్నతాసనముల - నుండి పెద్దలనుఁ
గన్నులేవకయున్నఁ - గారాదు గాన
తనతేరుడిగ్గి చెం - తకు వారువచ్చు
దనుకఁగాల్నడ రఘూ - త్తముఁడొయ్య నరుగ 4690
వారు కూడఁగవచ్చి - “వచ్చెదమేము
శ్రీరామ! మీవెంటఁ - జేరి కానలకు
మాయగ్నిహోత్రసా - మగ్రితో వాజి
పేయశితచ్ఛత్ర - బృందంబు కడల
శారదసమయ హం - సంబులలీలఁ
దేర మీరానిండ - దిరుగంగవలయు
వేదమంత్రములంటి - వెన్నాడుబుద్ధి
మీదువెంబడి రాఁగ - మెయికొల్పెమాకు
తమకు సర్వార్థసా - ధనమైన వేద
మహారియున్నది కూడి - యంతరంగముల 4700
మాయింటివేలుపుల్ - మఱవకయిండ్లు
వాయకయుందురే - పట్టులనైన
మముఁదోడుకొని పొమ్ము! - మా మాటనీకు
నమరకయున్ననీ - యరదంబుఁద్రిప్పి
మఱలి యయోధ్యకు - మావెంటరమ్ము

సరిచూచుకొను మెద్ది - సరణియో నీకు
కాదనిమామాట - కడఁద్రోచితేని
వేదశాస్త్రంబుల - విప్రులనింక
నాదరించి ప్రయోజ - నాంతరంబులను
మేదినీజనములే - మిటికిఁగైకొనరు 4710
యిది ధర్మమనిమది - నెఱుఁగవే ? ధర్మ
పదవికెల్లనుమేలు - బంతినీనడక
నిజముగా షట్కర్మ - నిరతులమేము
యజనయాజనల స - మర్థుల మగుట
తపములుసేసి యెం - తయు నిండఁబండి
జపములఁగృశియించి - శాంతివహించి
యుపవాసములఁజిక్కి - యూర్ధ్వరేతములఁ
దపియించి యజుని వ్రాఁ - తలు మించఁబ్రతికి
యున్నవారముగాని - యున్నవారనుచు
నెన్నకు మిట్టియే - మిందఱుఁగూడి 4720
తెల్లఁగా నరసి యెం - తేజడల్ గట్టి
పల్లచాయలఁబొగల్ - వట్టిభస్మముల
ధూసరితంబులై - ధూళిపైబొదివి
డాసి వాహినులనీ - టనుఁదోఁగితోఁగి
పోరాని పుణ్యంపు - పుట్టలోయనఁగ
మీఱుమాశిరములు - మేదినిసోఁక
నీపాదములచెంత - నిలిపి సాగిల్లి
యోపుణ్యనిధి ! మ్రొక్కు - చున్నాము నీకు
నినుఁబాసియున్న మా - నియమంబులేల
కొనసాగు మము నెన్ను - కొనవేల నేఁడు 4730

స్థావరజంగమా - త్మకమైనధరణి
దేవ! నీరాకయు - ద్ధించె మాసరణి
సంచారపటుశక్తి - చాలమి వనులు
సంచలింపుచును ప్ర - చండవాయువుల
మొరయుచున్నవి వృక్ష - ములు పాయలేక
మొఱవెట్టుగతిఁజూడు - మో రఘుప్రవర!
జగతి నాహారసం - చారముల్ మాని
ఖగములు మీదురా - క యపేక్షచేసి
కలకలస్వనములఁ - గలగుండువడుచుఁ
గలఁగెడుఁగనవయ్య - కాకుస్థతిలక!" 4740
అని తన్నుమఱలింప - నర్థించి చాల
వినయనూక్తులువల్కు - విప్రులంగూడి
అడ్డిసేయక రాము - నరికట్టఁదలఁచి
అడ్డంబువచ్చెనో - యనఁదరుల్ నిండి
సరణిఁదోఁచిన తమ - సా నదిచేర
నరుగ సుమంత్రుఁడా - హయములవిడిచి
నీరార్చి కెలని ది - న్నెలఁబచ్చనైన
పూరిమేపుచుఁ జరిం - పుచు నుండెనంత.

—: రాముఁడు తమసానదియొద్దున విశ్రమించుట :—

రామచంద్రుండు పు - రాణపూరుషుఁడు
సౌమిత్రిఁజూచి ప్ర - సన్నుఁడై పలికె. 4750
"వనవాసమున కాది - వాసరంబిట్టి
దినముమొదల్గాఁగ - తిర్యగాదులనుఁ

గలసిచరించుట - గాని సౌఖ్యములు
నిలయంబులును మది - నిలుపుటమాని
చరియింతమిపుడు వి - చారంబుతోడ
నరపతిదేవులం - దరు పట్టణమున
మనలఁదలంపుచు - మఱుగుచుండుదురు
మనరాజు ఖేదంబు - మాన్పనోపుదురు
భరత శత్రుఘ్నులా - పట్టునఁగాన
పరితోషమొందెడి - భావంబులోన 4760
తల్లితండ్రులకు ఖే - దంబు లేదచట
నుల్లానమొందింప - నోపుదువిచట
సీతతోఁగూడి వ - చ్చిన నాకునీవు
నీతోడుగలుగ న - న్నిటనుమేలయ్యె
నేఁటికి యేటిపా - నీయంబె తక్క
నేఁటికి నితరంబు - నితవుగా"దనుచు
నాసుమంత్రునిఁచూచి - "యశ్వముల్ లెస్స
మేసెనే కసవులా - మిక" నంచుఁబలుక
అతఁడుమేసిన యట్టి - హయములఁగట్టి
యతి నీవు సమయకృ - త్యంబులుదీర్చి 4770
చల్లనా నొక్కర - సాలంబు చెంత
పల్లవంబులుదెచ్చి - పఱపుగానునుప
లక్ష్మణసీతాను - లాపముల్ రాజ్య
లక్ష్మితోఁబాయుతె - ల్పాటు వారింప
అందుముప్పురును శ - యానులై నిదురఁ
జెందుచోట సుమంత్రు - జేరి లక్ష్మణుఁడు

రామునిసుగుణకీ - ర్తనములు నడవి
భూమిజతో శయిం - పుటలుఁ జేర్కొనుచు
నున్నచోఁ దా నరు - ణోదయంబునకుఁ
గన్నులు విచ్చి మే - ల్కాంచిరాఘవుఁడు 4780
తన చుట్టునిదురించు - ధారుణీజనులఁ
గనుగొని లక్ష్మణుఁ - గని యిట్టులనియె
"పౌరులకెటువంటి - బాళిచూచితివె ?
వీరిండ్లనింతుల - విడిచియున్నారు
ఆహారములు మాని - యలసి యిందఱును
దేహముల్ మఱచి ని - ద్రింపుచున్నపుడె
కడకుఁబోవుదము మే - ల్కనిరేని మనల
నడవికిం బోనీయ - రడ్డగింపుదురు
విడుతురుప్రాణముల్ - విడువకుమనల
నెడవాసిక్షణమైన - నిట్టట్టుఁ జనరు 4790
వీరును మనవెంట - విపినభూములను
శారాకు దిని యేల - గాసిచేనలఁగ
తొలఁగుటొప్పగు"నన్నఁ - దొలఁగుటేమంచి
తలఁపని తా నర - దంబుఁ దెమ్మనిన
నాసుమంత్రుఁడు రథం - బటు తెచ్చి యునుప
నాసీతతోడ వా - రల్లనయెక్కి
తమసాస్రవంతిని - దాఁటి యాతేరు
తమ రయోధ్యకుఁ బోవు - తలఁపు పుట్టింప
రథముఁగ్రమ్మర నుత్త - రముగ రానిచ్చి
పృథుమతి నాజాడ - పేరేటఁగూర్చి 4800

యావల నీటిలో - నరదంబుతూర్పు
వోవఁగానిచ్చియ - ప్పుడు దక్షిణముగ
గట్టెక్కి చట్టుపైఁ - గదలించిరాల
మిట్టల నడపించి - మెల్లనేచుట్టి
తెరువు గూడుక తను - తేరు కాంతార
సరణినిఁ బోనిచ్చు - సమయంబునందు,

—: పౌరులు రామునింగానక యయోధ్యకు మఱలిపోవుట :—

నిదురింపు చున్నట్టి - నిఖిల జనంబు
నదరిపాటున లేచి - యరదంబు లేక
రామలక్ష్మణుల ధ - రాతనూజాత
నేమేరఁ గానక - యిచ్చలం గలఁగి 4810
యీనిద్ర యక్కటా ! - యిటుసేసె మనల
తాను దాసులఁబాయఁ - దగునె రాఘవుఁడు?
తనయుల వంటి యిం - దఱఁ బాసిపోవ
తనకెట్లుచెల్లు నీ - తా సహాయునకు
నేల రామునిఁబాసి - యింకఁ బ్రాణములు
చాలు మేనులతోడి - సంసర్గ సుఖము
పాటింపుదుము మహా - ప్రస్థానమైన
యేటివెల్లువఁబడి - -యేనిఁ బోవుదము
కనుకని చోత్తము - కారుచిచ్చైన
కనకెట్టులోర్తుమీ ! - కాకుత్స్థకులుని 4820
రామునిఁబాసి యూ - రకె యిండ్లుచేర
నేమందు రచ్చోటి - యెల్లరు మనల
శ్రీరాముఁగూడి వ - చ్చిన వారమకట !

యేరీతిఁ బోవుద - మిటువాసి యతని
యేమి సేయుదమని - యెల్లధనంబు
నేమరి కొల్పోవు - నెన్నిక వారు
నటునిటుఁ బరికించి - యరదంబుపోవు
పటుతర మార్గంబు - భావించిచూచి
మనగంటి మీజాడ - మనయయోధ్యకునుఁ
జనియె రాఘవుఁడునుఁ - జనియెఁ గానోవు 4830
వలదు ఖేదంబని - వచ్చినజాడఁ
దొలఁగక యందఱుఁ - దోడ్తోన కదలి
సాకేత నగరికిఁ - జని రాఘవుండు
లేకయుండుటకు జా - లివహించి యచట
నెమ్మియు నాహార - నిద్రలుమాని
యుమ్మలికింపుచు - నుండి రందఱును.
పాములు లేనిచోఁ - బక్షిపుంగవుఁడు
కామించి చేరని - కాసార మనఁగ
హరిణాంకు నెడబాయు - నాకాశవీథి
సరణి నంబువులేని - జలధి చందమున 4840
రామునిఁబాసి గా - రవ మెల్లఁదొలఁగి
శ్రీమించదయ్యె నీ - క్షింప నప్పురము

## —: రామునిఁగూర్చి పౌరస్త్రీలు దుఃఖించుట :—

యితరులుఁ దమ వారు - నిండ్లు భోగములు
హితమని తమమది - నెంచ రెవ్వరును
జీవనంబుల మీఁద - స్థితులందు తమదు
జీవధనంబుపై - చింతలుమాని

యందఱును విరక్తు - లై పణ్యవీథు
లెందుఁ బాయకయుండ - నెల్లవారికిని
చెడిపోయిన ధనంబు - చేతికిచ్చినను
పొడమక ప్రమదంబు - పురుషులయందు 4850
పుత్రులయందును - పౌలఁతులయందు
శత్రుభావముగ ని - చ్చలుఁ గనుఁగొనుచు
శ్రీరాము నెడబాసి - చేరు వల్లభుల
నారులందఱును చెం - తలఁ జేరనీక
యేల వచ్చితిరి మీ - కీపట్టణమున
నేలాభ మాసించి - యేతేర వలసె?
రామానుజీవి ధ - ర్మ స్వరూపుండు
సౌమిత్రి యొక్కఁడే - సత్పురుషుండు
మీ కేల యట్టి య - మేయ భాగ్యంబు
చేకూడు గృహావధూ - జీవనాశులకు! 4860
శ్రీరాము పదపద్మ - చిహ్నాంకితంబు
లై రాజిలంగ మ - హానదీ వనులు
యింత పుణ్యము సేయు - నే యవియెల్ల
సంతతం బతని బూ - జలు సేయకున్నె
కమనీయ గంధోద - కముల సంఫుల్ల
సుమములఁ దమతను - సొమ్ములుగాన
వరకందర ఝురీ ని - వాసంబులైన
గిరు లమ్మహాత్ముండు - క్రీడించు కతన
నవియూర? యెంత ధ - న్యములయ్యెఁ గొదవ
లవమానములు గల్గ - వతఁడున్నయెడల 4870

రాముని పదసమా - శ్రయమె యెల్లరకు
సేమంబుగాన భ - జింతము వోయి
యేము సీతను మీర - లెల్ల రాఘవుని
కామించి కొలుపక - గతివేఱె గలదె ?
అన్యాయపద మయో - ధ్యా పట్టణంబు
సన్యసింపకఁ జూడఁ - జనునె యెవ్వరికి ?
తరమె కైకేయి యు - ధర్మ రాజ్యమున
పురమని నమ్మికా - పురములు సేయ
తన బ్రదుకాశించి - తనుఁ బెండ్లియాడు
పెనిమిటి పుత్రుని - పేరు వెంటాడి 4880
కలుషంబులకు నోడి - గట్టినకైక
పాలియింప కెవ్వరిఁ - బోనిచ్చునింక ?
కూలికాండ్లను బోలి - కొలిచెద మనిన
జాలియింతియె కాక - సౌఖ్య మెక్కడిది ?
పుర మనాయకమయి - పోఁదరివచ్చె
ధరణీశ్వరుఁడు రాముఁ - డానెడవాసి
వాలియుటసిద్ధ మ - ప్పుడు పోవరాదు
తొలఁగి పోవుదము మీ - ఁదు తలంచి యిపుడ
నుండుకంటె విప్రప - యోగంబె మేలు
పాండెఱుఁగని దేశ - ములకైన వెడలి 4890
చంపుదు గొఱియల - చందాన నిట్టి
కొంపలలో తాము - గూలియుండెదము
కారుణ్యశరధి య - కల్మ షాత్మకుఁడు
సారస పత్రవి - శాలలోచనుఁడు
దయగల తండ్రి స - త్య పరాక్రముండు

జయశాలి నీతిశా - స్త్ర విశారదుండు
పురుష శార్దూలుండు - పుణ్యుండు మత్త
కరిరాజ గంభీర - గమనుఁ డుత్తముఁడు
అట్టిరాముఁడు వను - లందుఁ జరింప
నిట్టి మీవంటి వా - రిండ్లు చేరుదురె ?" 4900
అని పురస్త్రీలు నా - యకులతో మృత్యు
వునుఁబోలు కైక పై - వులకు శోకింప
నంతట భానుఁడ - స్తాద్రికిఁజేరె
నెంతయు మహి నెల్ల - నిరులల్లుకొనియె
అధ్యయనాగ్నిహో - త్రాదులు లేక
విధ్యుక్త కర్మముల్ - వీడుకోలొంది
యుదక శూన్యంబైన - యుదధియుం బోలి
యొదవు నిశ్శబ్దత - నుండె పట్టణము

—: వేదశ్రుతి గోమతులను నదులను రాముఁడు దాఁటుట :—

ఆరీతి పౌరుల - నందెల్ల డించి
తేరుదోలించి మం - త్రియుఁ దాము నేఁగి 4910
మిగుల దూరముపోయి - మిహిరోదయమునఁ
దగు నెడ కాల్యకృ - త్యంబులఁ దీర్చి
దమసీమ పొలిమేర - దాఁటి కట్టెదుల
నమరపంటలుఁ బండి - నట్టి గ్రామముల
బడలికల్ దీఱఁ జూ - పట్టఁ గన్గొనుచు
నెడనెడఁ బల్లెల - నెల్ల వారలును
"కామాతురుఁడు రాజు - కైకకు లొంగి
రాముని వంటి గా - రాపుఁ బుత్రకుని

యేమని పొమ్మని - యెను పాపజాతి
గామిడికైక యే - గతివరం బడిగె! 4920
అట్టి దుర్మార్గురా - లకట! యీసీత
నిట్టి బాములఁ బెట్టె - నేమనవచ్చు"
అనిపల్కు వినుచు వా - రవ్వల చనఁగ
ననఘ వేదశ్రుతి - యను నొక్కయేఱు
దాఁటె దక్షిణముగాఁ - దమరు పోవుచును
మాటికి నావుల - మందలున్నట్టి
గోమతినది గనుం - గొని యదిమీటి
యామొగదల స్యంది - కాపగఁగడచి
మనువు మున్నిక్ష్వాకు - మనుజేశ్వరునకుఁ
దనసీమలోఁ బంచి - తానిచ్చినట్టి 4930
యారాజ్యమిదియని - యవనిజతోడ
నారాఘవుఁడు దెల్పి - యవ్వలచనఁగ
నెంతదవ్వేక మన - మేఁగు కాఱడవి
యింతకన్నను దూర - మేల పోయెదరు?
మనవారి నింకొక్క - మఱిచూడనాకు
మనసయ్యె పురికేఁగి - మఱలుద మిటకు
దిగులయ్యె "ననిన ధా - త్రీతనూజాత
మొగముచూడఁ బ్రధాన - ముగ నశ్రులొలుక
నావల నరుగుచో - "నవనిజ ముగ్ధ
యేవగ పదునాలు - గేండ్లు చరించు 4940
నోయి సుమంత్ర! యిం - కొకనాఁడు మఱలి
పోయి యీసరయువు - పొలముల యందు
వేడుకతో డేగ - వెంటాడి చెలులఁ

గూడి మా దశరథు - కొలువునకేఁగి
డాసి చిక్కములవి - ట్టలనెల్లఁగాన్క
చేసి కౌసల్యకుఁ - జేరి మ్రొక్కుదునొ ?
యీడేఱ నెన్నఁడో - కివ్వన వాస
మేడ యయోధ్యమా - కికఁ జూడగలదె ?
యీమాట వెంటాడ - నెంచితినంచు
నీమది లోపల - నిలుపకు మెందు 4950
విలుకాండ్రకును గురుల్ - వేయుట దేహ
మలయించుటయు శ్రమం - బణఁచుట ముసలి
రాజులు వేఁడిన - శ్రాద్ధార్హ మాంస
రాజిఁదెచ్చుటయుఁ గ - ర్తవ్యముల్ గాన
మనసున దోఁచిన - మాటవాకొంటి ”
యనిపల్కి రఘువీరుఁ - డామ్రోలనున్న
నుత్తర కురుకోస - లోత్కలభూము
లత్తరి చూచుచు - నదిదాఁటి నిలిచి
గతి నయోధ్యాభిము - ఖంబుగా మఱలి
యతిభక్తిఁ గేలెత్తి - యంజలిచేసి 4960

—: రాముఁడు గంగాతీరముఁ జేరుట :—

“ఓపురరాజంబ ! - యొక్కొక్కయెడల
నేపున్య దేవత - లెవుడు నీయందు
నున్నవారలొ వారి - కొక నమస్కార
మెన్నిక మారాజు - ఋణము దీర్చుటయు
మఱలివచ్చి భజింతు - మఱువక వారి

నరలేక నాకు స - హాయు లౌటకును"
అనిజలజలతెప్ప - లందు బాష్పములు
చినుకంగఁ గన్నుల - చెంగావిగ్రమ్మ
పొడవుగా వలపలి - భుజమెత్తి యెలుఁగు
కడురాయ గద్గద - కంఠుఁడై యచటి 4970
జనుల నుద్దేశించి - "చాల నామీఁద
కనికరింపుచు వెను - కటి దినంబులకు
కలసియుంటిమి బహు - కాలమిమ్మీఁద
తొలఁగిపోవలసె నా - దురదృష్టమునను
దయమఱువకుఁ"డను - ధరణీశతనయుఁ
బ్రియవచనంబుల - ప్రేమతోవినుచు
నచ్చోటిజనులెల్ల - నలమరుగంగ
వచ్చెనస్తాద్రికి - వనజబాంధవుఁడు.
చీకటిమరుగున - సీతావరుండు
వేఁక మాస్యందన - వేగంబుతోడ 4980
జనపదంబులుగొన్ని - సరణిగన్గొనుచు
చనిచని యెదుట లో - చనపర్వలీల
కాంచనదళరత్న - కందళ కర్ణి
కాంచిత కమలవ - నాభిశోభితము
మకరంద రసలోల - మదచంచరీక
నికర గాయనగాన - నిబిడీకృతంబు
శౌనకాదిమ మహా - సంయమిశ్రేష్ఠ
మానితాశ్రమలస - మానకూలంబు
మానితసురత సం - భ్రమ రణ దివిజ
మీనేక్షణా మణీ - మేఖలారవము 4990

కలితలతా డోలి - కాలోల మాని
కులకన్యకా తులా - కోటిస్వనంబు
పనస రసాల రం - భా నారికేళ
తినిశ క్రముకవనో - త్కీర్ణరోదంబు
వారికేళీలోల - వైమానికాభి
సారికా వీక్షామృ - షా మీనబలము
యాజన హోమధూ - మాకాండ జలద
రాజికాచ్ఛన్నత - రంగ మాలికము
కారండవ మరాళి - కా ప్లవీభూత
గౌరసారస పరా - గ ప్రపంచంబు 5000
నగుచు తుమ్మెద - దాఁటులలకలు గాఁగ
మొగుడు దమ్ములు చన్ను - మొలకలుగాఁగ
కలితకటీర చ - క్రము పులినముగ
వలనొప్ప విరి - దమ్మి వదనంబుగాఁగ
కెందమ్మిదోయి యం - ఘ్రియుగంబు గాఁగ
పొందు బేడసలు చూ - పుల గాఁగుగాఁగ
సరళవలీ విలా - సము తరంగలుఁగ
నెరసిన నాచు పె - న్నాతి గుంపుగాఁగ
మీఁగాళ్లు మేటితా - మేటి పిల్లలుఁగ
తీగ లే నగవులు - తేలు నుర్వులుఁగ 5010
కామినియునుఁ బోలు - గంగానదీల
లావంబు చూచియా - లక్ష్మణాగ్రజుఁడు
చేరి చేతులుమోడ్చి - శృంగిబేరంబు
చేరవాఁడగుచు ద - క్షిణముగా నరిగి
"యిచ్చోటనున్నది - యింగుదుశాఖ

వొచ్చంబు లేకనేఁ - డుంద మీఁద ”
అన లక్ష్మణ సుమంత్రు - లట్ల శోకనుఁడు
చన యమ్మహీరుహ - స్థలిఁ దేరుడిగ్గి
చెంత దేజీలఁ బ - చ్చిక మేయవిడిచి
వింతవారలు లేని - విజనదేశమున 5020
వసియించుతరి రఘు - వర్యుని రాక
వెసఁదన వారిచే - విని సంతసించి
తనసీమ గావునఁ - దగిన సన్మాన
మొనరింప గుహుఁడను - నొకబోయఱేఁడు
తనవారు ముదుసళ్లు - తనుచుట్టుఁ గొలువ
పనిపూని బహువన్య - ఫలములఁ గొనుచుఁ
గానుకచేసి ల - క్ష్మణుఁ గూడియున్న
జానకీజాని, న - చ్చటఁ బొడగాంచి
అతిథివైతివి యోగ్య - తార్థుండనైతి
హితమెద్ది నాకాన - తిచ్చి కైకొనుఁడు 5030
అనిస్వాదు జలములు - నన్నంబు భక్ష్య
వనఫలాదు లొసంగి - వారియ్యకొనిన
“ఇనవంశ! ఆది గ - ర్భేశ్వరుఁడైన
నినువంటి యతిపుణ్యు - నికి నింతచింత
అకట! రావచ్చునే? - యడిగెఁబోకైక
ఒకమాట కాఁదన - కుర్వీశ్వరుండు
వరమిత్తునని పంప - వచ్చునే మిమ్మ
పరికింప ననువంటి - బంటు గల్గియును
నేలయింత విచార - మే నాయయోధ్య
యేలింతునో? నిన్ను - నిటుగాదటన్న 5040

నందుకు బదులుగా - నధిప! నాపురము
నందు పట్టము గట్టి - యస్మదాదులము
గొలుతుమో? మరి - వేఱ కోరిక నీకుఁ
గలిగియున్నదియొ? యొ - క్కటి పేరుకొనుము
చేకూర్తుమీకు నా - చేతనుంగాని
యేకార్య మొకటున్న - దే" యనిపల్క
ఆదరంబున గుహు - నక్కునఁజేర్చి
మోదంబుతో రఘు - ముఖ్యుఁ డిట్లనియె
"నీవు నీవారును - నెమ్మదింగూడి
యేవలనఁ గొఱంత - యింతయు లేక 5050
సుఖమున్నదియెచాలుఁ - జూచితిమిట్టి
సఖు నిన్నుఁ గనుట లే - చాలును మాకు
అగలన్నియు మాని - యడవులఁదిరుగ
నాసించు మాకు న - న్యప్రతిగ్రహము
గారాదు నీయావి - కైకొంటి మేము
పోరానియట్టి యా - ప్పుఁడ వైన కతన
మాకునై యిన్నియు - మఱలంగనీవు
కైకొమ్ము నగరివి - గాన తేజీలు
మేపింపు" మన నట్ల - మేకొని గుహుఁడు
జోపానచేసి న - చ్చోఁ దురంగముల 5060
బహుమానమిది మాకు - భక్తిఁ దెమ్మనుచు
గుహుఁడొసంగఁగ నార - కోకలుదాల్చి
సౌమిత్రి దెచ్చిన - జహ్నవీవారి
రామచంద్రుఁడు గ్రోలి - రాత్రి యచ్చోట
సామాన్యమగు తృణ - శయ్యాతలమున

రామామణియుఁ దాను - రామచంద్రుండు
నిదురింప గుహుఁడు మం - త్రియుఁ దనచెంతఁ
గదిసి రాఘవగుణ - కథనముల్ సేయ
సౌమిత్రి విలు నారి - సారించికెలన
నేమఱ కొక్కింత - యెడ నిద్రలేక 5070
కాచి వారలుఁ దానుఁ - గనుకల్గియున్న
నాచోట గుహుఁడు రా - మానుజుఁ బలికె

—: గుహుఁడు లక్ష్మణునితో సంభాషించుట :—

"శయ్యనీకొకటి ల - క్ష్మణ! యేరుపఱచి
యియ్యెడ నున్నది - యిందునిద్రింపు
మదన సుఖోచితం - బైన నీమేను
నిదుర లేదేలి యె ం- తే గాసినొందు
రాముసంరక్షణా - ర్థమున కేఁజాలి
యేమరకుందు నా - హితులతోఁ గూడి
అలవడియుండు ని - ద్రాహార విధులు
కలిగిన లేకున్న - కాయముల్ మాకు 5080
నమ్ముచు నీపూన్కి - నామీఁదనుంచి
నెమ్మదిఁ బవళించి - నిదురింపుమీవు
సీతాసమేతుఁడౌ - శ్రీరామచంద్రు
నేతఱిఁగని కొల్వ - కిందునకన్న
నేకార్యమైన నా - కేల ? యీస్వామి
శ్రీకర కరుణావి - శేషంబు వలన
పురుషార్థములు నాల్గుఁ - బొందెదననుచుఁ
బరికించినాఁడనా - భావంబులోన

చతురంగబలములి - చ్చట నెదురించి
ప్రతికూలమైనయేఁ - బాఱఁద్రోలెదను 5090
ననుఁబని గొను" మన్న - నవ్వి లక్ష్మణుఁడు
వినయంబునఁ బుళింద - విభున కిట్లనియె
"ఎంతకైననుఁ జాలు - దీవుఁ గల్గఁగను
చింతయేడది రఘు - శ్రేష్ఠుఁగాచుటకు
నేలపై సీతతో - నిదురించు రాము
నీలీల కన్నుల - నేఁజూచిచూచి
తనవునం బ్రాణముల్ - దాల్చియున్నట్టి
నినుఁజూచి కంటికి - నిద్దురగాంతు
తపముల పంటయా - తనయు నీరీతి
నపవాదముల కోర్చి - యడవుల కనిచి 5100
యాలిమాటల వెఱ్ఱి - యైన మారాజు
జాలిచే విలపించి - చాకుండఁ గలఁడె?
ఈరాము నగరిలో - నింక నయోధ్య
నూరక పాడుగా - కుండ నేరుచునె?
కౌసల్యమాట యిం - క వంచింప నేల?
అసుమిత్రయు నట్ల - యైన శత్రుఘ్నుఁ
జూచి యూరడ యొకిం - చుక గననేర్చు
భూచక్రమునకు నీ - పుత్రరత్నమును
పట్టంబుగట్టి యా - భాగ్యంబుఁజూచు
నట్టి పుణ్యంబు లే - దాయె రాజునకు 5110
నారాజునకుఁ క్రియ - లర్థిఁగావించు
వారలకగు రాజ్య - వైభవోన్నతులు
వనుల పూనికదీర్చి - వచ్చి రాఘవుఁడు

తనుఁజూచు నందాక - దశరథ విభుఁడు
పాటించి ప్రాణముల్ - బట్టుకయున్న
నాఁటివేఁడుక యేమ - నఁగ వచ్చునీకు ”
అని గుహుతో మాట - లాడుచు నుండ
విని యతండును ఖేద - వివశాత్ముఁ డగుచు
కన్నీరు దొరుగ రో - గంబుచే నలఁగి
యున్నట్టి మత్తేభ - మో యన మిగులఁ 5120
గలఁచుచు నుండఁ జీ - కటు లెల్ల విరిసెఁ
దెలవారె నిద్దుర - దెలిసి రాఘవుఁడు

—: రాముఁడు గంగనుదాఁటఁ బ్రయత్నించుట :—

ఓయి లక్ష్మణ! భాస్క - రోదయంబయ్యె
కూయిడఁ దొడఁగె ప - క్షులువనాంతముల
నీగంగదాఁటుద - మిప్పుడేయనిన
నాగుణ నిధిమాట - లతఁ డాలకించి
వినుఁడంచును కిరాత - విభుని సుమంత్రుఁ
గనిపల్క యతఁడు చెం - గట నిల్చునంత
తః ప్రధానులతోడఁ - “ దగినట్టియోడ
గొనితెండు మీ ” రని - గుహుఁడు వల్కుటయు 5130
వాను నట్లన సేయ - వచ్చియతండు
“ శ్రీరామచంద్ర! వ - చ్చెను నావ ” యనిన
గుహుఁడోడ దేర ము - గ్గురుఁ జేరఁబోయి
విహిత వైఖరి నెక్క - వేళ సూతుండు
“ దేవ! నాకేది బు - ద్ధి యనుజ్ఞయిందు
నీవాఁడ ”ననిన మం - త్రికి రాముఁడనియె

—: సుమంత్రునికిఁ జెప్పఁదగిన సందేశముల రాముఁడు చెప్పుట: —

" అరదంబుతో నయో - ధ్యకుఁ బొమ్ము నీవు
ధరణీశు సేమంబుఁ - దలఁచి వర్తిలుము
గహనభూముల నింక - కాల్నడఁగాని
విహితమే రథముతో - విహరింపమాకు " 5140
అనిన సుమంత్రుఁడు - హానిఁ వెచ్చనూర్చి
అనఘ ! రాఘవ మిమ్ము - నడవుల కనిచి
యీవట్టి రథముతో - నేరీతి పురికిఁ
బోవనేరుతు నాదు - పుణ్యమిట్లయ్యె
నేరీతి మువ్వురు - నేఁగి యుండెదరు
ఘోరాటవుల మిమ్ముఁ - గోలువ కెట్లుందు
ఆచార్య వాసంబు - నందు నధ్యయన
మాచరించి కృతార్థుఁ - డగు బ్రహ్మచారి
కైవడి వీరితోఁ - గానలయందు
దేవ ! చరించి స - త్కీర్తిఁ గాంచితివి 5150
పోనేర నే" నన్న - భూమిజారమణుఁ
డాననంబు మఱల్చి - యతని కిట్లనియె
" మనువంశమునఁ బుట్టు - మావారికెల్ల
నినువంటి యాప్తుఁడౌ - నెయ్యుఁ డున్నాఁడె ?
మానిమిత్తము నీవు - మఱలి నాకొఱకు
మానసంబున శోక - మగ్నుఁ డైనట్టి
మాతండ్రి నూరార్చి - మనవి వాకొనుము
సీతయు సౌమిత్రి - చేరి భజింప
వనులలో సుఖమున్న - వాఁడ నేననుచు
ననుమంటి మనిపల్కు - మమ్మహీపతికి 5160

ముదిసి ముప్పునఁ జిక్క - మోహంబుచేత
మది నీతిమార్గంబు - మాని యేమన్న
నారాజుమాట నీ - వౌదలయందుఁ
జేరిచి యటులనే - సేయు మేయెడల
కౌసల్యకును నమ - స్కారంబు మేము
చేసితి మని మున్న - చేరి వాకొనుము
దశరథేశ్వరుఁడు చిం - తల నొందకుండ
కుశలత నీవు మా - కు హితంబుగాఁగ
భరతునిం బిలిపించి - పట్టంబుఁ గట్టి
ధరణీశ్వరుని మన - స్తాపమ్ము మాన్పు 5170
మముఁ బాసి దుఃఖాబ్ధి - మగ్నుఁడౌ భరతు
శమియింపు మనినా వ - చనముగా ననుచు
తల్లుల సరిగాఁగ - దశరథునట్ల
యెల్లరకడ నీవు - హితబుద్ధి మెలఁగు
కౌసల్యఁ జూడుము - కైకేయియట్ల
యాసుమిత్రల వారి - యట్లపాలింపు
నీలీల మెలఁగిన - నిహపరంబులకు
మేలగు ననుచు ధా - ర్మికుఁడయిన యిట్టి
మాభరతుని తోడ - మఱువక పలికి
యాభిముఖ్యము గాంచి - నపుడ వాకొనుము 5180
పొమ్మ"న్న సూతుఁడ - ప్పుడు కేలుమొగిచి
సమ్మతింపక బాష్ప - జలములు దొరుగ
"అయ్య! నేరిచినేర - కాడినమాట
లియ్యెడ సైరింపుఁ - డేల పోవుదును
నీతి యే? దొరవైరి - నృపులచేఁ బడిన

సూతశేషరథంబు - చులకఁగాఁ దెచ్చు
వాని కైవడి నిన్ను - వనులకుం బనిపి
దీనుండనై రిత్త - తేరుతో నేను
పురికేఁగ దైన్యంబుఁ - బొందరే జనులు
నిరతంబు నాహార - నిద్రలుమాని 5190
నీవయోధ్యాపురి - నిర్గమనంబుఁ
గావింప నెంతదుః - ఖము పొందినారొ ?
అంతదుఃఖము గాంతు - రప్పుడు నన్ను
చెంతలఁజేరి వీ - క్షించు భూజనము
నేమందుఁగౌసల్య - కేఁబోయి మేన
మామయింటను డించి - మరలివచ్చితిని
రాముని నని దబ్బ - రలువలుకుదునె ?
భూమిజతో వనం - బులలోన రాము
విడిచివచ్చితినని - వేదనవెట్ట
నుడువుదునో నాకు - నోరెట్టులాడు 5200
మీరు లేనట్టిచో - మిన్నకరథము
వారువంబులు నన్ను - వహియించునెట్లు ?
కావున నడవికేఁ - గదలిరమ్మనుచు
దేవ ! యానతి ప్రసా - దింపుఁడు నాకు
రమ్మనవేని యీ - రథముతో శిఖ ము
ఖమ్మునఁజొచ్చినే - కడతేరువాఁడ
వనములోపల మీకు - వ్రతనియమములు
కొనసాగకుండ మా - ర్కొనునట్టి వారి
యీతేరుచే వధి - యింప నోపుదును
సూతమాత్రుని గాఁగఁ - జూడకుమయ్య! 5210

నియమించి నీచెంత - నిలుపుకనన్ను
భయదాటవులయందుఁ - బనిగొనుటొప్పు
మాన్యంబులగుముని - మాపులలైన
ధన్యవైఖరుల ను - త్తమగతుల్ గాంచు
మీకొల్వులేకున్న - మిహిరాన్వయేశ !
నా కమోధ్యయె కాదు - నాకంబునొల్ల
పాపాత్ముఁడపవర్గ - పదవికి దొఱఁగి
తూపిలి పడఁబోవు - దుర్గతింబోలె
చేలనై యేనిన్నుఁ - జెడవాసి పురికి
నేలపోవుదువెంట - యేవచ్చువాఁడ 5220
తరవాతమిమ్ము నీ - తాసమీతముగ
నరదంబుపైనుంచి - యరుగుదుపురికి
పదునాలుగేఁడులు - పదునాల్గు క్షణము
లదియెంత మీవెంట - నరుదేరనాకు
మిముఁబాసియున్న ని - మేషంబు నాకు
క్రమియించునది బ్రహ్మ - కల్పమైతోఁచు
భక్తవత్సలుఁడ వీ - పట్టునఁ దగునె ?
భక్తుని నన్నుఁజే - పట్టక వదల?"
అని దీనవదనుఁడై - యడలు సుమంత్రుఁ
గనుగొని లక్ష్మణా - గ్రజుఁ డిట్టులనియె. 5230
" నీభక్తివిశ్వాస - నియమంబులెల్ల
నీభూమిజనులెల్ల - నెఱిఁగియుండుదురు
యేనెఱుంగుదు నింత - యేఁటికీచింత
మానసంబున నాదు - మనవిఁగైకొనుము
పురికినన్నేఁటికిఁ - బొమ్మంటివనిన

తరుణితో రాఘవు - దండకాటవికి
ననిచి వచ్చితినన్న - యప్పుడు గాని
జననికైకేయిని - జంబుగాఁగొనదు
వేయేల ! నీవేఁగి - విశ్వాసమొదవ
నాయమ్మతోఁజెప్పి - యనుమానముడుప 5240
నంత మాతండ్రి స - త్యము మెచ్చి నమ్మ
యింతట దోషంబు - లెన్నక మనుచు
భరతుండు రాజ్యంబు - పాలింపఁజూచి
పరిణామముననుండు - పార్థివోత్తముఁడు
మారాజునకు నాకు - మదిలోనహితముఁ
గోరి యయోధ్యకుఁ - గొనిపొమ్మురథము
ఎవ్వరెవ్వరితోడ - నేమనుమంటి
నవ్వచనములె కా - నాడు మందటికి "
అని సుమంత్రునికిఁ బ్రి - యంబులు చెప్పి
మనసు రంజిలఁజేసి - మఱలిపొమ్మనుచు 5250
గుహుని నెమ్మోము గ - న్గొని యిట్టులనియె
" మహితాత్మ ! జనులస - మ్మర్దమిచ్చోట
కలిగియున్నది నిల్వ - గారాదు మాకుఁ
దొలఁగి పుణ్యాశ్రమా - దుల నుండవలయు
నియమపూర్వకముగా - నేదీక్షఁదాల్చి
దయసేయఁదగిన సీ - తాలక్ష్మణులకు
మాతండ్రికిని సర్వ - మంగళహేతు
భూతంబుగా జడల్ - బూనంగవలయు
పరిజనులను మఱ్ఱి - పాలు దెమ్మనుము
పరమ సంయమివృత్తి - పరుఁడగావలయు " 5260

అన నట్లకావింప - నచట రాఘవులు
మునివేషధారులై - మున్నటికన్న
చెలువంబులెచ్చి యా - చెంచులతోని
వలనుఁగన్గొని రఘు - వరుఁడిట్టులనియె.
"బలదుర్గములయందు - ప్రజలందు రాష్ట్ర
ములయందు నిజధర్మ - ములయందు నీవు
నేమఱియుండక - హితులతోఁగూడి
భూమియేలుము మేము - పోయివచ్చెదము"
అని మఱలఁగఁబంచి - యాయోడచేర
జని రఘువరుఁడు ల - క్ష్మణుఁజూచిపలికె 5270
"ఎక్కింపులక్ష్మణ! యీయోడ మీఁద
నిక్కడభూపుత్రి - నేలతామసము ?
పోవు"దమనిన య - ప్పుడు లక్ష్మణుండు
దేవి నయోడపైఁ - దెచ్చియుంచుటయుఁ
దరవాతఁ దమ రన్న - దమ్ములు నెక్కి
తరణిభాగీరథిఁ - దరలింపుఁడనుచు
నాగుహు దాయాదు - లైన నావికుల
వేగంబె వాకొని - విడిచిపోలేని
నూతుని గుహుని న - చ్చో మఱలించి
పూతాత్ముఁడగుచు వి - ప్రులకు రాజులకు 5280
జపియింపఁదగునట్టి - సన్మంత్ర మొకటి
యపుడుచ్చరింపుచు - నంజలిచేసి
నడపింపుఁ డనవుండు - నావికు లోడ
గడపుచో సీత గం - గానదిఁగాంచి
దేవి ! భాగీరథి ! త్రిభువనంబులను

పావనంబులుగాఁగఁ - బ్రవహించితీవు
వనవాసమీడేర్చి - వచ్చితి మేని
యెనయు వేడుక బలు - లిత్తుము నీకు
వనధిపట్టపురాణి - వాసమ ! నీవు
వనులలో మాకు నీ - వలయు నేమంబు 5290
రాముఁ డయోధ్యాపు - రము ప్రవేశించి
శ్రీమించఁగా నభి - షిక్తుఁడౌనపుడు
నీకొఱ కప్పుడ - నేకవిప్రులకు
సాకేతనగరి భో - జనములమర్చి
శాటికా గోదాన - శతములు చేసి
చాటించి పురి గంగ - జాతరనడచి
మైరేయమాంస సా - మగ్రితోఁగొలిచి
పేరటాండ్రకు నీదు - పేర బుట్టములు
కట్టించి నీదరి - గాఁచు వేల్పులకుఁ
గట్టించెదము గుళ్ళు - గ్రామాంతరముల " 5300
అని మ్రొక్కుచునుఁబోవ - నవల దక్షిణపుఁ
బెనుగట్టునకు నోడ - బిరుసున జాఱ
మున్నెక్కినట్లనే - మువ్వురుడిగ్గి
మన్నించి నావికు - మఱలంగఁబనిచి
మునులక్ష్మణుఁడు సీత - ముందఱ తాను
వెనకయునై రఘు - వీరశేఖరుఁడు
వనులలోఁజరియించు - వారలై పల్ల
మును మిట్టు రాలును - ముండ్లునుంగల్లు
త్రోవల నొకకొంత - దూరంబువోయి
యావల సకలస - స్యసమృద్ధమైన 5310

వత్సదేశముచూచి - వచ్చుచో దీన
వత్సలుండా రఘు - వర్యుఁడు సీత
యలసి యాఁకటిచేత - నడుగిడలేక
కలఁగుచందము చూచి - కఱకుటమ్ములను
నొకపంది నొకలేటి - నొక్కకురంగేటి
నొకచింకఁబడవైచి - యొలిచి మాంసములు
తెచ్చి యొండొకయేటి - తీరంబుచేరి
యచ్చోటనొక భూరు - హచ్ఛాయ నిలువ
ముగ్గురు నాహార - మునఁదనివొంది
యగ్గలిక వసింప - నర్కబింబంబు 5320
నపరాద్రి చేర సం - ధ్యాదులుఁదీర్చి
యపుడు లక్ష్మణుఁజూచి - యనియెరాఘవుఁడు

—: రాముఁడు పరితపించుచు లక్ష్మణుని నింటికిఁ బొమ్మనుట :—

"మఱలనంపితిమి సు - మంత్రునిచ్చోట
బలుపుగాఁదీర్పుము - పండుటాకులను
నీవును సీతయు - నిదురింపు మిమ్ము
గావనే జాగరూ - కతనుండువాఁడ
నడవి గావున నిది - యాదిగా పూనిక
కడతేర్చునందాఁక - క్రమమిదినాకు"
అని శయనించి పా - యని చింతతోడ
మనువంశతిలకంబు - మఱియునిట్లనియె. 5330
కడలేనియట్టి శో - కంబు రాజునకుఁ
గడువేడ్కకైకకుఁ - గల్గునీవేళ

ప్రాణేశునకుఁగైక - భరతునిఁజూచి
ప్రాణధారణమంత్ర - పటిమనువోలె
నూరటఁగల్పించు - నుల్లంబునకును
నేరుచు నెటులైన - నృపునిరక్షింప
ననుఁబాసి వృద్ధుం డ - నాథుండునైన
జనపతికైక హ - స్తంబులోవాఁడు
ఏమిసేయఁగనోపు - నింతినిమిత్త
మీమహారాజున - కిట్టిపాటైన 5340
ధర్మమర్థమును వ్య - ర్థంబులు కామ
కర్మంబె యధికంబు - గా నెంచనయ్యె
యెంతటిమూఢుండు - నిటులొక్క యాలి
పొంతనంబునకు సు - పుత్రుఁడైనట్టి
ననువంటివానిఁ గా - నల కెటులంపు
కనలేని పనిచేసెఁ - గామాంధుఁడగుట
పతిదెచ్చి యొకమూలఁ - బడవైచి మనల
వెతఁబెట్టి తనపట్టి - విభునిఁ జేయుటను
భరతుఁడాలునుఁదాను - పట్టాభిషేక
పరతచే నతి సౌఖ్య - పరతంత్రుఁడగుచు 5350
దీనులా కోసల - దేశాధిపతుల
లోనుచేసుక యేలు - లోకమంతయును
తనకు లోనగు రాజుఁ - దాఁజంపఁ దలఁచి
మనలఁ గానలఁద్రోలి - మాయలకైక
కొడుకుఁ బట్టము గట్టఁ - గోరి విశ్వంబుఁ
దడకట్టె నెవ్వరిం - తకు నేరఁగలరు ?
మదముతో నామీఁది - మచ్చరంబెల్ల

మదినుంచి కైకేయి - మనలఁ గౌసల్య
బ్రదుక నీయని యట్టి - పాములం బెట్టి
చెదరక నేమేమి - సేయనున్నదియొ ? 5360
నానిమిత్తమున వ - నంబుల కీవు
పూనివచ్చినది త - ప్పుగ నెంచి కైక
తెగఁజూచును సుమిత్రఁ - దెలియక పట్టి
పగగొను కొంటివి - భరతునితోడ
మాయన్న ! యింకనైన - మాఱు మాటాడి
దాయలచేతి భా - ధలకు లోఁగాక
వేకువతో లేచి - వీటికి నరిగి
సోఁకోర్చి కౌసల్య - జూచి పోషించు
భరతుఁడెప్పుడు వచ్చెఁ - బాయక యతని
కరములో మాతల్లి - కరము నీవునిచి 5370
కానక కన్న రా - ఘవు నొంటి కొడుకుఁ
గానకు ననిచి దుః - ఖముల నున్నట్టి
యీపుణ్య భామిని - నెపుడు కైకేయిఁ
జూపక ప్రోవుమం - చు వచింపుమీవు
మనతల్లులకు దిక్కు - మఱిలేదు వేగ
జనుమీవు భరతుండు - సద్ధర్మ పరుఁడు
తల్లికి బిడ్డకు - తానెడల్ చేసి
తొల్లి కౌసల్యయీ - దుఃఖ మొందెడును
గలకాలమును నోచి - కన్నట్టి కొడుకు
తలగాకయీ యాప - దలఁ గుందదలసె 5380
యెందుకు నీజన్మ - మిటుగన్నతల్లి
నందరి లోపల - నవిధిఁ బాల్పఱిచి

మనువార లేజాతి - మానుసులందు
ననుఁబోలి యొక్కఁడు - న్నాఁడె లోకమున ?
పిలుకతో కౌసల్య - బెంచిన యాఁకు
చిలుక యల్లదె పిల్లి - చేరంగవచ్చె
కరవు మీఁదాని మో - కాలు తున్కలుగఁ
కరవాఁడి ముక్కునఁ - గఱ్ఱించి నటుల
అనుచుండు నాజన్మ - మాపాటి లేక
పనికిమాలెను తల్లి - పట్టున నిపుడు 5390
తనకుపుణ్యము లేక - తనయుఁ గోల్పోవు
జననికి నేల నిష్ఫల - మిట్టి బ్రదుకు
కనిపించి యొకవేడు - కయుఁ గానకున్న
కనియె నాచేత దుః - ఖంబు కౌసల్య
తలఁచినప్పుడె యయో - ధ్యా పట్టణంబు
బలిమినిఁ గైకొందు - బాహుశౌర్యమున
నెఱఁగవే మునుపన్న - నే ధర్మమునకుఁ
బరలోకహాని యా - పదలంద వలసె"
అనియొక్కచో తమ్ముఁ - డవ్వల జనక
తనయయు వినుచుండ - తలపోసి పోసి 5400
కన్నీరుఁగురియ గ - ద్గద కంఠుఁడగుచు
విన్నఁబాటున మాట - వెడలకేమియును
జ్వాలలడంగు వై - శ్వానరు రీతి
చాలవేగము మాను - జలధి చందమున
మౌనంబుతో నున్న - మనువంశ మణికి
జానకి వినఁగ ల - క్ష్మణుఁ డిట్లులనియె.
"రామ ! సోముఁడు లేని - రాత్రియో యనఁగ

సేమమేది యయోధ్య - చేడ్పడియుండ
చెంతనున్నట్టి యీ - సీతకు నాకు
నింత ఖేదంబుగా - నిట్టు లాడుదురె ? 5410
తగునయ్య యీపాటి - దైన్యంబునీకు
తగవుగా దేను సీ - తయు మిమ్ముఁబాసి
నేరతుమే మేన - నిలుపఁ బ్రాణములు
నీరంబులేక గం - డెలు మనఁగలవె ?
యేలమాకు నయోధ్య - యేలకౌసల్య ?
యేలసుమిత్ర నా - కితరు లేమిటికి ?''
అనులక్ష్మణుని మాట - లాలించి వనికిఁ
దనవెంట రా నమ్న - తమున నతండు
నమరించి తృణశయ్య - యందు శయించి
కమలాక్షిసీత చెం - గటఁ బవ్వళింప 5420
సింగముల్ గిరిగుహా - సీమలయందు
వొంగుచు నిశ్శంక - మున నున్నరీతి
విజనాటవిని రఘు - వీరు లారాత్రి
నిజవీర ధర్మంబు - నిర్జరుల్ మెచ్చ
వసియించి యందొక్క - వటము క్రీనీడ
నెసఁగుచోఁ దూర్పున - నినుఁడుదయించె.

:— రాముఁడు భరద్వాజాశ్రమమున కరుగుట :—

ఆవేళ రాఘవుం - డచ్చోట వాసి
పోవుచునొక కొన్ని - భూములు గడచి
దండితారాతి మ - ధ్యందిన భాను
మండలా తపముచే - మరిపోవరాక 5430

తమ్మునిఁ జూచి యు - దరమునఁ బలికె
"యిమ్మేరఁ జూచితి - వే ప్రయాగంబు
యేముని శేఖరుం - డిందున్నవాఁడొ?
హోమ ధూమములు మి - న్నొరయుచుఁ గవిసె
నెవ్వరున్నారకో! - యీ యాశ్రమమున
దవ్వుల వింటివే - తరళతరంగ
లహరిం బరస్పరో - ల్లాస ఘట్టనల
మహనీయ నినదంబు - మహియెల్ల నిండె
అమర గంగాయము - నాపగా సంగ
మమునకు నెచ్చోట - మసలక నేఁడు 5440
వచ్చితిమిది భర - ద్వాజాశ్రమంబు
వచ్చెనల్లవె చూడు - వనచరావళిని"
అనిచేరఁ బోవుచో - నపరాహ్ణవేళ
ధనువులుతో వచ్చు - తమ్మునీక్షించి
బెదరి మృగశ్రేణి - భీతి సట్టిట్లు
చెదరి పాఱఁగఁజూపి - సీత నూరార్చి
యపుడు భరద్వాజు - నాశ్రమంబునకు
నృపకుమారులు చేరి - నిలిచి రొక్కెడను.
ఆమౌని యగ్నిహో - త్రాది కర్మములు
నేమంబుతోఁ దీర్చి - నిజశిష్యకోటి 5450
పరివేష్టన మొనర్పఁ - బరగెడునట్టి
వరమౌని సమయంబు - వారలెఱింగి
అతిభక్తితో వచ్చి - సాష్టాంగ మెరగి
యతని సన్నిధి నిల్చి - హస్తముల్ మొగిచి
"వినవయ్య! దశరథ - విభునకు మేము

తనయుల మూరయో - ధ్యా పట్టణంబు
యీతఁడు సౌమిత్రి - యేనురాఘవుఁడ
యీతన్వి సీతనా - యిల్లాలు వీరు
నావెంట వచ్చిరి - నన్నుమాతండ్రి
భావించి వనులకుఁ - బనిచిన కతన 5460
మునులలో మునివేష - ములఁ జరియింపఁ
దనమది నియమంబుఁ - దాల్చివచ్చితిని"
అనిన భరద్వాజుఁ - డాతిథ్య మొసఁగి
మనసు రంజిల్ల స - మర్చనల్ చేసి
ఫలములు నన్నంబు - భక్ష్య భోజ్యముల
నలఘు నైఖరిఁ దెచ్చి - యర్పించిభక్తి
ఆరాముఁ జూచి మ - హామౌనిరాజు
గారాము మీఱఁను - త్కంఠ నిట్లనియె.
"నిన్నుఁ జూడఁదలంచి - నిచ్చలుమేము
జన్నముల్ దేవతా - ర్చనలుఁ గావింప 5470
నన్నిపుణ్యంబులు - నఱలేక తెచ్చె
నిన్ను నిచ్చటికి న - న్నింట ధన్యుఁడను
ఎచటికిఁ బోనేల ? - యిది పుణ్యభూమి
యిచట నుండుఁడు మీర - లే నెఱుంగుదును
మీరువచ్చిన రాక - మేదినీతనయ
తో రామచంద్ర! యిం - దు వసింపు మీవు"
అని యాశ్రమమున ర - మ్య ప్రదేశంబు
మునిశిఖామణి చూపి - ముదల యొసంగ
క్రమ్మరఁ గేల్మోడ్చి - కాకుత్స్థ తిలకుఁ
డమ్ముని రాజుతో - నర్థి నిట్లనియె. 5480

"ఇవ్వనంబున నుండ - నెట్లగు మాకు ?
దవ్వులేదిదె యయోధ్యా - పట్టణంబు
మాయున్కి విని స - మస్త జనంబు
నీయాశ్రమము చేరి - యిండ్లకుఁబోరు
కావున మాకు నె - క్కడనైనఁ దగిన
తావునం జేచూపి - తాపసనాథ !
జానకి యొంటిగాఁ - జరియింపఁ దగిన
యానెలవున నుంపుఁ - డని" పల్కుటయును
"విలసిల్లు పదికూఁత - వేటులనేల
యలరామ చిత్రకూ - టాఖ్య శైలంబు 5490
తగునది గంధమా - దన శైలమునకు
ద్విగుణించి సౌభాగ్య - వినుత వర్తనల
లాలిత రతుకో - లాంగూల వనచ
రాళికినది విహా - రావాసభూమి.
ఆగిరి శిఖరంబు - లందులఁ జూడ్కి
సాగు నెచ్చటనున్న - జనుల కన్నడిమి
సీమద్రొక్కిన పాప - చింతలు వోడమ
వామహీధర మహి - మాను భావమున
నందు తపోనిష్ఠు - లైనట్టివారు
పొందుదు రింద్రుని - పురమెల్లనాఁడు 5500
అదియె నివాస యో - గ్యము మీరుచేర
నదిగానిచో నుండుఁ - డరలేక యిచట."
అనిజానకీ లక్ష్మ - ణాన్వితుండైన
మనువంశమణికి న - మ్మౌని నాయకుఁడు

నుచితోపచారంబు - లొనరించిపూజ
లచలిత ప్రీతిమై - నాచరించుటయు
సమ్మదంబొప్ప న - చ్చట నాఁటికెల్ల
నమ్మునివ్వరు వసించి - రమ్మఱునాఁడు

—: చిత్రకూటాశ్రమగమనము యమునానది దాఁటుట :—

రామచంద్రుఁడు మౌని - రాజు నీక్షించి
" యో మహాత్మక! యెందు - నుందుదుమేము 5510
అనతియిండ"న్న - నాభరద్వాజుఁ
డైన వంశోత్తంసుఁ - డైన రాఘవునిఁ
గాంచి యిట్లనియె. " నె - క్కడ యననేల?
యంచిత మునివర - యజ్ఞవాటంబు
నవరత్న శోభాపి - నద్ధకూటంబు
పాలిత తరువరా - పారఝూటంబు
నీలనీలాంబుద - నికర ఖేటంబు
ప్రాలేయ కర సుసం - బద్ధజూటంబు
పరిసర సంచర - ద్భాను ఘోటంబు
స్థిరపుణ్య కూటంబు - చిత్రకూటంబు 5520
సీతతోఁగూడి వ - సింపుఁడో నీకు
నేతటి నీమది - కింపుఁ గల్పింతు
అచటి యాశ్రమములు - నచ్చోటివనుల
నచటి నికుంజంబు - లచ్చోటిదోనలు
అచ్చటఁగల నిర్ఝ - రాపగా వళుల
నెచ్చోట వెదకిన - నేఁటికిగల్గు?

అందునిల్చిన నయో - ధ్యా వియోగమునఁ
జెందుదుఃఖము మఱ - చి సుఖింపఁగలరు
పొమ్మ"న్న నమ్మౌని - పుంగవుఁజేరి
తమ్ముండుఁ దానువం - దన మాచరించి 5530
దీవనలంది ధా - త్రీ జాతఁగూడి
యావలఁ జనువారి - కమ్మౌని వలికె.
"కాకుస్థతిలక ! గంగయు - యమునయునుఁ
జోకఁగాఁ గూడిన - చో నట్టనడుమ
సంభేదమునఁ గూడి - చనుచు నందుండి
అంభోధి నాయకు - నాశగా మఱలి
యమునవెంబడిఁ బోయి - యనతి దూరమున
నమరు రేవున డిగ్గి - యావలికాల్వ
తెప్పమీఁదట దాఁటి - తీరంబునందు
నొప్పుశ్యామ యనంగ - నూడల నమరి 5540
మార్గంబులోనున్న - మఱ్ఱి నీక్షించి
వర్గత్రయంబును - వరముగా నడిగి
ఆచెట్టు సీతచే - నర్ఘ్య పాద్యాస
నాచమ నాదుల - నర్చింపఁజేసి
నిలువ వేఁడిన నందు - నిలిచి లేదేని
వలగాఁగ వచ్చి యా - వల సాగి నడిచి
పరువునేలనుఁ గను - పట్టు కాఱడవి
తెరువుల డాపలి - తెరువుగాఁ జనిన
వనమృగదావ పా - వక భీతులెందు
నెనయక మొత్తని - యిసుము ద్రోవలను 5550

నీరునీడయుఁ గల్గు - నెలవులనిల్చి
చేరుదు రీప్రొద్దె - చిత్రకూటంబు
పదియైదు వరుసలా - పర్వతంబునకు
వదలక యేఁ బోయి - వచ్చినవాఁడ
సుపథంబు నే మీకుఁ - జూపినత్రోవ
తపనోదయంబయ్యెఁ - తరలి పొండనుచు''
అనిచి యాశ్రమభూమి - కరిగినయంత
జనకజా ధీశుండు - సౌమిత్రి కనియె.
''ఈమహా మహుఁడెంత - హిత మాచరించె
సామోక్తులను మంచి - జాడ నేర్పరచి 5560
యటుల వోవుదమని - యవనిజ వెంట
పొటిలంబుగాఁ గూడి - పోయి వారచట
యమునా తటముచేరి - యయ్యేఱు దాఁటు
క్రమమెద్దియో యని - కడు విచారింప
సాధకంబులు దాల్చి - సౌమిత్రి గగన
రోధకంబగు వెదు - రుల గుంపుచూచి
బొంగులు నరకి యు - ప్పుడు తెప్పగట్టి
వింగడించిన పది - వేరు పైపఱచి
మెత్తఁగానందుపై - మేదినీతనయ
క్రొత్తసిగ్గున నెక్కఁ - గొంకుచుండఁగ 5570
రాముఁడెత్తుక తెచ్చి - రామ నా తెప్ప
పై మెదలక యుండ - పద్మాసనముగ
నునిచి సాధనములు - నుర్వీజ సొమ్ము
లోనలును విండ్లుఁగైదు - దువులందమర్చి
తమరు కాల్నడఁ బ్లవ - దండంబువట్టి

యమునలోఁ ద్రోయుచు - నవ్వలరాఁగ
యామహీసుత యమ్మ - హానదిఁ జూచి
నేమంబుమదిఁ గోరి - చేయెత్తి మ్రొక్కి
"ఓతల్లి! నావిభుఁ - డుగ్రాటవులను
నీతితో హాయనుల - నియమంబుపూని 5580
చరియింపఁ బోయెడు - సాగించి వ్రతము
పురికేము మఱలంగఁ - బోయినయపుడ
ఆవులు వేయి బ్రా - హ్మణులకునిచ్చి
నీవు మెచ్చఁగ సురా - న్వితఘటయుతము
పలలౌఘములతోను - పారమొసంగి
కొల్చెద మిదియె మ్రొ - క్కుచునున్నదాన"
అని పోవ వారిమ్మ - హానది దాఁటి
పెను తెప్పపైనున్న - పృథివిజ డించి
శ్రీరామవిభుఁడు ద - క్షిణముగా వచ్చి
చేరె మౌనివరుఁడు - చెప్పినమాడ్కి 5590
ఆవటమైనట్టి - యావటంబునకు
నావసుధాపుత్రి - యంజలిచేసి
"శ్యామాభిధానంబ! - జగతిజసార్వ
భౌమ! ప్రోవుము నాదు - ప్రాణేశువనుల"
అనువేళల "లక్ష్మణ! - యడవిత్రోవలనుఁ
చనుచున్నవారము - జతనంబుగాఁగ
పొమ్ము! మున్నుగనీవు - భూపుత్రివెంట
నమ్ములువిల్లు నే - నందిమీ వెనక
వచ్చెద! సీతకు - వలయువన్యంబు
లిచ్చుచు నలయంగ - నీకపొమ్మనిన" 5600

కరి మధ్యముననున్న - కరణి యొప్పంగ
హరిణాక్షివారల - ననుసరింపుచును
తా నెఱుంగని లతా - తరుమృగంబులను
జానకి విభుఁజూచి - సారె వేఁడుచును
పోవుచో సౌమిత్రి - భూపుత్రి తనకుఁ
గావలయు నటంచు - కామించియడుగు
నన్ని పదార్థంబు - లన్నియుఁదమ్ముఁ
డన్నెలవులఁ దెచ్చి - యందియిచ్చుచును
కాళింది చెంగట - గడియ పైనంబు
బాలాశిరోమణి - బడలకయుండ 5610
పోయి యొక్కెడనిల్చి - ప్రొద్దుగ్రుంకుటయు
నాయెడవసియించి - రారాత్రియెల్ల.
తెలవారి నిద్దుర - దెలిసి జానకినిఁ
బలికించి సౌమిత్రి - పవళించియుండ
"నోయి! లక్ష్మణ! గూళ్ల - నుండకపక్షు
లేయెడ విహరించె - నెలుఁగులిచ్చుచును
చాలింపు నిదుర భా - స్కరుఁడుదయించు
వేళయయ్యె" ననంగ - విని లక్ష్మణుండు
నిదురమేల్కొని కాల - నియమముల్ దీర్చి
కదలిపోవుచునుండ - గహనమార్గమున 5620
సీత నెమ్మోము వీ - క్షించి రాఘవుఁడు
చూతాదితరువులఁ - జూపియిట్లనియె.

—: రామాదులు వాల్మీకియాశ్రమమునకుం బోవుట :—

"వనజాక్షి! మధుమాస - వాసరంబగుట

వనములశిఖి శిఖా - వళిఁదాల్చుకరణి
చందన పనస ర - సాల జంబీర
మందార వకుళ త - మాల పున్నాగ
కతక కింశుక మధూ - క లవంగ లుంగ
లతల నారక్తప - ల్లవములుమించె
చూచితే! వికచప్ర - సూనమంజరుల
వాచవులకు మధు - వ్రతమిథునములు 5630
సంపూర్ణమాధ్వీ ర - సంబులుఁగ్రోలి
ముంపుగాఝుంకార - ములనాడఁదొణఁగె
అదె కనుఁగొంటివే? - యలినీలవేణి!
మదకోకిలంబులు - మావికెంజిగురు
మేఁతల నలరారు - మీఁదిగీతముల
రీతిఁబాడుచుఁ గొస - రెదు ముద్దుగులుక
యల్లదె చంద్రబిం - బాస్య! వీక్షింపు
చల్లని పవమాన - శాబముల్ పొలయ
నగసిజాంబకు నాట్య - శాలలోనాడు
బిరుదుపాత్రలనంగ - పించముల్ విరియ 5640
చొక్కుపాటల దిశల్ - నగాంచు కేకినుల
చక్కందనంబులె - సానుదేశముల"
అని లక్ష్మణునిఁజూచి - యావ కనుఁగొమ్మ
మనములఁజూచి కొ - మ్మలఁదారునట్టి
కలమధురారావ - కలితనత్యూహ
విలసనంబులు వీను - విందులయ్యెడును
మానితద్రోణప్ర - మాణంబులగుచు
నానామహీరుహా - నతశాఖలందు

యీడాడుచున్నట్టి - యీ తేనెపెరలు
జూడుము మదికి మె - చ్చులు పొదుకొల్పె 5650
యీచిత్రకూట మ - హీధరాగ్రమున
రేచితప్లుతసంచ - రిష్ణుహంసములు
తేలుచు మాల్యవ - తీ ప్రవాహోర్మి
మాలికాడోలల - మలసెఁ గన్గొనుము.
చింతలుమఱచి యీ - శిఖరిగాపున్న
నెంత వేడుకచెల్లు - నేవేళమనకు
చూతమె చేరి యి - చ్చో నాశ్రమముల
నేతరి మానుల - నేకులున్నారు"
అనుచు వాల్మీకుల - యాశ్రమంబెదుటఁ
గనుఁగొని యమ్మౌని - కంఠీరవునకు 5660
సాగిలి మ్రొక్కిన - సన్మౌనివారి
యాగమన మ్మెఱింగి - యర్ఘ్య లొసంగి
తనయాశ్రమోపాంత - ధరణీ తలమున
ననువైన యెడనుండ - నానతి యొసఁగ
రాముపంపున సుమి - త్రా కుమారకుఁడు
భూమియొక్కెడఁ జౌళి - ముగ నందపరచి 5670
చుట్టును ములుగంప - సొరిది నమర్చి
గట్టిమ్రాఁకులు దెచ్చి - కవరు లేర్పరచి
వాసంబులె త్తిప్పె - వాసపోయించి
ఘాసంబుదెచ్చి పొం - కంబు గాఁగప్పి
ముందర వెదురుల - మొత్తంబుచేత
పందిరి యమరించి - పారవాకులను
తడికె పెండెముగట్టి - తలుపుగా నుంచి

గుడిసె యొక్కటి తన - కనుఁ జోకపఱచి
అన్నకుఁ జూపిన - యాపర్ణశాల
చెన్ను శ్రీరాముఁ డీ - క్షించి యిట్లనియె. 5670
"నూతన గృహములం - దులఁ బ్రవేశింప
నేతరి యిదియర్హ్వా కృ - త్యంబుగాన
హరిణమాంసము హోమఁ - మాచరింపంగ
సరగఁ దెమ్మనిన ల - క్ష్మణుఁ డట్లకాఁగ
ననుపక్వముగ చేసి - యట తెచ్చి యునుపఁ
గని రాఘవుఁడు యథో - క్త ప్రకారముగ
నైణేయపల హవి - రన్నహోమంబు
ప్రాణేశ్వరియు దాను - భక్తితోఁ జేసి
యితర దైవతముల - నెల్లఁ బూజించి
శతపత్ర నేత్రుని - శంకరుఁ గొల్చి 5680
వైశ్వదేవ మొనర్చి - వాస్తుదైవముల
శాశ్వత భక్తిఁ బూ - జల బలిక్రియల
నారాధనము చేసి - యాపర్ణశాల
శ్రీరామచంద్రుండు - సీతయుందాను
మంచిలగ్నమున స - మ్మతిఁ బ్రవేశించి
యంచితామోదకం - దా వ్రుఁడై యుండె.
ప్రతిదినం బూర్మిళా - పతి దెచ్చి యిచ్చు
హితవన్య ఫలము ల - నేక మాంసములు
సీతతో నారగిం - చి రసాలసాల
శీతలచ్ఛాయలఁ - జిత్రకూటాగ్ర
సానుభాగముల వా - సంతికాకుంజ
సూన తల్పలముల మం - జుల కందరముల

మాల్యవతీ నదీ - మహనీయ సలిల
కుల్యాభి వర్ధిత - కుసుమిత ఫలిత 5700
వివిధ వనంబుల - వెలఁదియుఁదాను
రవివంశమణి మనో - రాముఁడై మెలఁగి
తమమనంబుల యయో - ధ్యా పట్టణంబు
తమవారిఁబాయు చిం - తలు దూరముగను
సమయోచిత క్రియల్ - సలుపుచు నచటఁ
బ్రమదానురాగ సం - పదల నున్నంత.

—: సుమంత్రుఁ డయోధ్య జేరుట :—

అచ్చట రఘువీరుఁ - డంపిన మరలి
వచ్చు సూతకిరాత - వరులాత్మలోన
రాముని సుగుణకీ - ర్తనములు చేసి
తాము వెంబడిఁబంపు - తమవారుచేరి 5710
శ్రీరామచంద్రుండు - చిత్రకూటమున
చారువై ఖరిఁ బర్ణ - శాలలో నునికి
చెప్పినవిని చాల - చింతించు గుహుని
నప్పుడే వీడ్కొని - యాసుమంత్రుండు
నరదంబుతో నయో - ధ్యా పురిత్రోవ
మఱలివచ్చుచునుగ్రా - మంబులు వనులు
కడచి మూఁడవనాఁటి - కడజామునందు
నడలుతోఁదమ యయో - ధ్యా పట్టణంబు
చేరంగనేఁగి యా - క్షితిపతితోడ
శ్రీరామ విభువార్త - చెప్పెద ననుచుఁ 5720

" బోవుచో పురజనం - బులు రాముఁడేఁడి ? "
" యీవట్టి రథమునీ - వేల తెచ్చితివి " ?
అనిగువ్వ కరిగొని - యడుగువారలనుఁ
గనుఁగొని రాము - గంగా సమీపమున
నునిచి పొమ్మనిపంప - నొంటిగా నేను
చనుదెంచినాఁడ ని - చ్చటికని పలుక
నెన్నడుఁగను గొందు - మెటువలెనుందు
మెన్నినాళ్లకు వచ్చు - నేమనవచ్చు
యాగవివాహాదు - లందు వేడుకలు 5730
సాగునే శ్రీరామ - చంద్రుండులేక
దయనెల్ల వారిని - తండ్రిక్రియ బ్రోచు
ప్రియముతో రక్షించు - పేదసాదలను "
అనిచాల విలపింప - నారాజవీధి
వనిత లిండ్లిండ్ల గ - వాక్ష మార్గములఁ
జూచి " రామా " యని - శోకింపుచుండ
చూచియుఁ జూడక - చొప్పెఁదలవాంచి
నగరి వాకిటి కేఁగి - నరులెల్లఁ దన్ను
తెగితిట్టుచుండ మం - త్రి వరేణ్యుఁ డపుడు.
ఆ యజారము మీరి - యావలనొక్క
చాయ రథంబుంచి - చయ్యన డిగ్గి 5740
వడదేర మోము సా - వడు లైదురెండు
గడచి యాదశరథా - గారంబుచేరి
యంతఃపురంబున - కరుగుచో నచటి
యింతులెల్ల సుమంత్రు - నీక్షించి కలఁగి
" అమ్మకచెల్ల ! యీ - యన వొంటివచ్చె

అమ్మలార! వనంబు - లందు రాఘవుని
విడిచి వచ్చెనుఁగదే - వెతలఁ గౌసల్య
యడుగుచో నేమని - యనువాఁడో యితఁడు
కటకటా! కౌసల్య - గన్నదే తల్లి
యిటువంటి రాముని - నెడవాసి మీన 5750
తానుఁ బ్రాణంబులు - దాల్చిన యపుడె
యేనాట నోర్తురే - యితర భామినులు"
అనువార్త లాలించి - యారాజుఁజేరి
తనరాక రాముప - ర్తనము దెల్పుటయు
ఆదశరథుఁడు మూ - ర్ఛా యత్తుఁడైన
పైదలు లందరుఁ - బలవింపుచుండ
మిగుల కౌసల్య సు - మిత్రయుఁదాను
పొగులుచు వచ్చి య - ప్పుడు దశరథుని
యెత్తి పానుపు - మీఁద నిడి సేదదీర్చి
యత్తఱికౌసల్య దా - నడలుచుఁ బలికె. 5760
"ఏఁటికయ్య సుమంత్రు - నీక్షించియొక్క
మాటయు నుడుగవు - మదిఁ గొంక నేల?
అన్యాయ పరుఁడనే - నైతిఁ గాయనుచు
దైన్యంబుతో సిగ్గు - దాల్చినావేమొ?
వట్టివేడబముల - వగవ నేమిటికి?
యిట్టిచో వెఱచి వా - యెత్తవిదేల?
కైకయిచ్చట లేదు - గావున భయము
మీకు నేమిటికి యే - మియు ననవేల?
యీసుమంత్రునిఁ జూచి - యెచట నున్నాఁడో
నాసుతుండేల శా - నలకుఁ బ్రోలితివి?" 5770

అని తాను బుడమిపై - నడలుచుఁ బొరలఁ
గనిదంపతుల మూర్ఛ - కాంతలందరును
చూచియోర్వఁగలేక - శోకింపుచుండ
నేచాయఁ బురవీధి - నేడ్పులునిండె.
అంతటఁ దెలివొంది - యాదశరథుఁడు
కొంతయూరట దెచ్చు - కొని మంత్రిఁజూచి
చేరరమ్మని పిల్వఁ - జేతులు మొగిచి
చేరిన యతనితో - క్షితిపాలుఁ డనియె.

—: రాముని వార్తల సుమంత్రుండు దశరథునికిఁ జెప్పుట :—

"మా రామచంద్రుఁడే - మాడ్కి నున్నాఁడు ?
చేరి వసించె నే - చెట్ల క్రిందటను ? 5780
నెయ్యది యాహార ? - మెచ్చోట నిలిచె ?
నెయ్యెడఁ బవళించె - నేమేమి వలికె ?
శీతలగుణమైన - సీతయుందాను
జాతికొట్టుల పాద - రాజీవయుగము
కందిబొబ్బలువోయి - కతకత నెరియ
నెందెందు నడవుల - నిడుము లొందెదరో ?
అశ్వినేయులు మంద - రాచలాగ్రమున
శాశ్వతులై యుండు - సరణి నాసుతులు
పాదచారములు వై - భవములు మఱచి
బీదలవలెఁ గిటుల్ - బెబ్బులుల్ మెలఁగు 5790
వనులఁ గ్రుమ్మరుచున్న - వారలే వారిఁ
గని వెంటఁబోయి యా - క్రమ మెల్లఁ దెలిసి
వచ్చి కృతార్థ భా - వంబుఁ గాంచితివి

ముచ్చటయయ్యె న - మ్మువ్వురు నిన్ను
బనుపుచో నే - మేమి పలికిరి వార
లనుమన్నయవి యెల్ల - ననుము నాతోడ
విని యూరడిల్లెద - వినుపింపు మీవు
అనఘుఁడైనట్టి య - యాతి భూవరుఁడు
హితులైన యట్టి దా - హిమిత్రుల వలన
వెతఁదీరి యున్నట్టి - విధమున నేను
మానస శోకంబు - మానెద "నన్న 5800
మానవేంద్రునితో సు - మంత్రుఁ డిట్లనియె.
"అనఘాత్మ! మీసేమ - మడిగి సాష్టాంగ
మొనరించితి నటంచు - నొగిఁ బల్కుమనియె.
తనమారుగాఁగ నం - దరు తల్లులకును
వినతి చేసితినని - వినుపింపు మనియె.
జానకీజాని కౌ - సల్యతో మిమ్ము
తానుపోషింప నెం - తయుఁ దెల్పుమనియె.
అదిగాక యగ్నిహో - త్రాది కర్మములు
వదలక మిముఁ - జూచు వైఖరిభరతు
పట్టున నేవేళ - భయభక్తు లునిచి 5810
యెట్టిచో కైకకు - హితముగా మెలఁగి
సవతులపట్టునఁ - జాలప్రియంబు
దవులంగ నడచి బాం - ధవుల నేమఱక
పాలింపుమని రఘు - పతి తల్లితోడ
మేలెంచి ననుదెల్పు - మీ" యనిపల్కె.
భరతునితోడ - "మీ పనుపున నెల్ల
ధరణియుం బాలించి - తండ్రి నేమఱక

సముచితంబైన పో - షణ మాచరించి
క్రమము దప్పక యుప - ద్రవ మొందనీక 5820
కైకేయి మారుగాఁ - గౌసల్యఁజూచి
చేకూర్చి నడపి యు - చ్చికము లేకుండ
కడమ తల్లుల నట్ల - కా ధర్మమెఱిఁగి
నడపింపుమీ యని - నామాటగాఁగ
పలుకుమంచు" వచించి - పలపలకంట
వెలువడు నీటితో - వెలవెలనైన
మోముతో నవమాన - మునఁ జాలడస్సి
సామాన మేనితో - సగము మాటాడి
పలుక నేరని తొట్రు - పాటుతో చాల
కలఁగు చిత్తంబుతో - కడుఁ దలవాంచి 5830
యున్న రామునిచంద - మర్వీశతిలక !
కన్నవారలకు నే - గతినేర్పవచ్చు?
అటమున్న తమయన్న - యలమట చూచి
కటకటంబడి కన్నుఁ - గవ జేవురింప
రోమిరాకఁ దెల్పిన - యెంత లేదనుచు
సౌమిత్రి పలుకు భా - షణము లాలింపు.
"రాముఁడేమేమి నే - రంబులుచేసె!
యేమిటికింత సే - యించె మీరాజు?
కైకమాటలె వినేఁ - గాని యించుకయు
లోకాప వాదంబు - లో నెంచఁడయ్యె? 5840
కడపట దనురాజు - గాయని యెంచి
పుడమినెవ్వరు నిద్ర - పోదురునమ్మి
తానేడతండ్రి ? యిం - తట నుండినాకు

దీనబాంధవుఁడు కీ - ర్తి విభూషణుండు
కారుణ్య శరనిధి - కల్యాణగుణుఁడు
శ్రీరామచంద్రుఁడే - చెప్పెడిదేమి?
తల్లియుఁ దండ్రియు - దైవంబునాకు
నెల్లవారలు నుండి - యేమిటి కింక"
అనిలక్ష్మణుఁడు వల్క - నాసీత నన్నుఁ
గనుఁగొని జలజలఁ - గన్నీరు రాల 5850
వాడఁ బారుచుఁ దల - వాంచి యేమాట
నాడలేదయ్య ద - య్యము సోఁకినటుల
ఆరీతి వారల - యనుమతి నేను
తేరు దోలుక సారె - తిరిగి చూచుచును
వారలు ననుఁజూడ - వచ్చుచో రథము
వారువములు నాదు - వలపకురాక
తిరుగుడు పడుచుండఁ - తేరొక్కరీతి
బరపుచు గుహునితోఁ - బఱిచితి చేసి
మూనాళ్లు మఱల రా - ముఁడు నన్నుఁబిలుచు
గాని పోనీండని - కాచుకయుండి 5860
అంతటఁ జాల ని - రాశచే వెడలి
యెంతయు విన్ననై - యేవచ్చునపుడు
నింకిన యేఱులు - నిండిన చెరువు
లంకిలితో వాడి - నట్టిభూజముల
మేయని మృగములు - మెలుపులయాస
వాయు ధేనువులును - పంటలు లేని
భూములు విలపించు - పులుగులుంగలిగి
నీమహి యెల్ల న - న్నిటఁ బాడువడియె,

కమలాకరంబులఁ - గమలకల్హార
కుముద చక్రాది సం - కులత లేదయ్యె. 5870
చాంపేయ మల్లికా - చయ కుందకుసుమ
సంపద నుడివోయి - సౌరభంబెల్ల
పనస రసాల రం - భాముఖ్య తరుల
మనసైన ఫలమను - మాటలేదయ్యె.
ననుఁగాంచి గొణఁగుచు - నాలి యేడ్పులను
వనితలందరుఁ దిట్టు - వారైరి వీట
మొగముఁ జూచినమారు - మొగమిడి నన్ను
మగవా రదేమని - మాటాడరైరి
కరులు రోదనములు - గావింపఁ దొణఁగె
హరులకు ధారాళ - మయ్యెఁ గన్నీరు 5880
భూవర కౌసల్యఁ - బోలి యార్తులకుఁ
దావయ్యె నీయయో - ధ్యా పట్టణంబు.''
అని విని యేమియు - వనలేక నగల
మునిఁగి మంత్రికి రాజ - ముఖ్యుఁ డిట్లనియె.
''ఆలిమాటలువిని - యాప్తులం బిలిచి
యాలోచనముచేసి - యైన కార్యంబు
కానికార్యంబునుఁ - గనలేక యింత
దీనుఁడ నైతిని - దిక్కెవ్వరింక
అపకీర్తి నా యన్వ - యమునకుఁదెచ్చి
యుపమృత్యువునకు లో - నై పోవవలసె. 5890
రాముని చెంత చే - ర్చక యుంటివేని
యీమేనఁ బ్రాణంబు - లిక నేలయుండు?
హితమాచరించెద - వేవే వే పోయి

క్షితి తనూభవతోడ - శ్రీరాముఁడెమ్మ
నినునమ్మితిని నాదు - నేరముల్ సైఁచి
ననునెంచి ప్రాణదా - నంబుఁ గావింపు
రాముఁడు మిగుల దూ - రము వోయెనేని
తామసంబేల ? ర - థంబుపైనన్ను
నునిచి తోకొనిపోయి - యూర్మిళా రమణు
జనకజాతను రామ - చంద్రునింజూపు 5900
అటులైన బ్రదుకుదు - నని హా కుమార !
యెటు వోయితే పల్కు - వే మహీజాత !
హాలక్ష్మణా ! " యని - యార్తుఁడై చాల
జాలిఁగుందుచును కౌ - సల్యతోఁ బలికె.
"అతివ ! శోకంబను - నలఘు వేగంబు
క్షితిజఁ బాయుట పేరఁ - జెందువారంబు
ననిశంబు నాయూర్పు - లను తరంగములు
పెనుపొందు కన్నీరు - పేరియంబువులు
కరతాడములను - కడలు మీనములు
పెరుగు నియేడ్పుల - పెరియ స్రోతయును 5910
పృథుల పెన్నెరిగుంపు - పేరటినాఁచు
నదిరయ్య ! కైకేయి - యను బాడబంబు
నాఁము మందరబుద్ధు - లను నక్రకులము
నలనాఁటి వరమను - నట్టి వేలయును
రామప్రవాస దు - రంతంబు నగుచు
యేమేర కడలేని - యీదుఃఖ జలధి
యేరీతిచేఁ బాధ - నీఁదెడివాఁడ
నారాముఁడను గట్టి - నావ లేకున్న"

అని ప్రమానుఁ గన్నిడి - యవనిపైఁ ద్రెళ్ళి
పెనుమూర్ఛ పాల్పడ - పృథివీశుఁజూచి 5920
కౌసల్య చాల శో - కమున నిల్పోప
కా సుమంత్రుని తోడ - యడలుచుఁ బలికె.

—:కౌసల్య శోకింపఁగా సుమంత్రుఁ డూఱడించుట :—

"నన్ను మారాము చెం - తకుఁ గొనిపోవ
వన్న నాయాపద - కడ్డమై నీవు
అరదంబు దెప్పింపు - మటుసేయవేని
మఱలి తెల్పుము నాదు - మాట రామునకు
కాదని పల్కినం - గైకేయి కల్ల
నీదుపూనికె నేఁడు - నిక్కంబుగాఁగ
యిచ్చెదఁ బ్రాణంబు - లివె నీవుచూచి
మెచ్చుచుఁ దలఁతువా - మీఁద నేనియును" 5930
అనిపలికి సుమంత్రు - డా సాధ్విఁజూచి
వినయ పూర్వకముగా - వినుమంచుఁ బలికె.
"ఏలమ్మ! దేవి! నీ - విటునన్నుఁ బలుకఁ
బోలునే వనుల నీ - పుత్రుఁ డున్నాఁడు
జానకి లక్ష్మణుల్ - సతతంబు రాముఁ
గానలఁ గొలిచి సౌ - ఖ్యమున నున్నారు.
మునుపును తాఁ క్లేశ - ములఁ నంది నటుల
తనప్రాణనాయకు - దండ నుద్యాన
వనులలోఁ గ్రీడించు - వైఖరి భయము
తనమది లేక సం - తసమందె సీత 5940

కారడవులలోనఁ - గాపున నీవు
వారికినై యేల - వగలఁ గుందెదవు?
ప్రాణముల్ మనసు రా - మాధీన మగుట
యేణాక్షి! యాసీత - యేల చింతిల్ల?
నూరు కారడవిని - యొకరూపె కాని
వేఱుగాఁ దలఁపదు - వినుమింక నొకటి
తానదీ నదములు - దాఁటి పోవుచును
జానకి కైక ప్ర - సంగంబుగాఁగ
అనియెనంచని యేమి - యనఁ జూచినాఁడో!
తనలోనే యామాట - తలఁపక డాఁచి 5950
కౌసల్యకు హితంబు - గా కైక వినిన
నీసుపుట్టునో యని - యిపిడి యామాట
మఱపించి వేఱొక్క - మై తప్పఁ దాల్చి
నెఱమంత్రి యతఁడొక్క - నేర్పునఁ బలికె.
"జానకీ చరణలా - క్షారసం బపుడు
లేని చందమకాన - లేరెవ్వరైన
కెందామరల సేవ - గించు పాదములు
గంది నెత్తురుఁగ్రమ్మ - గమనించు నపుడు
అడుగుల ఘల్లున - నందియ లమ్రోయ
జడిసి పారెడిమృగి - శాబకంబులను 5960
వేత్వర రాముండు - వివరించి చూపు
నుర్వీతనూజకు - నూరటగాఁగ
మునివృత్తిచే ఫల - మూలముల్ గొనుచు
వనములలో పిత్రు - వాక్య పాలనము
సేయు రాఘవులకై - చింతిల్ల నేల?

మాయమ్మ! వగపేల - మానుము మదిని"
అనిన మాటలువిని - యపుడె కౌసల్య
జననాథుఁజూచి కోం - చక యిట్టులనియె.

—: రామవనవాసమును గూర్చి కౌసల్య భర్తతోఁ
జెప్పి దుఃఖించుట :—

"రవివంశమునఁ బుట్టు - రాజులయందు
నవనీశ! యసమాన - మగుకీర్తిఁగాంచి 5970
యిన్నాళ్లు వెలసితి - విపు డపకీర్తి
నెన్నిక గాంచితి - వెన లేకయుండ
నీకడుపునఁ బుట్టి - నిఖిలభోగములు
గైకొన్నియట్టి రా - ఘవులకు నిట్టి
పాటువచ్చిన నౌర్వఁ - బడుగాక సీత
పాటు నావీనులఁ - బడియెట్టు లోర్తు
తలగడలనుఁజేరు - తన పట్టిచేయి
తలగడగా నుంచి - ధరఁ బవ్వళించి
యున్నట్టి చందమో - యర్వీశ! నాదు
కన్నులం గట్టిన - గతి నున్నదిపుడు 5980
యినుమొ పాషాణ - మొ హృదయంబు నాకు
తునిసి ప్రియ్యలుగాదు - తో[illegible]నె యిపుడు
అకలంక చంద్రబిం - బానను రాము
నకట! కానల కెట్టు - లంపితి వయ్యొ!
భరతుండు దొరయైన - పదునాలుగేండ్ల
తరవాతఁ జేరుసీ - తానాయకునకుఁ
దానేల సొమ్మతో - ధరణి యీ నేర్చు

కానిండు పితృకర్మ - కర్త లౌవారు
నియమించు శిష్టుల - నిల్పి బంధులకు
ప్రియముతో భుజియింపఁ - బెట్టిన వెనక 5990
వత్తురే మిగిలిన - వంటకంబులకు
నుత్తములగు వార - లుపవాస ముండి
కొమ్మలు పడవేసి - కోసె దుమనిన
సమ్మతించునటె వృ - షభము లెచ్చోట
రాముఁడు భరతుచే - రాజ్యంబు మరల
కామించునే యెఱిఁ - గఁగ లేవుగాక
నక్కలు దిన్నట్టి - నంజుఁడు గొంత
చిక్కిన మేయునే - సింగంపుఁ గొదమ ?
యోగ క్షేమములైన - యా సాధనములు
యాగార్హ మనియన్యుఁ - డాసించునేల 6000
మనుజేశ ! నష్టహో - మంబైన మఘము
మునుపటి సారమ - మ్ముదుపోవు మధువు
ఏమిటికినిఁ గొఱ - యే ? రాముఁ డెట్లు
గావింప నేర్చునో - కృనిచేతి ధరణి
వారులధర్మము సేయ - నోర్వని యతఁడు
మఱిపితప్పిన నధ - ర్మము సేయగలఁడె ?
యెంత లేదని యున్న - నెఱుఁగము గాక
పంతంబు పూనితె - ప్ప గదల్చి నంత
పదునాల్గు లోకముల్ - బాణాగ్ని చేత
సదమదంబులుగ భ - స్మము సేయఁ గలఁడు 6010
విల్లెక్కు వెట్టిన - విలయంబు సేయు
నెల్ల భూతములకు - నేక కాలమున

శర వహ్నిశిఖలకు - శరనిధు లెపుడు
పొరలింపఁ జాలునా - పోశనంబుగను
అట్టి మా రాఘవుఁ - డక్కట! వెట్టి
పట్టియీ కైకచే - బాము లందగిలె
గొప్ప చేపకుఁజిక్కు - కొండుక మీను
చొప్పునం జిక్కెని - చ్చోపేసికు నతఁడు
వనితలకును గతి - వల్లభుఁ డందు
వెనక పుత్రులు గతి - వివరించి చూడ 6020
నన్నునీవును నాదు - నందనుం డిపుడు
మిన్న కవిడిచి యే - మేలు గాంచితిరి ?
నీవు నన్నును నిన్ను - నీవారి రాము
గావక చెరిచితి - కైకేయి కొఱకు
భరతుఁడు నీయాలు - బ్రతికినఁ జాలు
కర మెచ్చి యెవ్వ - రెక్కడఁ బోయి రేమి"

— దశరథుఁడు మూర్ఛపోవుట —

అనునంత దుఃఖతుం - డై రాజు చాల
మనములో నార్తి ము - మ్మడిగాఁగ వగచి
యిన్నియాపద లొంద - నేమి పాపములు
మున్ను చేసితినో రా - మునివంటి కొడుకు 6030
విడిచి పోయెనటంచు - వెడవెడ మూర్ఛ
లడరంగ మునిశాప - మనుభవ్య మనుచు
చింతఁ గౌసల్యకుఁ - జేదోయి మొగిచి
యంతయుఁ దనమది - కపుడు దోఁచుటయు
గాకుస్థకుల మౌళి - కౌసల్యతోడ

నాకథా వృత్తాంత మ - ప్పుడిట్లనియె.
"రమణి! నీవు ప్రసన్ను - రాలవు గమ్మ
శమియింపు నాతప్పు - సయిరించి మదిని
నెల్లరకును జాల - హితముగా మెలఁగు
చల్లని మాటల - సాధ్వివి నీవు 6040
నాకు నప్రియముగా - నడతువే యెల్ల
లోకంబులందుల - లోలనేత్రులకు
వల్లభుం డెటువంటి - వాఁడైన నతఁడె
తల్లియుఁ దండ్రియు - దైవంబు సుమ్ము
యేనన నేల ? నీవె - యుఁగవే సతుల
కైన శాస్త్రార్థంబు - లఖిల ధర్మములు
కడలేని శోకసా - గరములో మునిఁగి
యడలెదు నాతోడ - నప్రియంబులుగ
యేమైన ననరాకు - మిఁక మీఁద నన్ను
నేమి సాధించెద - వీవని పలుక" 6050
విభుని దైన్యోక్తులు - విని మేనువణఁక
సభయమ్మై చేరికా - సల్య నాయకుని
కేలుఁదమ్ములు రెండు - కెంగేలనెత్తి
చాల శోకమున మ - స్తకముపై నునిచి
కనుఁదమ్ములఁ జేర్చి - గండ పాళికల
నునిచి పేరెదనంట - నొత్తి యిట్లనియె॥

—: కౌసల్యాభర్త నూరడించి మన్నింపుమని వేడుకొనుట :—

"ఓదేవ! మ్రొక్కెద - నోర్చి కొమ్మిటుల
నీదు చిత్తంబున - నిలుపుదురయ్య

పతివేఁడు కొనఁగనె - పంబైన నడక
యతివకు నిహపర - హాని గావించు 6060
దాసికి నిల్లాలి - తనమేల కల్గు?
నైననే నాపన్న - నైత్రోయ రాని
పుత్రశోకమ్మునఁ - బొగులుచు రాజ
మాత్రుఁగా నెంచి యీ - మాట లాడితిని
అత్యంత సకల ధ - ర్మాచారనిధివి
సత్య సంధుఁడవు రా - జర్షివర్యుఁడవు
ఆడరానివి మిమ్మ్మ - ననిన నేరంబు
చూడక ననుదయఁ - జూచి రక్షింపు
పగవారిచే బాధఁ - బడవచ్చుఁ గాక
జగతీశ! శోకంబు - సహియింప రాదు 6070
రాముఁడు ననుఁబాసి - రాత్రులైదయ్యె
భూమీశ! ఐదేండ్లు - పోలి వేగితిని
తెలియదే మీకు న - దీ వేగమునను
జలధిపొంగిన లీల - జానకీ విభుని
యెడవాయుటనుఁ జేసి - యేవేళ మదిని
విడువని దుఃఖంబు - వేరులు వారి"
అని కొంతయూరట - యైన కౌసల్య
వినయ భాషణములు - వినుచుండునంత
సాయంసయమయ్యె - జనపతి నిదుర
వోయెనప్పుడు మనం - బున తాల్మిపొంది 6080
నిదుర కంటికివచ్చు - నే యట్టివాని
కదియు నాసన్న మూ - ర్ఛాంతరంబయ్యె
నోడన తెలివిడి - తోకనువిచ్చి

వ్రీడావతీమణి - వెలఁది కౌసల్య
అడుగు లొత్తుచునుండె - నమ్మూర్ధమోము
కడకంటఁజూచి చెం - గటఁ జేరఁబిలిచి
"ముదిత! నీతో నాదు - మొదటికార్యంబు
విదితంబు సేయుదు" - వినుమంచుఁ బలికె.

— రాజు కౌసల్యతో దానుమున్ను మునికుమారునిం
బ్రమాదంబునఁ జంపినవార్త చెప్పుట :—

"ఎల జవ్వనంబున - యిగురాకుఁబోణి!
యిలనాలు చెఱఁగులు - నేలుచునుండి 6090
యువరాజనై యజుఁ - డున్నకాలమున
నవనీతి నినుఁబెండ్లి - యాడకమున్ను
నసమాన దివ్యాశ - స్త్రాస్త్ర వర్గమున
నెసఁగుచు విధిచైద - మిటులున్న కతన
ప్రాప్తమైనట్టి మ - హా శాపమొకటి
గుప్తంబుచేసి వా - కొన నైతిమున్ను
ననుభవింపఁగ దరి - యయ్యె నేడాను
దినము లామెను కళల్ - దేరుచునున్న
చంద్రుఁ బోలిన రామ - చంద్రుని మొగము
చంద్రశీతలగంధి - చక్కఁగాచూచి 6100
వోర్వలే నీకనని" - యున్నట్టి తెఱఁగు
సర్వంబురాజు కౌ - సల్యతోఁ బలికె.
"రవిమండలము సహ - స్రకరాళిచేత
నవనిపైఁ గలనీర - మంతయుఁగ్రోలి
వేసవిఁగనుపించి - విశ్వమంతయును

గాసిల్ల తపియింపఁ - గాఁజేసెనంత.
దక్షిణాయనముగా - ధర తాపశాంతి
దీక్షగైకొని నట్ల - దిందు పడంగ
వానకాలమువచ్చె - వసుమతికెల్ల
నానంద కరమయ్యె - నంబుదాగమము 6110
ప్రావృషేణ్యాంబుద - పటలంబునిండి
యావేళ దట్టమై - యల్లె నెల్లెడల
నుప్పొంగి భేకము - యూర చాతకము
లప్పుడు చెలరేఁగి - యానందమొందె.
కాలువలేఱు వే - కముగాఁగ పాము
ప్రేలగట్టినరీతి - విలసిల్లెజల్లు
మొఱకులు దడిసి య - ట్టిట్టు వోవలేకఁ
జొరఁ బారె జడిసి ప - క్షులు కులాయముల
సెలయేఱులను మీఁగు - శిఖరులరీతి
బొలిచె గజంబు లం - బు ప్రవాహముల 6120
వామలూరుల వచ్చు - వ్యాళంబు లనఁగ
భూమీధ్ర గుహల నం - బు ఝరంబు లుబ్బె
అట్టిచో నెవ్వరి కై - ననుం జేసి
నట్టికర్మము లెందు - నను భావ్యమగుట
గొప్పలై కెంజాయ - గుదులైన పువ్వు
లొప్ప మోదుగుఁ జెట్టు - లున్నతిఁ బెనిచి
నిగనిగమను నెత్తు - నిమహోఫలముల
దగునట్టి ముశిని నెం - తయుఁ బ్రోచేసి
సన్నఁ బువ్వులును ప - చ్చనికాయ లమరు
గున్నమామిడి బడఁ - గొట్టిన రీతి 6130

దుర్జాతి కైకేయి - తోఁ జెల్మిచేసి
వర్జించి నినువంటి - వరపుణ్య సతుల
కన్నుగానక యున్న - కల్మషరాసు
లన్నియు నీవేళ - ననుభవింపంగ
కారణంబగుట న - క్కాలంబు నందు
జోరున వానవం - చుక కురియంగ
నొకనాడు చీకటి - నొంటి వేఁటాడ
నకలంకగతివిల్లు - నమ్ములుఁ దాల్చి
సరయూ తటంబున - జలములు గ్రోలు
కరటిభల్ల వరాహ - కాసారవళుల 6140
వేఁటలాడఁగ చెంత - వెదురు గుంపులను
వాఁటంబుగాఁ బొంచి - వన మృగశ్రేణి
వచ్చుతేవునఁ గాచి - వాఁడియమ్మొకటి
యెచ్చరికను బట్టి - యేనుండు నంత.
పువ్వుఁ బోఁడి! యపూర్వ - బుడబుడధ్వనుల
దవ్వుల నొక్కనా - దము చెవిసోఁక
ఆశబ్దమేనుగ - డని నిశ్శబ్దమున
వేశల మతిశబ్ద - భేది సాయకము
సంధించి వేసినఁ - చనుమరనాటు
సింధురం బనియుంటిఁ - జెప్పెడిదేమి 6150
ఆచాయహోతాత - హోమాతయేల
నాచను మఱువచ్చి - నాఁటె నీయమ్ము
యీచతుర్థ నిశియందునే - నిల్లు గొనుచు
బోయెదుచో యతి - పుత్రునిమీఁద
అకట తపస్వివిం - డనక యిటేయ

నొకరికిఁ జేయనే - నొకనాఁడు కీడు
కనికని వాఙ్మనః - కాయ కర్మముల
జనుల కెవ్వరికి నే - చ్చటనెగ్గుదలప
అటువంటి వానికీ - యాయుధ మరణ
మెటుల వ్రాసితి విధి - యీతలయందు ! 6160
"మునిచర్య వానిన - మ్మునఁ బడవైచి
కనిలేని వాఁడేమి - గట్టుకోఁ గలఁడో ?
గురుతల్ప గమనుఁడౌ - ఘోర పాతకుని
కరణి వీఁడునుఁ గూలు - కల్మషంబులను
కడచేరి వృద్ధులై - కాల్మోచి పుడమి
నడుగిడ నోపక - యంధులునైన
తల్లిదండ్రులకు నై - తనమదిలోన
బల్లటిల్లెదఁ గాని - ప్రాణాశగాదు
పూని యే నిన్నాళ్లు - బోషింతువారి
దీనులై రిఁక నేది - దిక్కు వారలకు ! 6170
యీయమ్ము ముగురికి - హేతువైనాటె
నాయమ్ము నేమని - యనఁ గలవాఁడ"
అనుచు మానిసిమాట - లాచాయఁ బొడము
వినిగుండె భగ్గని - విల్లు నమ్ములును
నవనిపైఁ బడవైచి - యంగంబు చాల
వివశత్వమున మిన్ను - విఱిగిపైఁ బడిన
బాగున మిగులనా - పద నొంది యేను
వేగంబె యటవోయి - వీక్షించు నపుడు
వీడెడి జడలతో - వెలవెలనైన
వాడిన మొగముతో - వరదలై తొఁరుగు 6180

రొమ్ముగాయము నెత్తు - రుల తోడఁ దనమొ
గమ్మునఁజేర్చిన జల - కలశంబుతోడ
ధూళి బ్రుంగిన మేని - తోడనుండుచును
కాలునుఁగేలును - గదలింపలేక
యున్నట్టి మునిచెంత - నొయ్యనచేర
గన్నులాతఁడు విచ్చి - కాకుత్స్థ కులముఁ
జెఱుపఁజూచిన యట్లు - చెంతనున్నట్టి
పరమ పాతకుఁ దన్ను - భావించి చూచి
నా పేరు నారాక - నడిచిన తెఱఁగు
నాపుణ్యనిధి విని య - డలుచుఁ బలికె. 6190
"కలుషాత్మ! నీటికి - గావచ్చునన్ను
నలుగునఁబడ వేయు - నందు నీకేమి
చేకూడె నేనీకుఁ - జేసిన దేమి?
యేకతనం ద్రెళ్ల - నేసితి రాత్రి
తనపాటుచేఁ దన - తల్లిదండ్రులకు
ననరాని యాపద - లన్నియుఁజెందె
దప్పిచే నుదకంబు తా - దెత్తుననుచు
యిప్పుడు నారాక - కెదురులుచూచి
యేమని యెంతురో? - యెట్లున్నవారో?
యేమయిపోదురో! - యేమిసేయుదును? 6200
ఈ పాటు నీచేత - నేబడుటయ్యె
నేపాటు బడుదురో - నిటమీద వారు!
తపములు నెఱుక శా - స్త్రంబులు నేమి
యుపకారమున కయ్యె - నొక్కని చేతి
వ్రేటుచే నన్నియు - వీటిడిఁ బోయె

నేటి ధర్మము మోచు - నేధాత్రి నిన్ను
దురితాత్మ! వృద్ధుఁ డం - ధుఁడు నాదుజనకుఁ
డెటుఁగ నేనియు నిన్ను - నేమన నోపు?
అనవలసినమాట - యంటిఁ గాకతఁడు
తనయోగ దృష్టినిం - తయుఁ జూచెనేని 6210
యినవంశమంతయు - నిపుడె కోపాగ్ని
కనఘ తేజమునఁ బూ - ర్ణాహుతిసేయు
తబ్బిబ్బు రాకుండ - దశరథ! నీవు
గొబ్బున నమ్మౌని - కుంజరుతోడ
యీకాలిత్రోవనే - యోఁగి యమ్మునికి
వాకొమ్ము నాదుర - వస్థయింతయును
ఆమీఁద నెట్లైన - నయ్యెడుఁగాక
యామునీంద్రుని శాప - మందకు మిపుడు
జలవేగమున దరుల్ - సమసినరీతిఁ
గలఁగెదు నీయమ్ము - గాఁడి ప్రాణములు 6220
తాళనే నస్త్రవే - దనకు నీచేత
వేళంబె యీతూపు - వెడలింపు మని”న
విని నే ను బాణంబు - వెలిపుచ్చి నపుడె
చనుప్రాణములుముని - శ్వరునకు నిపుడ
యేమిసేయుదునని - హెచ్చు జింతించు
నామోము చూచి దీ - నత మాని వలికె,
“ నెమ్మదిలోఁ గొంకు - నీకేల నాటు
నమ్మదియ్యక బ్రహ్మ - హత్యకు వెఱచి
యేను విప్రుఁడనని - యెంచకు శూద్రి
మానవేశ్వర నాదు - మాత వైశ్యుండు 6230

తనతండ్రి యటుగానఁ - దగదీ విచార
మనుమానములు - మాని యలుగు వారింపు''
అనియుర్విపై బడి - యడలుచోఁ జేరి
తనయమ్ము దీసిన - దాని వెంబడినె
అతఁడసువులఁ బాసి - నంత నాయార్త్రి
యతివ ! యే మనువాఁడ - నట్లు శోకించి
వారికీ తెఱఁగు స - ర్వముఁ దెల్పకున్న
తీరని పనియని ధృ - తిపూని యేను
మునికొమారుఁడు దెచ్చు - మొదలింటి కలశ
మున సరయూజలం - బుల నిండనించి 6240
కొనిపోయి చూచుచో - కుంభినిమీఁద
యనదలై యేనేమి - యనువాఁడ నబల !
తెక్కలు విరిగి ధ - రిత్రిపై బులుఁగు
లొక్కటఁ బడియున్న - యూహఁ గన్పట్ట
తనరాక వారలు - తనయుని రాక
యనితలంపుచు నుండ - నణఁకువఁ జేరి
నిలిచిన యంత మా - నివరేణ్యుఁ డాత్మ
గలఁగుచుఁ దనయుండె - కానిట్టులనియె. 6250
" ఓయజ్ఞదత్త ! యి - ట్లుందురే నీవు
వోయి యిప్పటికింత - ప్రొద్దుగావచ్చె
దప్పిచే నలసి నీ - తల్లియుండంగ
నిప్పుడు తామసం - బేల చేసితివి ?
యెగ్గుచేసితినొ నీ - కీసరయువున
నగ్గలికను క్రీడ - లాడుచుండితివొ
మఱచితివో నీవు - మమ్ముఁ బ్రోచుటకు

నరుచిచే వేసట - యయ్యానోనీకు
పదములుఁ గన్నులు - ప్రాణముల్ నీవె
యిదిగాక మాకు ది - క్కెవ్వ రున్నారు ?
మాఱుమాటాడవు - మాతోడ నంధ
కారంబులోఁ బంపఁ - గాదు నిన్నని యె 6260
జలములు దెచ్చితే - చయ్యన" ననుచు
పలుమారు విలపించి - పలుక నమ్మాని
మాటలు వినినాడు - మదిలోన భీతి
వాటిల్ల నేమియుఁ - బలుకంగ నోడి
పలుకక తీరని - పనిగాన దంప
తులతోడ నేనార్తి - తోనిట్టు లంటి.
"తాపసోత్తమ! నీదు - తనయునిఁ జంపు
పాపవర్తనుఁడ మీ - పట్టి నేఁగాను
విశదంబుగా నన్ను - విను మినకులుఁడ
దశరథుండన నయో - ధ్యా పట్టణంబు 6270
పాలించువాఁడ ని - ప్పటినర్ధ రాత్రి
వేళ నీనదిపొంత - వేఁటాడ వచ్చి
వాకసద్దువిని గజం - బోయని వింట
వాకతూపు తొడిగి యే - యుటయు నచ్చోట
"హాతాత" "హామాత" - యను మానవోక్తి
వీతేర గుండియ - వ్రీలిపడంగ
నదరుచు నేఁ బోయి - యాత్రవేటు వలన
మెదడు నెత్తుటఁ దోఁగి - మేదినిఁ ద్రెళ్ళి
కడునార్తితో జల - కలశంబు మీఁద
బడియున్న యమ్మునిఁ - బాలకుఁ గాంచి 6280

ఆయన యనుమతి - నాయమ్ము దివియఁ
బోయె వెంటనె ప్రాణ - ములు నిమేషమున.
ఈమాట మీతోడ - నెఱిఁగింప వలసి
యోమహానివర ! వచ్చి - యున్నాఁ డనిచట
తగునాజ్ఞ సేయుఁడు - దండనీయుఁడను
తెగరాని పనిగాదు - తెలుపుండు తెఱఁగు"
అనిన వారలు కులి - శాహతులైన
యనువున మూర్ఛిల్లి - యంతన తెలిసి
చేతులు మొగిడించి - చెంగట నున్న
నాతోడ నమ్మౌని - నాయకుం డనియె. 6290
"నరనాథ ! యెందువా - నప్రస్థులైన
పరమ సంయముల కా - పదలు చేసినను
చెడు నింద్రుఁడైన నీ - చేసిన పనికి
చెడిపోవు టెంతయీా - క్షితియేలు వాఁడు
తననేర మెఱుఁగుట - ధర్మంబు మంచి
పనిచేసితివి నాదు - పజ్జకు వచ్చి
చేసిన దోషంబు - చెప్పక నీవు
మూసియుంచిన క్షణం - బున నీశిరంబు
పదియారు వ్రయ్యలై - పడు నిలమీఁద
నదిదప్పె నింకనెటు - లైన నీకేమి 6300
యిది జ్ఞానకృతమైన - యిక్ష్వాకు కులము
తుదిముట్టి యింతక - త్రుంగు నంతయును
యింతచేసిన వాఁ - డ విప్పుడ యతని
చెంతనిల్వుము మాకు - జీవంబు లతఁడ"
అని నన్నుఁ బల్కిన - యట్లనే వారి

దనమూపు పైనుంచి - తనయుని చెంత
నునిచిన యంతన - య్యుగళంబు శోక
వనరాశి మునుఁగుచు - వా తెఱ లెండ
వేఁడి మాతనయుండు ? - వేఁడి ధార్మికుఁడు ?
వేఁడి తపోనిధి ? - వేఁడి యుత్తముఁడు ? 6310
వీఁడా మహాత్ముండు - వీఁడా సుతుండు
వీఁడా కృతార్థుండు - వీఁడా ఘనుండు"
అనిచేరి తమ చేతు - లతనిపై నైచి
కన నోర్వరానిశో - కంబుల మునిఁగి
పావనాత్ములు చాలఁ - బలవించి మౌని
యే వినుచుండంగ - నిట్లని పల్కె.
" అదియేఁటి కన్నమ - హాత్మ ! మాతోడ
మదినల్గితివో యొక్క - మాటాడ వేల?
యీ నేలఁ బడియుండ - నేఁటికి నీకు
మానుషం బెల్ల దే - మాయార్తి నీకు 6320
యిదెనేడు నీజన - యిత్రి శోకింప
మదిఁ గనికరముంచి - మానుప వేల?
శ్రవణ హితంబుగా - శాస్త్ర పురాణ
నివహ మెవ్వరి చేత - నే విందునింక
సమయోచిత క్రియల్ - జపములు దీర్చి
తమకు నెవ్వాఁడు వం - దన మాచరించు
అలసి యాఁకొన్న వా - రని కందమూల
ఫలములెవ్వఁడు మాకు - భక్తితో నొసఁగు
కన్నుల నిరువురఁ - గానమీ మమ్ము
నన్న ! రక్షింప - సమర్థుఁ డెవ్వాఁడు 6330

మముడించి పోవ ధ - ర్మముగాదు నీకు
తమకడ కేతెమ్ము - తనయ ! యీ ప్రొద్దు
తేపు మువ్వురముఁ గో - రిన యట్టియెడకు
వేపోద మొంటిగా - విడిచి పోఁజనదు
వినవేని యిప్పుడే - వెంబడి వచ్చి
యినతనూజుని వేఁడి - నేనిన్నుఁ దెత్తు
అనిశంబ దీర్ఘాయు - వనుచు దీవించి
నినునొక్క వేఁటకా - నికిఁ గోలుపోతి
నెక్కడ దశరథుఁ ? - డెచటి యయోధ్య ?
యెక్కడి మునమునీ? - వెక్కడి రాత్రి? 6340
గురియైతి నీయంప - కోల పెట్టునకు
సరసిజగర్భుఁ డి - చ్చట నెన్నియిట్లు
హరిహయు వీట తే - త్రాచార ధర్మ :
నిరతుల సౌఖ్యంబు - నినుఁ జెందుగాక !
జనమేజయు యయాతి - సగర దిలీప
జనకాది లోక వా - సము గాంతుగాక !
నిజతప స్స్వాధ్యాయ - నిధులైన వారు
యజన పరాయణు - లైనట్టివారు 6350
భూదాన గోదాన - ములనుంచువారు
పేదల కష్టముల్ - పెట్టన వారు
యేక పత్నివ్రత - హితులైన వారు
వాక్యోన్న సత్యంబు - వదలని వారు
గంగలో మేనులు - గడతేర్చు వారు
సంగతి గురుపూజ - సల్పిన వారు
యే లోకములు గాంతు - రిచ్చలు మెచ్చ

నాలోక సౌఖ్యంబు - లందుము నీవు
తలఁపనేరక నన్నుఁ - దమి వధియించు
కలుషమానసుఁడు దు - ర్గతి నేఁగుఁగాన"
అని యుదకక్రియ - లాచరించుటయు
ముని కుమారుఁడు స్వర్గ - మున కేఁగునపుడు 6360
వరవిమానంబుతో - వాసవుతోడ
ధరణిపై శోకించు - తల్లితండ్రులను
గనుఁగొని గగనమా - ర్గంబున నుండి
వినయంబుతో వారు - వినఁగ నిట్లనియె.
"అనఘాత్ములార! మీ - యంఘ్రి పద్మములు
కనిగొల్చి యుత్తమ - గతులు గాంచితిని
మీర లింకేల యి - మ్మేదిని నుండ
రారండు వేగ స్వ - ర్గంబు చేరుదము
యెఱుఁగక వధియించె - నీ రాజు తన్ను
కరుణించి కావుఁడ - కల్మషుఁ డతఁడు 6370
పోయెడ" నని ముని - పుత్రుండు పోవ
కాయముల్ పుత్రశో - కమున వ్రేఁగైన
నామునిశోకార్తుఁడై - తాల్మిలేక
నేమున వచ్చున - న్నీక్షించి పలికె.
"ఇనవంశ! విను జీవి - తేచ్ఛ నేనొల్ల
తనకుమారుని మున్ను - ధరణిపైఁ గూల
నేయమ్ము చే నేసి - తే యమ్ము నన్ను
నాయమ్ము సంధించి - నాయమ్ము నాట
యెఱుఁగమిచే నీకు నీ - బ్రహ్మహత్య
పరిహృతంబయ్యెనీ - భాగ్యంబు కతన 6380

ఐననేమాయె మా - యట్లనె నీవు
సూనులంగని పుత్ర - శోకంబుచేత
మృతినొందుమని ''శపి - యించి తానంత
మృతుఁడయ్యె జాయాస - మేతంబుగాఁగ.
దానఫలంబు దా - తనుఁబొందినట్ల
యానాఁటి మునిశాప - మాసన్నమయ్యె.
చిన్ననాఁడేనుచే - సినకర్మఫలము
వెన్నాడిమేనఁబ్ర - వేశించె నిపుడు
చాన యపథ్యభో - జనమున మేన
మానకవ్యాధి ము - మ్మరమైన యట్లు 6390
మునికుమారచ్ఛేద - మున నైనపాప
మనుభవింపఁగఁ గైక - యనుకూలయయ్యె.

—: దశరథుఁడు రామునిఁ దలఁచుకొనుచు మృతినొందుట :—

వినరాదు నీమాట - వీనులనిపుడు
కనరాదు నీశుభా - కారంబు నాకు
యిపుడెవ్వోయెడఁబ్రాణ - మిఁకనైన రాముఁ
డుపకారియై వచ్చి - యుండినంజాలు
బ్రదుకుదు నటులైన - పంకజనయన!
యిది పురాకృతకర్మ - మేఁటికి దప్పు
నాయెడభయభక్తి - నడుచు రామునకు
నీయెడనపకార - మేమిచేసితిని? 6400
తనయుఁలు తనకేమి - తప్పుచేసినను
జనకుఁడు త్తముఁడైన - పడలిపోలేఁడు

యేకొమారుఁడు తండ్రి - కెదిరి యేమియును
వాకొనయూరకె - వనముల కేఁగు ?
చలియించె బుద్ధియు - శమనకింకరులు
బలిమి నీడ్చుకపోవఁ - బదరుచున్నారు
యీవేళ రాఘవు - నెడబాసి యేల
జీవనం బిక మృతిఁ - జెందు టేమేలు ?
ఎండకొంచెపు నీటి - నింకించినట్ల
నిండుతాపమున మే - నికి హానియయ్యె 6410
చంద్రాస్య ! వికసిత - జలజాతపూర్ణ
సాంద్రతగల రామ - చంద్రు మొగమ్ము
చేరి యేపుణ్యులీ - క్షింతురో యింక
వారివె స్వర్గాప - వర్గసౌఖ్యములు
పంచేంద్రియమ్ముల - పాటవంబెల్ల
నించుకయును లేక - యెనసిభూతముల
నలివేణి ! తైలహా - న్యతనారు దీప
కళిక యోయన జ్ఞాన - కళ తెల్విమాసె
అని యింత పతిహంత - వని నీమనంబు
కననేరనైతిఁ గై - కా ! యంచు ఎగచి 6420
హాలక్ష్మణా ! సుమి - త్రా ! కోసలేంద్ర
బాలికా ! యనుచుఁ బా - పంబుచేఁబొరలి
హాజనకాత్మజా ! - యనిపిలాపించి
హాజలజేక్షణ ! - హారామ ! రామ !"
అనిప్రాణములఁ బాసి - యాదశరథుఁడు
చనిమె నంతట నిశా - సమయంబునయ్యె.

—: రాజపత్నులు దశరథుమృతికై విలపించుట :—

నిదురవోయెనటంచు - నెలంతలందరును
నిదురించి రందంద - నెగులురెట్టింప
నాయెడ నరుణోద - యంబైన నగర
గాయనమంగళ - గానరావంబు 6430
కలకలాయితశారి - కా కీరరవము
చెలరేఁగు బ్రాహ్మణా - శీర్వాదములును
నిండిన నగరిలో - నిద్దురల్ దెలిసి
యుండనుండిన వివి - చారుజలోచనలు
పరిచారకులుమద - ర్పణములుదాల్చి
గురుతరసౌవర్ణ - కుంభంబులందు
నొకట సుగంధహి - తోష్ణోదకములు
చకచకలీను ని - చ్చలపుచల్వలును
విరిపొట్నముల్బహు - విధములైనట్టి
పరిమళద్రవ్యముల్ - భద్రాసనంబు 6440
నవరత్నమయభూ - షణంబులుఁ దిలలు
ప్రవిమలాజ్యంబు సం - పంగి నూనెయును
నారికేళములు తి - న్నని ఖాదిరంబు
జీరకంబు నమర్చి - చెలు లామతింప
యినుఁడుదయించియు - నేలకో నేఁడు
జనపతి నిద్దుర - చాలింపఁడయ్యె ?"
అనిపల్కియుడిగెంపు - టతివలు హస్త
వనరుహాంబుల మహీ - వల్లభుఁజేరి
యాతనిపాదంబు లొ - య్యన మెచ్చరింప
నతిశయదీర్ఘని - ద్రాతురుండగుచు 6450

లేవకూరకయున్న - లేమలు వెఱచి
భూవల్లభుఁడు మృతిఁ - బొందెనే కాక
యింతులందరును కూ - యిడఁగ నాచెంత
యింతనంతట నున్న - యిగురాకుబోండ్లు
యేటివెల్లువఁ దృణ - బృందమోయనఁగ
గాటంపుభీతితో - గజగజవణఁకి
పుడమిపైనుత్పాత - ములఁబొగల్ గప్పి
కడుమాయునక్షత్ర - గణము కోయనఁగ
తేజముల్ దరగి ని - ద్రింపుచున్నట్టి
రాజీవనేత్రల - రామునితల్లి 6460
యాసుమిత్రనుఁజేరి - యద్దరిపాటు
దోసపుమాట రం - తుగ లేపివలుక
దిగ్గనలేచి యా - తెఱవలిద్దఱును
బెగ్గడిల్లుచుఁబ్రలా - పింపుచుఁజేరి
చుక్కలుఁదెగిపడ్డ - సొబగునవారు
నక్కైకయును ధాత్రి - నడలుచుంబొరల
యితరకులాంగన - లెల్లశోకింప
క్షితిపాలునగర మిం - చెను రోదనములు
హితులు రాజులుఁబురో - హితులు మంత్రులును
క్షితిజనంబునుఁగూడి - చింతించునపుడు 6470
రాజభామినులు మ - రందముల్ గురిసె
రాజీవములనంగ - రాలుఁగన్నీట
రోదనంబులుబెట్టు - రోదసేయ దీప్తి
నాదిత్యుఁడుదోలంగి - నట్టిచందమున
చల్లఁగానారు వై - శ్వానరులీల

వల్లభుఁడుండు భా - వంబు నీక్షించి
దశరథుశిర మంక - తలమున నునిచి

—: కౌసల్యవిలాపము :—

శశిముఖ కౌసల్య - చాలశోకమున
కైకేయి మోముచ - క్కఁగఁజూచి యొరులు
వాకొనగారాని - వచనముల్ వలికె. 6480
"ప్రతినచేసుక యోసి - పాపాత్మురాల!
పతినందరునుఁజూడఁ - బదరి మ్రింగితివి
కడతేరెఁగోర్కె యు - కంటకంబైన
పుడమియేలుము రాముఁ - బొమ్మనఁదగునె?
అక్కటా! యేను కా - రడవిలో నొంటి
జిక్కిన గతి నీదు - చేతఁజిక్కితిని
పతిని మున్నిచ్చితి - ప్రాణేశుప్రాణ
తతియు నీకిప్పుడు - దారవోసితిని
మగనిఁజంపినయట్టి - మగువయెందైన
జగతిపైఁగలదె? యి - చ్చటనీవె కాక 6490
దీనకంబున విష - దిగ్ధాశనంబు
పోనీక భుజియించి - పొలిసిన యట్లు
మందరబుద్ధిచే - మనవంశ మెల్ల
మ్రందఁజేసితి మాట - మాత్రలో నీవు
వనముపేరిట రాము - వనులకుఁబంప
దురపిల్లుఁదనుఁబోలి - దుహితృమోహమున
జనకుఁడింతక మేను - సగముగాఁగరఁగు
పెనిమిటియునుఁబోయి - బిడ్డలవిడిచి

తానున్న చందంబు – తనకుమారకుఁడు
వీనులసెవ్వాఁడు – వినఁగలఁడో కొ౼! 6500
యెన్నడు నొకచింత – యెఱుఁగని సీత
విన్నని తెఱఁగెల్ల – విలపించునొకొ౼!
వనములలో సీత – వసియించుమాట
తనయహీనుఁడుగాన – తండ్రియెట్లోర్చు ?
యేఁబతివ్రతనౌట – నీరాజువెంట
పోఁబోలు శిఖిముఖ – మున నిల్వఁదగదు ”
అనియేడ్చుఁగౌసల్య – సతివలందరును
బెనఁగొని శోకింపఁ – బృథివీతలేశు
మంత్రులందరునొక – మాటగాఁగాల
మంత్రకోవిదులౌట – మానవేంద్రునకు 6510
గన్నట్టికొడుకు సం – స్కారంబుసేయ
నన్నలువుర నొకఁ – డైన నప్పటికి
వేళకు లేకున్న – వెడద కొప్పెరను
తైలపక్వముచేసి – ధరణీశు మేను
బుద్ధిమంతులుగానఁ – బోలినజాడ
సిద్ధార్థముఖమంత్రి – శేఖరుల్ గూడి

—: రాజపత్నులవిలాసము :—

అధిపుఁడైలద్రోణి – యందు నిల్పుటయు
నధికశోకమునఁ గు – లాంగనామణులు
నరనాథ! తమ్ము న – నాథలం జేసి
విరతిచే నీవెట్లు – విడిచిపోయితివి ? 6520

యెంతటికి నిమూల - మాకైక యూపె
పొంత నే క్రియప్రాణ - *ముల్ నిల్పఁగలము ?
నీతనయులకును - నీకును మాకు
నీతకుఁగానట్టి - చెడుబుద్ధికైక
ఎవ్వారికిని మంచి - చేయనువార
మెవ్విధమో యని - యిలప్రాలి వెడల
కలిమిచుక్కలులేని - గగనంబురీతి
చెలువుండు లేనట్టి - చెలువచందమున
ఆ యయోధ్యాపురం - బటుపాడు దేరె
నాయినమండలం - బస్త్రాద్రిచేరె 6530
నెచ్చటఁబురములో - నేడ్పులునిండె
వచ్చెనంతటఁ జెల - వారఁ నవ్వేళ

—: మార్కండేయులు వసిష్ఠునితో నరాజకమును
చెప్పి వేడుట :—

వామదేవాత్రేయ - వత్సజాబాలి
జామదగ్న్మిమృకండు - శరభశాండిల్య
గౌతమకపిలాత్రి - కణ్వాదిమౌను
లేతెంచి యందరు - నేకవాక్యముగ
సచివులలో వసి - ష్ఠమునీంద్రుఁజూచి
యుచితంబు నడపింప - కునికి నిట్లనిరి.
" రాజులేనట్టియీ - రాత్రి యుల్లముల
యోజింప నూరేండ్ల - యోజఁగన్పట్టె 6540
తనయులెవ్వరు లేని - తరిఁ బిలిపించి
యొనరఁబట్టంబులే - కున్న నొప్పునె ?

మహి యరాజకమై య - మాత్యులు చత్తు
రహరహంబును బ్రజ - లార్తినొందుదురు
వసుమతి పండదు - వానలు గురియ
వెసఁగవు ధర్మంబు - లెచ్చుఁబాపములు
మర్యాద లుడిపోవు - మఘములుసాగ
వార్యులనెంచ ర - ధ్యయనముల్ మాయు
మగల గణింపరు - మగువలు జనులు
తెగుదురు జన మని - దెస బలహీను 6550
బలియుండు మననీఁడు - పరుల యిల్లాండ్ర
దొలఁగక నితరులె - త్తుకొని పోవుదురు
దేవదాయములు భూ - దేవ దాయములు
పోవునుఁ జెడిభయం - బులు పుట్టునెందు
సంగీతనాట్య ప్ర - సంగముల్ దప్పు
నంగంబులకు నిర్ణ - యంబులు దొలఁగు
వేడుకల్ చెల్లవు - విభవముల్ దీరు
కూడును రోగముల్ - కుంజరాదులకు
కలుగును వెత లస్త్ర - గరిమముల్ వొలయు
వెలలేక వర్తకుల్ - విడుతు రంగళ్లు 6560
తెరువులు నడవవు - దివ్యవస్త్రములు
పరిమళంబులునుఁ దా - ల్పరు రాజులెల్ల
మెదలరు పాఁడి న - మ్మిక లెల్లఁబోవు
పొదలవు పుణ్యముల్ - పొందునాపదలు
జాతిసంకరమగు - సత్యంబు దొలఁగ
నీతిమార్గమునిల్చు - నెయ్యముల్ దరగు
వావులు చెడిపోవు - వరుసలు దీరు

పోవును శుభములు - పొందు రోగములు
హేతిప్రదీప్తవ - హ్నికి రథంబునకు
కేతువు హేతువుల్ - కెలని చూపఱకు 6570
మనవంటి వారల - మనుకుల కెల్ల
మనుజేశ్వరుఁడు లేక - మరిదిక్కు గలదె!
మునుపు రాజాజ్ఞచే - మూలల నొదుగు
చెనటు లందరుఁ బ్రకా - శింతురిల్లైన
అంగంబునకు దృష్టి - యటుల సమస్త
మంగళప్రదుఁడు నీ - మకు నృపాలకుఁడు
దిక్కులు వాలించు - దివిజుల శక్తి
యొక్క భూవరునందె - నుండు నేకముగ
న్యాయ మన్యాయము - నడపించు రాజు
సేయఁడే లేనిచోఁ - జీకటి పగలు 6580
జలధివేలనుఁ బోలి - జవదాఁట రాదు
తలఁపున మామాట - ధరణి రక్షింపు
కట్టుము పట్టంబు - కర్తనుఁ దెచ్చి
గట్టిగా నీ వేదు - గడ యుందఱకును"
అనిన వసిష్ఠుఁ డ - య్యందఱం జూచి
తన మనంబునకు నెం - తయు హితంబగుట
మంత్రజ్ఞులైన సు - మంత్రాది రాజ
మంత్రులతో నొక్క - మాట యిట్లనియె.

—:భరతుని దోడ్కొనివచ్చుటకై వసిష్ఠముని దూతలనంపుట:—

"భరత శత్రుఘ్నుల - పాలికి మీరు
వెరవరులై నట్టి - వేగుల వారి 6590

ననుపుఁ డిప్పుడె జవ - నాశ్వంబు లిచ్చి
యనిన మీరలె పంపుఁ" - డని వారు వలుక
నతఁడు జయంత సి - ద్ధార్థుల విజయు
స్తుతమతిశాలి న - శోక నందనుల
పయనముల్ సేయించి - "పనివూని మీరు
రయమునఁ గేకయ - రాజన్యు పురికి
పోయి కేల్మోడ్చి య - ప్పుడు వారితోడ
నీయర్థ మేమియు - నెఱింగింపఁ బోక
మేముపిల్చితి మని - మీరాడి వారి
కేమేర లుడుగర - లెప్పుడు గట్టి 6600
యనుపుదురో నేడు - నట్టి కట్టడనె
కొనిపొండ "నుచు మాని - కుంజరుండనిన
పయనమై సంబళ - బత్యంబు లంది
కయికాన్క లుడుగర - కట్టలు గొనుచు
ననుపంగఁ దగువారి - నటమున్నె పనిచి
వెనకఁదారు నయోధ్య - వెడలి యప్పురికి
పడమరగాఁ గొంత - పర్యంతమునకు
నడచి యుత్తర దక్షి - ణములుగాఁ బెరుగు
నుపరి తాలంబను - నొకకొండ యుత్త
రపు దిక్కుగాఁ జుట్టి - ప్రవహించు నట్టి 6610
మాలినీ నదిదాఁటి - మార్గంబు లందు
జాలంగ పూర్వ ప - శ్చిమ దీర్ఘమగుచుఁ
దనరు ప్రలంబ భూ - ధరముఁ గన్గొనుచుఁ
జని యుత్తరముగన - శ్వములు మఱల్చి
ఆవల పడమర - వైపోవుచాయ

త్రోవనే నడచి యా - దూత లేవురును
జాడఁ బాంచాల దే - శంబులు గడచి
నాఁడెవారలు కరి - నగరంబు దాఁటి
గంగానదిని మీఱి - కదలుచోఁ గురుర
జాంగలకురు మహీ - స్థలముల నడిమి 6620
మార్గంబు వట్టి గ్రా - మంబు లేఱులును
నిర్గమింపుచు నొక్క - నిబ్బరంబుగను
కారండవక్రౌంచ - కలహంస చక్ర
సారస నిబిడయా - శరదండ యనెడు
నది నదితోయ్యపయా - నమహీరుహంబు
నెదురు గన్గొనిమీఱి - యెంతే రయమున
నరుగువారు కుళింగ - మను పట్టణంబు
తెరువుగా నిక్షుమ - తీ మహానదిని
దాఁటిదోసెఁడు నీళ్లు - ద్రావి యాత్రేవ
సాటికి నిగమ ప్ర - సంగముల్ సేయు 6630
ధరణీసురలఁ జూచి - తారు బాహ్లికుల
వారిగేహములఁ జూచి - యచటి విపాశ
దెరువున దాఁటి న - దీ తటాకములు
సరగ నంగార్య సం - సక్రి మీఁగుచును
వివిధ మృగంబుల - వీక్షించి వార
లవలఁదురంగంబు - లవియునోయనుచు
యెంచక చనుచు న - య్యెడ గిరి వ్రజము
గాంచి రాజహితంబు - గా భరతునకు
సేమంబుచే కూడ - క్షితి శోభనముల
చేమించి వారట్లు - చేరి కైకయుని 6640

సముఖంబునకుఁ బోవ - సమయంబు గామిఁ
దమకునాఁటికి నిల్వఁ - దగినచో నుండి
గ్రక్కున భరతునిఁ - గనుపించుకొనక
యెక్కడి వారొకా - నిమిడి యున్నంత

—: భరతుఁడు తన దుస్స్వప్నమును మిత్రులతోఁ జెప్పుట :—

తెలవారు వేళ ని - ద్రింపుచు నొక్క
కలగాంచి భరతుండు - కలఁగుచు లేచి
వేసట సంధ్యాది - విధు లాచరించి
బాసట లేక య - ప్పటి పరిజనుల
యుపలాలనము చేసి - యొకమాట యైన
నపుడు పల్కక చెక్కు - నందు చేయుంచి 6650
యున్నెడ ననుచరు - లూరట గాఁగ
గొన్ని వినోదముల్ - కొన్ని హాస్యములు
కొన్ని పదంబులు - కొన్ని పద్యములు
కొన్ని ప్రసంగముల్ - కొన్ని యాటలును
మఱపింప నడపింప - మది నొక్కటియును
సరకుగాఁ జూడక - చాల చింతిలఁగ
నందొక్క నెచ్చెలి - యతని వీక్షించి
యెందు నిమిత్తమో - యిపుడు మీ మొగము
విన్నఁబాటిన దేమి - విధమని చేరి
విన్నపించినమాట - విని భరతుండు 6660
తెలుప నోరాడక - తెలపక మదిని
నిలుపను లేక వా - నికి నిట్టులనియె.
"యీ రేయి నాకల - యేమని పలుక

నేరుతుందమ తండ్రి - నెఱిగుంపు వీడ
మలిన వస్త్రముగట్టి - మలినుండై యొక్క
శైలాగ్రమున నుండి - జగతిపై పేడ
మడువు లోఁబడినట్టు - మరి తెలినూనె
పుడిసిటఁ ద్రావుచు - పొరలి నవ్వుచును
తలయంటు కొనినట్లు - దశరథ నృపతి
తిలమిశ్రితాన్నంబుఁ - దినుచున్నయట్లు 6670
తైల ఘట్టంబులోఁ - దల క్రిందుగాఁగ
వ్రేలుచు నున్నట్లు - విషరాశి యింకి
బీడయినట్లు జా - బిల్లి మిన్నెల్ల
బాడుగా ధరణిపైఁ - బడినట్లు వసుధఁ
గానరాక యదృశ్య - గతి నొందినట్లు
మానవేశ్వరుఁ డెక్కు - మదదంతి కొమ్ము
విఱిగిపోయిన యట్లు - వెలుఁ గొందువహ్ని
మెఱమంట లుడిగి పో - యి శమించినట్లు
ధర వగిలిన యట్లు - ధరణీరుహములు
దెరలియెండిన యట్లుఁ - దెక తేర గిరులు 6680
పొడి పొడియైనట్లు - భూమీశుఁ డినుప
నిడుద గద్దియ - నుండ నీలవర్ణలును
పచ్చని వారునా - పడఁతు లెత్తుకొని
మెచ్చటికో కొంచు - నేఁగిన యట్లు
గర్దభంబులు నాల్గు - కట్టిన రథము
కర్దమ క్షితినెక్కి - కదలించి రాజు
మఱలి చూడక రక్త - మాల్య గంధములు
ధరియించి దక్షిణ - స్థలి కేఁగినట్లు

ఆ మహీపతి వికృ - తాకార మైన
భీమరాక్షసి పట్టి - బెదరించినట్లు 6690
నీరీతి దుస్వప్న - మేఁగంటి నిందు
చే రాఘవున కైన - క్షితిపతి కైన
తనకైన మృతియాట - దప్పదుగాన
మొనచూపు నార్తిచే - మునిఁగిన వాఁడ
చలియించె శారీర - సంపద మనసు
కలంగెడు మాటాడఁ - గా వేసటయ్యె
యిందుల కెద్దియో - హేతువు నెఱుఁగ
పొందెడు భీతి యి - ప్పుడు దాఁపనేల?
తనమేని చాయ యుం - దప్పె నెన్నడును
వెనకటికిని నిట్టి - వెతనంద లేదు" 6700
అనిపల్కు చున్న - చో నల పౌరజనులు
కనిపించు కొనుచు కే - కయ రాజునగరు
చొచ్చి కొల్వున్న రా - జునకుఁగే ల్మోడ్చి
చెచ్చెర నయ్యుధా - జిత్తుకు మ్రొక్కి
పజ్జన యున్నట్టి - భరతునిం జేరి
బుజ్జవంబునఁ గొంత - పోరామి నడపి
శత్రుఘ్నుఁగని వసి - ష్ఠ సుమంత్ర ముఖులు
మైత్రితో మీదు సే - మము వేఁడుమనిరి
మీతాతకును మీదు - మేన మామకును
ప్రీతితో వార లం - పిన కానుకలిచ్చి 6710
"రండు మా వెంట కా - ర్యముమాకుఁ దెలిసి
యుండదు వారేమి - యూహించినారొ?
యిరువది కోట్లులై - హెచ్చైన వెలకుఁ

దరమైన యీసొమ్ము - తాతకు నిచ్చి
పదికోట్లు సేయు నా - భరణంబు లిమ్ము
మదిమెచ్చ మీమేన - మామకు ననుచు
చూపియిచ్చినఁ గైక - సుతుఁడది యంది
యోపి మోచిన యన్ని - యుడుగరలిచ్చి
వేగుల వారల - వీక్షించి భరతుఁ
డీగడ దెలియంగ - నీక్షించి పలికె. 6720

—: భరతుఁ డయోధ్యకుఁ బ్రయాణమగుట :—

"మనరాజు రాముల - క్ష్మణులుఁ గౌసల్య
యును సుమిత్రయు లెస్స - యున్నారె పురిని?
చలము రోషమును మ - చ్చరము నోర్వమియుఁ
గలుగు నాతల్లికిం - గైకకు సుఖమె ?
ఆకైక నాతోడ - నను మన్నమాట
వాకొనుం"డని పల్క - వారలిట్లనిరి.
"అయ్య! నీ వడిగిన - యందరు లెస్స
నియ్యెడ నినుబొందు - నెల్ల సేమములు
నరదంబు దెప్పింపుఁ - డాలస్యమేల ?
సరగ విచ్చేయుఁడు - సాకేతమునకు" 6730
అనిన కేకయుఁజూచి - యనఘ! మావారు
ననుఁ బిల్వనంప నం - దరు వచ్చివారు
పోయివచ్చెద నను - పుఁడు మీరలనిన"
నాయవనీశుండు - నౌఁగాక యనుచు
శిరము మూర్కొని మీరు - చేరుఁ డయోధ్య
పరిణామమున మన - పార్థివోత్తముని

నడిగితి మ్రొక్కితి - నని వల్కి మతని
పడఁతుల సుతల మా - పైఁదయ యెపుడు
మఱవకుండనుము నె - మ్మదినేఁగు మనుచు
కరితురంగమ రత్న - కంబళ వస్త్ర 6740
వరభూషణాదుల - వ్వారిగా నిచ్చి
"తనవారి వెంటం గొం - దఱఁ గూర్చి భరతుఁ
బనిచిన కేకయ - పతి కుమారకుఁడు
ఐరావతాంశంబు - లైనవి యింద్ర
శిరదేశమునఁ బె - చ్చినయవి భద్ర
సామజోష్ట్రంబుల - జవ నాశ్వములను
నామేనమామ ప్రి - యంబుతో నొసంగి
సింగంబులన గ్రామ - సింహముల్ హాతకు
రంగముల్ గొన్నిగా - రామున నిచ్చి 6750
యనిచినయంతఁ బ్ర - యాణ తత్పరతఁ
దనకిచ్చు వాన నా - దర మింత లేక
రయముతో చారులు - రమ్మని పిలువ
భయ పుట్టఁగాని స్వ - ప్నముగన్న కతన
చిదుముడి పాటుతోఁ - జేరి యవ్వలకు
గడమ వారలకు న - గళ్లలోఁ దమదు
పయనంబు చందమే - ర్పఱచి వా రనుప
రయముతో నొకమహా - రథముపై నెక్కి
తానుఁ దమ్ముఁడు నయో - ధ్యా పురంబునకుఁ
బూని కేకయుల పం - పుదు మూకగొల్వ 6760
నుఱలి పట్టణ పూర్వ - మార్గంబు నందు
నరుగు వారు సుధామ - యను నది దాఁటి

పడమర దిక్కుగాఁ - బాఱు హ్లాదినియుఁ
గడచి శతద్రువుఁ - గమియించి యేల
ధాన జనపదంబు - దాఁటి శీఘ్రమున
రానందు నపర ప - ర్పట దేశములునుఁ
దరియించి యొకయేఱు - దాఁటి యాగ్నేయ
పురశల్యకర్తన - పురములు గడచి
తనచాయఁ జైత్ర ర - థంబను వనము
గ్రమియించి గంగా స - రస్వతుల్ మీఱి 6770
చని వీర మత్స్య దే - శము లుత్తరమున
తనరు భారుండాభి - ద వనంబు చేరి
కాంచి దేవినిఁ గుళిం - గమునను నదులు
ప్రాంచల నగములు - భావించి యమున
చెంగట నొక రేవు - చేరి యుత్తమ మ
తంగజాశ్వములు సే - దలు దేర్చి బలము
విశ్రమింపఁగఁ గాల్య - విధులాచరించి
యశ్రాంతులై వార - లవలఁబోవుచును
పవనుండు మబ్బులఁ - బాపిన కరణి
జవసత్వ భద్రేభ - సంఘుంబు మీఱి 6780
మట్టి చిట్టడవిదు - మారంబు రేయి
బట్టబయల్ సేయఁ - బరగు కాఱడవి
త్రోవగావచ్చి చే - రువనఁ శుధాన
మావల ప్రాగ్వట - మనునూళ్ల చెంత
భాగీరథి దరించి - బలముల తోడ
సాగి యాకుటి కోష్ఠ - శైవలినియును
గ్రక్కున ధర్మవ - ర్ధన పురి గడచి

యక్కడ తోరణ - మను నూరుచూచి
వోయి యామ్యమున జం - బూప్రస్థపురము
చాయ వరూధాఖ్యఁ - జను నూరుచేరి 6790
అక్కండు గ్రుంక సా - రచ్చోట నిల్చి
యర్కవంశలలామ - మమ్మఱునాఁడు.
అరుణోదయమ్మున - నఖిల సైన్యముల
దరలించి పూర్వ ప - థంబున వచ్చి
యుజ్జయినీ పురిని - నుద్యాన భూమిఁ
బజ్జలఁ జతురంగ - బలములు గొలువ
నందునాఁటికి నుండి - యవ్వలి దినము
నందు సూర్యోదయం - బగువేల లేచి
బలముల వెంబడిఁ - బయనంబు చేసి
యలఘు వేగమున - జాశ్వంబు లెక్కి 6800
ముందర నన్నద - మ్ములు కొంత తురగ
బృందంబు నొకకొన్ని - యేనుఁగల్ వెంట
చను దేరమున్నుగా - సర్వ తీర్థంబు
దనరు నౌత్తానకి - దాఁటి రాఘువులు
మఱియు నుం గొన్ని ని - మ్నగ లుత్తరించి
అరుగుచుఁ దురగంబు - లలసిన కతన
మసలక పడివాగె - మత్తు మావులను
వెస నెక్కి రఘువంశ - విభులు గదలి
నవియును నలసిన - నచట కళింగ
భవమైన యేనుఁగ - సై వారలెక్కి 6810
పోవనిచ్చి ప్రయాగ - మునుఁ బోలుకుటిక
యావల లోహిత్య - మనుపురి చెంత

కపివతి యనునది - గని యేకసాల
మపుడు వీక్షించిత - దగ్ర భాగమున
స్థాణుమతీ నది - చనిచూచి మహికి
వేణియై కనిపించి - వినతా పురమున
గోమతినది గనుం - గొని కళింగమున
రాముని తమ్ములా - రామంబు చేరి
కరిడిగ్గి యంచలఁ - గట్టిన హరుల
నిరువురు నెక్కి రా - నినుఁడ స్తమింప 6820
కాఱడవిని త్రోవ - గనిపింప దివిటి
బారులతో వేగుఁ - బర్యంతమునకు
వచ్చి సూర్యోదయా - వసరంబు నందు
నెచ్చోట శుభచిహ్నా - లేమియు లేని
తమ పట్టణముచూచి - తరణి వంశజులు
తమితోడ సప్త రా - త్రమునకుం జేరి
అరదంబు పై నెక్కి - యపుడు సారథిని
బరికించి యిట్లని - భరతుండు వలికె
"తగఁజూచితే ? సు - ధాధౌత సౌధములు
మిగులు శోభాలక్ష్మి - మించ వేమియును 6830
అధ్యయనములు యా - గాదు లైనట్టి
విధ్యుక్త కర్మముల్ - వెలయ వేమియును
రణదురుమణి నూపు - రంబుల వెలయు
గణికాజనంబు నే - కడల లేరైరి ?
కేళికా వనములఁ - క్రీడలు సల్ప
బాలికావళిఁ గూడి - పల్లవుల్ రారు ?
శృంగార వనములు - చెలువముల్ దిరిగి

చెంగలించుట లేక - చిన్న వోయెడును
ఏ మగలశ్వంబు - లెక్కక రాజ
సూనులు పురికెందుఁ - జూపట్టరైరి ? 6840
కొడిగెల యందుఁగే - కిలును హంసములు
నడయాడు నట్టి స - న్నాహ మేర్పడదు
జలజాకరంబులఁ - జక్రవాకాది
జలపక్షికలకల - స్వనములు మాసె
నా చూపులకునర - ణ్యంబునుం బోలి
యేచాయ నీపురం - బేలకో తోఁచె
పువ్వు లేమియులేక - పూఁదోట లేల
మవ్వముల్ దరగి రె - మ్మలు వాడువారె
కౌసికాగురు కాష్ఠ - కర్పూర ధూమ
పేశల గంధముల్ - పెల్లుబ్బ వయ్యొ 6850
చలువలీనుచు మాంద్య - సౌరభంబులను
మలయదు దక్షిణ - మారుతాంకురము
కలిత వాదిత్ర సం - గళ వాద్యరవము
విలసిల్ల దొకచోట - వీథుల యందు
తొలఁగక కనిపించె - దుశ్శకునములు
కలఁగెడు చిత్తం బ - కారణంబుగను
మనవారికెల్ల సే - మము లేకయేమి
పని పుట్టెనోకద - పట్టణంబునను''
అని చింతిలుచు నయో - ధ్యా పట్టణమున
దనర్మోల వైజయం - తంబను పేర 6860
గురుతైన పడమటి - కోట వాకిటను
బరగు గోపురము దా - భరతుండు వొచ్చి

వాకిటి కావళ్ల - వారలు లేచి
చీకాకు పడుచుండ - చేసన్న నాఁచి
ఆ కుమారాగ్రణి - యవల నేఁగుచును
కేకయసారథిం - గీర్తించి పలికె.
"వింటివే సూత యీ - వీడున్న లాగు
తొంటి రాజులుమేని - తోఁచాసినపుడు
యెట్లుండు ననివిందు - మెల్ల జనంబు
నట్లయున్నది సంది - యమొకింత లేదు 6870
తెఱచిన వాకిళుల్ - దెఱచిన యట్లు
పఱచిన కంబళ్లు - పఱచిన యట్లు
మూసిన యంగళ్లు - మూసిన యట్లు
వేసిన గానులు - వేసిన యట్లు
కట్టిన గజములు - గట్టిన యట్లు
పట్టిన కైదువుల్ - బట్టిన యట్లు
నిలిపిన రథములు - నిలిపిన యట్లు
మలపిన దీపముల్ - మలపిన యట్లు
పడియున్న టెక్కెముల్ - పడియున్న యట్లు
చెడిపోవు ముగ్గులు - చెడి పోవునట్లు 6880
చెదరిన చిత్రముల్ - చెదరిన యట్లు
వదలిన మేల్కట్లు - వదలిన యట్లు
మానిన శుభములు - మానిన యట్లు
పూనిన మఘములు - పూనిన యట్లు
విలువని సొమ్ములు - విలువని యట్లు
గొలవని వేల్పులఁ - గొలవని యట్లు
సేయని పూజలు - సేయని యట్లు

హాయన నేడ్పులు - హాయను నట్లు
యిటువలె మున్నుందు - నే యీపురంబు
కిటుకులు పుట్టె సా - కేతంబు నందు" 6890
అని వేగమున మన - యరదంబు నడపు
మన తమ నగరు డా - యంగఁ బోయి యచట
యా తేరుడిగ్గి యా - య్యన తండ్రి నగరి
కేతేర నచ్చోట - నెవ్వారు లేమి
గ్రక్కున మరలి యా - కైకేయి నగరు
చక్కఁగాఁ జొచ్చి ప్ర - సన్నుఁడై యున్న

—: కైక భరతునితో జరిగిన వృత్తాంతమును జెప్పి రాజ్యమును బూనుమనుట :—

తల్లినిఁ జేరి వం - దన మాచరింప
"చల్లఁగా మనుము" ని - చాల దీవించి
తడవులకై వచ్చు - తనయునిఁ జేరి
కడువేడ్క నిండారు - కౌఁగిటం జేర్చి 6900
ఆసీనుఁజేసి ప్రి - యంబుతో చెంత
నాసీనయై కైక - యతని కిట్లనియె.
"అన్న! మీతాత గృ - హంబీవు వెడలి
యెన్నినాళ్లాయనో - యెల్లవారకును
సేమమేకద? యథా - జిత్తుండు సుఖియె?
నీమేనువాడె - నేంతే ప్రయాణముల"
ననవినిభరతుఁ"డో - యమ్మరో! నేడు
దినముబాయను వెళ్ళి - తెరువు నిద్రలను

వారెల్ల సుఖమున్న - వారలునాకు
కూరిమి నిచ్చిరి - కోరువస్తువులు 6910
అలసినవాఁడ మా - యయ్య యెచ్చోట
నెలకొని యున్నాఁడు - నిజమందిరమున?
కానక వెదకి యి - క్కడనుండు ననుచు
యేనిన్నుఁ గనుఁగొంటి - నెన్నినాళ్లాయె
తమతండ్రిఁజూచి యో - తల్లియేగ్వరవు
ప్రమదంబు తోడనే - భామినియింట
నున్నవాఁడో పోయి - యుర్వీశు మోము
కన్నులుచల్లగాఁ గ - నుఁగొనవలయు
కాకచూపెదెతల్లి - కౌసల్యయింట
శ్రీకరమూర్తియై - చెలఁగు చున్నాఁడొ 6920
వేగవాకొను ''మన్న - విని భరతునకు
నాగుణహీనురా - లప్పు డిట్లనియె.
'' అన్ని గార్యంబులు - నటులుండ నీవు
తన్నుఁగన్గొని వేఁడి - తండ్రియటంచు
అడిగెదీ వఖిలజ - నావళి ముదిసి
కడతేరియెట్టి లో - కమున కేఁగుదురు
ఆలోకమున కేఁగె - నవనిపాలకుఁడు
కాలమందరికినిఁ - గర్తయాఁగాదె
తగవున నోడిన - ధరనిండ బ్రదికి
తెగిపోయిననుఁ గల - దే విచారములు 6930
ఉండి యే నను భవం - బుర్వియేలెదునొ?
గండెచ్చి బిడ్డలఁ - గని పెంచఁ గలఁడొ ?
పగవారి గెలుచునో - పనికిరా నతఁడు ?

తెగినవుండిన నొక్క - తీరె చూచినను
కలవు సేయఁగఁబెక్క - కార్యముల్ మనకు
తెలిపెద శుభము లం - దెడువేళ నీకు
యీవిచారముమాను - మీవంచుఁబలుక
భావించి తనగుండె - భగ్గున నవియ
దిగులుచే మూర్ఛిల్లి - తెలిసి హస్తములు
జగతిపైఁ బుణుకుచు - జాఱఁగన్నీరు 6940
తలయూఁపుచునుఁ బరి - తాపించి మదిని
కలగుచు నలుదిశల్ - కలయంగఁజూచి
కమలారిఁ బాయునా - కాశంబ పోలి
తమతండ్రి లేనట్టి - తల్పంబుఁగాంచి
అతని యాకారంబు - నతనివ ర్తనము
మతిఁదలంపుచు పలు - మారుఁ బేర్కొనుచు
వెతనొందు భరతుని - వీక్షించి కైక
హీతమతి తాఁజే - ఠి యిట్లని పలికె.
"నరికిన మ్రాకిచం - దమున నేమిటికి
యురక నేలనుఁబడి - యొరలి యేడ్చెదవు? 6950
నినువంటి వానికి - నియతమే యిట్టి
పనిలేనిదుఃఖంబు - పైవేసి కొనఁగ?
మందరాచలముపై - మార్తాండుదీప్తి
చందానవీయచం - చల హృదయమున
గనిపించు దైన్యత - కళయేల మాని
మునుపటి శ్రుతి శీల - ములు మఱచితివె?
మాయన్న వలదు నీ - మదిఖేద" మనిన
నాయమ్మఁ గనుఁగొని - యతఁ డిట్టులనియె,

" శ్రీరాముపట్టాభి - షేకంబుచేసి
కోరికలెల్లఁ జే - కూర్చుకొన్నాఁడో! 6960
హయమేధ రాజసూ - యాదిమయాగ
చయముగావింప దీ - క్ష వహించినాఁడో !
తడవాయెఁ జూచియు - ద్దఱి నయోధ్యకును
వడిగ రండను కమ్మ - వచ్చు నోమాకు
యెప్పుడు చేరఁబో - యి మహీశు మొగము
తప్పకచూచి సం - తసము నొందుదుమొ?
అని తలంపుచువచ్చి - యమ్మ! యేనెల్లు
విని యోర్తు నీమహీ - విభుఁడు వోవుటకు
యేమిగారణమున మృ - తి నొందెరాజు
రామలక్ష్మణుల దా - రా! భాగ్యమైన 6970
యిటువంటి తండ్రికి - నిహపరంబులకుఁ
గటకటా ! వారలే - కర్తలై మనిరి
రామలక్ష్మణు లుత్త - రక్రియల్ దీర్ప
నేమిటి కేఁ దండ్రి - కిచ్చోట నున్న
యోజింపఁగా నప్ర - యోజకంబయ్యె
నాజన్మ మికనెందు - నావెతల్ దీరు
యేను మ్రొక్కిన నన్ను - నెవ్వారు దిగిచి
చేనిండ కౌగిటఁ - జేర్చుకో గలరు ?
ఎవ్వారు నారాక - కెదురులుచూచి
యవ్వేళఁ గనినంత - నాత్మఁ బొంగుదురు? 6980
తండ్రిలేవట్టిచో - దల్లియు గురుఁడుఁ
దండ్రియు నాకు నీ - తావరుం డొకఁడె
ఓయమ్మ! యెచ్చోట - నున్నాఁడొ తెల్పు

మా" యన్న యపుడు ల - క్ష్మణునితోఁగూడి
చేరి యారాముని - శ్రీపాదయుగము
నూరటగాఁజూచి - యుడుకారువాఁడ
రాజు లేనట్టిచో - రాఘవు చరణ
రాజీవయుగళి చే - రఁగదిక్కునాకు
యెందుఁజూచిన మరి - యెద్ది మాతండ్రి
జెందిన దురవస్థ - చేనున్న యపుడు 6990
యేమని నాతోడ - నెఱిఁగింపు మనియె?
నో మానవతి! విని - యూరడిల్లెదను
మఱుగు వెట్టక తెల్పు - మా" యనిపల్క
భరతునిఁ జూచిదాఁ - పక కైకవలికె.
" మీతండ్రి రామసౌ - మిత్రుల కొఱకు
సీతానిమిత్తంబు - చింతలం జివికి
కాలధర్మమునొందె - గంధసింధురము
కాలాయసోఙ్కుశ్రృం - ఖలనుఁ బోలి
సద్ధర్మ సత్యపా - శంబులఁ జాల
బద్ధుఁడై యన విని - ప్రాణముల్ గలఁగ 7000
బిమ్మిటిగొని తన - పెంపెల్ల మఱచి
అమ్మ రాఘవుఁడేమి - యయ్యె? సౌమిత్రి
యెక్కడికేఁగె? మ - హీం జాత యెట్టి
దిక్కున నున్నది? - తెలుపు" మీవనిన
దిట్టయై కైకయా - త్మీయ వర్తనము
బట్టుచు పట్టియా - పట్టికి ట్లనియె.
" తానుతమ్ముఁడును సీ - తయుఁ గూడియేను
చేనొసంగిన నార - చీరలుగట్టి

అడవులకునుఁ బోయె - నన్న శ్రీరాము
నడవడియును నిజా - న్వయ వర్తనంబు 7010
తనమదినెంచి హి - తంబని పలుకు
జననితో భరతుండు - జాలి నిట్లనియె.
" పరులసొమ్ముల కాస - పడియెనో లేక
పరకాంతలనుఁ బట్టి - బలిమిఁ జేకొనెనో!
పనిలేక యుడిచె - నో! బ్రాహ్మణశ్రేణి
ధనమెల్ల బ్రహ్మహ - త్య యొనర్చినాఁడో!
యేమమ్మ! శిశువుల - హింసించువాని
భూమినుండఁగ నీక - పొమ్మనినట్లు
యీరాజు వనముల - కేఁటికిం దరమె?
శ్రీరామచంద్రు నూ - ర్జితపుణ్య నిధిని 7020
కలతెరంగెల్ల ని - క్కముపల్కు మనిన"
కలుషాత్మురాలైన - కైక యిట్లనియె
"నీవుపల్కినపాప - నికరంబునందు
నావంతయైన జే - యఁడురఘూద్వహుఁడు
శ్రీరామపట్టాభి - షేకంబుచేసి
ధారుణి యేలింపఁ - దలఁచె మీతండ్రి
అది నే సహింపక - యాత్మలో నీకు
నిది హితమని యెంచి - యెల్లరు మెచ్చ
సీతతో నడవికి - శ్రీరాముఁ బనిచి
మీతండ్రిచే సర్వ - మేదినీ భరము 7030
కైకొంటిఁ బట్టంబుఁ - గట్టెద నిన్ను
నీకునై చలపట్టి - నిర్వహించితిని
పడరాని పాటులం - బడి నాచలంబు

కడతేరె బ్రతికితిఁ - గాయంచు నుండ
నడుమంత్రమునవచ్చి - ననుఁ జిన్నబుచ్చి
చెడుబుద్ధివగుచు నే - డ్పెదు తెక తేర
రామునిఁ బాసియో - ర్వఁగలేక రాజు
భూమిపైఁబడిమృతిఁ - బొందెఁ గావునను
మనయధీనము మహీ - మండలంబెల్ల
మునుపు వసిష్టాది - మునుల యనుజ్ఞ 7040
రాజన్యునకు నుత్త - రక్రియల్ దీర్చి
రాజవు గమ్ము ధ - రా చక్రమునకు ”

—: భరతుఁడు కైకనాక్షేపించుట :—

ననిన నచేతనుం - డై కైక మొగముఁ
గనుఁగొని భరతుండు - క్రమ్మరం బలికె.
“ రామచంద్రుఁడు దశ - రథుఁడును లేని
భూమి యేలు మనంగఁ - బోలునే నన్ను ?
నోరువనేర్తునే - యొకపుంటిమీఁద
కారంబువేసిన - గతిదాపమెచ్చె
చెట్టవై కులమెల్లఁ - జెఱపంగనీవు
రట్టుకోఁరిచి కాళ - రాత్రివై నావు 7050
నరపతి ప్రాణంబు - నకుఁ దెచ్చుకొనియె
నెఱుఁగక నినుఁదన - యిల్లాల వనుచు
నీతోడి చెలిమి వ - హ్నిని బడినట్లు
మాతండ్రి కన్యాయ - మరణంబువచ్చె
దశరథుఁజంపి మా - తరము రాజులకు
యశమెల్లఁ బోకార్చి - యార్తిఁ జేసితివి

ఏకారణము లేని - యీపాపచింత
నీకుఁగల్గగ నేర్చు - నే కాలగతిని ?
సతులైన యట్టి కౌ - సల్యా సుమిత్ర
లతిశయపుత్ర శో - కార్తి నొందుదురె ! 7060
నిన్నుఁ గౌసల్యగా - నెమ్మదిలోన
నెన్నుమా యన్నకే - యిటువంటిపాటు
కౌసల్య తోఁబుట్టు - గానిన్నుఁజూచు
నాసాధ్వి కెట్లు కీ - డాచరించితివి ?
ఉత్తమగుణు రాము - నూరక వదలి
చిత్తమొక్కటిచేసి - చెదర కున్నావు
ఏమిఫలంబబ్బె - నిందుచే నీకు
రాముని వెడలించి - రాజ్యమేలుదునె ?
అతనిపై నాహృద - యమున విశ్వాస
మతిమాత్రమగుట నీ - వరయవే యపుడు 7070
తల్లి ! యెంతటి యన - ర్థంబు చేసితివి ?
మెల్లనే పల్కి సౌ - మిత్రితోఁగూడి
గాముఁడు లేనట్టి - రాజ్యంబు సేయ
సామాన్యమే నాకు - శక్తి యెక్కడిది ?
మేరుశైలమున జ - న్మించిన యడవి
మేరువు గాచిన - మేర రాఘవుని
తేజంబు చేతఁగా - దే దశరథుఁడు
రాజయ్యె నిఖిల ధ - రాచక్రమునకుఁ
బటుమాహాశక్తి సం - పన్నుండౌరాజు
చటులవిక్రమముచే - సంరక్ష సేయు 7080

నీ భూమియతి బల - హీనుండనైన
యేభరింపఁగనేర్తు - నే వెఱ్ఱితల్లి!
కాఁదనియతశక్తి - గలిగెనేనియును
నీదుమాటలు విందు - నే ధాత్రికొఱకు ?
అన్నరాజ్యముసేయ - ననుజన్ములతని
మన్నన సేవింప - మాకులక్రమము
యీమేరయెప్పుడు - నిక్ష్వాకువంశ
భూమీశులవనిపైఁ - బెట్టఁబుట్టినది
మీవారు మహినిట్టి - మేర వారొక్క
నీవుగల్గగ లోక - నిందితులైరి 7090
తనప్రాణమున కీవు - దప్పినయట్టి
పనిచేసితివి చల - పట్టి నీకొఱకు
రామునిందెచ్చి యు - ర్వర యేలఁజేతు ?
నామహామహుఁగొల్చి - యడుగులొత్తుదును
చిత్తంబురా సేవ - యుదుఁగాంతు
నుత్తమస్థితుల ని - యుర్వీధరముల
సింగంబు గుహను గ - ర్జించినయట్టి
సంగతి శోక రో - షంబులు పెనఁగ

—: భరతుండు కైకను నిందించుట :—

క్రమ్మరంబలికె నో - కైక! లోకైక
సమ్మతు మాయన్న - జానకీరమణు 7100
ప్రాణనాథుని నీవు - పఱచినపాటు
ప్రాణపర్యంతమౌ - పనివచ్చె నాకు
చేరనేర్తువె రాజు - చెంతకు నీవు

ఘోరనారకములఁ - గూలుటగాక
కడుద్రోహి వీఁడు కై - కకుఁ బుట్టినాఁడు
చెడుగని లోకులీ - క్షింతురే నన్ను?
కల్లరివై కన్నుఁ - గాన కెవ్వరిని
తల్లివా? నాపగ - దాయవు గాక
కులఘాతినివి నీదు - కొడుకునుఁగాను
తలఁపకునను - నీవు తల్లివిగావు 7120
కైకయునింటి రా - క్షసివి జన్మించి
నాకుఁజేసితివి ప్రా - ణమునకుహాని
కౌసల్యతోడ రా - ఘవుఁ బాపినీవు
చేసిన పాపంబు - చెఱుపకపోదు
రామచంద్రుఁడు దశ - రథునిమర్యాద
నేమదిఁబూనిన - నీమంబుగాన
నీమోముచూచిన - నిష్కృతిలేదు
భూమిపై గానని - ప్పుడెమానినాఁడ
దయ్యమువలెఁ నీవు - దరమిన రాము
నియ్యెడఁగౌసల్య - యెడవాయఁగలదె? 7130
మున్నొక్కసురగవి - ముద్దుఁగోడెలను
దున్నుచునొక్కండు - తోలియాడంగ
యెండలోతన బిడ్డ - లీపాటువడుచు
నుండఁగ సురగవి - యుల్లంబుఁగలఁగ
శోకింప కన్నుల - జొటజొట నశ్రు
లేకడఁదొరగింప - నింద్రుండు జూచి
ఆజలంబు విమాన - యానుఁడౌ నింద్రు
పై బడిగురియ సం - భ్రమమున నతఁడు

ధరణిపై నయ్యంబు - ధారలు చెదరి
తొరుగకయుండ చే - తులయందుఁదాల్చి 7140
యెలకో ! యీచింత - యేఁగల్గెననుచు
పేలుపుటావుతో - విబుధేంద్రుఁడనియె.
ఏమిచేసితినీకు - నెవ్వారు నిన్ను
నేమనిపలికి రి - ట్లేలయేడ్చెదవు ?
లేదుగదా ! భయ - లేశంబునీకు
నాదుపురంబులో - నా కేర్పరింప ''
" అన దేవ ! సురభి య - య్యమరేంద్రుఁజూచి
తనతనయులపాటు - తగవిన్నవించి
దేవ ! నీయాజ్ఞచే - దివిజలోకమున
నేవలనొకభయం - బెఱుఁగనెన్నఁడును 7150
సుతుల ఖేదంబునేఁ - జూచి యీరీతి
వెతలనొందెద నన్న - విబుధనాయకుఁడు
అదియుచితంబె కా - యనియూరడించె
నది చాలపుత్రుల - నంది యిట్లైన
కన్నట్టి తనయుఁడొ - కఁడు కడకేఁగ
సన్నుతశీల కౌ - సల్యయెట్లోర్చె ?
ఏకీడు నినుఁజెందె - నేఁడె నే నేఁగి
శ్రీకరచరితు రా - జీవలోచనుని
సత్యసంకల్పుఁ గొ - సల్యాకుమారు
నత్యుదారు మనోహ - రాకారు రాము 7160
శరణంబుచొచ్చి పూ - జలు చేసి పిదపఁ
బరలోకవిధులు భూ - పతికాచరించి
తేజంబుగాంతు నే - దెత్తు రాఘవుని

భూజనంబులచేత - పొగడికల్గందు
నెల్లరు రోసిన - యీబ్రదుకేల ?
చెల్లదు నీకు నీ - క్షితిమేనుఁదాల్ప ?
నడవికిజనుము కా - రగ్గిలోఁజనుము
జడనిధింబడుము వి - షంబైన కొనుము
నురిబెట్టుకొను మాయు - ఘోరఘాతమునఁ
దెరలుము నూతిలోఁ - ద్రెళ్లుము నాల్క 7170
వెఱుకుకొమ్మిఁక గొంతు - విసుకుక చావు
మురకకూడుము నీరు - మడిగి నశింపు
పడుముర్వినీమేడ - పైబొడువెక్కి
గడియలోన నపకీర్తి - కడతేర్చుకొనుము
గతివేఱె నీకెద్ది ? - కాకుస్థ తిలకు
క్షితినెల్ల నే నభి - షిక్తుఁ జేసెదను
పాపపుఁ గన్నులఁ - బట్టాభిరాముఁ
జూపోపలే కొకిం - చుక దాళితేని ”
అనిరోదమునఁ జిక్కి - నట్టి మత్తేభ
మనభరతుండు డో - లాలోల మతిని 7180
జగతిపై నింద్రధ్వ - జంబుత్సవాంత
మగునెడఁ బడియెనో - యని పుగుణింప
కెంజాయ చూడ్కులతోఁ - గేశముల్ విరియ
మంజు కుంకుమము చె - మ్మటలచేఁ గరఁగ
చెదరి భూషణమణి - శ్రేణి రాలంగ
వదలి కట్టినయట్టి - వలువమ్రోఁజాఱ
సిగపువ్వు లెత్తులు - చెదర లేనవ్వు
మొగము మిక్కిలివాడ - మూర్ఛిల్లినట్టు

లవనిపైఁ బొరలాడి - "హారామ ! రామ !
రవివంశనిధి ! ప్రోవ - రావే" యటంచు 7190
నన్ను యీయాపదముల - యాన యీకార్య
మెన్నడు కలనైన - నెఱుఁగనే ననుచు
నీమందభాగ్యకు - నేఁబుట్టి నపుడె
యేమని నీదుమో - మీక్షింతు ననుచు
నీచిత్తమఱియక - నేనొక్క తెంపు
చూచి ప్రవర్తింప - చొప్పడ దనుచు
నడలుచున్నెడ సుమం - త్రాదులు హితులు
తడయ కానగరికి - తనరాక దెలిసి
వచ్చినవారల - వదనముల్ చూచి
యచ్చోటఁదగిన మ - ర్యాద సంధించి 7200
కనుఁగొల్కులను జల - కణములురాల
మనసులో భరతుఁ డు - స్మరించి పలికె.

—: భరత శత్రుఘ్నులు కౌసల్యనుఁ జూడఁబోవుట :—

"ఎఱిఁగిన వాఁడఁగా - నీకైక తలఁపు
ధరణిపై యాస యిం - తయు నాకులేదు
నామేనమామ యిం - టను వీరువనుప
సామనై ఖరి నుండి - శత్రుఘ్నుఁగూడి
యీరాము వనవాస - మెఱుఁగ నేమియును
చేరదులక్ష్మణ - సీతలరీతి
వనభూములను రఘు - వర్యునిచెంత
తనకు నప్పుడుగాని - తలగదుచింత" 7210
అనువేళ పరిచారి - కావళి వలన

వినిభరతునిరాక - వెలఁదికౌసల్య
తనచెంగటికి సుమం - త్రని చేరఁబిలిచి
కనలేక పుత్రశోక - మున నిట్లనియె.
"వచ్చెఁగదమ్మ జ - వ్వని కైకకొడుకు
ముచ్చటల్ దీరె రా - ముని మారునాకు
యింతమాత్రముభాగ్య - మే నిఁయుఁగల్గె
చెంతకుఁబోయి - చూచెద వెంటరమ్మ
యెరీతినున్నాఁడో - యేమందు చెలియ!
మారాము నెడవాసి - మనలేఁడువాఁడు" 7220
అని మాగధినిఁగూడి - యపుడ కైకేయి
కనకరత్న గృహంబు - కౌసల్యచొచ్చి
తనకా సుమిత్ర కై - దండయొసంగ
తనచాయగా రాగ - తల్లులంజూచి
తమ్ముండుదాని న - త్తరి నెదురేఁగి
యమ్మలయిరువురి - యడుగులన్రాలి
శోకింప నెప్పుడు - చూచెనోభరతు
వాకొనరాని య - వస్థల మునిఁగి
అవనిపైఁబడి మూర్ఛ - నంది వే తెలిసి
చివురాకు చేతుల - చేఁజేరఁ దిగిచి 7230
భరతుఁ గౌఁగిటఁ జేర్చి - భక్తిఁగౌసల్య
కరుణ నెమ్మదిడాఁచి - కలుషించి పలికె.
"కలఁగనేల? కుమార! - కైకేయివలన
సలరు మకంటక - మైనరాజ్యంబు
నీకుఁగట్టడచేసె - నీతల్లిగాన
చేకొమ్ము పట్టాభి - షేక సంభ్రమము

తల్లిని బోధించి - తనకుమారకుని
వెళ్లనంపితి మున్న - విపిన భూములకు
కైకేయి పనుపున - గహనంబునందు
నాకుమారుని వెంత - నను డించిరమ్మ 7240
రాజన్నవాఁడ నీ - రాముండునన్ను
నీజాడవిడనాడి - యేఁగెఁ గానలకు
యింక నెవ్వరిదాన - నిచ్చోటనుండి
సంకెళల్ వీడె భూ - జానిపోవుటను
కాదన్న యేను మా - గధియునుఁగూడి
యీదశరథు వెంట - నేఁగువారలము
లేక మీతల్లికి - లెంకలమగుచు
మాకేలయుండ - మీ మనసటమీఁద"
అన విని భయముతో - నాసాధ్వి పాద
వనరుహంబులమీఁద - వ్రాలియిట్లనియె. 7250

—: భరతుఁడు శపథములు చేయుట :—

"పావనశీల! యే - పాపంబు మదిని
భావింపనేరని - పట్టినింబట్టి
యింత నిందింతురే - యెఱుఁగవే నాదు
స్వాంతంబురామ వ - శంవర్తినేను
అక్కటా! శ్రీరాము - నడవుల కనుప
నుక్కుగుండియ వాడు - నోపునే తలఁప?
యెవ్వడింతకు దెగి - యిన్నియుం జేసె
దవ్వవానికి యశో - ధర్మ సద్గతులు

యిదినేఁ దలంచిన - నినమండలంబు
నెదిరి చూడకనిష్ఠుఁ - డేఁగెడు గతికి 7260
నిదురించు నావుఁ ద - న్నిన వానిగతికి
బెదరించి విప్రుఁ జం - పిన వానిగతికి
కొలిచిన వారల - కొలువు పాటెఱిఁగి
అలరించి జీత మి - య్యని వానిగతికి
ధరణియేలుచుఁ బ్రజఁ - దగినట్టి జాడ
నరసి ప్రోవఁగ లేని - యతఁడేగుఁ గతికి
యాగంబు లొనరించు - నపుడు దక్షిణల
చాగమియ్యని వాఁడు - చనియెడు గతికి
భీతిచే ననిలోన - బెదరెడు పాఱుఁ
బోతు బంట్రౌతులు - వోయెడు గతికి 7270
హితమతి నిగమంబు - లెల్లనుం జదివి
మతిలేక మఱచు దు - ర్మతి పోవు గతికి
నైవేద్య మిడక య - న్నము భక్ష్యములును
తా వేడ్కమెసవు పా - తకు లేఁగుగతికి
సజ్జనులగు వారిఁ - జవుకగా నెంచి
రజ్జులు వల్కు దు - ర్జనుఁడేగుగతికి
ధారణీసురలను - తన దైవమనుచుఁ
గోరికొల్వని పాత - కులు గూలుగతికి
కేరడంబులు వల్కి - గేలి సేయుచును
సూరుల నెంచు కిం - చులు వోవుగతికి 7280
నెఱుఁగని యర్థంబు - లెఱిగిన యల్ల
బరవకూఁతలు గూయు - పలవలగతికి

నొరులమేలునకు జూ - పోపకవారిఁ
జెఱుపఁ జూచినవాఁడు - చెడిపోవుగతికి
కండకావరమున - గర్వించి నగర
గొండియంబులు వల్కు - కూళలగతికి
ఐనయర్థంబు కా - దనియాసు వెనిచి
లేని కార్యములు వ - ల్కెడు వానిగతికి
నొరులుచేసిన మేల్మి - యుల్లంబులోన
మఱచి కీడాడు దు - ర్మతి వోవుగతికి 7290
బహుజన ద్వేషులై - బ్రతుకుల కొఱకు
తహతహ మెలఁగు పా - తకు లేఁగుగతికి
గుణములన్నియుఁ ద్రోచి - కొంచెపు తప్పు
గణుతించి తెగడు ము - ష్కరుఁ డేఁగుగతికి
కలిగియుండియుఁ జాల - కష్టుఁడై దాఁచి
బలిభిక్షములు మాను - పాపాత్ము గతికి
తీసిన ఋణము తా - దిద్దక యొరుల
మోసపుచ్చిన దురా - త్ముఁడు వోవుగతికి
నన్యుల దూషించి - యాత్మ ప్రశంస
లన్యాయముగఁ జేయు - నధముల గతికి 7300
తనపుణ్య ఫలమైన - తనయులు లేక
వెనక చింతింపని - వీఱిఁడి గతికి
నాలుబిడ్డలు మాని - యటు తన కడుపు
చాల పోషించు దు - ర్జనుఁ డేఁగుగతికి
ప్రత్యేక శాకాన్న - పాకముల్ బంతి
నిత్యంబు భుజియించు - నిర్భాగ్యుగతికి
తగవులో పక్షపా - తంబుగాఁ బల్కి
మొగమాట పడునట్టి - మూర్ఖుల గతికి

పరకామినీ ద్రవ్య - పరతంత్రు లగుచు
గరివించి మెలఁగు త - స్కరు లేగుగతికి 7310
పితృకర్మముల యందుఁ - బ్రీతి విశ్వాస
మితవును లేనివాఁ - డేఁగెడుగతికి
ఆలినొల్లక వెల - యాలి కిందగిలి
జాలిపుట్టి చరించు - చండాలుగతికి
యింతుల నందరి - యేక భావమున
వంతుకు నడపని - వాఁడేగుగతికి
నెలఁతల రాజుల ని - సువుల ద్విజులఁ
బొలియించు ఘోరపా - పులు వోవుగతికి
మధుమాంసలవణ సా - మగ్రి యమ్మించి
యధమ జీవనుఁడైన - యతఁ డేగుఁగతికి 7320
తనవంశ ధర్మంబు - దప్పి యన్యమున
మనసొగ్గి నడచు దు - ర్మతి వోవుగతికి
వెఱచిపారెడు వాని - వికువక సమర
ధరణిలోఁ జంప పా - తకుఁ డేగుగతికి
జీవహింసలు తెగి - సేయుచు మేని
కావరంబున నుండు - కలుషాత్ముగతికి
రసనకు సత్యంబు - రానీక యపుడు
వ్యసన పరుండైన - వాఁడేఁగుగతికి
నుచిత వ్యయముసేయ - నోపక కాని
యచటవెచ్చము సేయు - నల్పులగతికి 7330
నుభయసంధ్యల నిద్ర - లుడుగక పీత
శుభకర్ములైన నీ - చులు వోవుగతికి
దాఁచఁ బెట్టినయట్టి - ధనము లేదనుచు

నేఁచిబాసలు సేయు - హీనులుగతికి
నొరులకు హానిరా - నూరక యుండి
యెఱిఁగి తెల్పని యల్పు - లేఁగెడుగతికి
దేవాలయ క్షేత్ర - తీర్థ దూషణము
గావింపు చున్నట్టి - కలుషాత్ముగతికి
జగతి నభక్ష్యభ - క్ష్యములు చూడకయె
తెగి రుచుల్ గొనువాఁడు - తెగిపోవుగతికి 7340
కుమతియై గృహదాహ - కుఁడు వోవుగతికి
నమరగేహంబుల - యధికారిగతికి
ఋతుకాలముల యందు - నింతులఁ గూడి
రతిలేని దుష్కర్ము - రతుఁడేఁగుగతికి
మందుల మాయల - మగువలఁ జెఱిచి
పొంది రమించు న - ల్పులు వోవుగతికి
నమ్మి యేలిన రాజు - నడిపిన నతని
సొమ్ము వంచన సేయు - క్షుద్రుని గతికి
కొడుకుల నిల్లాలిఁ - గోపించి తఱిమి
కడుపు పెంచుచునున్న - కష్టుని గతికి 7350
అర్థులు వేఁడిన - నాసలఁ బెట్టి
వ్యర్థంబుగాఁ ద్రిప్పు - నధముని గతికి
జలములు నన్నంబు - చాల నించించి
పలవకూతలు గూయు - పాపాత్ము గతికి
తనసీమలో వారి - దండుగల్ వట్టి
ధనములార్జించు పా - తకుఁ డేఁగుగతికి
లేఁగ దూడలకు పా - ల్విడువక కట్టి
యాఁగోఁదలకుఁ బిండు - నతఁ డేఁగుగతికి

నీరాన్నముల చేత - నెవ్వ లొక్కరికి
దీరుపని ఖలుండు - ద్రెళ్లెడి గతికి 7360
గరళ మన్నంబులోఁ - గలయించి యొకరిఁ
జెఱుపఁ జూచినద్రోహి - చేరెడుగతికి
వాలాయముగ నేఁగు - వాఁడనో యమ్మ
ఏల నన్నీ మాట - లిపుడు వల్కితివి ?"
అని శోకపరవశ - యైన కౌసల్య
గని భరతుఁడు వల్క - కన్నీరురాల
పుడమిపై బొరలు న - ప్పుడు రాముజనని
యడలుచు మరల నా - యనఁ జూచిపలికె.
"అన్నయీా శపథంబు - లాడంగ నేల ?
నిన్ను నేనెఱుఁగ - నే ? నేఁడు నామనసు 7370
సురసుర నీసుత - శోకాగ్నిఁ గమలి
మరగు చున్నదిగాన - మరి తాళ లేక
ఆడితి సైరింపు - మనుచు నూరార్చి
నేఁడు నాప్రాణముల్ - నిలిపితి వీవు
రాముని నెనయు కా - రణమునఁ జేసి
నీమది చలియింప - నేర దెన్నటికి
అల లక్ష్మణునిఁ బోలి - యలఘు కల్యాణ
విలసన శ్రీలచే - వెలయుదు గాక"
అని భరతుని తన - యంకపాళికను
తనయ వాత్సల్యంబు - దళుకొత్త నుంచి 7380
తల్లియు కొడుకు నెం - తయు ప్రొద్దుజూచి
యొల్లరు శోకింప - నేడ్చి కౌఁగింటఁ
గలయంగ శత్రుఘ్నుఁ - గదియించి ముగురు

విలపించు నంతట - వేగు జామయ్యె.
తెలవాఱుటయును మం - త్రి యుతంబు గాఁగ
నలరువసిష్ఠ మ - హామౌని వచ్చి
భావికార్య విచార - పరతచే భరతు
నావేళ వీక్షించి - యతని కిట్లనియె.

—: భరతుండు తండ్రికి సంస్కారముచేయుట :—

"చాలింపు మింక వి - చారంబు తండ్రి
మేలెంచి తీర్పుము - మీఁది కార్యములు 7390
కలిగియున్నవి పెక్కు - కార్యము ల్మీఁద
కలఁగకు మన" విని - కాకుస్థకులుఁడు
గురునియానతి నూనె - కొప్పెరలోని
ధరణీశుఁ దెప్పించి - తానమాడించి
నవరత్న సింహాస - నంబుపై నుంచి
వివిధకాంచన వస్త్ర - వితతి గట్టించి
సారదివ్యపు భోగపు - సొమ్ములన్నియును
వరసతోఁ దెప్పించి - వానగై సేసి
కుండల మాణిక్య - కోటీర దివ్య
మండనంబు లమర్చి - మనుజేశుఁ జూచి 7400
" అయ్య ! యీయానతి - యాదల నుంచి
చయ్యన మాతుల - సదనంబుఁ జేరి
తడవుంటి నని మదిఁ - దలంచిరో నన్ను
కడకంటఁ జూడవు - కన్నులు దెఱచి
రామునిఁ బాసి తీ - రని చింతనున్న
భూమీజను లడంచి - పో నీకుఁ జనునె ?

నీ కుమారుండును - నీవును లేక
యేక్రైవడి శుభంబు - లెనయు నీపురము
మా మేనమామ సే - మము వేఁడిమీకు
కామించి పనుపు కా - న్కలు చూడవేల? 7410
కష్టాత్మయైన కై - కకు వీఁడు కొడుకు
దుష్టాత్ముఁడని కడం - ద్రోచి పోయెదవొ
తల్లిని మఱియించి - దండ కాటవికి
చెల్లరె రాముఁ బం - చిన ద్రోహియనియొ
పుడమిపై నేడ్చుచుఁ - బొరలు సుమిత్ర
కొడుకునై ననుఁ బేరు - కొని పిల్వ వేల?
వాఁడేమిచేసె భూ - వర! రామచంద్రుఁ
డేడి తానేల మి - మ్మెడ బాసిచనియె?
ధైర్య గాంభీర్య స - త్య పరాక్రమాది
చర్యలన్నియు నెందు - సడలె నీకిపుడు? 7420
లోకముల్ గెలువఁ జా - లుదువు నీవిట్టి
కైకమాయలు గెల్వఁ - గా నేరవైతి
పతిఁబాపు సుతుఁబోవుఁ - బాసి కౌసల్య
వెతల నెవ్వరియాన - వేగించు నింక?
యిదిబుద్ధియని యాన - తీవయ్య తండ్రి!
యది యాచరించెద - నర సేయనేల
పోవుదునో వనం - బుల కన్నవెంట
మీవెంట వత్తునో - మీరు గన్నట్టి
తనయునకుం గల - దా యసత్యంబు?
పనిగొమ్ము సేతునీ - పదముల యాన'' 7430

అని ధూళిధూసరి - తాంగుఁడై పౌరలు
మనువంశనిధిఁ జేరి - మంత్రులు వినఁగ
ఆ వసిష్ఠుఁడు వల్కె - " నవని పాలునకు
గావింపు ముత్తర - కర్మంబు లిపుడు "
అనుసంత ఋత్విజు - లగ్నులన్నియును
గొని తేరఁ బరిచారి - కులు దశరథుని
పల్లకిలో నుంచి - బహుతూర్యరవము
లుల్లసిల్ల మహీశు - లోలగింపంగ
చతురంగ బలములు - సందడి సేయ
హితమతి మును గల్గ - నేఁగుచో వెంట 7440
మగువలు హేమచా - మరములు వీవ
పొగడుమ భటులు గుం - పులుగూడి నడవ
రాజుపల్లకి వెంట - రాజీవముఖులు
లాజలు నాగద - శంబులుఁ జల్ల
ఆసించు వారలు - యడిగిన యట్ల
వాసో విభూషణ - వ్రజ కనకములు
ఆవుల కదుపులు - నధికారి జనులు
రావించి వెదచల్ల - రాజమార్గమున
భరతుండు వెంబడి - బాంధవుల్ హితులు
దొరలు రా కాల్నడ - తో నశ్రులొలుక 7450
జారిన కేశ పా - శంబుల తోడ
తారిన మేనితో - తమ్ముండు దాను
పోవుచుండఁగ నంతి - పురినుండి వెడలి
దేవేరులందరు - దిడ్డితో నమరు
చతురంత యాన పం - చాదశత్రితయ

శతములలో వెంటఁ - జను దేరవారు
రాజన్యుఁ బురి యుత్త - ర ద్వార సరణి
భూజనుల్ పొక్క న - ప్పుడు గొనిపోయి
సరయూనది ప్రాంత - సైకత క్షోణి
నిరవు కొల్పినయంత - ఋత్విజు లెల్ల 7460
చందనాగరు మహి - షాక్షి కర్పూర
కందళి గుగ్గులు - కస్తూరి కాది
మహితచితా కాష్ఠ - మధ్యంబునందు
మహీపాలు నునిచి స - మస్త భూసురలు
నిగమముల్ పఠియింప - నెలఁత లందరును
జగతీశుచుట్టు క్రొం - చ స్వరంబులును
రోదనం బొనరింప - రోహణా చలము
పై దవానలములు - బలసిన యట్లు
భరత చరిత బృహ - ద్భాను కృత్యంబు
వరమంత్రయుతముగా - వర్తిల్లె నంత. 7470

— భరతుండు శ్రాద్ధములుఁ జేయుట. —

సరయు మహానదీ - స్నానంబు చేసి
భరతుండు దానముల్ - పౌరుల కచ్చి
అందరతో నయో - ధ్యా పట్టణంబు
నందుఁ బ్రవేశించి - యటు తరవాత
సూతక దినములు - సోఁకోర్చి తగిన
రీతిఁ గ్రమించి యా - రేయి వేగుటయు
ధేనుప్రదాన ధాత్రీ - దాన కనక
దాన కన్యావస్త్ర - దాన మాణిక్య

దాన దాసీ - దాన దానగజాశ్వ
దాన నానామహా - దానముల్ చేసి 7480
భరతుండు తండ్రికి - పరలోక విధులు
పరిపాటి నొనరించి - బాంధవావళియు
హితులు మంత్రులుంబురో - హితులును వెంట
జతగూడి నృపతిసం - స్కారాది యైన
పదియు మూఁడవనాడు - భరతుఁ డిల్వెడలి
నది కేఁగి చితిశోధ - నంబు గావించి
జనకు నుద్దేశించి - చాల శోకమున
మనసులోఁ గుందుచు - మమత నిట్లనియె.
" రాజేంద్ర! వనులకు - రాఘవుం డరిగె
నీజాడ దినమున - కేఁగితి వీవు 7490
మీరు లేని యయోధ్య - మిన్నక యెట్లు
చేరెదువాఁడ ? ప - ర్జింపుదుఁ గాక!
సుతు నెడవాసిన - చోటఁగౌసల్య
వెతనొంద నెక్కడ - విడిచి పోయితివి ?
మా కేది దిక్కు " ని - మరియు వాపోవ
నాకడ కడ నమా - త్య శ్రేణిచేరి
మునులు యయాతిని - మూఁగు కున్నట్లు
యినవంశమణికి చా - రెల్ల వైరాగ్య
కారణ కథనముల్ - కనుపింపనొక్క
మేర శత్రుఘ్నుండు - మేదినిఁ వ్రాలి 7500
హాతండ్రి! యెచ్చటి - కరిగితివీవు
సీత మే నీయంత - నృపతికి పాటు ?

మందరచేత స - మగ్రమై పుట్టి
యందుఁ గైకేయీ మ - హా జలగ్రహము
చరియించు నీశోక - జలరాశిలోన
తరణి వంశంబున - త్రైక రత్నమునఁగ
నీలాలనకుఁదగు - నీలాలకోరు
బాలచంద్ర విభాసి - ఫాలునిభరతు
నెవ్వరిచేతికి - నిచ్చి పోయితివి ?
యెవ్వ రున్నారు మా - కిటమీఁద దిక్కు 7510
భోజన మజ్జన - భూషణాంబరము
లోజనక ! యెఱింగి - యొగు లొసంగుదురె ?
మముఁ జేరఁ బిలిచిన - మ్మతితో నొసంగ
తమతండ్రి యే - తండ్రి ధరణికి నెల్ల
నెప్పుడు ధాత్రిని నీ - నెడవాసి పోయి
తప్పుడ రెండు ప్ర - య్యాలుగాక యుండి
కుదురయి యున్నచో - క్షోణికై యజుఁడు
తుదిగన్న నాఁడునెం - దునుఁ జేటులేదు
యేను నయోధ్యకు - నేల పోవుదును ?
మాని వేషమునఁగ్రు - మ్మరుదుఁ గానలను" 7520
అనియిట్లు శోకించు - నక్కుమారకులఁ
గనియెల్ల వారలు - కటకటం బడఁగ
తేరిచూచి యరుంధ - తీ ప్రాణవిభుఁడు
చేరి యాభరతుని - చేఁ జేతఁ దిగిచి
యిలమీఁద వసియింప - నిడియిట్లు వలికె.
"కలఁగుదు రయ్య ! యీ - గతి ధైర్యనిధులు

—: వసిష్ఠుండు భరతునకుఁ బోధించుట :—

నినువంటి సుతులు - మానిత పుణ్యులైన
జనపాలకునిఁ బోలు - జనకులుం గలరె?
కావించితివి పితృ - కర్మంబు విమల
భాసంబుతోఁ బూని - పదుమూఁడు నాళ్లు 7530
నీచేతతండ్రి వ - న్నియగాంచె వేల్పు
రాచవారలలో పు - రందరు పీట
సకల జీవులకును - సాధారణములు
ప్రకట భోజనబుద్ధి - పానీయ వాంఛ
మోహంబు శోకంబు - ముదిమియుఁ జావు
దేహధారులకు సం - దేహ మేమిటికి?
గుంతయు నెఱింగియు - నింత విచార
మెంత యేనియుఁ - జేయ నేటికి? రమ్ము''
అనిపలుక సుమంత్రుఁ - డపుడు శత్రుఘ్ను
ననునయాలాపంబు - లాడి యూరార్చి 7540
ఆక్రోశనూరకుల నో - య్యన బుజ్జగించి
సాకేతమున కేఁగ - సముకట్టె నపుడు
భరతుఁడు వనికేఁగ - పైనమై యుండ
తఁగాంచి యతనితో - తమ్ముఁడిట్లనియె.

—: శత్రుఘ్నుండు మందరను శిక్షించుట :—

''నోయన్న! మనయింట - నొకనాఁడు లేని
నాయంబు నడపించి - నాఁడు రాఘవుఁడు
కంటివే తండ్రి మా - ర్గముచూచి నేము
వెంటఁ గూర్చుక పోయె - నెలఁది గానలకు

అలిమాటలు విని - యవుఁగాము లెన్న
కేలలోంగెనో తన - కిది చెల్లు బడియె? 7550
యింతటి గుణశాలి - యిటులైన చోట
నింతుల గెలుచు వా - రెవ్వ రున్నారు?
తానైన మన సుమి - త్రా కుమారకుఁడు
మానవనాథుని - మతి చలియించె
నెంత లేదనినిగ్ర - హించి శ్రీరాము
చెంతనుండిన వాఁడు - చెడకుండ కులము
కైకయెన్నికె మాన్పఁ - గా నోపఁడయ్యె
నీకుఁదీరదు తెచ్చి - నిలుపక యున్న"
అనిమాట లాడుచో - నల వసిష్ఠాది
మునులు మంత్రులునుఁ గ - మ్మక వారివెపక 7560
పొదివెట్టుకొని వచ్చి - పురములోఁ జొచ్చి
యెదురైన దొరలంత - నింతఁ గేల్ మొగుప
నగరి తూరుపు దివా - ణంబు వాకిటను
జగతీశ సుతులేఁగు - సమయంబు నందు
"యింతకార్యము నిర్వ - హించిన నన్ను
యెంతమెచ్చునో కదే - యిఁక భరతుండు
ఆతని యభిషేక - యత్నంబు చేరి
చూతునే నని" మున్నె - చొరఁబారి నగరు
కైకయిచ్చిన యన - ర్ఘ విభూషణములు
కోకలుఁ గైచేసి - గునుకు లేనడను 7570
పెనుగొలుసునఁ జిక్కు - పెంపుడుఁ గోంతి
యనువున గలగల - నందెలు మొఱయఁ
ఘైకయింటికిఁ బోవఁ - గని యందు నున్న

వాకిటి కావళ్ల - వారరికట్టి
దానిఁ బట్టుక తెచ్చు - తరిమహారాజ
నూను లచ్చటికి రాఁ - జూపర మెచ్చ
గొల్లలు శత్రుఘ్నుఁ - గోపంబు రేఁచి
"యెల్ల కార్యములకు - హేతువీ జంత
రాముఁ గానలకంపి - రాజన్యుఁ జంపి
సీమవారినిఁ జెఱ - చి" నది దియనుచు 7580
చూపిన మీరలు - చూడంగ నిపుడె
ఆ పాపములకు ప్రా - యశ్చిత్త మేను
చేసెద" నని తన - చేఁ గొప్పువట్టి
తీసిధారుణిఁ బడ - ద్రెళ్లఁగ నీడ్చి
యేనుఁగ యనకాల - నిడి నేల రాచి
గూనుబోరయుఁ దన్ని - గులగులల్ చేసి
యిలమీఁదఁ బొరలింప - నేడ్చుచోదాని
యెలుఁ గాలకించి స - హింపంగ లేక
కైకేయి మదినోర్వఁ - గా లేకయింటి
వాకిలి వెలువడి - వచ్చి మందరకు 7590
సద్దంబు వచ్చిన - సదలించి కూచి
అడ్డియంతయుఁ గీగె - నైసట్టు లయ్యె
వేగ రమ్మను మాట - విని భీతినొంది
వేగంబె భరతుని - వెనుకకు జాఱి
నాపుణ్యనిధివల - దన్న! శత్రుఘ్న!
పాపంబు వచ్చు చం - పకు మాటదాని
నేనుచంపఁగ నేర - నే? కైక బట్టి
పూనిచేసిన ద్రోహ - మున కోర్వఁగలనె!

కన్నతల్లినిఁ జంపె - కలుషాత్ముఁ డనుచు
నన్నుఁ జూడఁడు మహీ - నందనాప్రియుఁడు 7600
దాసి పొమ్మనది యని - దండించి తేని
వాసియుఁ బోవు - స్త్రీవధ మాచరించి
వీడని నీమోము - వీక్షింపఁ డొక్క
నాఁడును దశరథ - నందనోత్తముఁడు
రాముని కొఱకు నీ - రల దగఁ జూడ
నేమిటి కెటువోయి - రేమి పోనిమ్ము"
అనవిని శత్రుఘ్నుఁ - డగుఁ గాకయనుచు
దనచేతి ఘాతల - ధరణిపైఁ ద్రెళ్ళి
తన మేని సొమ్ముల - ధరణి తలంబు
మినుకుఁ జుక్కలతోడి - మింటితో నెనయ 7610
బుసకొట్టు మందరఁ - బొమ్మని వదల
బసువెద్దునుం బోలి - బడిదొత్తు లెల్ల
తమునేలి నట్టి మం - దరఁ బట్టినపుడె
తమకేది దిక్కని - తమకించి పఱచి
కౌసల్య పదములు - గని శరణొంద
నాసాధ్వికని పోవ - నమ్మందరయును
కైక చెంగటఁ బడి - కన్నీరు రాల
శోకంపుటయు దానిఁ - జూచి యవ్వేలఁది
సమ్మతపడఁ బల్కి - సదనంబు చేరి
నిమ్మకాయలును నూ - నెయు దానికిచ్చి 7620
అణఁకువతో నుండ - నక్కుమారకులు
కణఁక శోభనకర్మ - కలితులై రంత.

—: భరతుఁడు రామునియొద్దకుబోవ మార్గమును
చక్కఁజేయ నాజ్ఞాపించుట :—

మఱునాడు మానులు - మంత్రులుఁ గూడి
" భరతునిం జేరి - యోపావన చరిత !
రాజులేనట్టి యీ - రాజ్యంబు చూడ
రాజులేనట్టి యీ - రాత్రియ పోలె
మనుజులు మంత్రుల - మాటలు వినక
తనతన యిచ్ఛగాఁ - దలఁచిన యట్లు
మెలఁగ నూరకయుండ - మేరయే రాజు
పోలిసి రాముఁడు వనం - బులను నేఁగుటను 7630
" అయ్య ! నీవురకున్న - నవనికి నెల్ల
నయ్యో నవాంతరం - బట్లుండ రాదు
గ్రిక్కున పట్టంబు - గట్టుకొమ్మిన్నావు
దిక్కయి నిలుపు ధా - త్రీ జనావళికి
యివె యగ్రతోయ స - మేత కుంభంబు
లివె ఛత్రచామరరా - నేక వాద్యములు
మంగళ ద్రవ్య సా - మగ్రినీక్షింప
సింగపు గద్దె యుం - చితి మజారమున
వినియోగముల వారు - వేగ్వేర వచ్చి
పనిపూని యున్నారు - పార్శ్వ భాగముల 7640
లేచిరమ్మన ముకు - ళీ కృత హస్తుఁడై
చామరాది చి - హ్నములకు మ్రొక్కి
పరిపూర్ణ కనక కుం - భ ప్రదక్షిణముఁ
దిరిగి మంత్రులం జూచి - గీరుఁడై పలికె.
" యీ మాటలాడు దు - రే ? రఘువంశ

భూమీశ్వరుల శీల - ములు వినలేదె?
అన్నయుండఁగ తమ్ముఁ - డందునే రాజ్య
మిన్నినాళ్లకు వింటి - మీ వింతనేఁడు
యెప్పుడుఁ గలవార - లిందరు మాకు
నిప్పుడు గానివ్వ - రున్నారు క్రొత్త 7650
పట్టంబు గట్టుఁడు - పట్టి కౌసల్య
పట్టినే నుండెద - పదునాలు గేండ్లు
కానలయందు రా - ఘవు మాలుగాఁగ
సేనలం బయనంబు - సేసుక రందు
మంత్ర పూతంబుగా - మంగళ ద్రవ్య
సంత్రాణ మొనరించి - చనుదెందు వెంట
మనమందరము బోయి - మరలఁ బ్రార్థించి
జనకజా జానిన - చ్చటనె పట్టంబు
కట్టి శాలాంతర - గతుఁడైన వహ్ని
నెట్టుక తెచ్చిన - నేన్పు సంధిల్ల 7660
తెత్త మయోధ్య కా - దీన మందారు
నిత్తము కాదన్న - నీ శరీరములు
మనుజుల నంపించి - మార్గ మధ్యమున
వనములు నరకిన్రో - వలు చక్కఁ జేసి
చలిపందిరులు జలా - శయము లేర్పఱిచి
నిలుకడ విడుదు ల - న్నియు జోకపఱిచి
తెరలు గుడారు లె - త్తించి సరాతు
లిరవుగాఁ గట్టించి - యేముఁ దల్లులును
పరిచాగకులును రాఁ - బల్లకీల్లోక
పఱపించి కొల్లారు - బండ్లు దెప్పించి 7670

చతురంగ బలముల - సాగించి తగిన
యతనంబు గావింపుఁ - డని పల్కుటయును
ఆ సుమంత్ర ప్రముఖామాత్య వరులు
రాసుతుంగని క్రమ్మ - ఱఁగ నిట్టులనిరి.

—: వన మార్గమున జక్క బఱచుట :—

''నిన్నుఁ జేరినయట్టి - నిఖిల రాజ్యంబు
నన్నకు నేనిత్తు - నని పల్కినపుడె
జగతి నెంతటి భాగ్య - శాలివి నీవు
తగుఁ నీకు శుభము లం - దంగఁ జాలుదీవు
పొందు నిందిర - నిన్ను పుణ్యాత్మ''యనిన
యందర మధురోక్తు - లతఁ డాలకించి 7680
నయనాంబుజంబు లా - నందాశ్రు సిక్త
బయునమై యున్న వోఁ - బనుల వారెల్ల
అయ్యా! సర్వంబు నే - డాయత్త మయ్యె
నయ్యడవులు దీర్ప - నైన శిల్పులను
పనిచితి మనివారు - పలుకు నవ్వేళ
వనమార్గములు దీర్ప - వచ్చినవారు
పారలు నుప్పర - పారలు గడ్డ
పారలు చెక్కుడు - పారలు మడ్డు
గత్తులు గొడ్డండ్లు - కన్నెలుం గొలిమి
తిత్తులు దన్నీరు - తిత్తులు కరకు 7690
కొడవండ్లు నెడ్లను - గోనెలుఁ దాటి
గుడము సున్నంబు సం - కులుఁ గావిరాళ్లు
పంచవర్ణ ద్రవ్య - భాండముల్ నీరు

మంచముల్ నిచ్చనెల్ - మ్రాకుల బండ్లు
చించపు రేకులు - చింతయంబళ్లు
పెంచులు నిటికలు - బేర్పులు నూనె
లగపలు కణికలు - నావులు కెట్లు
నగరి బొక్కసము గు - న్నాపట్ట కరక
కాయలు పంచాణి - కపుఁబనిముట్లు
చాయల వస్తువుల్ - జల్లులు మేలు 7700
కట్టులు శుకశారి - కాపంజరములు
పట్టెమంచంబులు - పటపులు దివియ
గంబముల్ వెండి - బంగరు కొప్పెరలును
కంబళ్లు మెరుగులు - గాజుఁ గుండలును
మొదలైన సాధనం - బులు బరువులును
పదలంబు ముందర - సాగించు నపుడు
చెట్టులు గొట్టి ప - చ్చికలు చెక్కించి
మిట్టపల్లము లొక్క - మేరగాఁ జేసి
బావులు ద్రవ్వించి - పందిళ్లు వేసి
త్రోవచక్కఁగఁ జేసి - తోపు లూడ్పించి 7710
కలయంగ గంగోద - కంబులు చల్లి
చలువ నీడలచెట్ల - చాలు నాటించి
పాళెముల్ విడుదు లే - ర్పఱచి నగళ్లు
వేళంబె నిర్మించి - వీధు లమర్చి
అంగళ్లు వేయించి - యపుడు సాకేత
గంగానదీ మధ్య - గత వసుంధరను
యెడమింతయును లేక - యెవ్వ రెచ్చోట
నడిగిన వస్తువు ల - న్నియుఁ గలుగ

దివిజ మార్గము రీతి - దివ్య వాసనల
పుప్పొడావి చప్పరం - బులు మిన్నుముట్ట 7720
మలయమారుతములు - మలయు బీరెండ
పొలప మించుకదైనఁ - బొరయంగ నీక
యన్నియు శుభముహూ - ర్తాయత్తమగుట
న న్నగరీజనం - బది విని యలర
వేగుఁ(బొద్దున మహీం - విభుఁనింట వంది
మాగధగీత సం - పదలు సొంపెసఁగ

—: భరతుండు శోకించుట :—

నిద్దుర మేల్కని - " నేరాను గాను
బుద్ధిగాదిదినన్నుఁ - బొగడి మేల్కొలుప
నిటపట్టి చాలింపుఁ - డిట్టి మర్యాద
లిటువంటివియుఁ దగు - నే? యంచుఁబలికి " 7730
అని దమ్ముఁడును విన - నాఁడు నాభరతు
గనుగొని సతులెల్లఁ - గాంచి శోకింప
నా వేళ భాను వం - శాచార్యుఁడైన
యావసిష్ఠుండు శి - ష్యగణంబుఁ గొలువ
ధరణిపై (బ్రాలు సు - ధర్మయో యనఁగ
నిరుపము నవరత్న - నిర్మితంబైన
కొలువుసావడి మీఁద - గూర్చుండి వార
కులము నిరీక్షించి - గొబ్బున మీరు
హితుల బంధులఁ బురో - హితుల నాప్తులను
క్షితిపాలకుల నను - జీవులమున్న 7740

ధరణీ సురలఁ బిల్చి - తనదు చెంగటికి
భరత శత్రుఘ్నుల - పాలికి నేఁగి
తోడుక రండన్న - తోడనేవాడ
వాడల వారెల్ల - వారలం బిలువ
నందరుఁ జేరిన - యప్పుడు రాజ
నందనుల్ జనులు మ - నంబులం బొదల
కొలువు సావడిఁ జేర - కోమరొప్పఁ జూడ
కలశాబ్ధివడు చక్కిఁ - గను పట్టుచున్న
తిమి తిమింగిలములఁ - దేరఁ గొప్పమడుగు
క్రమమునఁ గొలువుఁబు - రంబుఁ జూపరను 7750
రాజు లేఁడను విచా - రము లేక భరతు
రాజుఁగా నెంచి పౌ - ర జనంబు వొదల

—,భరతుఁడు పౌరులతోఁ గూడి రామునికడకుం బ్రయాణమగుట:—

గురు భార్గవులచేత - గొమరొప్ప సభము
హరిణాంకుఁడన వసి - ష్ఠామాత్యయుక్తి
భాసిల్లు సభచూచి - భరతునిం జూచి
నాసభ వారెల్ల - నంజలి సేయ
శారద యామినీ - చంద్రుఁడో యనఁగ
నారఘుకుల వీరుఁ - డల్లన చారు 7760
చతురనీతికళా వి - శారదుం డగుచు
నతనితో నిట్లని - యాచార్యుఁ డనియె.
"అన్న! మీతండ్రి స - త్యంబె పాలించి
యున్నత సత్కీర్తు - లొందె నాకమున
శ్రీరామ చంద్రుఁ డూ - ర్జిత ధర్మరతుఁడు

చేరి ఘోరారణ్య - సీమల కతఁడు
యిరువురు నీకిచ్చి - యిలయెల్లఁ గాన
ధరణికినెల్ల క - ర్తవు నీవె సుమ్ము.
రహిఁబూను మిపుడు సా - మ్రాజ్య పట్టంబు
బహుళంబుగా నులు - పలుఁ గానుకలును 7770
గొని తెచ్చి యెల్ల ది - క్కుల మహీవిభులు
నినుఁ గొల్వవాకిట - నిండి యున్నారు"
అనియిట్లు కులగురుం - డాడిన మాట
వినియేమియునుఁ బల్కు - విధము చొప్పడక
"అయ్య! యేమని యిట్లు - లానతిచ్చితిరి?
చయ్యన తనబ్రహ్మ - చర్యంబు నందు
గురుశిక్షితుం డయి - గుణవంతు లందు
సరిలేని మాయన్న - సామ్రాజ్య పదము
వదలక ననువంటి - వాఁడు గైకొనునె?
అదియేఁటి మాట స - త్యంబె వాకొనుము 7780
యే రామునిం జేర - నిప్పుడే పోదు
నీరాజ్య మంతయు - నినవంశతిలకు
రాజ్యమేలఁగ నన్ను - రక్షింప లోక
పూజ్యుఁడా కౌసల్య - పుత్రుఁడున్నాఁడు
అటుగాన నే వంశ - హానికి వెఱతు
నిటువంటి రాజ్యంబు - లేలుట యెంత?
ముల్లోకములఁదన - ముద్దుటుంగరము
చెల్లఁ బ్రోవఁగఁ జాలు - సీతా వరుండు"
అనుమాట వినినంత - నాసభాజనుల
కనుఁగవల్ బాష్పాంబు - కణములు గురియ 7790

మఱియు నిట్లనియె "నో - మానివరేణ్య!
యరుగుదు నిపుడునే - నందఱిం గూడి
రాముని చరణ సా - రసములు గాంచి
యా మహామహునిర - మ్మనుచుఁ బ్రార్థింతు
నతఁడు రాఁడేని నే - నచట సౌమిత్రి
జతగూడి కొలుతు ద - చ్చరణ పద్మములు
పయనంబు చేసితిఁ - బరిజన శ్రేణి
రయమున గహన మా - ర్గము చక్కఁ జేయ
తమకింపు చున్నది - తలఁపు యాత్రకును
మమునంపుఁ" డని యాసు - మంత్రుతోఁ బలికి 7800
"బలములఁ బిలిపించి - పయనంబుఁ గమ్ము
వలయునట్టి ప్రయాణ - వస్తువు లెల్ల
చేకూర్చు కొమ్మ"ని - చెప్పిన నతఁడు
నాకై వడి తగి - నట్టి వారలను
పనిచి పైనము చాటఁ - బౌర జనంబు
ననురాగమునఁ బొంది - యట్ల కావింప
యిల్లాండ్రు పురములో - నింటింటి తమదు
వల్లభులనుఁ జూచి - వనులకు జనుఁడు
'రాముని దోడితెండు - రయమున నేల
తామసించెదర" ని - తరువులు సేయ 7810
నందఱు బయనంబులై - వీడు వెడలి
ముందర చతురంగ - ములతోడ గదల

—: భరతుండు పయనమైపోయి గంగాతీరంబు చేరుట :—

భరతుఁ డాచార్యుని - పనుపున మంత్రి

వరుఁజూచి "రథము దే - వలయు నీవ"నిన
నతఁడట్ల తెచ్చితి - నని పల్కుటయును
చతురుఁడై యమ్మహా - స్యందనం బెక్కి
ఖరిమ లుష్ట్రములు రో - క్కములు సొమ్ములును
బరువులుం గొని తేర - బంధులు దొరలు
రాజులు వెంట నే - రాళంబు గాఁగ
నేజాడ నెడమీక - నిరుగడంగొలువ 7820
చామర కేతన - చ్ఛత్ర చిహ్నములు
సామజ హయభట - స్యంద నావళులు
భేరీ మృదంగాది - బిరుద వాద్యములు
భోరున నొక్కమొ - త్తముగ నుర్వఁగదల
నడచుచో డిండిమ - నాదముల్ మొరయ
పడగలు నక్షత్ర - పదము గోరాడ
నిగళంబు లిల దు - మ్ము నెగయించిదాన
గగనవాహిని రొంపి - కాల్వఁగా జేయ
తొమ్మిదివేలు దం - తులు రాజవాహ
నమ్ములు రథము ముం - దర నడతేర 7830
అరువదివేలు మ - హా రథశ్రేణి
దొరలతో సూతుల - తో వెనకరాఁగ
మావులప్పుడు వీర మల - హరుల్ మొరయ
క్రేవలఁ జామర - శ్రేణిపై నాడ
అడుగుల నపరంజి - యందెలు గులుక
జడగుంపు మెడనంపు - చాయనల్లాడ
వాలచామరములు - వలమాన గతులు
చాలఁ ద్రిప్పుచును కై - జామోరలార్చ

పడివాగె తేజీలు - పదినూరు వేలు
కడవాగె సాదులు - గైకొనినడవ 7840
పొగరు జీనాస్వాలి - బొందుల మోర
సిగకొత్తమొలపము - సేయఁ గత్తులును
బురుసాకుమాలు ల - బ్బురపుమైఁ బూఁత
పరిమళంబులు దు - ప్పటి వల్లెవాట్లు
పట్టు చల్లడములు - పైదట్ల మీఁద
గట్టిన వంకులుం - గల వీరభటులు
కైజీత మొకకోటి - కన్నుల యెదుర
రాజమార్గము నిండి - రా భరతుండు
తమ్ముఁడాచార్యుండు - తమ ప్రధానులును
కమ్మక మణిశతాం - గములపైఁ గదల 7850
కౌసల్యయు సుమిత్ర - కైకేయి మున్న
గాసాధ్వు లందఱుఁ - గనక పల్లకుల
గొల్ల లాప్తులుఁ గంచు - కులు చేటికలును
పల్లకీలను వెంటఁ - బాయక రాఁగ
వెలయు డెబ్బదిరెండు - వినియోగమునకు
గలవారు నలుదిక్కు - గదిసి భజింప
మున్నుగాఁ గోమట్లు - ముదుసళ్లు సెట్లు
సాన్నారములవారు - సూపకారులును
పౌరులు నటులును - పారికులాట
వారును కంచర - వారును కాశ 7860
వారును సాదపని - వారును సాలె
వారును పటుసాలె - వారును ముచ్చి

వారును కుమ్మర - వారును చాకి
వారును చాయల - వారును పనుల
వారును కటికిరి - వారును వడ్ల
వారును మేదరి - వారును గంధ
కారులు జెట్లును - గణికులుఁ జెప్ప
వారును మాంత్రికుల్ - వైద్యులు సోది
చెప్పెడు వారును - శీర్షాల వారు
చొప్పరులుఁ దలార్లు - జోశ్యులుం గదల 7870
భరతుం డష్టకములు - వాడుచు నున్న
ధరణి దేవతల ర - థంబుపై నునిచి
కదలి యింద్రునిరీతి - గంగా తటంబు
కదిసి సేనలు డిగ్గఁ - గా నెచ్చరించి
అపుడు సుమంత్రుని - యాచార్యుఁ జూచి
యపరాహ్ణ మయ్యెనేఁ - డలసిన వారు
జనులెల్ల మనము ని - చ్చట నేఁడునిల్చి
యినుఁ డుదయించు చో - ని మ్మహానదిని
తమ తండ్రికిని వారి - దాన మొసంగి
సమచిత్తమున రేపు - చనుద మవ్వలికి" 7880
అనివారి విడుదల - కనిచి కైకేయి
తన నగరను కూర్మి - తల్లులుం దాను
యెప్పుడు దలవాచు - నెప్పుడు పోదు
నెప్పుడు రఘురాము - నీక్షింతుఁ ననుచు
తమ్ముఁడుఁదా నొక్క - తల్పంబు నందు
సమ్మతి శయనించు - సమయంబు నందు

—: గుహుండు భరతుని సత్కరించుట :—

గుహుఁ డింతయును కనుం - గొని ముఖ్యులైన
గహనచారులఁ దన - కడ వారిబిలిచి
చూచితిరే ? బహు - స్తోమముల్ వచ్చె
నేచాయ నిలమీఁద - నెడమింత లేక 7890
చతురంగ బలముల - సంఖ్యంబు లింత
యతిశయించిన రాజు - లన్యు లున్నారె?
తళతళమని కోవి - దార ధ్వజంబు
నెలయుచున్నది మహీ - విభు తేరి మీఁద
రథము చెంగట నవే - రవివంశ నృపుల
పృథుతర కాహళ - బిరుదముల్ దోఁచె
భరతుఁడె యితఁడు త - ప్పడు మనమీఁద
బెరిగి దండెత్తిచం - పెదనని తలఁచి
వచ్చెనో లేక యి - వ్వసుమతికాంతు
నెచ్చట నున్న ఁజో - నిత్తునే యనుచు 7900
రామునిమీఁదఁ దీ - రని మచ్చరమున
నీమేరవచ్చెనో - యెఱఁగ మేమియును
నెటులైన నేమిది - యేర్పడుదనక
నటునిటు నొక్కరి - నైనఁబోనిక
యోడలే నూరు నా - యోధ్ధునంగట్టి
యోడకు నూఱేసి - యొంటర్లనునిచి
పదిలమైయుండుడు - భరతుని హృదయ
మిదినిశ్చయం బని - యేర్పడు వెనక
చేతనైనట్టు చూ - చెదమని పనిచి
యాతరి నాట వి - శావళిగొలువ 7910

కుందేటి చట్టలు - గునుకుఁబ్రాల్దేనె
బిందెలు గసగసాల్ - పేర్పులుచార
పప్పును పికిలిపూ - బంతులు నేస్గ
గొప్పకొమ్ములునాలు - గులుఁ బులితోళ్లు
జవ్వాది పిల్లులు - జల్లులు వేఁట
దువ్వాలు నేదు - పందులు కేరిజనులు
బిరుదు జాగిలములు - పీలిజల్లులను
పొరలతో కప్పురం - బును సెలవిండ్లు
రాపువ్వులేటిగో - రజమును తాంద్ర
చాపలు మొదలైన - సకలవస్తువులు 7920
కానుకల్ దెచ్చినఁ - గని సుమంత్రుండు
మానవాధీశ కు - మారునిం జేరి
' అయ్య! యిచ్చట గుహుం - డను పాళెగాఁడు
నెయ్యుండు మనరాము - నికి వీనితోడి
చెలిమి మీకును వల - సినది యిచ్చోటి
నెలవరి యోడల - న్నియు వీనివశము
రాముఁడున్నట్టి మే - రయు వీఁడె తెలుపు
నేమున్నెఱుంగుదు - నితనివర్తనము
కానుకల్గొని పొడ - గనిపించుకొనుఁడు
వానిఁబిల్తునె మంచి - వాఁడనిపల్క 7930
యనుమతుఁడైనచో - నా సుమంత్రుండు
చనుమానముఁదెచ్చి - సంధింపఁజేయ
నతండు పైకానుక - లన్నియునిచ్చి
యతిభక్తిభరతుని - కంజలిచేసి
'' దేవ! మీరిట కరు - దేర నీయడవి

భావింప నుద్యాన - భంగిఁ జూపట్టె
యిదిమాకునెంకి యే - మెల్ల నిచ్చోట
వదలకుండుదుము మీ - వారైన యెపుడు
కడులాఁతివారము - గాము సుమయ్య
విడిసియుండుము నాదు - వీట నీప్రొద్దు 7940
సేనలకే విందు - సేసెదనేఁడు
కానుక లివియేమి - గావలె? మీకు
మావంగడము చూచి - మదిలోననన్ను
నేవగింపక సెల - విడి పనిగొమ్ము
స్వామి! యెంతటికైనఁ - జాలుదునేను
రామునిబంటఁ బో - రానట్టివాఁడ"
అనిన బోయలరేని - యర్థాంతరములు
గనిపించు మాటలా - కర్ణించిమెచ్చి
అతనితలఁపెల్ల - నాత్మలోనెఱింగి
హితమతి నృపసూనుఁ - డిట్లనిపలికె. 7950

—: భరతుని గుహుఁ డూఁఱడించుట :—

" అనఘ! రామునికి నే - నరలేనిబంట
ననియుంటి నామాడ - లఖిలార్థములును
యిచ్చిన వాఁడనే - యీసేనకెల్ల
నిచ్చట నీవు విం - దిడి పంపుటెంత?
యీదారిచనియెద - మే మెల్లనెట్లు
పోదుమీ యేఱు గొ - బ్బున నుత్తరించి?
అందుకు మార్గ మి - ట్లని పల్కుమనిన
డెందంబులోనఁ దొ - ట్రిల్లుచు గుహుఁడు

హితువెద్దియొ యని - యింత శంకించి
రాతిగుండియతోఁగ - రాతుఁ డిట్లనియె. 7960
"నరనాథ! మీవెంట - నావారు నేను
ననుదేరనీక యసా - ధ్యము లేదు మీకు
యిటురాముఁ డొంటిగా - నేఁగె కానలకుఁ
బహుతర చతురంగ - బలముతోఁగూడి
యేమి.గారణముగా - నేఁగెదరొక్కొ
రామునిపై నకా - రణముగామీరు
అహితులరని తోఁచె - నాత్మలోనాకు
సహజంబుగానున్న - చందమేర్పడఁపు"
అనుమాటవిని పుళిం - ధాధిపుఁజూచి
మనువంశ తిలకంబు - మఱియునట్లనియె. 7970
"మారామ చంద్రుని - మది దశరథుని
మారుగానెంచి యే - మఱలఁ బిల్చుటకుఁ
నరిగెదఁగాని ద్రో - హము సేయఁగాదు
పరిశుద్ధుఁని నన్ను - భావింపు మీవు"
అనుభరతుని మాట - లాలించి గుహుఁడు
మనసులో మఱియు న - మ్మిక యిట్టులనియె.
"అయ్య! కోరక పొంది - నట్టి సామ్రాజ్య
మియ్యెడ నీకు న - ధీనమైయుండి
నన్నకు నేనిత్తు - ననిపోవునపుడె
నిన్నుఁబోల నొకండు - నేర్చునె కలుగ 7980
నీయంతవాఁడవు - నీవె యేనిన్ను
సేయుఁబూజలు నన్నుఁ - జేసె పావనుని"

అనిపల్కి నెడ యినుం - డస్తాద్రిచేరఁ
గనుమూయుగతి నంధ - కారంబుఁగప్పె
గుహుఁడు సుమంత్రుండుఁ - గూడియాచెంత
విహితరీతి సుఖోప - విష్టుఁడై యుండ
శయనించి భరతుఁడూ - ర్జవలాభరతుఁడు
నియతాత్ముఁడై యుండి - నిద్దుర లేక
తరుకోటరంబున - దహనుఁడా తెరువు
దరికొననేర్చు చం - డంబున నతని 7990
మదిఁబుట్టినట్టి రా - మవియోగవహ్నిఁ
బొదలుతాపమున నో - ర్వనుఁ బ్రాపు లేక
హిమవన్నగంబు బీ - రెండచేఁ దప్త
హిమవారి ఝరముల - నీనినయట్లు
చింతచేఁబుట్టిన - చెమరుమై నిండి
యెంతయు జడిగొన - నిటునటుఁ బొరలి
తాపవేదనలు ప్ర - త్యంత శైలములు
నాపోవనిట్టూర్పు - నందుధాతువులు
నాయాస శోకదై - న్యమనోరుజాను
లాయత శృంగంబు - లడుగడుగునకుఁ 8000
బొడమెడు మూర్ఛలం - బొలయు జంతువులు
దొడరు సంతాపౌష - ధులుఁ గల్గియున్న
తనదుఃఖమును పర్వ - తము మోవలేక
కనుమూసి గడియ యె - క్కయుగంబు గాఁగ
వేగించు భరతుని - నెతలాత్మ నెఱిఁగి
యాగుణనిధిఁ జేర - నల్లనవచ్చి

—: గుహుండు భరతునకు రామవిషయమైక
వృత్తాంతమునుం జెప్పుట :—

యూరటగాంజెంత - నుండిన గుహుండు
వేడ్క పరాకు గా - వించి యాచింత
మఱపింప తాను ల - క్ష్మణుండును మున్ను
పరిచర్య సేయున - ప్పటి మాటలెల్ల 8010
నాసుమంత్రుండు విని - యవియొచ్చరింప
గాసిల్లు భరతునిం - గాంచి యిట్లనియె.
"రాజకుమార ! శ్రీ - రామచంద్రుండు
తాజానకీ సహి - తంబుగా నాంటి
రేయి యిచ్చోట ని - ద్రింపుచు నొక్క-
చాయ నూతనతృణ - శయ్య గావించి
సౌమిత్రికినిఁజూపి - శయనింపుమనిన
రామునిబన్నంబు - రాజువర్తనము
తనవిచారము సవి - స్తరముగాఁదనదు
మనసులోఁగల యవి - మాతోడఁదెలిపె 8020
యీసుమంత్రుండు నేను - నేమన్న వినక
యీసుమిత్రా పుత్రుఁ - డడలు చందంబు
నెంతని పలుకుదు - నీరీతినుండ
నంతటఁ దెలవారె - నారఘూద్వహుండు
తానునిద్దుర లేచి - తమ్మునిం బిలిచి
జానకీ సహితుండై - చనునట్టివేళ
బలిమి నాచే మర్రి - పాలుఁ దెప్పించి
తలముళ్లువిడిచి యి - ద్దరురాఘవులును

జానకి యడలంగ - జడలు ధరించి
మానితవల్కలాం - బరములుగట్టి 8030
యేను దెచ్చినయోడ - యెక్కి సుమంత్రు
తోనాకకొన్ని బు - ద్ధులు వచియించి
గంగ యాత్రోవగాఁ - గడచిరి వారి
యరిగద యప్పుడే - మన వచ్చు ననిన
క్రొవ్వాఁడిమైన యం - కుశముచే నరుక
నొవ్విచేఁగూయు సిం - ధురమో యనంగ
హాయని యిలఁబడి - యొరలుచో భరతు
బాయక తమ్ముండు - పలవరింపంగ 8040
సైరింపలేక కౌ - సల్యాదులైన
నారీమణులు రోద - నములు గావించి
యేమియు నెఱఁగక - యింతంతచేర
నామేర కౌసల్య - యడలుచునున్న
భరతుఁ గౌఁగిటఁ - జేరి "పట్టి! యిదేల
యురక నిద్రింపుచు - నుండి యీరేయి
యేమికారణముగా - నేడ్చెదు వనుల
రామలక్ష్మణులు భ - ద్రమున నున్నారె?
సేమమేకద వన - సీతకు? లేక
యేమైన వింటిరో? - యెఱిఁగింపుమనిన" 8050
తావిన్న తెఱఁగెల్ల - తల్లితోఁ బలికి
యావేళకొంత యూ - రార్చి యవ్వెనక
గుహుని నెమ్మోముఁ గ - న్గొని చేరఁబిలిచి
బహుళ ఖేదంబుతో - భరతుండు వలికె,
"ఓయి పుళింద వం - శోత్తమ! రాముఁ

డేయెడ వసియించె - నేమివచించె
నెయ్యెది భుజియించె - నింతియుండాను
నెయ్యెడఁ బవళించె - నెఱిఁగింపు" మనిన

—: రాముఁడు జలము లాహారముగాఁ గారచెట్టుక్రింద బండుకొనిన వృత్తాంతము గుహుఁడు చెప్పుట :—

"నోదేవ! సౌమిత్రి - యును రామవిభుఁడు
నైదేహియును నిందు - వచ్చియున్నపుడు 8060
పొడగని బహుభక్ష్య - భోజ్యాదికములు
తడయక తెచ్చినీ - దాసుండ నేను
కైకొనుం డన విని - కాకుస్థకులుఁడు
మాకేల కొనిపొమ్ము - మరల నన్నియును
యీజలంబులె చాలు - నితరంబు లేల!
రాజుల కప్రతి - గ్రహము ధర్మంబు"
అనిలక్ష్మణుఁడు తెచ్చు - నంబువారములు
గొనియెల్ల యింగుదీ - కుజము చెంగటను
తమ్ముఁడొనర్చిన - తల్పంబునందు
సమ్మతిదంపతుల్ - శయనించు నపుడు 8070
సౌమిత్రి వారల - చరణముల్ గడిగ
యీమేర నేరిచి - యించు పానుపున
నుండనొల్లక కడ - నుండి కోదండ
మండలాగ్రంబులే - మఱక వేగింప
ఏను మావారలు - నీసుమంత్రుండు
పూనిపల్కిన నిద్ర - వోవకయుశేఁడు
యేజాడ నిద్దుర - యేఁబోదు నకట

యీజానకీ రాము - లిటులుండఁ జూచి''
అనుచు నాతోమాట - లాడు చున్నంత
నినుఁడు దోఁచెననంగ - హృదయంబు విరియ 8080
తల్లులు తమ్ముండుఁ - దాను నచ్చటికి
తల్లడిల్లుచు భర - త కుమారుఁ డరుగ
యిదిరాము తృణశయ్య - యిదియె లక్ష్మణుని
గదిసి యేము వసించు - గరిమిడి పఱపు''
అనిగుహుం డెఱిఁగింప - నా భరతుండు
జనముల కెల్లఁ జే - సాఁచి వాకొనుచు
ఆది గర్భేశ్వరుం - డై హంసతూలి
కాది తల్పంబుల - యందుశయించి
నానామణీ భూష - ణములఁ జెన్నొందు
భానుసన్నిభున కా - పచ్చిక పఱపు ? 8090
కలగంటి నోర్కొని - క్రమము కాక తనకు
తెలివిడి దప్పెనో - తెలియ లేదనుచు

—: సీత నగలలోని బంగరుపాఁడి గారచెట్టుక్రింద రాలియుండుటకు భరతుఁడు శోకించుట :—

ధరణీతనూభవ - దశరథు కోడ
లరయంగ జనకుని - యంకభూషణము
శ్రీరాముదేవి యీ - సీత కా యిట్టి
పూరిపాన్పున నిద్ర - వోవు పాపంబు ?
దైవయత్న మిదౌర ! - తప్పింప రాదు
భావించి చూచిన - బ్రహ్మాదులకును''
అనిచేరి చూచుచు - నా శయనమున
జనకనందన బుఱు - సాచీర చెఱఁగు 8100

బంగరు పొళ్లను - పైఠాని రవికె
కంగుల నూలంటు - కఱకు పచ్చికలు
గమగమ జవ్వాది - కమ్మ నెత్తావి
గమిచిన నివ్వరి - కసువుతలాడ
యెండబారిన పువ్వు - బెత్తులుం గెలన
నిండిన వీటికా - నిబిడ రసంబు
త్రొక్కురాలంటు ల - త్తుకయు నాళయ్య
చక్కటింజూచి మూ - ర్ఛమునింగి లేచి
"రాముని కిపు డంగ - రక్షయై నట్టి
సౌమిత్రి భాగ్యంబు - చాలదే" యనుచు 8110
"నారడి పుట్టువు - నైతి నాజన్మ
మేరికిఁగొఱగాక - యట్లయ్యె" ననుచు
యెంత చేసితి - దగునెక రాము
డింతకు నోరుచు - నే విధి యనుచు
మందరి బుద్ధిని - మాతల్లి చేసి
యందరి రక్షించె - నేమందు ననుచు
రాముఁగా కని దశ - రథునకుఁ దప్పె
సీమ యేలంగ నా - సితునే యనుచు
రామచంద్రుఁడు లేని - రాజ్యంబు పరులు
కామింప వెఱతురు - గరళంబు తోడి 8120
యన్న మొక్కఁడు దిన్న - నరుగునే యచట
నున్నరాముని శౌర్య - మొరు లెఱుంగమియె
జడలెందు శ్రీరామ - చంద్రుండు దాల్చె ?
తడయక యచ్చోటఁ - దాల్తు నే జడలు?
రాము నయోధ్యకు - రాజుఁగాఁ బనిచి

సౌమిత్రిఁ బట్టణ - స్థలినుంచు వాఁడ
యిట్టినా పూనికె - యీడేర్పఁ గేల
గట్టుదుఁగాక ! కం - కణము దైవంబు
అమరు లందఱునుఁ దో - డై వచ్చి నాదు
సమయంబు చేకూర్చి - చనుదురు గాక ! 8130
గహన భూములనన్నుఁ - గాఁచి వెన్వెంట
సహచరుండై యుండు - శత్రుఘ్నుఁ డపుడు
మాయన్న నేఁడు నా - మనవి గాదనిన
పాయక యేను త - త్పదములు గొలిచి
జానకి లక్ష్మణ - సమ బహుమాన
మానితవృత్తి నె - మ్మది నుందు వనుల"
అనిభరతుఁడు వలి - యమ్మఱునాఁడు
తనచెంత నున్నట్టి - తమ్ముని కనియె
"ఈపుణ్య వాహిని - నీ ప్రొద్దెగడుత
మా పుళిందాగ్రణి - సర్థి రప్పించి 8140
యతని వశంబైన - యన్ని యోడలును
జతగూర్చి రప్పింప - సముకట్టు మనిన
వాకిట తనభట - వ్రాతముం దాను
నాకిరాతాగ్రణి - యచలుఁడై యుండ
తనయన్న మాట లా - తఁడు వివరింప
విని గుహుండు కిరాత - వీరులం బనిచి
యోడలే నూఱు నం - దొక్కొక్క యోడ
యోడకు నూరేసి - యొద్దికలైన
దోనులు నొక్కొక్క - దోనికిం దగిన
మానుసుల్ నూరేసి - మతియించి నట్లు 8150

తెప్పించి యునిచి - విస్తీర్ణమై మేడ
చొప్పున నిఖిల వ - స్తువులునుం గలిగి
రాముఁడెక్కు మనోహ - రంబైన యోడ
యామేరఁదమ రెక్క - నతఁడు దెచ్చుటయును
రాజులు మంత్రులు - రథికులు మాని
రాజులు సకల వ - ర్ణంబులవారు
సామజ ఘోటక - చయము సైన్యంబు
కామినీమణులాది - గా నెల్లవారు
నోడలపైఁ బోవ - నుర్వీశు సేన
చూడఁజూడగ నెందు - జూచిన నిండి 8160
కొందఱు హరి గోళ్లఁ - గొందఱు పుట్ల
గొందఱు దోనులఁ - గొంద రీఁతలను
కొందరు తెప్పలం - గొందఱు క్రొత్త
బిందెల నీరీతిఁ - బేర్చి యందఱును
నేఱుదాఁటిన యంత - నినవంశమణులు
తారోడ మీఁదికి - తల్లుల తోడఁ
దగిన వారలతోడ - దాసుల తోడఁ
దగినవైఖరి నెక్కి - తలఁచిన యంత
దాఁటి యాయేఱు మై - త్రంబను పేర
హాటకంబైన మ - హాముహూర్తమున 8170
నందఱుంగూడి ప్ర - యాగంబు చేరి
యందు సైన్యమునెల్ల - నమరించి యునిచి
తన పురోహితులతో - తమ్ముని తోడ
తనుపురంజిల భర - ద్వాజాశ్రమంబు
చేరిమంత్రుల నొక్క - చెంగట నిల్చి

వార లరుంధతీ - వల్లభు వెనుక
అమ్మహాశ్రమమున - కరుదేర వారి

—: భరతుఁడు భరద్వాజునితో మాటలాడుట: —

నమ్ముని శేఖరుఁ - డల్లంతఁ గాంచి
యెదురుగావచ్చి య - య్యిన వంశగురుని
పద పంకజములకు - పాద్యం బొసంగి 8180
తనయాత్మలో వీరు - దశరథ తనయు
లనియెంచి వారికి - నర్చ లొసంగి
కుశలంబు లడిగినఁ - గూర్చుండి యతని
కుశలముల్ వారు పే - ర్కొని యడుగుటయు
నిత రేతరముఁ దెల్పు - నెడ భరద్వాజ
డతుల తపోనిధి - యంతయు నెఱిఁగి
యెఱుఁగని చందాన - నెలనవ్వు తోడ
భరతునితో మృదు - ఫణితి నిట్లనియె.
"ఎల్ల సామ్రాజ్యంబు - నేలెడు నీవు
చెల్లరే యొంటిగా - చెట్టులు వట్టి 8190
ఆలుఁ దమ్ముఁడుఁ దాను - నాకులు నలము
తాళి శరీరయా - త్రకు నీడు చేసి
తమతండ్రి పనుపను - దరిదావు లేక
కుమకుమ శోకాగ్ని - గుములుచు నున్న
రామునిమీఁద నూ - రకె చంపవలిగి
యేమి సాధించెద - విటమీఁద నీవు ?
కైకేయి కొడుకవు - గాన కౌసల్య
శోకించునని మదిఁ - జూడలే వైతి

యెవ్వారెక్కడఁ బోయి - రేమి మాకేల
యివ్వేళ నాదు క - న్నెదురను నిలిచి 8200
కనిపించుకొని కడ - కడలనుం బోక
నను నొక్కచేరి కై - నను సడ్డగొనక
కనువాడిచిన యట్లు - గర్వించి నిలుచు
నినువసిష్ఠునిఁ జూచి - నేడు తాళితిని
లేకున్న నిన్నొక్క - లెక్కయె మాకు
కైకచేనగు మేలు - గనఁజేతు నిన్ను"
నన గడగడ కంప - మంది వసిష్ఠు
గనుఁగొని యమాత్యుని - కనుసన్న సేయ
తెలివి దెచ్చుకమాని - దృష్టి పథంబు
దొలఁగి ఫాలమున చే - దోయి గీలించి 8210
ఆ భరద్వాజుల - యడుగులు చూచి
యా భరతుఁడు భక్తి - నప్పు డిట్లనియె.
"అయ్యా! మీయట్టి మ - హానుభావులకు
నియ్యెడను జూడ - నిటువంటి బుద్ధి
బుడమి నప్పుడెనాదు - పుట్టువు వంటి
చెడుఁబుట్టు వెందుఁ జూ - చిన మరిలేదు
మేలనన్నిట్టు లాన - తిచ్చితి రయ్య"
వ్యాళదుష్టుని వహ్ని - యందుఁ ద్రోయుదురె?
శ్రీరాము నెడవాసి - చింతాపయోధి
భారంబు గానక - ప్రాణాశు చేత 8220
అతనిఁ బ్రార్థించి రా - జ్యమునందు నుంచి
హితము గావించి యే - నిచట నుండెదను
అనియెంచి వచ్చితి - నంతియె కాని

తనయందు లే దాత - తాయి వర్తనము
కానలేనైతి కై - క తలంపు మొదట
యేనది హితముగా - నెంచుట లేదు
యీవసిష్ఠుఁడు సాక్షి - యిటమీఁద మీఁదు
భావంబె సాక్షి త - ప్పదు ద్రోహిఁగాను
సదయాత్మ రాముఁ డె - చ్చట నున్నవాఁడో
యదిదెల్పి నను బంపుఁ - డాశాస్య మెఱిఁగి" 8230
అనిన భరద్వాజుఁ - డక్కుమారకుని
గనుఁగొని యుప్పొంగు - కరుణ నిట్లనియె.
"రాజేంద్ర! రఘువంశ - రత్నంబులైన
రాజులకిట్టి మ - ర్యాద లేమరుదు?
ఆ రాజులందు నీ - యట్టి ధార్మికులు
లేరు నీమదినిఁ గ - ల్గిన వృత్తమెల్ల
కనలేక పలుకుట - గాదు నీతలఁపు
గనిదృష్టి కరణంబు - గావింపఁ దలఁచి
యిటులంట్టి సైరింపు - మీచిత్ర కూట
తటతరుచ్ఛాయలం - దరుణితోఁ గూడి 8240
యున్నాఁడు మీయన్న - యొకనాఁడు మమ్ము
మన్నించి మాయాశ్ర - మంబులో నుండి
చేరుము రేపె యా - చిత్ర కూటాద్రి
మీర రాదనిన నే - మియు ననవెఱచి
చాలభక్తి మహా ప్ర - సాద మటంచు
తాలిమి భరతుం డ - త్తరి సమ్మతింప
వర తపోనిధియైన - వాల్మీకి శిష్యు
డనలేని భక్తితో - నతని కిట్లనియె.

—: భరద్వాజముని భరతాదుల కాతిథ్యమొసంగుట :—

దశరథనందన ! - తపముల మేము
కృశియించి వేల్పుల - నెల్ల భజించి 8250
చేసిన పుణ్యముల్ - చేఁ జేతవచ్చి
వాసిగా తమ భాగ్య - వశమునం జేసి
యిట్టిమేనులు దాల్చి - యే తేరమిమ్ము
నెట్టిపూజలు చేసి - యెన్నిక గాంతు ?
పత్రంబు పుష్పంబు - ఫలమును తోయ
మాత్రమైన నొసంగి - మదిఁ బ్రమోదింతు
నెంచి రేపటికి మా - యింట విందార
గించి రాముని పాలి - కిని మఱిపొందు.
అనిన "నో స్వామి ! మీ - రర్చ లిచ్చితిరి
మనసురంజిల నాశ్ర - మము లోనఁగలుగు 8260
కందమూల ఫలాది - కంబులె చాలు
విందని యందుపై - వేరె యేమిటికి ?
అనిన మాకునభీష్ట - మైన యర్థంబు
కొనసాగఁ జేయక - కలుచ సేయుదురె ?
సేనల నేలయుం - చితి నొక్కయెడను
మానుల మే మస - మర్థులమగుచు
నిందరికిని విందు - యిడఁ జాలఁడనుచు ?
నందుచే కడ నుంతు - రయ్య మీవారి
రప్పింపు" మనిన భ - రద్వాజుఁ జూచి
అప్పుడు భరతుఁ డి - ట్లనియెఁ గొంకుచును. 8270

"అనఘ! మాయాచార్యు - డాశ్రమంబులకు
జనుచోట మితపరి - జనముతోఁ గాని
చనదు మూకల తోడఁ - జన విహరింప"
అనినఁనే వెఱచి సై - న్యము నందయునిచి
పనివింటి పిలిపెంతు - బలముల నెల్ల
తనకిది తప్పుగాఁ - దలఁప నేమిటికి ?
చిత్తేశ నా ముని - సింహంబు తనదు
చిత్తంబు వొదల వ - చ్చిన వారికెల్ల
విందు సేయఁగ యాగ - వేదిక చేరి
అందుపై శుచియు ప - ద్మాసనస్థుండు 8280
ముకుళిత కరుఁడునై - మొదటి వర్ధకిని
సకలజ్ఞు నయ్యాగ - శాలకుఁ బిలిచి
కావింప వలయు రా - ఘవులకు విందు
రావింతు నిపుడె - యింద్ర ప్రముఖులను
పూర్వపశ్చిమ ముఖం - బుల నేఁగునదుల
వేర్వేర రప్పింతు - విందమర్చుటకు
నీచేత నైనట్లు - నిర్మింపు మనుచు
వాచయ్యమింద్రుండు - స్వరపూర్తి గాఁగ
నొక్క శిక్షా శాస్త్ర - యుక్త మంత్రంబు
చక్కఁగా నుడివిన - సకల దేవతలు 8290
నందుచేతఁ బ్రసన్ను - లై తమశక్తు
లందరు గనుపించి - యధికారులైరి
చల్లఁగా వీచెను - చందనానిలము
జల్లుగా పుష్ప వ - ర్షంబులం గురిసె
పాడిరి దేవతా - పాఠకులెల్ల

నాడిరి రంభాదు - లైన యచ్చరులు
యీదృశ మహిమంబు - నే వేళఁ గలిగె
నైదు యోజనముల - యందాక దిశల
కల్పికమై విశ్వ - కర్మ విచిత్ర
శిల్ప చమత్కృతి - చేనొక్క పురము 8300
మేడ లుప్పరిగలు - మేల్కట్లుఁ దగిన
వాడలు వీధులు - వనజాకరములు
పువ్వుఁదోఁటలను తోఁ - పులు వెలజాతి
జవ్వను లంగళ్లు - చప్పరంబులును
కోటలు నగడితల్ - కొత్తళంబులును
నాటకశాలలు - నవరంగమిండ్లు
చపికెలు చిత్తరు - సావళ్లు దివ్య
భవనముల్ రథగజ - భటతురంగములు
వివిధవర్ణ జనాభి - వృద్ధియు గలిగి
దివిఁలోకము ధరి - త్రిని వ్రాలెనవఁగ 8310
భరతుఁడు డించిన - పాళెంబు లెల్ల
పురములో వెదకినం - బొడగాన కుండ
యెక్కడ మొలచెనో - యీ పురంబనుచు
ముక్కుపై వ్రేలిడి - మునివరుల్ మెచ్చ
కలిగెనో తోఁపుల - ఖర్జూర సప్త
దళనారికేళ చూ - తరసాలపనస
పరిపక్వ ఫలముల - పాకమై యుండ
కురువక మల్లికా - కుంద చాంపేయ
మరువక కేతకీ - మాలతీ వకుళ
సురభిళ నవ్యప్ర - సూన గుచ్ఛములు 8320

పారిజాతలతాంత - పరిమళ మిళిత
సౌరభంబులఁ జొక్కు - చల్లుచు మలయ
మొకచోట నపరంజి - యోడు బిల్లలను
చకచక లీనుహ - జారంబు మెరయ
నవరత్నమయమయ మైన - నగరిలో వెండి
చవికెలోవను లుబ్బ - చప్పరంబును
పట్టె మంచంబులుఁ - బఱపులు మేలు
కట్టులు వెండి బం - గారు కొప్పెరలు
పచ్చల పళ్లెముల్ - పసిడిఁ గిన్నెలును
పచ్చరా గోడలు - పలక వజ్రముల 8330
తలుపులు నీలాల - దార బంధములు
కలమాన్న శాక పా - కము లమరించు
బోనపు టిండ్లలో - పుప్పఁ బోణులును
నానామణీ భూష - ణములు పేటికలు
చేటి సహస్రముల్ - చీనాంబరములు
హాట కావరణంబు - నమరు గేహమున
విడిదిగా భరతుని - విడియించి వారి
కడమ రాజులను న - గళ్లలో నునుప
తన నగరను భర - త కుమారకుండు
ఘనతర నవరత్న - కాంచన ప్రభల 8340
చెలువుమించిన యట్టి - సింహాసనంబు
కెలనఁగన్గొని చేరి - కేలెత్తి మ్రొక్కి
అందుమీఁదటఁ దమ - యన్న యున్నట్టి
చందంబుగా మాన - సమున భావించి
భరత శత్రుఘ్నులా - పజ్జ చామరము

లిరువుర గైకొని - యించుక సేపు
విసరి మంత్రులకని - వేర్వేర యనుచు
పసిఁడి పీఠంబుల - పైఁ గూరుచుండి
తనదు ప్రధానులం - దగిన పీఠముల
నునిచి బాంధవహిత - యుతముగా నుండ 8350
మెఱుపులు విడివడ్డ - మెలఁకువ నొక్క
తరమైన దేవతా - తరుణీశతంబు
కంకణంబులు మ్రోయ - కౌనులు గదల
బింకెపు చూపులు - పేరెముల్ వార
నందెలు ఘలుఘల్లు - మనఁ బళ్లెరముల
యందుల భక్ష్య భో - జ్యా ది వస్తువులు
యెన్నడు వినికని - యెఱుఁగని వెల్ల
కన్నులు చిత్తముల్ - కడుఁ దనియంగ
నడ్డింప భుజియించి - వార్చి రాఘవుల
యడ్డియించుక లేక - యలసువారంపు 8360
పడుచుల వలకు లోఁ - బడి రాజసుతుల
దడవక యేమియుం - దలఁపక పూని
మాయచే మేనులు - మఱచి యందఱును
మాయలాఁడుల కేరి - మఱిగి యున్నంత
నాఁపురి నాల్గు చా - యలను నానామ
హాపగల్ జలధులు - నాత్మ శక్తులను
నేకమై యపరంజి - యిసుము గఁన్పట్ట
గాక మహానది - స్తోమంబు వార
నదుల తీరములందు - నగరులు నిండ్లు
పదులు నూరులు వేలుం - బెరిపాఁటి మెఱయ 8370

కొలువు లోపలనుండి - కొసరులు దీరి
వలకారి ప్రాయంపు - వనితలం దగిలి
అందరుఁ గడకేఁగ - నా దశరథుని
నందనులొంటి ను - న్నారని యటకు
మెచ్చుసొమ్ము లొసంగి - యిరువది వేల
యచ్చరులఁ గుబేరుఁ - డనిచె కొల్వునకు
అందరు దేవతా - హరిణాంక ముఖులు
నందనోద్యానంబు - న మెలంగువారి
వాసవుం డల భర - ద్వాజాశ్రమంబు
గైసేయ నలసము - ఖమునకు నంపె 8380
కడమ దిక్పాలుర - కడనున్న వేల్పు
పడతులు దొరలుఁ బం - పంగ వచ్చిరటకు
నజుని కొల్వుననున్న - యమర కామినులు
రజతాచలంబుపై - రాజీవముఖులు
నాగలోకముననున్న - మెలుంగుఁబోండ్లు
వేగంబ భరతుని - విడిదికిం జేరి
అందరు గుమిగూడి - యపుడు మేళంబు
క్రందుగా నరరంజి - కాళలు గట్ట
తుంబురునారదా - దులు రాఘవారికి
తంబురాలైనట్టి ప - దమ్ములు వాడ 8390
సకలమహామహీ - జశ్రేణిఁగూడి
యొకటి మద్దెలతాళ - మొకటి యుపాంగ
మొకటి రావణహస్త - మొకటి చెంగొకటి
యొకటి దండియు నొక్క - టురమయు నొకటి
భరతుని ముందర - భరతశాస్త్రమున

గరిమె మీఱుచు తత్త - కారతాళముల
కొనుగోలు గనిపించు - కొలువుండి యతఁడు
తనమదిలో భర - ద్వాజులయాజ్ఞ
యేమియు ననరాక - యీక్షింపుచుండ
నామానివరు మహి - మానుభావమున 8400
మల్లికాపాటల - మాధవీకుంద
వల్లికావళికుబ్జ - వామనశ్రేణి
పనులు పూనంగ రం - భలు కంచుకాళి
యనువున సొంగుబ - లానులాపముల
సముఖంబు విప్పిమె - చ్చరికగావింప
గుములుగాఁ గొందరు - కొం వణిచూప
కొందఱుకొమ్మలు - కోలాటమాడ
కొందరు పేరణిం - గులుకుచునాడ
కోలచాఱిని చిందు - గుజ్జరి దేశి
లీలలగొందరు - లేమ లాడంగ 8410
వేలుపుజవరాండ్రు - వినుపించునట్టి
కేళికరాముల - కితవగు నుచు
మానిమాయల ముందు - మనసురానీక
తానిర్వికారుఁడై - దశరథాత్మజుఁడు
నూరకె చూచుచు - నుండునప్పురము
సూరెల బహునదీ - స్తోమంబులందు
గాలిచే నెగసిన - కరడుల దరుల
రాలుతుంపురు లెల్ల - రమణులై నిలువ
మలమానిలమునఁ గొ - మ్మలు చలియింప
జలజల వృక్షముల్ - సకియలరాల్ప 8420

నిరుగడ పాళెంబు - లెందుఁజూచినను
తరుణులే కాఁగ నం - తయు నిండియుండ
నెచ్చట మొలిచి రీ - యెలజవ్వనంపు
తచ్చనకత్తెలిం - దరు ననుచూడ
మాయంపు మబ్బులు - మహిమీఁదఁగొన్ని
పాయక చినుకొక్క - పణఁతిగాఁ గురియ
నురిమినయురు మెల్ల - నొసపరసతులు
మెఱసిన మెఱపెల్ల - మీనలోచనలు
జలచరావళి యెల్ల - జంద్రాసల్యచట
గల బుద్బుదములెల్ల - కన్నెలబారు 8430
అగుచుండ నయ్యేటి - యంచులయందు
ధగధగ వెలుఁగు కుం - దనపుపాత్రికల
నిమ్మకాయలను నూ - నెయు నుశిరికాయ
ఘుమ్మను జవ్వాది - కుంకుమరసము
ముడిఁబువ్వ సరులు గం - బురసున్న మాకు
మడుపులు నొరవొత్తు - మంచిబాగములు
పలగర కొమ్మలు - పసుపునుఁగొత్త
చలువలు తిరుమణి - చాఁదులద్దములు
పావకోళ్లును మెట్ట - పాపోసుజోళ్లు
దూవెనల్ చిక్కట్లు - తోపుబావడలు 8440
సవరముల్ దట్టులు - చల్లాణములును
రవికెలును రుమాలు - రాసులు వలయు
కైదువులును జోళ్లు - గాజుగిన్నెలును
జాదుల పొట్లముల్ - సంపెంగి విరుల
గసగసాల్ కొబ్బెర - కాయలు జీని

మిసిమిగంజాపొడి - మీఁగడ వడుపు
జాపత్రియును కురా - సానియోమంబు
వేపుడు శనగలు - వెల్లుల్లిదిండ్లు
నెచ్చోటఁజూచిన - యెడమీఁకయుండ
నచ్చోట మానిమా - యాకల్పనమున 8450
సారాయి నొకయేఱు - చరుచుకసారె
సారెఁగల్లున నొక్క - పావనతటిని
తేనియ వెల్లినే - తెంచె నందొకటి
యోని మూజ్య ప్రవా - హాము చూపెనొకటి
పాలచే నొక్కటి - ప్రవహించె చెఱకుఁ
బాలచే నొకటని - బ్బరముగావచ్చె
ఫలరసంబులుపొంచి - పారెనం దొకటి
కళుకు లేఁబెరుగు ము - ద్దల వచ్చెనొకటి
పాయసమయముగాఁ - బ్రపహించెనొకటి
ఆయను సూపను - యంబుగా నొకటి 8460
యెలనీరుతోఁ బ్రవ - హించె నందొకటి
చలువమజ్జిగనిండఁ - జనుదెంచె నొకటి
పానకంబులచేతఁ - బ్రవహించెనొకటి
నానారసముల ను - న్నతి గాంచెనొకటి
యీరీతినదులెల్ల - నెల్లెడనిండఁ
జేరుఁవ బర్వత - శ్రేణులవ్రాలి
యొకకొండ మాంసమై - యుప్పరంబంటు
నొకపర్వతిముమిన్ను - లొరసె కజ్జముల
ఒకగిరియన్నమై - యుండె బచ్చళ్లు
నొకగట్టు దిశలన్ని - యునుఁ దానె వాడివె 8470

నొకభూధరము మించె - సురశోక సమితి
నొకదిప్పఁ గనుపట్టె - నూరుఁ గాయలను
యిటులుండ భరత మ - హీశు సైన్యంబు
లటునిటుఁ గనుఁగొని - యయ్యాశ్రమమునఁ
గలవినోదంబులుఁ - గనుఁగొని వేల్పు
తలిరుఁబోణులఁ జూచి - తగిలిపోలేక
యందునెవ్వతె నెవ్వఁ - డీక్షించె వాని
నందె కాకవ్వలి - కదిచనసీక
అందరికందరై - యందంబులైన
మందిరంబులకు స - మ్మతి నెలయించి 8480
తలలంటి వలచుచం - దనములు వులిమి
జలకంబు లారిచి - చలువలందిచ్చి
ఉడిగంపు విరిబోణు - లొకకొందరెడల
నడపముల్ గట్టంగ - నద్దముల్దాల్ప
తలదడియార్చనం - దపుసిగల్ వేయ
నెలమిపుట్టఁగఁ బువ్వు - టెత్తులుంజుట్ట
మలసులుమెచ్చ రు - మాలులుగట్ట
కలపంబులలద బెం - గరు పళ్లెరములు
భోజనంబు లమర్పఁ - బొదలుచు మొదటి
రాజీవముఖిఁగూడి - రాజసంబులను 8490
పట్టెమంచములపైఁ - బవళించి భటులు
కట్టుకంబంబుల - గజములవోలి
రాగరసంబులు - రారాఁపుసేయ
భోగముల్ గలిగి సం - భోగముల్ మరిగి
ఆపరంజిగిన్నెల - నరబ్రాలుగ్రోలి

చపలలోచనలు పూ - సారాయొసంగి
నంజుడు లెడనెడ - నంజు కోనిచ్చి
కెంజిగురాకు లే - కెమ్మోవు లొసఁగి
మబ్బురామబ్బురా - మస్తుకుండలును
గొబ్బెర గసగసాల్ - గోధుమనేతి 8500
కజ్జంబులను తృప్తి - గావించి రమణు
లజ్జవాయకయుండ - నాసైన్యమెల్ల
నేఁటికయోధ్య ? మా - కేటికిభరతుఁ ?
డేఁటికి రఘురాముఁ - డెటువోయెనేమి ?
కొలువేల ? యిల్లాండ్రు - కొడుకులునేల ?
కలిగరా ! మనకు ని - క్కడ మిట్టపంట
కట్టుఁగోకలను భో - గములు భాగ్యములు
పెట్టెల సొమ్ములు - పేర్వులపాఁడి
చక్కని కొమ్మలు - సంతరించకయె
దక్కిన దాసీ వి - తానంబు గలిగ 8510
నేలికయును దైవ - మీభరద్వాజుఁ
డేల రాజులఁగొల్చి - యిడుములంబడఁగ
చాలుఁజాలు నటంచు - సంతుష్టమతులు
కేళిరతులుఁదృణీ - కృతపురందరులు
నగుచు సైన్యములుండ - హయసామజములుఁ
దగునెడకట్టిన - తావులయందు
మడ్డియుఁ గవణముల్ - మధుమాంసములును
గడ్డియుఁ దెప్పలు - గాఁదెచ్చివేసి
నీరార్చువారును - నెమ్మేనిదుమ్ము
వోరాల్చు వారును - పోషించువారు 7520

ఎచటనుండిరొయొ వచ్చి - యిన్నియందములుఁ
బచరింపఁ జతురంగ - బలమునుప్పొంగి
అరవది గడియలు - నమ్మునీశ్వరుని
కరుణఁగాలమునకుఁ - గట్టిరిబొమ్మ
తెలవారు నంతలో - దేవతామాయ
తొలఁగ భోగములెల్లఁ - దొలఁగెనెల్లరకు
కలగన్నగతి నీరు - కడ కేఁగ నిలుచు
జలచరంబుల రీతి - సైన్యమంతయును
యెందుపాళెముడిగ్గి - యేరీతినుండి
రందరు నారీతి - నచ్చోటనుండ 8530

—: భరతుఁడు చిత్రకూటమునకుఁ బ్రయాణము చేయుట :—

మరునాడు భరతుఁ - డమహాముని శేఖరుని
చరణంబులకుభక్తిఁ - జాగిలిమ్రొక్కి
అయ్య ! మీకరుణచే - నఖిలసైన్యంబు
నియ్యెడ నిన్నటి - కెల్ల నానంద
పారవశ్యమునొంది - బడలికల్ దీరె
శ్రీరాము చెంతకుఁ - జేరంగవలయు
నెయ్యెడ నున్నవా - రేరీతిఁబోదు
యెయ్యది మార్గ మీ - వెఱిఁగింపు మనిన
ఆభరద్వాజ మహా - ముని కరుణ
తోభరతునకుఁ బొం - దుగ నిట్టులనియె. 8540
"అనఘ ! యిచ్చటికి మూఁ - డామడమేర
నొనరిన చిత్రకూ - టోర్విధరమున
మందాకినీ నది - మలయు నుత్తరము

నందున నయ్యోటి - యామ్యభాగమునఁ
గలదొక్క రమ్యమా - గహనంబుదాన
నెలకొనియున్నాఁడు - నీయన్నయిపుడు
అడవిమార్గముగాన - నతి దుర్ఘటంబు
కుడియెడమల త్రోవ - గూడిపోవుటకు
బహుసైన్యములు గాన - పదిలంబుగాఁగ
గహనంబులో కసి - గందక చనుము" 8550
అనునెడ భరతుని - యనుమతి నతని
జననులందఱు మాని - సన్నిధిచేరి
చేతులు మొగిచి ని - ల్చినఁ జూచి భరతు
నా తపోనిధి గాంచి - యప్పుడిట్లనియె.
" అందఱు వీరెవ్వ - రయ్య ! యీసాధ్వు
లిందఱి గురుతులు - నెఱింగింపుమాకు
వినవలయు నటన్న - వినిభరతుండు
మునిచంద్రునకుఁ గేలు - మోడ్చియిట్లనియె.
"అయ్య! వామనుఁగన్న - యదితిచందమున
నియ్యెడ నిలుచున్న - యీయమ్మసుమ్ము 8560
కౌసల్య రామునిఁ - గన్నట్టితల్లి
యీసాధ్విదండ నే - యెలవంకనున్న
మెలఁతయె సుమ్ము సు - మిత్ర లక్ష్మణుఁడు
తొలుచూలి పిదప శ - త్రుఘ్నుండు పుట్టె
అల్ల యాకడనున్న - యామెకైకేయి
వల్లభుఁజంపి యా - వనవాసములకు
రామునిఁబంపి యె - ఱుఁగని యెటుల
సీమలన్నియునుఁ గా - ల్చినది నాతల్లి

యీ పెకు జన్మించి - యిన్నియాపదలఁ
బాపంబుచేసి లోఁ - బడి వేగవలసె 8570
చూడుఁ డీపెమొగంబు - చూచినవెనక
జూడుఁడు తరవాత - సూర్యమండలము"
అనవిని యదలించి - యాభరద్వాజ
ముని భరతునిఁజూచి - ముదముతోఁబలికె.
"యిట్లులాడుదురయ్య - యీయమ్మవలన
గట్టిగానిద్దురల్ - గనిరి వేలుపులు
సకలలోకమ్ము నీ - సాధ్వి చేఁగాంచె
నకలంకసౌఖ్య క - ల్యాణ సంపదలు
వందితఁగాని యె - వ్వరిచేఁగైక
నిందిత గాదది - నే నెఱుంగుదును 8580
తరవాత మీరలం - దరు నెఱింగెదరు
పొరపొచ్చముగ నిట్లు - వోనాడఁదగదు
ధరణిఁబ్రోవఁగ నిమి - త్తము కైకజేసి
పరమేష్ఠి నెమ్మదిఁ - బరగియున్నాఁడు
అమందరయు విశ్వ - మంతయుఁ బ్రోవ
భూమిపైఁజనియించెఁ - బుణ్యశీలమున
కావున నేఁడాది - గాఁగైకమనసు
నోవఁజేయకుఁడు మ - నోవాక్యములను
పొందని దీవించి - పుత్త్రేరవారు
వెండియుఁబ్రణమిల్లి - వెడలిరాశ్రమము 8590

—: భరతుఁడు చిత్రకూట ప్రాంతమును బ్రవేశించుట :—

తల్లులు భరతుండుఁ - తమ్ముండు బసిఁడి

పల్లకీలెక్కి యా - ప్రజనంబుగొల్వ
పదిలమై నలుగడ - బలమెల్ల రాఁగ
పదలంబు ముందర - సాగించికదల
దక్షిణంబుగ జల - ధరములు నడచు
లక్షణంబున శుభ - లక్ష్మణులైన
రాకుమారుల సేన - రయమునం గదలి
భీకరారణ్యంబు - భేదించినడచె.
పులులు దుప్పులుఁ గారు - పోతులు లేళ్లు
నెలుగులు కుందేళ్లు - నేదుబందులును 8600
కరులు మర్కటములు - గండకంబులును
కిరులుఁదోఁడేళ్లు బె - గ్గిలి భీతిఁ బరవ
నేల యీనినయట్లు - నిబిడమై నదులు
శైలంబులును వన - స్థలములుదాఁటి
కొంతమారమువచ్చి - గుహుఁజూచి భరతుఁ
డంతరంగంబున - నలరుచుఁ బలికె.
"దవ్వులనదె భర - ద్వాజు లున్నట్టు
పువ్వుఁ దోఁటలుచుట్టుఁ - బొదువుకయుండఁ
దళుకొత్తునట్టి మం - దాకిని చెంత
జెలువొప్పె నల్లనై - చిత్రకూటంబు 8610
జలదముల్ వడఁగండ్లు - చల్లినరీతి
నిలమీఁదరాల్చె మ - హీజముల్ విరులు
జలజంతువులతోడి - జలనిధియనఁగ
పొలిచెఁ గిన్నరు లని - భూమీధరంబు
అరవరాజ్యముఁబోలి - యందరు సిగల
విరులుచుట్టిరి గంటె! - వేడుకనిచట

మనకుహితంబుగా - మలయమారుతము
చనుచోట ధరణీ ర - జంబు వారించె ”
అనుచుఁ దమ్మునిఁజూచి - యనియె నిచ్చోట
“ మునుల మహాశ్రమం - బులు గానవయ్యె 8620
అమరావతి యనంగ - నతిరమ్యమగుచు
నమరె నీవన మయో - ధ్యాపురి కరణి
ఎచట నున్నాఁడ కో - యెచ్చోటరాముఁ
డచలుఁడై యందందు - నరయంగవలయు ”
అనునెడ నాయుధ - హస్తులై నట్టి
జనులు కేల్మోగిచి దా - శరథికిట్లనిరి.
అల్లదె కనుఁగొను - మయ్య ! యీచక్క-
నల్లనిపొగలు గా - నఁగవచ్చె నెదుట
జనులున్నవారలు - సందియంబేల ?
జనకజారమణుఁ డి - చ్చట నుండనోపు 8630
కాదేని మానులు - గాఁబోలు లేక
లేదు హేతువు వనీ - లేఖ నగ్నికిని ”
అనవిని శత్రుఘ్ను - నాచార్యుఁగూడి
తన సేననెల్ల న - త్తరి విడియించి
భరతుండు ముందర - పయనమై కదల
పరిజను లామోద - భరితులై రంత.

—: రాముఁడు పర్వత శృంగారమును సీతకుఁ జెప్పుట :—

అక్కడ రఘురాముఁ - డవనిజంగూడి
చక్కని యా - శైల సానువులందు

మెలఁగుచుఁ గంటివే - మృగశాబనయన !
అలరెనీ చిత్రకూ - టాచలం బిపుడు 8640
మన మయోధ్యాపురి - మఱచి యిచ్చోట
మనసురంజిలఁగ ని - మ్మహినుండఁగఁగ్గె
యీగిరి కూటంబు - లినుని రథంబు
సాగిపోనీ వన - చదలఁగన్పట్టె
జాతివైరంబు లె - చ్చట లేకజంతు
జాతమిచ్చటఁగూడి - చరియించెఁగనుము
ధరణీతనూజ ! వి - ద్యాధరు లిచట
గిరికందరంబులఁ - గ్రీడించువారు
తమచేతి కైదువుల్ - దగిలింపవాన
సమరు నున్నత భూరు - హములఁగన్గొనుము 8650
జానకి ! చూడు మి - చ్చటి గైరికములఁ
బూనెను కుంకుమ - పూఁత యీనగము
దానధారల గజేం - ద్రము మించురీతి
నీ నగంబున సెల - యేరు లొప్పెడును
సౌమిత్రివంటి నా - సైదోడుగూడి
భూమిజ ! నినువంటి - పొలఁతిగల్గుటను
తమ్మునికై యెల్ల - ధరణియునిచ్చి
సమ్మతితోఁదండ్రి - సత్యంబు నిలిపి
యీరెండు కోరిక - లీడేర్చికొంటి
నోరామ ! యిచ్చోట - నున్నట్టికతన 8660
నెన్నన్ని వేడుక - లిచ్చోటఁగలిగె
నిన్నగేంద్రంబుపై - నెట్టిపుణ్యులమో!

అతివ ! వానప్రస్థ - మైన యాశ్రమము
వ్రతులకు స్వర్గాప - వర్గసాధకము
మావారికెల్ల ధ - ర్మంబిదిగాన
నీ విపినంబుల - కేను వచ్చితిని
మంజుల సుమిత్రుడు - మచ్ఛాయ నెపుడు
రంజిల్లు నీచల్వ - రాయిఁ గన్గొనుము
కనఁగనమను దీప - కళికలో యనఁగ
దనరు నీజ్యోతిర్ల - తలురాత్రులందు 8670
యీచుట్టుకట్టిన - యిండ్లనుంబోలె
జూచితే వికచప్ర - సూనకుంజములు
సీత ! యీవనము లీ - క్షింపుముద్యాన
రీతి శ్రమంబు వా - రింపుచు మించె
పఱచిన పువ్వుల - పఱపులోయనఁగ
ధరణిఁ గ్రొవ్విరివసం - తములాడె వనులు
తరలాక్షి ! దేవతా - దంపతులిచట
మరుకేళిఁదేలి క్ర - మ్మరుట దెల్పెడును
వాడినపువ్వులు - వన్యఫలంబు
లేడవి కాకున్న - నీప్రదేశముల 8680
కోమలి ! యుత్తర - కురు భూములందు
ప్రేమంబుతో విహ - రించినయట్లు
మానససరము ర - మ్యతయు స్వర్గంబు
మాననీయ్యతయు స - మగ్రమై కలుగు
నిచ్చోట పదునాలు - గేండ్లు నీతోడ
విచ్చనవిడిఁగూడి - విహరించువాఁడ''

—: రాముఁడు సీతను పలాలించుట :—

అనిపల్కి గిరి డిగ్గి - "యతివ! చూచితివె
తనియించె చూడ్కి మం - దాకినీతటిని
కారండవ క్రౌంచ - కలహంస చక్ర
సారస బకముఖ్య - సంకులంబగుచు 9690
కైరవ నీరజ - కల్హారనికర
నీరంధ్రమకరంద - నిష్యంద మగుచు
చంచరీకాంగనా - సంగీతమంత్ర
వంచితనియమ ది - వ్య మహీంధ్రమగుచు
కుసుమితోభయనదీ - కూలసమస్త
వసుమతి రుచిశీత - వాతూలమగుచు
జలపిపాసాయాస - జంతువితాన
కలుషిత ప్రాంచల - కర్దమంబగుచు
స్నాతలై చనుసట్టి - సంయమీశ్వరులు
చేతులు పొడవెత్తు - చిర తపోధనుల 8700
గలిగినాట్య మొనర్చు - కాలకంధరుని
పొలుపున నీనది - పొంత నిన్నగము
గాలిచేగదలు వృ - క్షములతోలాస్య
కేళిసల్పెడు నట్ల - కీర్తింపఁదగియె
రాలినపువ్వులే - రాలమై యొక్క
చాలుకట్టుక రాగ - జలపక్షికులము
తెప్పయెక్కినరీతిఁ - దేలియాడుచును
దెప్పరంబుగవచ్చె - తెరవ కన్గొనుము!
మునులునిచ్చలుఁ దాన - ములు సేయుకతన
వనమిల్ల భువన పా - వనముగా నమరు 8710

నియ్యేరు నీగిరి - యెంత యింపెసఁగె
తొయ్యలి ! నాకు నీ - తోడఁ గ్రీడింప
చెలియ ! యయోధ్యయా - చిత్ర కూటాద్రి
పొలయ నిచ్చటి మృగం - బులు ఘోరసమితి
యనితోఁచె నీవునా - యవరజుం డొక్క-
మనసుతో ననుఁగూడి - మలసిన కతన
వెలఁది! నిచ్చలు మూఁడు - వేళల నిచట
జల పూరములయందు - స్నానంబు చేసి
మునిచర్యచేఁ గంద - మూలముల్ గొనుచు
నినుఁజూచి మఱతు న - న్ని విచారములును''    8720
అని వినోదింపుచు - నటకు లక్ష్మణుఁడు
వనమృగంబుఁ గొన్ని - వధియించి తెచ్చు
చవులైన మాంసముల్ - సతియునుఁ దాను
నవిరళ ప్రీతితో - నపుడారగించి
మెచ్చులు గలయెడ - మెలఁగుచు నుండి
ర చ్చిత్రకూట ర - మ్యవ నాంతరముల.

—: అడవి మృగములు భయపడి పాఱుటంజూచి రాముఁడు తత్కారణ
మును లక్ష్మణుని జూడుమనుట :—

ఆవేళ మృగము లి - ట్టట్టును బెదరి
పోవఁజూచియు రవం - బులు మిన్నుముట్టి
వినఁగ వచ్చుటయు పృ - థ్వీపరాగంబు
కనుచాటుగా రవిఁ - గబళించుటయును    8730
వినుచోటఁ గనుచోట - విస్మితుండగుచుఁ
దన తమ్ముఁజూచు నీ - తాకాంతుఁ డనియె.

"ఇదియేమి లక్ష్మణ! - యెన్నండు నెఱుఁగ
మదరుచునున్నది - యవనీ తలంబు
రభసంబువుట్టెఁ గా - రణమేమి యిచట
విభులెవ్వరైనను - వేఁట లాడెదరొ?
క్రూర మృగంబుల - కోలాహలంబొ?
నేరుపుతో దీని - నిశ్చయం బెఱిఁగి
వివరింపు నాతోడ - వేగంబె యనిన
రవితేజుఁడగు సుమి - త్రా కుమారకుఁడు 8740
ఆ చెంతనున్న మ - హా నగం బెక్కి
చూచి పైవచ్చు పౌఁ - జుల విలోకించి
ధరణీపరాగ మం - తయు నిండఁజూచి
పరసైన్య మిదియని - భావనచేసి
శ్రీరామ యేరాజు - సేనయో వచ్చె
నూరక యేమరి - యుందురే మీరు?
ఆ వీతిహోత్ర స - మారోపణంబు
గావింపుఁడీగిరి - గహ్వరాంతమున
జానకి నునుపుండు - శస్త్రకోదండ
నానాస్త్రములను స - న్నాహమై నిలుఁడు" 8750
అనివిని శ్రీరాముఁ - డాబలం బెట్టి
జననాయకునిదో వి - చారించి చూచి
మరి తెల్పుమనిన ల - క్ష్మణుఁడును వారి
గుఱుతులన్నియుఁ గనుం - గొని యన్నతోడ
బొమముడి నిగుడఁ జూ - పుల నిప్పులురుల
గుమిగొన్న యూర్పులఁ - గ్రొంబొగలెగయ

"కనుఁగొంటి గుఱుతుగాఁ - గైకేయి కొడుకు
మనమీఁద దండెత్తె - మచ్చరం బెచ్చి 8760
నీచేతి రాజ్యంబు - నిష్కారణముగ
దోఁచుక యంతటి - తోఁజాలుననక
అడవులు వట్టించి - యందుచే నైన
యుడుగని పగఁ గైక - యుపదేశ మొసఁగఁ
జంపెదనని పూని - చతురంగ బలము
గుంపులు గూర్చి యు - క్కోలుగాఁ గవిసె
బాహుబలంబుచేఁ - బగవాని సహితు
ద్రోహి నీతని జంప - దోషంబు రాదు
చదలంటె దేవగాం - చనపుఁబతాక
యదిచూచి భరతుఁడౌ - నని తలంచితిని 8770
యెవ్వనిచే నీకు - నిన్ని ఖేదములు
నివ్వటిల్లెను వాని - నేఁడె దండింతు
యిందెయుందము మన - కిది యిరవైన
కందువ యతఁడె యి - క్కడికి రానిమ్ము
వచ్చిన వాని నే - వధియించి మీకు
నిచ్చెద సామ్రాజ్య - మేలు మెల్లపుడు
నేనుఁగ వొడిచిన - యిలమీఁదఁ గూలు
మ్రాను చందమునఁగు - మారుఁ డిచ్చోట
కలనిలోఁ బడజూచి - కైకేయి చాల
విలపింప నెవ్వరు - విడుమన్న వినక 8780
బందులు దెగ శేరు - బందులఁ గొట్టి
ముందర మందర - ముందల గోసి

యావగవారైన - యట్టివారలను
లావుమైఁద్రుంచి యె - ల్లరుఁజూచి మెచ్చ
నాతని డాలు నీ - యడుగుల చెంత
నీతరి కానుకఁ - నేజేయువాఁడ
వనమెల్ల రక్త ప్ర - వాహముల్ నించి
తనియించువాఁడ భూ - తశ్రేణి నెల్ల
కాకజంబుక ఘూక - కంకాది ఖగము
లేకడఁ దనియఁగా - కీ రణస్థలిని 8790
క్రూర మృగంబులు - గొనిపోవుఁ గాక
భారత వీరులు - పడిన యుద్ధమున
నడఁగి నా మదినున్న - యతికోప వహ్ని
వెడలించి నీరస - విపినంబు వోలు
భరతుని సేన లో - పలఁ దవిలించి
దరికొల్పు వాఁడ ని - త్తరి నిమేషమున
నాయుధంబులు గాఁచి - నట్టి ఋణంబు
పాయక తీర్తునే - బవరంబులోన"
అనిన సహింపక - యనునయోక్తులను
జనకజా విభుఁడుల - క్ష్మణున కిట్లనియె. 8800

—: రాముఁడు లక్ష్మణుని కోపమును శాంతి నొందించుట :—

"బలపరాక్రమ శాలి - ప్రాజ్ఞుండు భరతుఁ
డలఁతిమాటలు నీకు - నాడ నేమిటికి?
మనతండ్రి పనుపున - మనము కానలకుఁ
జను దేర నతని దో - షముగఁ బల్కెదవె?
భరతుని మీఁదటఁ - బనికి రాఁగలమె?

ఎఱుఁగ వింతియెకాక - యీ సాధనములు
వనికిఁదానయి పూని - వచ్చిన యతనిఁ
దునిమిన నపవాద - దోషంబు వచ్చు
నాత్మీయ జనులకు - హాసి గావించు
నాత్మలాభము విషం - బని యెంతునేను 8810
నామదినైన ని - ర్ణయము ధర్మార్థ
కామంబులేఁ బూనఁ - గా మించు నెల్ల
తమ్ములకే కాని - తన మేలు దలఁచి
సమ్మతింపను దివ్య - శరముల యాన
యీకత్తితోడు మ - హీ చక్రమెల్లఁ
జేకొనన యధర్మ - చింత చేసినను
యిలయేల నొల్లనే - నింద్ర పట్టంబు
బలిమి జేరిన న్యాయ - పథముఁ దప్పించి
మిమ్ముగాదని నాకు - మేదిని యేల
యమ్మోయిం బ్రాణంబు - లైన నేమిటికి? 8820
సతతంబు నాప్రాణ - సదృశుండు గాన
యితఁ డయోధ్యకువచ్చి - యిన్నియుఁ
నన్నుఁ జూడఁగవచ్చి - నాఁడేమొ? కాని
యున్నబుద్ధులు వాని - కొకనాఁడు లేవు
అతఁడేల? మనయన్వ - యముననే నాఁడు
నితరంబు లెవ్వరి - యెడనైనఁ గలవె?
తల్లిపై కడు నల్గి - తండ్రి నూరార్చి
యెల్ల రాజ్యంబు న - న్నేలింతు ననుచు
నిది పనిగావచ్చె - నేమొ? యాభరతు
హృదయంబునకుఁ గల - దే ఛలనంబు? 8830

పదరియాతని నొవ్వఁ - బలికితి వేని
యదినన్ను దూషించి - నట్లుగాఁ దలఁపు
మన్న దమ్ముల తండ్రి - నవనిపై నందు
విన్నామె చంపిన - వీర శేఖరుల
నదిగాక యవనిపై - యాస నిక్కముగ
మదినీకుఁ గలిగిన - మాట మాత్రమున
భరతుచే నిప్పింతు - పాలింపు మీవు
ధరణి యంతయును బం - దయె తీరె మాకు
నతఁడు నామాటగా - దని మీఱవెఱచు
హితుఁ"డని పల్కిన - నేమియుననక 8840
తలవాంచి తనలోనె - తాఁజాలఁ గ్రుంగి
వెలవెల నైమాట - వెడలక యుండి
యూరకె మాటాడ - కుండ రాదనుచు
వేఱె తానొక యుక్తి - వెదకి లక్ష్మణుఁడు
గతిగూడుకొని యీసు - గనిపించి పలుకు
క్షితిసుతారమణు నీ - క్షించి యిట్లనియె.
"దశరథుం డిచటికిఁ - దావచ్చె నేమొ ?
కుశలంబు లరసి కఁ - న్గొన వేఁడికుమ్మ
చేర వచ్చి ననుఁ జూ - చెదము వీరనుచు
నేను పాటగునన్న - నింగితం బెఱిఁగి 8850
యటులయౌ వీర లీ - యడవుల యెందు
నిటులుండ వచ్చునే - యేఁబోయి తోడి
తెత్తుఁగాకని యరు - దెంచెనో కాక
మెత్తని మేనిది - మేదినీ తనయ
యనియెంచి యాసీత - నైనను వెంటఁ

గాని పోవవచ్చునో - కోయంచుఁ బల్కి
కనిపించి కొనక రా - ఘవుఁ డట్టులైన
మనరాజు ఛత్రచా - మరములు లేవు
శత్రుంజయంబను - జనపాలుఁ డెక్కు
గోత్రాధరముఁ బోలు - కొలువు సామజము 8860
వచ్చుచున్నది గాన - వసుమతీ నాథుఁ
డిచ్చోట లేఁడని - నిచ్చ నెంచెదను
మిన్నక యీచెట్టు - మీఁదట నేల
యున్నవాఁడవు డిగ్గు - మొయ్యన మహికి
నన డిగివచ్చి చెం - గటను తానన్న
జనకజ కెలన ల - క్ష్మణుఁ డున్నయంత

—: భరత శత్రుఘ్నులును గుహాదులును రామాశ్రమము వెదకుట :—

నడవి లోపలను రెం - డామడ మేర
నెడపక తనమూఁక - నెల్లను డించి
వెనకవచ్చుఁ గిరాత - విభుఁజూచి మాకు
చనదిట మీఁద రా - జన్య వేషములు 8870
పనిచి లెంకల మట్టి - పాలు దెప్పింపు
మన నాతఁడట్ల సే - యఁగ భరతుండు
తమ్ముండు దాను న - త్తరి జటావల్క
లమ్ములు దాల్చి యు - ల్లాసంబు తోడ
తనదుతమ్ముని జూచి - తగు నెలవరుల
వనములోపల రఘు - వరు వెదకుదును
మొలవంకఁగాఁ గర - మ్మేనును గుహుఁడు

వలదపరినుల నీ - వైపున వచ్చి
అరసి చూచెదమని - యా భరతుండు
మఱియు నిట్లనియె " స - మహితా శ్రమముల. 8880
లాలిత పద్మ ప - లాశ లోచనుని
నీలమేఘ శ్యాము - నిత్య కల్యాణు
హలకులిశాదిరే - ఖాంకితచరణు
నలఘు సత్యవ్రతు - నా రామచంద్రుఁ
జేరి నెమ్మోము వీ - క్షించి తచ్చరణ
వారిజంబుల మీఁద - వ్రాలి ప్రార్థించి
అల యయోధ్యకుఁ దెచ్చి - యభిషిక్తుఁ జేసి
కొలిచినప్పుడు గాని - కోరికె ల్లెల్ల
చేకూడి పాయదు - చింత నామదిని
శ్రీ కరమూర్తియై - సీతయుఁ దాను 8890
తమ్ముండు నందనో - ద్యాన వాటికల
సమ్మతి నింద్రుండు - చరియించు నట్లు
విహరింప నీపుణ్య - విపినంబు లెట్టి
మహిమంబు గాంచునో - మహినెల్ల నాఁడు"
అని వెదకుచుఁబోయి - యనతి దూరమున
వనవీధికను ధూమ - వల్లి వీక్షించి
జానకీ రమణుఁడీ - శైలంబు చెంత
తానున్న వాఁడని - తన మంత్రివరుల
హితుల నచ్చటనుంచి - యేఁగె కాల్నడను
ప్రతిపదంబును రఘు - పతిఁ దలంపుచును 8900
నవుడొక్క యెడనిల్చి - యాచార్యుఁ జూచి
" యిపుడు మాతల్లుల - నెల్లను మీఁదు

తోడి తెండ" ని పంచి - తోడనే గుహునిఁ
గూడియావలి కేఁగి - కూర్మి తమ్ముఁడును
ఆ సుమంత్రుఁడు రాఁగ - నాశ్రమ క్షోణి
యేసంయమీంద్రుల - యిరవకో యనఁగ
పెనురాసి యగునేఱు - బిడుకలు విఱిచి
కొనితెచ్చు కట్టెల - గుంపును దివిజ
పూజార్థముగఁ దెచ్చు - పువ్వులుఁ జెట్ల
రాజిల్లు నారచీ - రలు నజినములు 8910
కనిచేరఁబోవ న - క్కడ పర్ణశాలఁ
గనుఁగొని భరతుండు - కరమర్థిఁ బలికె.
"మున్ను భరద్వాజ - మునివల్కు గుఱుతు
లన్నియు శత్రుఘ్న! - యవె కనుంగొనుము
యిదియె మందాకిని - యిది చిత్రకూట
మిది పర్ణశాల యీ - యెడ లక్ష్మణుండు
కందమూలముల నె - క్కడికినో చనుచు
నిందువ్రేలఁగఁ గట్టె - నీ వల్కలములు
మునివర ప్రార్థనం - బుల నిందునిలుచు
మనరాము నెలవు భూ - మంబిది గనుము" 8920
అని యానగముచేరి - యయ్యేటి యోర
వనముల జానకీ - వరుఁజూత మనుచు
మునివంటి వానిసో - ముని వంటివానిఁ
గనఁగల్గె భాగ్యంబుఁ - గనఁగల్గె ననుచు
నా మహాపురుషు వీ - రాసనాసీను
నీమేర నాకొఱ - కిట్టి కానలకు
సీతతోఁగూడి వ - చ్చిన రామచంద్రు

నేతరిఁగని కొల్చి - హిత మాచరింతు
నని ప్రదక్షిణముగా - నాయింటి చుట్టు
పెనుముల్లు కంపకు - పెట పరగాఁగ 8930
తడికె పెండముగల - ద్వారంబు దూరి
బడగరమ్మునకు నై - పన్నిన యట్టి
సౌమిత్రి గుడిసె య - చ్చటఁగాంచి యవల
రామచంద్రుని మంది - రము చేరనరిగి
మొగదల నాయుధం - బులశాల లోన
దిగదిగవెల్గు హే - తిద్వితయంబు
అపరంజి మొలలచే - నమరు కేడెములు
నపహాసితపినాక - మగు ధనుర్యుగము
నాలుకల్ గోయుచు - నాకువులందు
వ్యాళముల్ వెలువడు - నైఖరి నోఁప 8940
అలుగులు వెలుఁగ మ - హా హేమపుంఖ
ములతోడి దివ్యాస్త్ర - ములఁ దేజరిల్లు
దొనలునుఁ జూచి చే - దోయి మొగిడ్చి
చని వరమృగదురా - సద మైనయట్టి
హరులున్న గుహవోలి - యరులకుఁ జేరఁ
దరముగానట్టి సీ - తాం ప్రాణవిభుని
శాలలోఁజొచ్చి యీ - శాన్య భాగంబు
చాలంగ తరిగి ప - శ్చిమ దిశ హెచ్చి
వలమాన పావక - జ్వాలల చేతఁ
బొలుపొందు నొక - వేదిపొడగని దాని 8950
చెంగట తమ్ముఁడు - సీతయుఁ గొలువ
మంగళాకారమహా- ఘాని వేషమున

నారచీరలును తి - న్నని జడల్ దాల్చి
చారువై ఖరీఁ గుశా - స్తరణంబు మీఁద
నచలుఁడై వీరాస - నాసీనుఁ డగుచు
నుచిత ప్రసంగంబు - లొనరింపు చున్న
లోకేశనిభు నార్త - లోక శరణ్యు
గాకుత్స్థతిలకు రా - కా చంద్రవదను
కరుణాసముద్రు నా - కర్ణాంతనయను
నరుణారుణాధరు - నాజానుబాహు 8960
నీరదనిభగాత్రు - నిత్య కల్యాణు
వీరశేఖరు ధను - ర్వేద పారగుని
సారవివేకుఁ గా - సల్యా కుమారు
శ్రీ రామచంద్రు నీ - క్షించి శోకించి
జలజలఁ గన్నీరు - జాలుగాఁ గురియ
యెలుగురాయంగ నొం - డేమియుఁ బలుక
నేరక తనధైర్య - నిర్వాహ శక్తి
సూరెల మంత్రులఁ - జూచి యిట్లనియె
"కంటిరే! మాయన్న - కాకుస్థ తిలకుఁ
డొంటిగా నిచ్చోట - నువిదయుఁ దాను 8970
తమ్ముఁడు ననువంటి - తమ్ముని కతన
నుమ్మలి కింపుచు - నున్నట్టి వాఁడు
రాజవేషము మాని - రాముఁడు మౌని
రాజవేషమున ను - గ్ర వనంబులందు
నుండఁజూచియు నోర్చి - యుండిన నన్ను
చండాలుఁడైన తు - చ్ఛము లాడకున్నె?
లాలిత సౌఖ్యోప - లాలితు లడవి

పొలుగా నతిపాప - భాజనంబైన
యీమేను తనకేల? - యికనని చేరి
"రామా" యనుచు నాప - రాని ఖేదమున 8980
నిలఁబడి పొరలి మే - నెఱుఁగ కేమియునుఁ
బలుకక యుండ న - పార శోకమున
రాముని చరణ సా - రసముల మీఁద
నామీఁద శత్రుఘ్నుఁ - డడలుచు వ్రాల

—: రాముఁడు భరతుని కుశల ప్రశ్నముచేయుచు రాజనీతిని బోధించుట :—

యిరువురు తమ్ముల - నిరుగేల నెత్తి
కరుణతో నిండారఁ - గౌఁగిటం జేర్చి
చాలశోకింప ల - క్ష్మణుఁడు సీతయునుఁ
దాలిమిలేక రో - దనములు సేయ
మదిలోనఁ గలఁగి సు - మంత్రుండు గుహుఁడు
కదియంగ రామల - క్ష్మణులనుఁ జేరి 8990
గురుఁడును శుక్రుండుఁ - గూడి భాస్కరుని
హరిణాంకుఁ గదిసిన - యందంబుఁ దోఁప
రామలక్ష్మణుల నూ - రడఁ బల్కనంత
నామహామహులైన - యర్క వంశజులు
నలువురు దిగ్గజేం - ద్రంబుల రీతి
నలరుచో భరతుఁడ - త్యాపన్నుఁ డగుచు
తన జడలన్న పా - దములపైఁ బొరలఁ
దనువున వల్కల - దట్టంబు జార

క్రమ్మర విలపింపఁ - గని రఘూద్వహుఁడు
తమ్ముని దనయంక - తలమున నునిచి 9000
శిరము మూర్కొని రెండు - చేతుల నతని
యుర మప్పళించి మృ - దూక్తి నిట్లనియె.
"మనతండ్రి యిపుడు సే - మమున నున్నాఁడె?
వినుపింపు మట్లైన - విడిచి యిక్కడికి
వత్తురే! మేనులు - వసివాళ్లు వాడి
వత్తులై మీరున్న - వైపులు చూచి
కలఁగెడు చిత్తంబు - గహన భూములకు
వెలువడి రానేల - వినుపింప వన్న!
రాదుగదా! దశ - రథునికిఁ గొదవ
లేదుగదా! హాని - లెక్కింపఁ బురిని" 9010
అనిపల్క నేమియు - ననకున్న నతని
మనసులో దుఃఖంబు - మఱపింపఁ దలఁచి
హితము దెల్పఁగమది - నెంచి శ్రీరాముఁ
డతనితో మఱియు ని - ట్లని పల్కెనపుడు.
"సేయుదువే! తండ్రి - చెప్పిన యటుల
పాయవే! యవ్విభు - పరి చర్యలందు
కావింతువే! కులా - గత గురుపూజ
భావింతువే! వారి - పరిణామ మెల్ల
కౌసల్యయు సుమిత్ర - కైకయు రాణి
వాసంబులను శుభా - వహులైన వారె? 9020
సుఖయేకదా! సుయ - జ్ఞుఁడు వామదేవ
ముఖులందఱును సౌఖ్య - మున నున్న వారె?
చెలికాండ్ర కెల్లను - సేమమే? బంధు

కులమెలమెల్ల నీమేలు - గోరియున్నారె?
యేమేరల భజింతు - వే యజ్ఞ మెల్ల
యేపురవే దేవ - ఋషి తర్పణములు?
కొలిచినవారి నె - గులు మాన్పినావె?
యిలవేలుపులు సుఖు - లే పట్టణమున?
బహుమాన మొనరింతె - పండిత శ్రేణి?
గృహదేవతలను భ - క్తి భజించినావె? 9030
భరత ధనుర్వేద - పారీణుఁడైన
గురుని సుధన్వుఁ జే - కూర్చి రక్షింతె?
మంతుకెక్కిన బుద్ధి - మంతులై నట్టి
మంత్రులకెల్ల సే - మమె కదవయ్య?
రాజులకును మంత్ర - రక్ష సర్వప్ర
యోజనంబుల యందు - నుత్తమం బగుట
తగినవారలు సంప్ర - దాయకుల్ సిఫుణు
లగువారు నుందురె - యాలోచనముల
వేళల నిదురించి - వేఁకువ లందు
నాలోచనము సేతె - యర్థ మార్జింప 9040
నొంటి యాలోచన - ముడిగి పెక్కండ్ర
నంటు నాలోచించు - నదియును మాని
సులభ యత్నముగ నె - చ్చుగవచ్చు లాభ
ములయందు తామసం - బుగ జారవిడిచి
యుండక కనుగల్గి - యుందువే? యితర
మండలాధిపులు నీ - మాట సేయుదురె?
సేయు నాలోచనల్ - చేసిన దనక
యేయెడఁ బొడమక - యీడేర్చు కొనిన

నప్పుడందఱు విని - యానని మెచ్చి
రొప్పనిట్టిది యన - నుర్వి యేలుదువె ? 9050
శ్రేయాభివృద్ధి గో - రి వివేకులందు
వేయింట నొక్కని - వెదకి యేర్పఱచి
చేపట్టి యెవ్వరు - చెప్పిన వినక
యాపురుషుని యాప్తుఁ - డని నడుపుదువె?
ఎందరు గలిగిన - యేమిఁటి వార
లందరు నర్థ ప్ర - యంబింతె కాక
అన్నిఁటికినిఁ దగి - యామంత్రి యొకఁడె
యున్నఁజాలదెనిధి - యున్నట్టి కరణి
మనుజుల నుత్తమ - మధ్య మాధములఁ
బనిగొంటె? తగినట్టి - పనులందు నిలిపి 9060
పరిజనుల స్వహస్త - పరహస్తములను
పరిశీలనము సేసి - భావముల్ గనుదె ?
తగనిదండనము చే - తప్పు లేకయును
తెగినొంప కుందువే - తెకతేర జనుల?
నన్యాయ పరుఁడైన - యవని పాలకుని
సైన్యముల్ ఋత్విజుల్ - సవనంబు నందు
పతితుఁడా యజమానుఁ - భాసిన కరణి
యతివేల కామాంధుఁ - డైఁ బల్మిఁబట్టు
హితమెఱుఁగని మూర్ఖు - నెడవాయు నట్లు
ప్రతి కూలు లగుదురు - భావంబులోన 9070
చతురుపాయంబుల - జనపాల నీతి
చతురుఁడై మన రాజు - జగతిఁ బెంపెక్కఁ
దన బ్రదుకునకు నం - దఱిమీఁద విభుని

మన సెడయించి దు - ర్మానుసుండైన
వాని( జేపట్టిన - వసుమతీ విభుఁడు
హీనుఁడై యాపద - లెల్లనుఁ బొందు
అటుగాన నిట్టి ప - ర్యాయ మెఱింగి
పటుధైర్య గాంభీర్య - బాహు శౌర్యముల
నెన్నికగను వాని - హితుని నీ మొనకు
వన్నియగా దళ - వాయిఁ జేసితివె? 9080
సమరంబు లొనరింప - చతురులై నీదు
సమయంబునకు వచ్చి - సాహసులైన
సేనలకెల్లఁ జే - సిన సంబళములు
నానాటనిచ్చి మ - న్ననఁ బ్రోచినావె
అనురక్తులైనట్టి - యాప్తులు నిన్నుఁ
గనికొల్చి సకల సౌ - ఖ్యముల నున్నారె?
నీవువల్కిన మాట - నిజమని నమ్మి
సేవకులెపుడు వ - చ్చి భజింతురయ్య
యెదురువారల మర్మ - మెఱిఁగి యీవేళ
కిదియుచితంబని - యెంచి భాషింతె? 9090
వలఁతులౌవేగుల - వారు కన్నులుగ
తెలియుదువే యెల్ల - దిశల కార్యములు?
వరమహీ పాలుర - పట్టున నీకు
నెఱుఁగంగ దగుపదు - నెనిమి దెట్లనిన
తొలుత మంత్రి పురోహి - తుఁడు యువరాజు
దళవాయి గొల్లలం - తః పురకర్త
ఆజ్ఞాధికుఁడు తీర్పు - నతఁడు నెచ్చెలియు
తజ్జ్ఞుఁడై సెలవులే - తరిసేయ నతఁడు

నగరంబు పాలించు - నర నాయకుండు
తగవరి ధర్మశా - స్త్రము దెల్పువాఁడు 9100
చనవరియు తలారి - సాల దుర్గములు
తనగడినుండు నా - తఁడు ననంగలుగు
వారల తెఱఁగు స - ర్వంబు నానాట
యేరుపాటుగ విందు వే - యేకతమున?
హితుఁడు మంత్రుల - నీవునే తక్కనీదు
క్షితిఁబదియేను వీ - క్షింతె యేమరక?
వీరల చందముల్ - వేర్వేర గుప్త
చారులచే విని - సాధించినావె?
పరులరాజ్యము గొని - పాఱంగ ద్రోల
కరిగాపులుగ వారి - నణఁచి యేలుదువె? 9110
బలహీను లనియెంచి - పగవారి జేరఁ
బిలిచి రక్షించు ను - పేక్ష మానితివె?
వేద శాస్త్రంబులు - విడిచి చార్వాక
వాద తర్కంబు లే - వలఁగొన్ని నేర్చు
దుర్మతి పాషండ - దుర్జన శ్రేణిఁ
గూర్మిఁ జేరఁగ నీవె - కొలువు లోపలికి
చతురంగ బలములఁ - జతురుపాయైక
చతురత మంత్రుల - సకల భూజనుల
తనరెడుమన యయో - ధ్యా పట్టణంబు
పనుపడ లెస్సగాఁ - బాలింతె నీవు 9120
చలివెందరులు యాగ - శాలలు దివ్య
నిలయముల్ సత్రముల్ - నీరా కరములు
ధర్మసావడులు నెం - తయు త్రోవఁగల్గ

నర్మిలి బాలింతె - యరసి పొందులను ?
మహినెల్లచో నదీ - మాతృకత్వమున
బహుళంబులగు జాన - పదము లన్నియును
ముక్కారు పంటలు - మోచి స్వర్గమును
లెక్కసేయక యవి - లెస్స యున్నవియె ?
అరయుదే నగరి కా - ర్యముల నాదాయ
పరులునై నమ్మిన - ప్రాంత వర్తకుల 9130
నిన్నునమ్మిన వారు - నిఖిల భోగముల
నున్నారె యచ్చిక - మొకయందు లేక
యిల్లాండ్రతో మర్మ - మెఱింగింపఁ బోక
యెల్ల కామితములు - నిచ్చి యేలుదువె ?
సింధురాశ్వముల నా - ర్జించుచోనతి మ
దాంధతకును దని - యక మెలంగుదువె ?
ఉభయవేళలఁ గొలు - వుండి నిచ్చటను
సభలోన హితగోష్ఠి - సలుపు చుండుదువె ?
పనులవారల నొక్క - పరిపాటి గాఁగ
చనవిచ్చి యూనిక - సవదరింపుదువె ? 9140
దుర్గాంతరముల ర - స్తులవిధరస
వర్గముల్ గలుగ స - ర్వమువిచారింతె ?
ఆదాయమున కన్న - నధికమౌ సెలవు
కాదుసేయఁగ నంచు - కని మెలంగుదువె ?
కరణముల్ దెలుప లె - క్కలు విచారించి
యెఱుఁగుదువే సీమ - నెత్తు రొక్కంబు ?
నిలువ లుండఁగనీక - నెఱి నాడునాట
నిలవృద్ధిం బొందించి - యేలు చుండుదువె ?

పాత్రంబు నందు లా - భంబు వెచ్చంబ
పాత్రంబులను జలు - పక యుందువయ్య ? 9150
గురుబుధ కవియాచ - కులను లాలించి
నిరతంబు గోర్కెల - న్నియు నొసంగుదువె ?
చోరుండు వీఁడను - చో విచారింప
కూరక దండింప - నోడుదే నీవు ?
సొమ్ముకై యాసించి - చోరులం గాచి
యిమ్మహికెల్ల గీ - డెంచ కుందుదువె ?
యిరువురు జగడించి - యే తేరవారి
తెఱఁగెల్ల గట్టిగా - తెలియంగ వినక
యందు లంచములిచ్చు - నతనిఁ జేపట్టి
చిందుగాఁ బ్రతివాది - చెప్పిన మాట 9160
తగవులుఁదీర్చు పా - తకులు లేకుండ
నగరివాకిట నీతి - నడపు చున్నావె ?
న్యాయ మన్యాయంబు - నరులపై చింత
సేయకొొక్కరుని దూ - షించి నిందింప
వాని కన్నులనీరు - వసుమతి రాల
నానరపతి నిర - యంబులఁ గూలు
వృద్ధబాలక వైద్య - వితతి దానమున
బద్ధానురాగ సు - భాషితంబులను
నలరింపుదువె ? పూజ - నారాధనములఁ ?
గొలుతువే మునుల నా - కుల నిరంతరము ? 9170
ధర్మార్థ కామముల్ - తరి దప్పకుండ
శర్మంబుగోరి ని - చ్చలు నొనర్పుదువె ?
ఆది నాస్తికతయును - ననృతంబు నప్ర

సాదమే మగుటయు - జడతయు బుధుల
మన్నింపమియు పాలు - మాలుట సతుల
చిన్నెలం దగులుట - సేయుఁ గార్యములు
తనయిచ్ఛ నడపుట - తగని మంత్రములు
చెనటివారలఁ గూర్చి - సేయుట తగిన
యాలోచనమును సే - యమియును సేయు
నాలోచనములు బ - యల్సేయుటయును 9180
శుభకర్మములు మానఁ - జూచుట నలుగు
రభిముఖులై దోర - లనికి నేతేర
నొకఁడు నెదుర్చుట - యునుఁ జూవె రాజు
నకుదోషములు పదు - నాలుగై యుండు
తొలఁగి యీచెప్పిన - దోషంబులకును
పిలసిల్లదే నయ - విదులేన నంగ
ఆలస్యమును లోభ - మాగ్రహించుటయు
చాలు మోసంబున - సత్యవాదంబు
పిరికితనంబుతో - బేదఱికంబు
నెఱుకలేమియు నీతి - యెడ వాయుటయును 9190
కొంచంబు లాడుటఁ - గూడ వివేకు
లెంచిరి దశ - వర్గ మిదిమానినావె?
స్థలదుర్గ వనదుర్గ - శైల దుర్గములు
జలదుర్గ ధనురస్త్ర - చయ దుర్గములును
అనఁ బంచదుర్గంబు - లరసి నీమేని
యనువున మఱవక - యరయుదే యెపుడు?
చెలిమియు నెడవాయఁ - జేయుటఁగాఁగ
కొలది నిచ్చుట పనిని - యడంచుటయు

కలుగునుపాయ వ - ర్గంబులీ నాల్గుఁ
దెలియుదే రిపుల - సాధించు పూనికెల 9200
సమునితో సామంబు - చపలుని తోడ
సమరు భేదంబు శౌ - ర్యాధికు నందు
దానంబు లోనైన - దండన క్రమము
పూని గావింతువే - బుద్ధి నెల్లపుడు?
నిజశక్తి మంత్రుల - నెపుడు జుట్టమున
భుజశౌర్యమును పరి - పూర్ణ ధనంబు
సీమయు దుర్గముల్ - సేనయుఁ జుమ్మ
భూమీశునకు నంగ - ములు రెండునైదు
అట్టి స్వామ్యాది స - ప్తాంగ వర్గమున
గట్టిగాఁ గొదవలు - గాక యున్నావె? 9210
సాహసంబు నసూయ - చాడియుం బనుల
ద్రోహంబు నీర్ష్యయు - దూషణంబులును
ప్రల్లదంబులు విన - రాని దండనము
చెల్లదీ యెనిమిది - సేయు పాతకుల
వర్జించి యీయష్ట - వర్గంబు నెఱిఁగి
యార్జిత నీతిచే - యుర్వి యేలుదువె?
ప్రభుశక్తియును మంత్ర - బలము నుత్సాహ
మభిమతవర్గ త్ర - యంబెఱుఁగుదువె?
ధర్మత్రయీవార్తలు - దండనీతియును
నరయుదె? విద్యాత్ర - యంబని మదిని 9220
కాని చోసంధి వి - గ్రహములు నుచిత
యానాసన ద్వివి - ధాక్రమణములు
ననఁగ షడ్వర్గంబు - లానీతిచేత

చనకువైరులను శి - క్షించి మించితివె ?
ప్వానికయింద్రియం - బులగెల్చి దైవ
మానుషకృత్యముల్ - మదినెఱుంగుదువె ?
సీమయునెలవును - చెలులుదేశంబు
నేమంబుఁదనవారి - నెవ్వాఁడెఁజెఱుచు
మదముదుర్విషయంబు - మానంబుపీడ
లాదవించుటయుఁదెల్పి - యుడపుటల్ గళిగి 9230
ధర్మార్థశక్తిఘూ - తకుఁడయి దేవ
కర్మావమానుఁడై - కడఁగునెవ్వాఁడు
కాని వాఁడితఁడని - కడుఁబ్రజకెల్ల
హానిసేయుచునుండ - నయ్యెనెవ్వాఁడు
తనమాటగాదన్న - తాఁజలపట్టి
పెనఁగునెవ్వఁడువానిఁ - బెంపుఁగావించి
రమ్మపొమ్మనియాద - రముసేయఁబోక
పొమ్మెల్లఁగొని వీడు - చోరనీవె వాని ?
యెన్నిక సేయనీ - యిరువదిగుణము
లున్నవారి నెఱింగి - యుందుదే మదిని ? 9240
గడిరాజు శత్రుఁడా - కడిరాజు మిత్రుఁ
డెడరాజుదాసీనుఁ - డెవ్వారికైన
తనరాజ్యమునకు నే - తరినలుదిక్కు
లనుఁగల్గురాజు లె - ల్లనునిక్కమనుచు
రాజులు ద్వాదశ - రాజమండలము
యోజింతురది వద - నున్నదేనీకు ?
నలువురఁగూర్చియై - నను ముమ్వురైన
వలయునాలోచనల్ - వరుసఁగావింప

నందరుంగూడియే - కాలోచనంబు
పొందుగానడపించి - బుద్ధిలోనెంచి 9250
యిటమీఁదనీకు నె - య్యేది సరిపోయె
నటుల సేయుదువె జ - నాళిమెచ్చంగ ?
యాగంబు లొనరించి - యాగమంబులును
భోగంబులునుఁదేల్చి - పువ్వుఁబోఁణులను
దానధర్మములచే - త నపారధనము
మానితశీలక - ర్మముల శాస్త్రముల
కొలిచినవారిచే - గుణచరిత్రములు
ఫలములొందించెనే - భరత ! నీకిపుడు ?
ధర్మార్థకామోచి - తంబులై నాదు
నిర్మలహృదయంబు - నెలకొన్నయట్లు 9260
నేవివరించిన - యీనీతులెల్ల
భావంబులోనీకుఁ - బాదుకొన్నవియొ '
మనపెద్దలైనట్టి - మనువంశనృపుల
యనువునంబ్రోతువే - యవనియంతయును
మంచిపదార్థ సా - మగ్రితో సరస
బంచుక భుజియింతె - బంధులంగూడి
యేనుచెప్పిన బుద్ధి - నెవ్వారలైన
మానవాధీశులి - మ్మహియేలిరేని
సకలభోగములు య - శంబునుఁగాంచి
యకలంక సంతోషి - తాత్ములై పిదప 9270
యెల్లనాఁడును దివి - నింద్ర భోగముల
నుల్లసిల్లుచు వేడ్క - నుండుదురెపుడు
అన్నమాటలువిని - హస్తముల్ మొగిచి
యన్నతో నరతుఁడి - ట్లని విన్నవించె

—: రామునకు భరతుఁడు తండ్రి మృతి నెఱింగించుట :—

" ఏలయ్య ! ధర్మవి - హీనుండనైన
పాలసునకు నాకుఁ - బార్థివ నీతి
అన్నయుండఁగ నొకం - డైన రాజ్యమునఁ
గన్నిడునే మన - కాకుస్థు లందు
తనకేల వట్టివె - తల్ నాదురాక
వినవయ్య ! మీరు నా - వెంబడివచ్చి 9280

పట్టంబు గట్టుక - భానువంశంబుఁ
జుట్టనవ్రేల్ వంచి - చూపరాకుండ
వన్నువవెట్టుము - వర్ణితగుణము
లన్నియు మీయొక్క - రందె కల్గుటను
దేవుడవును నృప - తివి నీకునేను
సేవకుండను పరీ - క్షింపు ముల్లంబు
ఏను కేకయ పురి - కేఁగియు మీరు
కానల కరుగుట - కారణంబులుగ
దశరథేశుండు కాల - ధర్మంబు నొందె
దశవారములుఁ దీఱు - తరిఁ జేయువలయు 9290

కర్మంబు లేఁ దీర్చి - కదలి వచ్చితిని
ధర్మాత్మ ! నీసన్ని - ధానంబునకును
మీరునుఁ జేయుఁ - డమ్మేదినీ పతికి
వారిదానము దృఢ - వ్రతుఁడవు నీవు
ప్రియపుత్రుఁడవు గాన - పేర్కొని యొసఁగు
నియమపూర్వక తిలా - న్వితపుణ్యవారి
అక్షయదివ్యలోకా - వాప్తిఁ జేయు

—: రాముఁడు తండ్రికై శోకించి తర్పణ మొసర్చుట :—

లక్షింపఁ బితృకోటు - లకునెల్ల నేఁడు"
అని భరతుఁడు బల్క - నమ్మాట చెవుల
విని మహానగము ప - విప్రహారమున 9300
బడినట్లు నరకినం - బడు భూరుహంబు
వడువున జానకీ - వరుఁడు మూర్ఛిల్లి
కూలంబు గోరాడి - కుంభిని నలసి
వ్రాలిన మత్తేభ - వరము చందమున
నున్నగన్గొని వివి - ధోపచారంబు
లన్నకుం దమ్ములు - నవని జాతయును
కావింపఁ దెలివొంది - కన్నులు దెఱచి
ఆవీర శేఖరుం - డడలుచుఁబలికె.
"కైకైనమాట కై - కేయి కుమార!
ఆడుదు రేయిట్టు - లదరిపాటునను? 9310
యేగతినోర్తు న - న్నిటు లెడవాసి
యాగుణనిధి తండ్రి - యంతరించినను
మనజనకుఁడు వోవ - మహియెల్ల నెట్టి
యనువునం ద - ల్లడమందెనో యపుడు
దశరథుగతి నయో - ధ్యారాజధాని
వశమె హేలంగ నె - వ్వారికినైన!
యేలేనిచోఁ దండ్రి - ఋణమెల్ల దీర్చి
మేలుఁ గైకొంటిరి - మీర లిర్వురును
యెందుకు నాజన్మ - మీఁక నునువంటి
నందనుం డుండి యుం - డని చందమయ్యె 9320

యెన్నినాళ్లకునైన - యిఁక ననువంటి
చెన్నటికి నయోధ్య - చేరంగనగునె?
నన్ను నాతండ్రి నా - నాఁటికిఁ జేయు
మన్నన లేనెట్లు - మరతు నుల్లమున
నేరుపు నెరముల్ - నెమ్మదినోర్చి
చేరి యెవ్వరు బుద్ధి - చెప్పెడివారు?
ననునొక్క పాలునఁ - నందనులెల్ల
దనకొక్కపాలుగాఁ ద - లఁచు భూవరుఁడు
వనవాస మీడేర్చి - వచ్చిననన్నుఁ
గనుఁగొని లాలించఁ - గలతండ్రిపోయె 9330
యెవ్వరు నారాక - కెదురులు చూతు!
రెవ్వరి యడుగుల - కేనుఁ వ్రాలుదును?
కన్నులు బాష్పంబు - కణములురాల
నన్నుదీవింప ను - న్నారె యింకొరులు?
పలికి బొంకఁగలేక - ప్రాణముల్ విడుచు
నలఘు సత్యవ్రతుండై - నట్టితండ్రి
నన్ను తానెడవాసి - నానిమిత్యముగ
నెన్నిపాటులఁబడి - యేఁగెనో దివికి
నొకరైన లాలింప - నోపలేరై రి
యకట కోల్పోతి నే - ననదనుం జేసి 9340
నమ్మి యందరిలోన - నారనాథు డించి
షామ్మనుటకు మోస - పోయివచ్చితిని
యేమందు నని విను - మిందీవరాక్షి
మీమామ దివి కేఁగె - మేదినీతనయ!
వినవన్న లక్ష్మణ! - విభుఁడు దిక్కేది?

మనల తానెడవాసి - మరణంబునొందె"
అనుమాటలకుఁ దమ్ము - లందరు జనక
తనయయు బెట్టు రో - దనములు చేసి
తనువారు వారలం - దాను నూరార్చి
మనకులోత్తముఁడు ల - క్ష్మణున కిట్లనియె. 9350
"ఇవుడు తండ్రికి వారు - లియ్యంగవలయు
తపినికాయల సైయి - దముఁ గొనిరమ్ము
తెమ్ము! వల్కలము లెం - తేవేగమనుచు
రమ్మని జానకీ - రమణిఁ దోకొనుచు
తమ సుమంత్రుఁడు కయి - దండ యొసంగ
నమరవాహినివంటి - యాయేటి నీట
సంకల్పపూర్వక - స్నానంబుచేసి
క్రుంకిడు తరవాత - కోమలాంజలుల
దక్షిణముఖముగా - తండ్రినిఁగూర్చి
యక్షయపుణ్యలో - కావాప్తి నీకు 9360
నయ్యెడు ననివారు - లర్పించి వార
లయ్యెడదరి కేఁగి - యచట తండ్రికిని
తర్పణంబులు తిలో - దకములు నిచ్చి
నేర్పుతో తపినిపిం - డియు రేఁగుఁబండ్లు
కలిఁగూర్చి ముద్దలు - గావించి పిండ
ములు పితరులకిచ్చి - మువ్వురు నపుడు
శోకించి జనులకె - చ్చో భుజియింప
జేసూడఁదానం - జేసిన పైతృకంబు
పితరులకెల్లఁ దృ - ప్తి వహింపఁజేయు
నతిశయంబుగ నని - యాగమవిదులు 9370

పలుకుదు రటుగాన - భక్తి నేమిచ్చు
జలమాత్రమునఁ దృప్తిఁ - జనుదురు గాక!
మమ్మును పితృపితా - మహులు మన్నించి
క్రమ్మర పుణ్యలో - కములకు ననుచు
నచ్చోటువాసి నిజా - వాసమునకు
వచ్చి యచ్చటనున్న - వారునుం దాము
రోదనం బొనరింప - రోదసి నిండి
నాదంబు భరతుసై - న్యము చెవిసోఁక
వారలందఱు విన - వచ్చు నీరవము
శ్రీరామచంద్రు నీక్షిం - చెఁ గానోపు 9380
భరతుఁడచ్చట విలా - పము నింగిముట్టె
గిరిమీఁదవారి యం - కిలి చూతమనుచు
నందరు వివిధవా - హనములతోడ
నందు ప్రవేశించి యా - శ్రమంబులును
చిత్రకూటము నిండ - సేనారవంబు
మాత్రాధికంబయి - మహిఁగప్పుకొనిన
కలగుండువడి విహం - గమకోటి యెగసి
కలకలధ్వనుల నా - కసము గప్పటయు
తల్లితండ్రులఁబాసి - తడవుఁగాలంబు
చెల్లించి బిడ్డలు - చేరుచందమున 9390
తలఁపు లుప్పొంగ సీ - తారామలక్ష్మ
ణులఁజేరి యెపుడు కన్గొను - దుమో యనుచు
కొందరు మందరఁ - గోపించితిట్టి
కొందరు కైకదు - ర్గుణము లెన్నుచును
సవిధకానన పర్ణ - శాలాగ్రసీమ

నవనిపై వీరప - ద్మాసనాసీను
అనుజసమేతు నీ - లాంబుదశ్యాము
జనకజావిభు రామ - చంద్రు నీక్షించి
నడలుచుఁజేరరా - నాప్తబాంధవుల
వెడఁద కన్నులదయల్ - వెదచల్లఁజూచి 9400
అందరందగిన మ - ర్యాద సంధించి
కొందర తనచెంతఁ - గూర్చుండఁజేసి
కుశలంబు లడుగుచుఁ - గూర్మితో వినుచు
దశరథరాజ నం - దనుఁ డున్నయంత.
అలవసిష్ఠుఁడు రా - జాంతఃపురంబు
కలయఁగూర్చుకొని హె - గ్గడు లెల్లఁగొలువ
కదిసిముందర వెన్కఁ - గనుకల్గి రాచ
ముదుసళ్లుఁ బెద్ద లి - మ్ములఁ జేరిరాఁగ
ముందర గంచుకుల్ - మూఁకల జడియ
గొందరు దవ్వారి - కులు వెంటరాఁగ 9410
ముదిత లందరు మేలు - ముసుఁగులతోడ
పదములుగంద చూ - పట్టుకాల్నడను
ఆచిత్రకూట మ - హాపర్వతంబు
చూచి మందాకినిఁ - జూచి కౌసల్య
కైలాగొసంగు ల - క్ష్మణుతల్లిఁజూచి

—: కౌసల్యాదులు రాముని దగ్గఱకు వచ్చుట :—

"బాల! చూచితివె! యీ - పావనతటిని
నీకొడు కీయేట్టి - నీరంబు లిచ్చి
నాకుమారుని చెంత - నవయుచున్నాఁడు

భరతుండు రామునిఁ - బ్రార్థించి తెచ్చి
పురినుంచి రాజ్యంబె - పూనించెనేని 9470
అట్టి భాగ్యంబెల్ల - నలివేణి నీదు
పట్టియె కాక చే - ర్పగనేల యొరుల?
ఆపదలకు నోర్చు - నట్టివారలకె
ప్రాపించువలయు సం - పదలెల్ల వెనక
యెందునున్నారకో - యిక్ష్వాకుతిలకు
లందరఁ జూచిరో - యపుడె రాఘవుని"
అనివచ్చుచో దక్షి - ణాగ్రముల్ గాఁగ
నునిచిన దర్భల - నుంచుపిండములు
గనుఁగొని "చెలియ ! యి - క్ష్వాకు వంశమున
జనియించి యిలయొక్క - ఛత్రంబు నీడ 9430
నడపించు దశరథు - నకు రాముఁబోలు
కొడుకు మందాకినీ - కూలంబు నందు
తపనిపిండిని పెండ - దానంబు సేయు
నపుడె యెవ్వరు - నేర్తు రావిధి గెలువ?
యిన్ని దుఃఖంబులు - నీక్షించి యోర్చు
నన్నుఁబోలిన యట్టి - నాతు లున్నారె?"
అని చేరఁగావచ్చి - యల్లంత రాముఁ
గనుఁగొని యేడ్చుచో - గడమ తొయ్యలులు
నందరు నెలుఁగెత్తి - హాహారవంబు
క్రందుగా శోకింపఁ - గాంచి రాఘవుఁడు 9440
చేసిన పుణ్యముల్ - చెల్లించి దివికి
బాసివచ్చిన యోను - వర్వుఁడో యనఁగ
గ్రక్కున లేచి తా - కౌసల్యమోము

జడలతో వల్కల - శాలులతోడ
పుడమియేలక రాజ్య - భోగముల్ మాని
వచ్చితి విటువంటి - వారల మిమ్ము
నిచ్చోటఁ జూచి నే - నెటులోర్చువాఁడ!
మీకు సుఖంబైన - మేలని యెంచి
నా కెట్టిఖేదమైన - సహింతుగాక!
నాతలంపెఱిఁగియు - ననువెతం బెట్ట
నీతియే యహితంబు - నీవు సేయుదురె ?
యేలవచ్చితివి? నీ - హృదయంబులోని
కీలునాతో నెఱిఁ - గింపు వేఁడెదను" 9500
అనవిని యన్నతో - నంజలిచేసి
తనవర్తనము భర - త కుమారుఁడనియె.
దశరథనృపతి మా - తల్లిచేఁ గాల
వశుఁడయ్యె మిముఘోర - వనులకు ననిచి
యీకైక తనకోర్కు - లీడేర్చుకొనియు
పోకయున్నది యమ - పురి కింకనైన
రాజు లేనట్టియీ - రాజ్యంబుసేయ
రాజవుగాన ప్రార్థన - చేసి మిమ్ము
నరలేని బంటనే - నని యెన్నకతన
మఱలఁదోకొని పోవు - మతివచ్చినాఁడ 9510
నాయందు నిట్టి య - నాథలైనట్టి
యీయమ్మలందు - మిమ్మోడ వాయలేని
ధరణీ జనుయందు - దయయుంచి మఱలి
పురికి నేతెందు నా - పూనికదలఁచి
శారదయామినీ - చంద్రునిచేత

మీరు కైవడి సర్వ - మేదిని తలము
మీచేతఁగాకయే - మిటఁ బ్రకాశించు
నాచేతనైన విన్న - పము చేసితిని
యెల్లవారలఁగూడి - యేను మీచరణ
పల్లవయుగళంబు - పట్టి మ్రొక్కెదను 9520
మీతండ్రియేలు భూ - మికి మీరెకాక
యీతండ్రి వేరొక్కఁ - డున్నాడె దిక్కు?
విచ్చేయుఁడ" నిదైన్య - వృత్తినిట్లూర్పు
లుచ్చుచు మత్తేభ - మో యనఁగలిగి
పలవించు భరితుని - పైగృపయునిచి
కొలువెల్ల విన రఘు - కుంజరుండనియె.

—: తండ్రియాజ్ఞ శ్రేష్ఠమని రాముఁడు చెప్పుట :—

"రావన్న భరత! యీ - రాజ్య మోహమున
నీవు మాయడఁదప్పు - నెంచుట లేదు
నీయెడదోషంబు - నెమకిననైన
నేయెడ నొకడెంచ - నెవ్వఁడున్నాఁడు? 9530
బాలుండ వగుట - నీపట్టునఁగైక
నేలదూషించెదఁ? - వెరఁగ కాడితివి
మనలకర్మ ఫలంబు - మనకు నీరీతి
జనులకెవ్వరికి నె - చ్చట లేనియట్టి
యలమటలను ముంప - నాయమ్మనిట్లు
పలుమాఱు మదినొవ్వఁ - బలుక ధర్మమె?
సుతులును సతులును - చుట్టముల్ ప్రజలు
క్షితిపాలుఁడానతి - చ్చినఁ జేయువారు

మనతండ్రి యానతి - మన మాచరించి
యనుభవింపుదము - మేలైన కీర్తైన 9540
పట్టంబు గట్టింప - పాటిఁదోలుటకు
గట్టిగా మనకెందుఁ - గర్తభూవరుఁడు?
కావున తండ్రిపై - గల మమత్వంబు
నీవేల తల్లిపై - నిలుప కాడెదవు?
ఆతండ్రి లేఁడేని - యడవుల కనుచు
నీతల్లి యున్నది - యీయమ్మమాట
చిన్నఁబుచ్చి ప్రతిజ్ఞ - చేసిన యేను
నన్ను నేమరితప్ప - నడవ నేరుతునె?
నిన్ను పట్టముగట్టి - నిలిపి కానలను
నన్ను నుండఁగఁజేసి - నర నాయకుండు 9550
సాక్షియై దివినుండ - చనునయ్య మనము
దక్షులమై యామ - తంబు వోనాడి
యెప్పుడెప్పు డటంచు - యేవచ్చి నీకు
జెప్పిన భూమి నీ - చేత హరించి.
యిటువంటి వాఁడని - యెల్లరు నాడ
నటువంటి ఖలునిఁ జే - యఁగఁ దలంచెదవు
హితమిది నాకు - యేనిచ్చెద నీకు
క్షితిపతి పాలించు - సింహాసనంబు
పదునాలు గేండ్లుత - ప్పక యిందునుండి
తుది నయోధ్యకువచ్చి - తోఁబుట్టువైన 9560
నీమాటవిని యెద్ది - నేమింతు వప్పు
డామాట సేయుదు - నవుగము మఱలి"
అనునంతఁ తఁపనుఁ - దస్త్రాద్రిఁ గ్రుంకుటయు

జనులతోడను నను - జన్మలతోడ
సేనలతోఁ గూడి - చిత్ర కూటాద్రి
జానకీ రమణుఁడా - శ్వాసితుఁ డగుచు
ఆ దినంబు వసించి - యందరు భాస్క
రోదయంబున లేచి - యుచితంబులైన
సమయవిధుల్ దీర్చి - జనులెల్ల వినఁగ
రమణీయ మూర్తియా - రామునితోడ 9570
వెరవక తొలునాటి - వృత్తాంతమునకు
భరతుండు కేల్మోడ్చి - భక్తి నిట్లనియె.

—: రాముని రాజ్యమును గ్రహింపుమని ప్రార్థించుట :—

"దేవ! మీయానతి - తెఱగెల్ల వింటి
భావింపుఁ డెఱగక - పల్కుట గాదు
వసుమతి కైకకు - వసుధేశుఁ డిచ్చె
నసమ వైఖరినిచ్చె - నాయమ్మ నాకు
నాచేతఁగాక యెం - తయునుఁ బ్రార్థించి
మీచేతి కిచ్చితి - మేదిని భరము
అధికార మెఱఁగక - యెవని యాసించు
నధముని రాజని - యందురే జనులు
సింగంబునకు నమ - ర్చిన యామిషంబు
చెంగక శునక మా - సింపఁ జేకూరునె?
గరుడని గమనంబు - కాకికిఁ దగునె?
ఖరముపోవునె తురం - గమము చందమున?
నీదైన రాజ్యంబు - నీచేతఁ గాక
యోదేవ! పాలింప - నోపునే యొకఁడు?

ధరణీరుహంబులఁ - దాఁ బ్రయత్నమున
పరిపాలనము చేసి - ఫలమందు వేళ
యవివీటిఁ బుచ్చిన - యట్టు లిన్నాళ్లు
నవమతి లేక మ - మ్మరసి రక్షించి 9590
పగవానిఁ జూచిన - పగిదిగాఁ జూచి
దిగ విడిచిన నేది - దిక్కు మాకింక?
మమ్ము నీచేతికి - మాతండ్రి యిచ్చె
నెమ్మది తానేఁగ - నీ వింకమీఁద
మమ్ము రక్షింపకే - మాట లాడినను
సమ్మతమే మహీ - జనుల కిందఱకి
జనులెల్ల మీరు రా - జ్యము సేయఁగోరి
నను రమ్మనఁగ వచ్చి - నాఁడ మీకడకు
వారేల యిలయేల - వలసిన ట్లయ్యె!
నో రామ! మిముఁ - గొల్చియుండెద నేను 9600
బంటులకే యూరు - ప్రభువుల తోడ
నంటి యేఁగాదని - యాడు టే యూరు
మీచిత్తమింక నే - మియుఁ బల్కనొల్ల
చూచికొండు పురంబు - చూర వోకుండ''
అనిపల్కి భరతుని - యందు నెయ్యంబు
ననలొత్తఁగా రఘు - నందనుం డనియె.
''భరత కుమార! నీ - పలుకెల్ల నిజము
పరికింపు మిఁకనాదు - భావ వర్తనము
అరయ దైవాదీఁ - నుఁ డస్వతంత్రుండు
నరునకు కార్యని - ర్ణయ శక్తిగలదె? 9610

సంపదలెల్ల నా - శము నొందఁగాక
సంపన్నులకు కొన - సాగ నెక్కడిది?
పెరుగుట లెల్లను - పెక్కువ దక్కి
తరుగుటకే కాక - తామేల నిల్చు?
జగతిఁ బుట్టుటలెల్ల - చచ్చుట కొఱకు
పగగొనుటకుఁ జెల్మి - బలవంత మగుట
పొందు సేయుట - బాసిపోవుట కొఱకు
నెందు ఫలించుట - యిలరాలు కొఱకు
కావున గట్టిగా - గట్టిన యిండ్లు
భావింప నానాటఁ - బడిపోవు నట్లు 9620
మనుజు లెల్లను జరా - మరణాధికముల
ననుదినంబు లయించు - నది నిక్కవంబు
దరిచేరు కరడు లె - త్తరి మళ్లి రావు?
నరులవయః ప్రమా - ణము లట్లపోవు
నిన్నటి రాతిరి - నేటికి రాదు
చన్నట్టివార లె - చ్చట మళ్లి రారు
జలధిఁ గూడిన నదీ - జాలంబు రీతి
జలములనెల్ల గ్రీ - ష్మము గాఁచినటుల
రయముతోడుత సహో - రాత్ర రూపముల
ప్రయమగు నాయువు - వసుధ యెల్లరకు 9630
కావున నీకునే - కడఁ బని లేని
యీవిచార భరంబు - లేల మోచెదవు?
పరలోకచింత నీ - భావంబు లోన
మరవక సౌఖ్యంబు - మరిగి వర్తిలుము
నీడకై వడి వెంట - నే కాచియుండి

వీడదు మృత్యువే - వెంట మానవుల
ఉదయాస్త సమ - యంబు లూరకె చూచి
మదిలోన భోగేచ్ఛ - మానక నరుఁడు
వుప్పొంగుఁగాని యాయు - వు బోవుననెడు
చొప్పు వివేకించి - చూడఁ డేమియును 9640
తృణకాష్ఠకోటి న - దీ ప్రవాహముల
క్షణమాత్ర మొక - చోట జతగూడివచ్చు
అన్నియు నన్నియై - యావలఁ బోవు
నన్నట్లు పుత్ర మి - త్రాంగనావళియు
పాయని కర్మాను - భవముచేఁ గూడి
పాయుచునుండు ని - బద్ధి యెక్కడిది?
చనువారిఁ జూ - చితాఁ జావనియట్ల
మనువార లేడ్చుచు - మరుగు చుందుదురు
యెఱుఁగని జాడగా - నేఁగెడు వాఁడు
తెలివరులనుఁ గూడి - తెలివు గన్నట్లు 9650
పెద్దల నడక ల - పేక్షించి చూచి
బుద్ధినట్ల మెలంగుఁ - బుడమి సజ్జనులు
మడికిఁ బాఱినసీరు - మఱలిన యట్లు
వడిమీరి తొలఁగు జ - వ్వనమున్న యపుడె
ముదిమిచే నరము - లేములు బయల్దేరి
మదిమూవ చావలు - మానిన యపుడె
అత్యంతమును పరా - యత్తులై నపయ
మృత్యువుకన్నులు - మెరయని యపుడె
తరహాత యముని బా - ధలం బడునపుడు
ధరఁజేయు ధర్మముల్ - తలంచుకో నపుడె 9660

యాగాదు లొనరించి - యాత్మకింపైన
భోగమ్ములనుఁదేరి - పుణ్యముల్ చేసి
కొలిచినవారల - కొదవల దీర్చి
యిలవేలుపుల కోర్కి - లిచ్చిపోషించి
జగతియేలఁగలేని - జననాథు దలఁచి
పొగిలెదు వారి కి - ప్పుడు దగుఁగాక
పరమధార్మికుండయి - భాగ్యసంపదల
నరపదివేలేఁడు - లవనిపై బ్రదికి
హయమేధవాజపే - యాది యాగములు
నియత దక్షిణలతోఁ - నిండారఁజేసి 9670
అరియను మాట యే - యదన లేకుండ
ధరణి యేకాతప - త్రముగఁ బాలించి
కొదదీర మనవంటి - కొడుకులఁ గాంచి
తుదిబ్రహ్మలోకంబు - తోరణకట్టి
రాజిల్లు దశరథ - రాజనకేల
యీజాడఁ బలవించి - యేడ్చెద వీవు?
తగవు గాదిఁకనైన - తాలిమిఁపూని
వగపెల్లమాని నా - వచనంబు చేసి
గ్రక్కునపట్టంబు - గట్టుకతండ్రి
యక్కరతో నిచ్చు న - వని యంతయును 9680
నామూఁడుగాపాల - నంబు గావింప
మీమాట కెదురాడ - నేఁటికి నీకు ?
తాను నీ వనిలోన - తండ్రి యానతిని
మౌని వేషమున స - మ్మతిఁ జరించెదను
మనమందరము రాజు - మాటలోవార

మొనరునే విభుని - యాజ్ఞోల్లంఘనంబు
నిన్న భూవరుఁ డీ - గ్గె నే డిటువంటి
యన్నదమ్ములును మ - ర్యాద పోవిడిచి
నడచినారని భూజ - నంబెల్లమనల
పుడమి నుండక - పారిపోదు రెల్లైన 9690
చల మేల నీవుమా - సత్యంబు నిలిపి
యిల యేలు మనిపల్కి - యేమియు ననక
పురకున్నఁ జూచి ని - ట్టూర్పు నిగుడ్చి
భరతుఁ డప్పుడు రఘు - పతికి నిట్లనియె.

—: రాముని భరతుండు పురల యుక్తియుక్తముగఁ
ప్రార్థించుచు మాటలాడుట :—

"శ్రీరామ ! చిత్ర - చారిత్రుండ వీవు
ధారుణియందు విం - తలు మీగుణములు
సుఖదుఃఖములను హె - చ్చునుం గుందు
లేని అఖలసన్నుతుఁ - డవి యెవనినందైన
లేని వస్తువులజా - లినీఁ బొర్లువాఁడు
తానింటఁ గలును న - ర్థము నొల్లనతండు 9700
మదిమదినుండి స - మస్తంబుఁ గలిగి
మదమచ్చరంబులు - మానిన యతఁడు
కలిగినవాని కొ - క్కనికి సౌఖ్యంబు
కలదె యన్యుల కిట్లు - గాక వేరొకట ?
యీ రీతి చింతిల్ల - నేఁటికి మీకు ?
నేరామ ! నేనులే - కున్నట్టిచోట
యేమేమి నడచునో -యీాకై క నేర

మేమియు మదిలోన - మెన్నక యోర్చి
నీకు భృత్యుండఁగా - న నేనన్నమాట
చేకొమ్ము ధర్మంబు - చేపట్టి యేను 9710
ఆడఁబుట్టువు తల్లి - యని తెగవ్రేయ
నోడితి నీ కైక - నోర్చి కొమ్మిపుడు
ఆ తండ్రికిం బుట్టి - యతి పాపచింత
సేతునే యజుఁడు వ్రా - సిన వ్రాఁతగాక
అధమాధమునికైన - ఆలన్నమాట
విధిగతి నిటుమేను - విడిచి పోదగునె?
యెఱుఁగఁ డందమె - రాజు నింతటివాఁడు
మఱచె యశోనీతి - మానసోన్నతులు
మగనిజంపుట యెంత - మహియెల్లగాల్చి
నిగురుసేయరె చెల్ల - రె యింతులెల్ల 9720
చేటుఁ గాలమునకు - చెడు బుద్ధి యనిన
మాట నిజంబయ్యె - మనతండ్రి వలన
యెటువంటివాఁడైన - నేఁ దప్పననుచు
నిటుతండ్రి పాలార్ప - నెవ్వరోపుదురు?
ధర్మంబు దప్పిన - తండ్రి యానతియె
ధర్మంబు గానెంచు - తనయుండె వీవు
ఐన నాపదవచ్చు - నప్పుడు మర్యాద
మానఁ జెప్పిరి నీతి - మార్గకోవిదులు
నేరక చెడిపోవు న్ప - పతి దోషంబు
కృూరాత్మయగు కైక - గుణదోషములును 9730
ఆపెకు నేఁ బుట్టి - నట్టిదోషంబు
బాపుమో! స్వామి! నా - పలుకు చెల్లించి

అయ్యో! క్షత్రాచార - మారడిఁబుచ్చి
యి య్యతీశ్వర వేష - మేల పూనితివి?
యేవిట్టు లున్నచో - నిక్ష్వాకువంశ
హాని యటానను బుద్ధి - యాత్మఁ బాయుదురె?
రాచవారికి ప్రజా - రంజనం బొకటి
చూచుకోవలెఁ గాక - చూడ రేమియును
ప్రజలఁ బ్రోచుట యిహ - పరసాధకంబు
భుజసౌఖ్య నిరతులో - భూమిపాలరకు 9740
కాక యీ మునివృత్తిఁ - గడతేర మనసు
దాకొల్పు క్షత్రియా - ధము లెందుగలరు?
మునివృత్తి బహుకాల - మునఁ బొందుమేలు
జనపాలనము చేత - సవరించికొనుము
ఆశ్రమంబులు నాల్గు - నందుల శోభ
నాశ్రయంబగు గృహ - స్థాశ్రమం బెచ్చు
అందుఁజెందఁగరాని - యట్టి పుణ్యంబు
లిందుఁ గల్గఁగమీకు - నెద్దిసాధకము?
పోక వయసేల నీ - యురుగుణాంశముల
నొక కళామాత్రం - బు నున్నదే నాకు? 9750
అన్నిట నల్పుండనై - నట్టివాఁడ
నిన్నుగాదని ధాత్రి - నే నేలఁగలనె?
అనవలసిన మాట - యనుటలుగాక
నినుఁబాసి నిమిషంబు - నే నేలపోదు?
యిదె సుమంత్ర వసిష్ఠు - లెల్లవారలనుఁ
గదిసి యెచ్చరికె తోఁ - గాచియున్నారు
అభిషేక మొనరింప - ననుమతియిండు

విభవ సామగ్రి - నా వెనుక వచ్చినది
పట్టంబు గట్టుక - పయనమై వెనక
పట్టణంబున కేఁగఁ - బాటిల్లుఁగాక 9760
యీ మౌనివేషంబు - లేఁటికి మనకు ?
భూమీజనుల నెల్ల - బోషింప మీవు
నీవార మగు మమ్ము - నిఖిల లోకములు
నేవేళఁ బోషించు - నీశ్వరునట్ల
కరుణించి మా సమ - స్కారంబులంది
శరణాగతులెల్లఁ - జాలఁ బాలింపు
అదియెల్లవేని యీ - యడవిలో మీదు
పదములుగని కొల్చి - పాయకుండెదను"
అని యెంత వేఁడిన - నా రామవిభుఁడు
మనసులో భరతుని - మాటగైకొనక 9770
తనచేత ఖేదమో - దంబు లందఱికి
నినుమడిగానుండు - నేడఁ దల్లులెల్ల
భరతుని మనవిగా - బ్రార్థించి చాల
కరుణవుట్టఁగ పాయఁ - గాలేక వగువ
చిరునవ్వు మొగము - తో సీతావరుండు
భరతుని మొగము త - ప్పక చూచి పలికె.

—: భరతుఁడు దశరథుఁడు కామమోహితుఁ డని నిందింపగా రాముఁడు కాడని చెప్పుట :—

"రమ్ము కుమార ! యె - అంగని నీదు
నెమ్మదింగల సత్య - నియమమెల్లపుడు

దశరథరాజనం - దనునకు నీకు
శశిభాస్కరులు తప్పు - జాడ నేఁగినను 9780
బొంకేల? కలుగు ని - పుడు కల తెలుఁగు
కొంకెలపలికి నీకు - హితం బొనర్తు
మన తండ్రి కేకయ - మనుజేశు తోడ
తన పెండ్లినాడు నీ - తల్లిపై ప్రేమ
గైకేయి కడుపునం - గలిగిన సుతుని
జేకొని పట్టాభి - షిక్తు గావింతు
యిది సత్యమని వరం - బిచ్చినవాఁడు
మదినెఱుంగుదు పెక్కు - మాటలేమిటికి?
ఆదినిచ్చిన వరం - బది మదినెంచి
కాదె భూవరుని సం - గర వేళయందు 9790
యొచ్చరికెను వేఁడి - నిమ్మని వరము
లిచ్చితి ననిపల్కె - నీవిభుఁ డపుడు
అట్టికారణమున - నడిగెఁ గైకేయి
పట్టంబు నినుగట్ట - పతి నెచ్చరించి
ముమ్మాటుగా నిచ్చు - మొదలింటివరము
లమ్మ వేఁడిన దీని - వదిగాన లేవు
నేరమే కైకకు - నృపతికిచ్చుటలు ?
నేరమే యిదికన - నేరముగాక ?
నినువంటి సుతుండు తం - డ్రికిని సత్యంబు
కొనసాగఁ జేయక - కొదవ సేయుదురె? 9800
సామాన్య నృపుఁడీ కో - సల సుతారమణు
డేమిటిచే తండ్రి - ఋణము దీర్చెదవు?
నిందింప కీ కైక - నెగులు వారింపు

మందర దీవెన - లందుము నీవు
గయలోపల మఘంబు - గావించి తొల్లి
గయుండను రాజువ - క్కాణించినాడు
పున్నామనారకం - బునఁ బడకుండ
తన్నుఁ గాంచి తలి - దండ్రులఁ బ్రోచు
నతఁడొక్కఁడే పుత్రుఁ - డనఁ జెల్లుఁగాక
యితరుండు కలిగియు - నేమిటికనుచు ? 9810
బహుపుత్ర లాభంబు - వడసిన బుణ్య
మహిమచే నొకఁడైన - మంచివాఁడగుచు
కడతేర్ప నేర్చు వం - గడము వారలను
పుడమి భగీరథుఁ - బోలి కావునను
మాయన్న నీచేత - - మనరాజసత్య
మీయెడఁ జెల్లించి - యేఁగుము పురికి
శత్రుఘ్ను నూరార్చి - జనులను బ్రోచి
మిత్రులఁ బాలించి - మేదినీ జనుల
తండ్రికై వడిఁ గాచి - ధరయెల్ల నేలి
తండ్రికై వడి గుణో - దారుండవగుము 9820
వనుల కిచ్చట నేను - వసుమతి కీవు
నొనరంగ దొరలమై - యుండంగవలయు
దండకావనమహీ - స్థలముల నేను
మండితచ్ఛత్రచా - మరముల నీవు
కందమూల ఫలాధి - కములచే నేను
నందితరసరసా - న్నంబుల నీవు
క్రమముతో నారచీ - రలు గట్టి యేను
రమణీయ దివ్యాంబ - రమ్ముల నీవు

పనిత జటాకలా - పములతో నేను
జననుత రత్నభూ - షణముల నీవు 9830
ముంపర వనమృగం - బులు గొల్వ నేను
నిండటికిని గొల్వ - నిచ్చుచు నీవు
సౌమిత్రి యొక్కఁడి - చ్చట నుండ నేను
సౌమిత్రి యొక్కఁడ - చ్చట నుండ నీవు
రాజితగిరికంద - రం బేల నేను
రాజగేహ పరంప - రలయందు నీవు
సీతయొక్కతె సేవ - సేయంగ నేను
శీతాంశు వదనలు - సేవింప నీవు
పాదసంచార మై - భవముతో నేను
వేదండ తురగాది - విహృతిచే నీవు 9840
యీచిత్రకూట మ - హీధరం బేను
ఆ చక్రవాళ మ - హాధాత్రి నీవు
తల్లిదండ్రుల యాజ్ఞ - తప్పక లోకు
లెల్లమెచ్చ వహింప - కేమనవచ్చు
అజుల పుత్రుఁడుచేసి - నట్టి కట్టడకు
నజుని పుత్రుఁడే సాక్షి - యవుఁగాములకును
కొడుకులు లేరని - కోరి పుత్త్రేష్టిఁ
దడయక యిట్టి నం - దనులనుఁ గాంచి
మన నలువురిచేత - మనరాజు నిజము
కొనసాగ కున్నచో - కొడుకు లేమిటికి ?" 9850
అని భరతునిఁ బల్కు - నా రాము మాట
వినియంత యును ధర్మ - విరహితంబైన

మత మవలంభిచె - మౌని జాబాలి
క్షితి సుతారమణు నీ - క్షించి యిట్లనియె.

—: చార్వాకమతము నవలంభించి జాబాలి రాముని రాజ్యము చేయుమని చెప్పుట :—

''రామునికి నిర - ర్థక బుద్ధిగలిగె
నేమింటి కెవ్వని - కెవ్వాఁడు హితుఁడు?
యే పురుషుండు మహి - నెవ్వని వలన
నే పురుషార్థమూ - హించి వొందెదును?
తా నొక్కఁడే పుట్టి - తాని నశించు
వానికి తనతండ్రి - వలననే ఫలము 9860
తెలివరు లేఁగుచో - తెలువున నొక్క
పురములో నా దుండి - పోయిన యట్లు
యీ యాత్మ తలితండ్రు - లిండ్లును సుతులు
జాయలు ధనమని - సంచరింపుచును
బద్ధుఁడై యిందరుఁ - బాసి పోయినను
సిద్ధమొక్కఁడె తుదిఁ - జేరు నొక్కడకు
రమ్మన్నరాదు స - ర్వంబును వచ్చి
పొమ్మన్న మఱిపోదు - పోవు నూరకయె
కావున సజ్జనుల్ - కలుముల యందు
భావించి నిజమని - పాటింపబోరు 9870
నినువంటి సద్గుణా - న్వితుఁడైన రాజు
మనవంశమునఁ గల్గు - మర్యాద వదలి
తమ్ముని మహియేలఁ - దగవులు చెప్పి
కొమ్మతోఁబర్వత - గుహాల నుండుదురె?

యెప్పుడు మీరాక - కెదురులు చూచు
నప్పౌరజన మయో - ధ్యా పట్టణమున
యున్నవారలు వారి - యనుకులు చూచి
మన్నించి యిందర - మనవి చేపట్టి
యిలయేలు మఖిలభో - గేచ్ఛ లందేలి
తలఁపకు మిటమీఁ - ద దశరథుమాట 9880
పనియేమి నీకు న - ప్పార్థివేంద్రునకు
ననఘ! నీ వొక్కఁడ - వతఁడు నొక్కఁడు
నిజమున్న శుక్లశో - ణిత మేళనమున
ప్రజ జనియించు దం - పతులు రాగముల
కామాతురత చేతఁ - గలయుచో ప్రజకు
తాము నిమిత్త మా - త్రనుఁ దండ్రులైరి
జీవకోటులు చేరు - చెంతకుఁ జేరె
నావసుధా నాథుఁ - డది గనలేక
నీవేల "తండ్రి తం - డ్రి" యటంచు లేని
భావఁ సంబంధ మీా - పగిదిఁ గల్పించి !890
భ్రమసి యాయన యిట్లు - పలికి నాఁడనుచు
నమరునే పట్టి పాల - ర్ప నమ్మాట
యిహలోక సుఖపరు - లెవ్వారుఁ గాక
విహరింతు రత్యంత - విహిత ధర్మమున
అట్టివారల మతంబిది - నాదు మదికిఁ
బట్టియుండదు హేయ - పదమగుఁ గాని
యీలోక సౌఖ్యంబు - లేమరి పిదప
నాలోకమున నేమియు - నుభవించెదరు!

యిది ధర్మమని చెడి - యెందుకుఁ గాక
తుదిఁ జచ్చితాను వోం - దుదు సౌఖ్యమనెడి 9900
అవివేకులునుం గల - రామీఁద స్వర్గ
మవలనున్నది యని - యదియెవ్వఁ డెఱుఁగు ?
యెవ్వ రిందుకు సాక్షి - యేమగు వాఁడో
యెవ్వఁ డెఱుంగు తా - నిటువోదు ననుచు
మేను విడకమున్నె - మేనెత్తు జీవి
తానట యమరప - దం బొందువాఁడు
చచ్చినవారికి - శ్రాద్ధ కర్మంబు
లిచ్చుట తాఁజేయ - నెక్కడ నుండి
వారు వత్తురో తమ - వంటకంబులకు
పారులు నడపించు - బందు కట్లవియు 9910
పరలోక మనుట ని - బద్ధి యానేని
పరికింపు పుణ్యంబు - పాపంబు చేసి
దివి కేఁగి మఱల నే - తెంతురో విడిచి
రవితనయుం బోయి - రమ్మనఁ గలఁడో
వొకఁడూరి కేఁగుచో - నున్నట్టి వాని
కొకరు విందమరింప - నూరికిఁ బోవు
వానియాఁకలి వోని - వసువునఁ దెగిన
వానిపేరడి వృథా - వ్యయము సేయుటలు
కర్మముల్ దెలిపెడు - గ్రంథముల్ వినఁగ
ధర్మంబు గాద బ - ద్ధము విచారింప 9920
ప్రత్యక్ష సౌఖ్యాను - భవము ధర్మముగ
సత్యవాదము సేయు - శాస్త్రముల్ వినుచు
అఖిల సుభావం - బైన సామ్రాజ్య

సుఖములం దేలు మే - జోలియు నేల?
అదిగాక పరలోక - మని యొక్కటించి
యదినమ్మి యచటి సౌ - ఖ్యము లందవేఁడి
అందుకు సాధకం - బగ్ని తండ్రిమాట
యిందు నేనని రాజ్య - విభవముల్ వదలి
యిడుములం బడ నీకు - నేలన్న! రామ!
విడుపుము నాబుద్ధి - వినియిట్టి చింత 9930
భరత సంప్రార్థనా - ఫలమైన సకల
ధరణిభారము నీవు - దాల్చి సుఖింపు"
అనవిని కనుశల - లందు కెంజాయ
జనియింప శ్రీరామ - చంద్రుఁ డిట్లనియె.

-: జాబాలిమతమును నిరాకరించి రాముఁడు వైదికమతమును స్థిరపరచుట :—

"జాబాలి! యిటువంటి - చదువులు చదివి
నీబుద్ధి యొరులకు - నేర్పఁ బూనితివి
హితము పథ్యముగాని - యీమాట లేల
యతు లందరును నవ్వ - నాడితి నిపుడు
ఆగమోక్తములైన - యట్టి కర్మములు
సాగనియ్యక దురా - చారుఁడై పాప 9940
భాజనుం డగు వాఁడు - పాయని నింద
నీ జనావళి చేత - నెప్పుడు నొందు
ఆచారమునఁ దోఁచు - నతని కులంబు
వాచాలతనుఁ దోఁచు - వాని మనీష
తనువు చూచినఁ - దోఁచు ధనికునిజాడ

కనిపించు నడకలఁ - గలుగు నెయ్యములు
కావున సకల ర - క్షణ రక్షితుండు
కోవిదుండు వివేక - కుశలుఁ డుత్తముఁడు
నీమాట వినవేర్చు - నే యధర్మంబు?
గామించి ధర్మంబు - గా పలికితివి 9950
చేసిన ప్రతినయుఁ - జెల్లింప లేక
వాసియంతయుఁ బోయి - వంశంబు చెరిచి
యిటువంటి నడకచే - నింద్రుని పురికి
నిటమీఁద నే జాడ - నేఁగెడు వాఁడ?
రాజెట్లు నడచె ధ - రాజనులట్ల
యోజించి నడచుట - యుక్తమై యుండ
జననాయకుండు సత్య - సంధుఁడౌ నేని
జనులెల్ల సత్యంబు - సడల కుండుదురు
సత్యవాదికిఁ గల్గు - సద్గతి యనుచు
నిత్యంబు చదువు ల - న్నియుఁ బల్కుచుండు 9960
బొంకెడు వారలం - బొడగని ప్రజలు
శంకింపుదురు క్రూర - సర్పంబు లనుచు
కావున సత్యంబె - కర్త రాజునకు
భూవరుండగు కర్త - పుడమికి నెల్ల
సత్యంబున వసించు - జలజాక్షు రాణి
సత్యంబె యిహపర - సౌఖ్య సాధనము
సత్యంబు గలిగినఁ - జాలునుఁ గాక
సత్యలోకావాస - సౌఖ్యమే యరుదు
దానంబు హోమంబు - తపమును జపము
ధ్యానంబు నొండొక్క - సత్యమునందె నిలుచు 9970

హానిమైనను వృద్ధి - మైనను నరక
మైనను సురలోక - మైన నొక్కరుఁడు
వంచించినను మనో - వాక్కాయ కర్మ
సంచిత క్రియలందు - సత్యంబె కాని
యితరంబు నేనొల్ల - నెవ్వాఁడుఁ బొంకు
నతనిపుణ్యము భస్మ - హవ్యమై పోలియు
అటుగాన నిజమున - కై పూనినాఁడ
జటలు వల్కలముల - శైలవాసంబు
యేనె సూనృతవాది - నేని లక్ష్మియును
భూనుత కీర్తియు - పుడమియుఁ బొందు 9980
పనిలేనిపాట మా - భరతుని మాట
కొనసాగనీ విచ్చ - కుఁడ వౌచు వచ్చి
యిట్టులాడిన - యంతనె నాకు వెట్టి
వట్టికానిమ్మని - పలుక నేరుతునె?
తండ్రిసత్యమె నిల్పఁ - దలంచిన యేను
తండ్రిమాటయె కాక - తమ్ముని మాట
విననేర్తునే చారి - వేకంబులేల?
మునివర్యుఁ బలుక రా - ముని యెడాటమున
యేఁగొంచ పరతునే - యీకైక వరము?
కాఁగల యర్థముల్ - కాకేల మాను 9990
పితృ దేవతావళి - ప్రీతి గావించి
హితమని మునివృత్తి - నిచట నుండుదును
యీకర్మ భూమిలో - నిద్ధ కర్మములు
చేకొని నియతిచేఁ - జేసియె కాదె
యీగాలి యీవహ్ని - యీవరుణుండు

నీగతి సకలలో - కేశ్వరులైరి
యాగంబు లొనరించి - యతఁ డింద్రుఁడయ్యె
యోగంబులను మాను - లున్నారు దివిని
కర్మకాండము నీవు - గాదని విహిత
ధర్మముల్ పోనాడి - తపసి వెళ్లితి?" 10000
అనిపల్కు నాస్తికుం - డైన జాబాలి
గని రఘువీరుఁడు - క్రమ్మరఁ బలికె.
"సత్యంబు ధర్మంబు - శమమును దమము
భృత్య రక్షణము - మహీ పాలనంబు
మొదలైన సత్కర్మ - ములు సునాశీర
సదనంబునకు మెట్లు - చందంబు లంద్రు
అరయుదు ఘోరుఁగా - నాస్తికుండైన
దురితమానసుని బా - ధుని కేనగాఁగ
భూదేవతలు నీవు - పొడమకమున్న
వేదోక్తకర్మముల్ - విడవ రెవ్వరును 10010
త్రిభువన దేశ - దేశికకుండైన
శుభమూర్తి మా వసి - ష్ఠుఁడు నీదుమాట
విని యోర్చెఁగాపున - విడనాడరాదు
నినునీదుమాటల - న్నియు నిన్నుపోలు
పురకయుండుటన్న - నుండక మఱియు
పరమవివేకి జా - బాలియిట్లనియె.
"శ్రీరామ! యేనునా - స్తికుఁడనుఁ గాను
పోరానిపని గానఁ బొ - సఁగఁ బల్కితిని
ఆస్తికత్వంబు నా - యందు నెల్లప్పుడు
శస్త్రహానది వసి - ష్ఠమునీంద్రుఁ డెఱుఁగు 10020

పూనియేనన్యాయ - ములు వచియింప
కానిమార్గములని - ఖండింతు వీవు
అందుచే నీమాట - లందరు నమ్మి
యుందురు ధర్మంబె - యూంతగా నెపుడు
శాంతమూర్తివి దయా - జలరాశివగుట
నింతటి యపరాధమే - జేయునపుడు
కోపగింపకతాళు - కొని యుంటిగాన
నేపుణ్యనిధి నీకు - నున్నారె సములు?"
అన నమ్మునీంద్రుని - యభిమతం బెఱఁగి
మునివసిష్ఠుండు రా - మునిఁ జూచి పలికె 10030

—: వసిష్ఠుఁడు రాముని కోపమునుదీర్చి హితముపదేశించి రాజ్యముఁ గొనుమని చెప్పుట :—

"అయ్య! జాబాలి మ - హాధర్మనిరతుఁ
డియ్యెడపురికి ని - న్నెలయించు కొఱకు
భరత హితంబుగాఁ - బలికిన మాట
లెఱుఁగ కాడెనటంచు - నెంచెదు సుమ్ము
యీవు సామాన్యుఁ - డవే వంశ మెల్ల
పావనంబుగఁ జేయఁ - బ్రభవించి తీవు
యెటులన్న వంశ - వృత్తాంత మెల్ల
పటుబుద్ధిఁ దెలియు మే - ర్పరతు నెట్లనిన
"అనఘ! మహాప్రళ - యంబు నన్నిట
మునిఁగి విశ్వము సర్వ - ము నణఁగియుండు 10040
అనఁ బవళించు - నబ్జాక్షునాభి
నానంద కరమైన - యబ్జంబు మొలిచె
కమలంబులోఁ బుట్టి - కమలసంభవుండు

కమలాక్షుఁ డపుడు నా - కరమూర్తితోడ
జలమున మునుఁగు ర - సాతలం బెత్తి
బలుగోర కొనసీటఁ - బలువుగాఁ బఱచె
ఆధాత సృష్టించె - నపుడు విశ్వంబు
వేధకుఁ గలిగెన - వ్వేళ మరీచి
ఆ మరీచికిని కా - శ్యపుఁడు జనించె
నా మహామహునికి - నర్కుండు బుట్టె 10050
భానునకు మను - ప్రభుఁడు జన్మించె
భూనుతుం డిక్ష్వాకు - పుట్టె నాయనకు
నా సత్యనిధి యయో - ధ్యా పట్టణంబు
చేసి కూటస్థుఁడై - క్షితి యెల్లఁ బ్రోచె
శ్రీరామ నినుఁ బెండ్లి - సేయు నవ్వేళ
మీరాజ జనకుండు - మిగిలినవారు
వినుచుండ మీవంశ - వృత్తాంతమెల్ల
వినిపింపంగా నీవు - విన్నావె కాదె
ఆ దశరథునకు - నగ్ర నందనుఁడ
వాదిమరాజ న - య ప్రతాపుఁడవు 10060
నీ వయోధ్యకు వచ్చి - నిఖిలరాజ్యంబు
శ్రీవెలయంగ ర - క్షింప ధర్మంబు

—: వసిష్ఠుఁడు గురుమతమును విడనాడరాదని
రామునకుఁ జెప్పుట :—

తగవు వల్కెడ తల్లి - దండ్రులు గురుఁడు
జగతిపై నొకరూపె - జనుల కందఱికి

తనదు పుట్టువునకు - తలిదండ్రు లిద్ద
ఱునుఁ గారణంబులై - రూఢి మీఱుదురు
జ్ఞానోపదేశమా - చార్యుండు సేయు
గాన యాయన నూవె ! - కర్త యందులకుఁ
గావున తండ్రినిఁ - గడవ నాచార్యుఁ
డేవిధంబునఁ జూడ - నెచ్చైనవాఁడు 10070
నీకు మీతండ్రికి - నీ పితామహుల
కాకడివారికి - నర్కవంశ్యులకు
కులగురుండనుగాన - కోరినమాట
చులకఁజేయక చెవిఁ - జొనుపు మీవేళ
అందు నిన్నొట్టివి - యఘములు వచ్చి
పొందవు మా మీఁదఁ - బూన్పు మాభరము
పూఁటకాఁపుల మేము - పుణ్యంబులెల్ల
నాటిదుర్దోషముల్ - నరకిచ్చైచుటకు
మాయందు విశ్వాస - మతియున్నవారి
కా యపవర్గంబు - హస్తగతంబు 10080
సేయరానివి యెల్లఁ - జేసి మామాట
సేయువారికి లేవఁ - జేయ లోకములు
చెప్పినయట్లసే - సేయ కర్మములు
దప్పను విధి నిషే - ధము లేల నీకు?
తల్లిచెప్పినఁ జేసి - తండ్రివాక్యములు
పొల్లువుచ్చిన నఘం - బులు దానరావు
కౌసల్య మాటచే - గడవుము తండ్రి
చేసిన కట్టడ - చెప్పితి నదియు

ప్రార్థింపుచున్న యీ - భరతుని మనవి
సార్థంబు సేయ దో - షంబు లేదందు 10090
నీ సత్యమునకు హా - ని యొకింత రాదు
మోసంబువచ్చు మ - మ్ముఁ దృణీకరింప
కాదను నీమాట - గాదు మాకన్న
వేదశాస్త్రములఁ గో - విదుఁడవ నీవు
తలఁచుకొమ్మ" నుమాట - దశరథసుతుఁడు
తలపోసి గురునితోఁ - దా నిట్టులనియె.

—: రాముఁడు గురునిమాటకంటె దండ్రిమాటయే శ్రేష్ఠమని చెప్పుట :—

"అయ్య ! యెందునఁ దీరు - నయ్య ఋణంబు
మియ్యానతులకు నే - మియు నాడరాదు
తనయుల మదిఁగోరి - తపములు చేసి
కని బాల్యదశలందుఁ - గాచి రక్షించి 10100
యింతేసి వారిఁగా - నీ డేర్చుతండ్రి
యంతటివాని వా - క్యము సేయ దరదె
యిపుడు మీ రానతి - యిచ్చినకెల్ల
నుపమింపు సద్ధర్మ - యుక్తంబులైన
జనకుని యాజ్ఞకొం - చక దాఁటుబుద్ధి
జనియింప దేమి దో - షంబొ నామదిని"
అనుమాట విని మది - నాస చాలించి
తనమదిలోని కొం - దల మెల్లదీరి
మంతనంబున తా సు - మంత్రునిం బిలిచి
పంతంబు చెల్లింప - భరతుఁ డిట్లనియె. 10110

"తడవుసేయక పోయి - దర్భలు దెచ్చి
పుడమినిచ్చటఁ బఱ - పుగ నేర్పరింపు
మందుపై శ్రీరాము - నవ్వేల వాని
చందాన నాకుఁ బ్ర - సన్నుఁడౌటకును
ప్రాయోపవేశన - పరుఁడనై యనువు
లా యనఘున కిత్తు - ననుచు మీఁదెత్తి
యేమియు భుజియింప - కిలఁబడి యున్న
రామునిచిత్త మె - ఱంగ నయ్యెదును"
అని చెవిలోఁ బల్క - నా సుమంత్రుండు
జనకజానాయకు - సముఖంబు నందు 10120
పఱచిన దర్భలు - భావించి తెలిసి
భరతునితో రఘు - ప్రవరుఁ డిట్లనియె.
"నీకేమి దోషంబు - నేజేయనట్టి
లోకాపవాదంబు - లోన ముంచెదవు?
అప్పులవాఁడవే - యడ్డపా టేల?
యిప్పుడేఁటికి మాని - తీవు భోజనము?
ప్రాయోపవేశంబు - బ్రాహ్మణు లెందు
జేయుదు రొప్పు నే - క్షితిపాలకులకు?
తగునె? సుమంత్ర! ప్ర - ధానివై యుండి
తెగుబుద్ధి నేర్పి యీ - తెంపు సేయింప? 10130
మానేర్పు నేరముల్ - మఱిచక్కఁ జేసి
పూని సింహాసనం - బున కొక్క కొదవ
రాకుండ నడప భా - రము నీదెగాదె
మాకేమి ధర్మంబు - మదిఁజూచుకొనుము

అయ్యః! వసిష్ఠ మహా! - మానిచంద్ర!
మియ్యాజ్ఞ యెవ్వరు - మీరనోపుదురు ?
యినవంశ మెల్ల మీ - రిడినట్టి చెట్టు
నినునందు నొక్కహా - ని జనించెనేని
యెల్లధర్మంబులు - నెఱుంగుదు వీవు
ప్రల్లదం బిపుడు జా - బాలి వల్కినను 10140
విని సమ్మతించి యా - వెంబడి గాఁగ
ననుఁగొంచ పలిచి యా - నతి యొసంగితిరి
రావోయి! భరత! ధ - ర్మంబు వోవిడిచి
యీ విధంబున నన్ను - నింత గైకొనక
పతితునిఁ జేయంగ - ప్రతిన చేసితివి
హితుఁడని నిన్ను నే - నెంచి యుండితిని
యిది బుద్ధిగాదు నీ - విందఱిఁగూడి
కదలిపట్టణ మెల్లఁ - గై సేయఁ బనిచి
చేరి సామ్రాజ్యంబు - సేయుము తగదు
మారాడి నీవు నా - మనసు నొప్పింప ” 10150
అనవిని వెలవెల - నై భరతుండు
తనచెంత దొరల నం - దఱుఁ జూచిపలికె.
“ పగవానిఁ దెచ్చిరొ - ప్పన చేసినట్లు
తగుఁదగదని మదిఁ - దలఁచి మీరెల్ల
ననవలసిన మాట - యనక యుపేక్ష
గనుచుండ మర్యాద - గాదు మీకనిన
అందరు నేకవా - క్యమున నోరాజ
నందన! జలధిలో - నావలాడంగ
తడికె చాటు లదేల ? - తమచేత నేమి
గడతేరు నతని సం - కల్పంబె గాక 10160

మాచేతఁ దీఱెడు - మాత్రమే మీరు
చూచియు మమ్ము ని - ష్ఠురము లాడుదురె ?"
అనువేళ భరతుని - యాననాబ్జమునఁ
దనచూపు లునిచి సీ - తాకాంతుఁడనియె.
" అనఘాత్మ ! యీ పౌరు - లాడిన మాట
వినినైన మదిని వి - వేకించు కొనుము
కాని కార్యము సేయఁ - గడఁగిన యట్టి
నీనేరమునకైన - నిష్కృతి వినుము
విడువు మీప్రాయోప - వేశంబు లేచి
తడయక పోయి మం - దాకినిఁ గ్రుంకి 10170
ననువచ్చియుంటుము " - నావుఁడు భరతుఁ
డనుమానములు మాని - యుల్లన జేసి
" యేదోషము నెఱుంగ - నేమియు నేను
లేదు నాయెడ నొక్క - లేశంబుఁ గీడు
యింకనేమియు నేల? - యీ రామవిభుని
లెంకనై రాజ్యమే - లినఁ గొల్చియుందు
కానల నున్న సి - క్కడ నుందు నింతె
కానియేమియుఁ బ - ల్కఁగా నేలనాకు ?"
అని యురకున్నచో - నందఱుఁజూచి
మనుకులాభరణంబు - మఱియు నిట్లనియె. 10180

—: భరతునకు సమాధానముచెప్పి రాముఁడయోధ్యకుఁ బంపుట :—

" భరతుఁ డెప్పుడు ధర్మ - పరుఁడు వివేకి
పరమకల్యాణాన - పాయసద్గుణుఁడు

తప్పింపనేర్చునే! - తండ్రియే మాట
చెప్పిన నదిపూని - చెల్లించుఁగాక
ననుఁ గాన లందును - నగరంబు లోన
తనునుండ నియమించె - దశరథనృపతి
అది విపరీత మె - ట్లగు? మీరు మాకు
తగవు దేలుపుఁ డన్న - తంత్రుల మేము"
అనువేళ నమరవి - ద్యాధరయక్ష
మునిమహర్షులు తమ - మూర్తు లెవ్వరికి 10190
కానరాకుండ న - క్కడఁ బొంచియుండి
దానిచే పంక్తికం - ధర వధమరసి
యపుడు ప్రసన్నులై - నట్టివారలును
కపటంబు మాపి రా - ఘవున కిట్లనిరి.
"భరతకుమార! భూ - పతి మాటనీవు
పరమ ధర్మంబని - భావింతు వేని
ధరణీశుమారుగా - దా రఘూద్వహుఁడు
పరికింపు మీ రామ - భద్రుని మాట
అట్టి చందంబుగా - నాత్మలో నునుపు
మిట్టిచలంబు నీ - కేల? పాలింపు 10200
నుతశౌర్యుండవు కులీ - నుఁడవు ప్రాజ్ఞుఁడవు
చతురుండవు వివేక - శాలివి గాన
మా యభీష్టము విను - మాయన్న రాముఁ
డీ యడవులనున్న - హితమది మాకు
యితఁడు భూవరు ఋణం - బీడేర్చుకొనిన
నతిశయ సంతోష - మగుమాకు నెల్ల"

ననుచు నంతర్హితు - లైన దేవతల
వినయోక్తు లాలించి - వేడ్కలం దేలి
యున్నట్టి యెడఁ దన - యొడలెల్ల వడఁక
విన్నఁబాటున మాట - వెడలక యుండి 10210
తెఱఁగుగానక దిట - దెచ్చుక మఱియు
భరతుండు జానకీ - పతికి నిట్లనియె.
" ధర్మజ్ఞ ! మనవంశ - ధర్మంబు రాజ
ధర్మంబు నెంచి యీ - తల్లుల మనవి
నావిన్నపము విని - నాకునై సకల
భూవలయము నీవు - ప్రోతువు రమ్మ
యిలయేల నేర మ - హీజనులెల్ల
హాలికుల్ మేఘంబు - నాశించునటుల
నినఁ గోరియున్నారు - నృపునిఁగా మమ్మ
మనుప నీవే కాని - మరి లేరు దిక్కు 10220
కరుణింపు " మనుచు లో - కశరణ్యుఁడైన
ధరణిజా రమణు పా - దములపై వ్రాలి
లేవకయున్న నా - లీకపత్రాక్షు
పావనచరితుని - భరతునిఁ జూచి
యెత్తికౌఁగిటఁ జేర్చి - యొలవంకతోడ
హత్తించి కరుణచే - నాసీనుఁ జేసి
" నిజముగా నీబుద్ధి - నీ కిట్టులగలిగె?
ప్రజల నాలోచించి - పాలింపు ధరణి
అడియాసు నీకేల? - యాడినమాట
పుడమి గ్రుంగిన వార్ధి - పొరలివచ్చినను 10230

కమలారి బింబము - కళలు మాసినను
హిమవన్నగంబు మం - చెడిలి పోయినను
తప్పదు నే మాట - దప్పిన నీకు
దప్పినవాఁడ నేం - తయు విచారింపు
కైకేయి నీమీఁది - కరుణచే నైన
ప్రాకట రాజ్యలో - భము చేతనైన
యిల పుచ్చుకొని నీకు - నిచ్చె నేమిటికిఁ?
గలఁగెదు దీననొ - క్కకొంత లేదు
మాయన్న! వీటికి - మరలి పొమ్మనిన
యాయన్న యెదుర మా - టాడంగ లేక 10240
భరతుండు రత్నంపు - పావాలు దెచ్చి
ధరణీ భరం బివి - దాలుప నోపు
మోపుము మీపాద - ములు వీఁటి మీఁద
నీ పాదుకలు రాజ్య - మేలు చుండెడును
బంటనై సేతుఁ ద - త్పరిచర్య నెల్ల
వెంటను మీరలు - విచ్చేయు దనుక"
అనవిని లోకత్ర - యమునకు సౌఖ్య
జనకంబులగు తన - చరణపద్మములు
పాదుకలను మోప - భరతుఁ డుప్పొంగి
యాదరంబున మౌళి - యందుఁ గీలించి 10250
శ్రీరామ పదము లీ - క్షించి సేవించి
"వో రామ! యిదె యేఁగు - చున్నాఁడఁ దరికి
పదునాలు గేఁడులు - పాదుకా రాజ్య
పదవిచూచుచు మీకుఁ - బలె సేవ సేతు

వోయి నందిగ్రామ - మున వసియించి
యా యతి వేషంబు - లిట్లనేయుండ
ఆమేర కందమూ - లాశినై గడువు
నీమది మఱచిన - నిమిషంబు నోర్వ
పదియునేనవ యేఁడు - ప్రాపింప నాఁటి
మొదటి దినంబులో - మొదటి యామమున 10260
ననల ప్రవేశమై - నాచరింపుదును
విను డిందఱును సాక్షి - వీరు వారనక''
అన నట్లయగుఁ గాక - యని రాఘవుండు
కనికరంబున గ్రుచ్చి - కౌఁగిటం జేర్చి
భరత శత్రుఘ్నుల - పరికించి వారి
శిరములు మూర్కొని - శ్రీరాముఁ డనియె.
" కైకేయి నిపుడాదిఁ - గాఁ గానిమాట
వాకొనవలదు కా - వలసిన నన్ను
కౌసల్యతో సరి - గాఁ జెప్పినట్లు
చేసియాత్మకు నింపు - సేయుఁ డిద్దఱును 10270
యేతరి మఱవకుఁ - డీ సీతతోడు
నాతోడు దశరథ - నరపతి తోడు ''
అనిపల్కి కన్నుల - నానంద వారి
చినుకఁ బొమ్మనుటయు - శ్రీరామచంద్రు

—: భరతుం డయోధ్యకుఁ జేరుట :—

వలగొని మ్రొక్కి పా - వలు పదిలముగ
తలమీఁద ధరియించి - తమ్మునిఁ గూడి

మఱలి శత్రుంజయ - మదదంతి వరము
శిరముపై పాదుకల్ - చేర్చి యావెంట
యిరువురుఁ గొలిచిరా - హితులు మంత్రులును
గురుఁడు రాజులు సైని - కులు వేఱువేర 10280
ననిపించుకొని పోవ - నపుడు కౌసల్య
మునుగాఁగ దశరథు - ముదిత లందఱును
రోదనంబులు సేయ - ప్రొక్కి పొండనుచు
నేదెస నిలువక - యేమియు ననక
సీతాసహాయుఁడై - చెంత సౌమిత్రి
యేతేరఁ దమయన్న - యింటి లోపలికి
తిరిగిచూడక పోవఁ - దెఱవ లందఱును
మఱలి యాభరతాను - మతిఁ దెచ్చినట్టి
చతురంత యానముల్ - సరవితో నెక్క
చతురంగ బలములు - చనుదేరఁ గదలి 10290
రథములపై దశ - రథ కుమారకులు
రథనేమి హయగజా - రావముల్ మీఱ
చిత్రకూటము ప్రద - క్షిణముగా వచ్చి
చైత్రరథంబు మె - చ్చ నియాశ్రమములు
చూచుచు వచ్చియు - చ్చో భరద్వాజ
వాచంయమీంద్రుని - వాసంబు చేర
నెదురుగా నమ్మౌని - యేతేర నతని
పదములు కెరగిన - భరతునిం జూచి
ఆశీర్వదించి మ - హాతపోధనుఁడు
దాశరథికిం బ్రమో - దమున నిట్లనియె. 10300

"అన్న నాచే మీర - లను మతులగుచు
నిన్న నేఁగిన వారు - నేఁడె వచ్చితిరి
సమయూఁడనే నీదు - సంకల్ప సిద్ధి
రమణీయమూర్తు లా - రామ లక్ష్మణులు
యెచ్చట నున్నవా - రెఱిఁగింపుమనుచు
నిచ్చ నెఱింగియు - నెఱుఁగని యటుల
పలికిన మాటితో - భరతుండు మఱల
కలతెరంగెల్ల ని - క్కముగ నిట్లనియె.
"అయ్య! మా రామునిం - బ్రార్థించి మఱల
నయ్యయోధ్యకుఁ బిల్వ - నాత్మఁ గైకొనక 10810
ఆచార్య ననుమతి - బ్రాఙ్ముఖుం డగుచు
లేచి పాదములఁ గీ - లించి పాదుకలు
మహిఁ యేల నియమించి - మన్నించి నన్ను
బహుమాన మొనరించి - పనిచితా రాక
పదునాలుగేండ్లు భూ - పతి మాటచేసి
తుదివత్తు మనుచు నా - తో నానతిచ్చె"
మఱలివచ్చితి నన్న - మాని వరుండు
భరతుని కామోద - భరితుఁడై పలికె.
"అనఘాత్మ! నీవు జ్యే - ష్ఠాను వర్తనము
మనసున నునిచి యీ - మర్యాద వడచి 10820
పల్లంబులను వారి - పాయని యటుల
యెల్ల సద్గుణముల - కిరవయి నావు
కావున నినువంటి - ఘనుఁడు శ్రీరామ
దేవు పాదుక లిట్లు - దెచ్చుట యరుదె!

యీమాటవినిన నా - హృదయ సంతోష
మేమని వాకొందు - నింతంత గాదు
అడిగెడి దేమి నీ - యంత సత్పుత్రు
బడయు భూపాలుఁ డె - ప్పటికి నున్నాఁడు
పోయి రమ్మన రాజ - పుత్రుఁ డమ్మునికి
జేమొత్తి మ్రొక్కి తా - సేనలు గొలువ 10330
యమునయు గంగయు - నట మీరియెదుర
రమణీయ శృంగిబే - ర పురంబు దాఁటి
తనదు తండ్రినన్నఁ - దమ్ములు లేక
తనకన్నులకు నయో - ధ్యా పట్టణంబు
రహిలేని తెఱఁగు సా - రథి మోముజూచి
బహుళ ఖేదంబుతో - భరతుండు పలికె

—: భరతుఁ డయోధ్యనుజూచి శోకించుట :—

"సూత! యీపురి దేరి - చూడు మెల్లెడల
గీతవాద్యాది సం - కీర్ణతల్ మాని
మొగడల మార్జాల - ములును ఘూకములు
జగడింపఁ దిమిర మె - చ్చట నిండికొనఁగ 10340
పాములాడఁగఁ గృష్ణ - పక్షంబు నాఁటి
యామినితోడి జో - డై చెలంగెడును
అలరాహు ముఖములో - హరిణాంకుఁ గూడి
నిలుకడ చెడురోహి - ణీ దేవిఁబోలి
పలుచని నీటిలో - పలఁ దపియించు
జలజంతువుల తోడి - ఝరియునుం బోలె

హవ్యంబు చేఁదేజ - మఱఁగిన పవన
హవ్యవాహానునిఁ బా - యని కీలవోలి
కదనంబులో హరుల్ - కరులనుం బోలియ
చెదరి బీడరియున్న - సేనలం బోలె 10850
మొరయుచు జలధిలో - మొలచి నీరంబు
విరియఁ బొంగణఁగిన - వీచియుం బోలె
మహనీయయాగ స - మాప్తి యాజకుల
విహరణం బుడిగిన - వేదిక పోలె
మందలేఁగల శాసి - మరి మేపులుడిగి
బందఁజిక్కిన ధేను - పంక్తియు బోలి
యెందు నాయకమణి - నెనయక చూడ
నందంబులేని ము - క్తావళిం బోలి
వరపుణ్య ఫలమెల్ల - వమ్మయి పోవ
ధరణిపైఁ బడియున్న - తారక వోలె 10860
చూడఁ గార్చిచ్చులు - సుడిగొన్న సెగల
వాడిన నవపుష్ప - వల్లియుం బోలె
జలదమాలికలు న - క్షత్రముల్ గప్ప
లలిమాయు నాకాశ - లక్ష్మియుం బోలె
పగిలిన భాండసం - పద చేత మత్తు
లగువారు లేనిపా - నావనిఁ బోలె
కడవ పెంచులును మొ - గ్గరములుం గలిగి
పడిపోవు నడిత్రోవ - ప్రపయునుం బోలె
దొమ్మికయ్యముల రా - తుకుఁగాక నొవ్వి
సొమ్మసిల్లిన యాక - శోరియుం బోలె 10870

సవరణ లేమియుం - జాలక ధన్యుఁ
డవు పురుషునిగాత్ర - యష్టియుం బోలె
జలదాగమంబున - జలధర శ్రేణి
యలమిన మాయు నూ - ర్యప్రభ వోలె
ఎలమి యేమియులేక - యీపట్టణంబు
తలమాసి యున్న చం - దంబు చూచితివె!
మంగళాలంకార - మహిమముల్ లేక
సంగీత సాహిత్య - సౌష్ఠవం బెడలి
చతురంగ బలముల - సంకులం బెడలె
క్షితిపాల సుతులుకై - చేసిరా రిపుడు 10380
తొలఁగెను సాంబ్రాణి - ధూప వాసనలు
వెలయువు పురిలోన - విభవంబు లెచట
ధరణిజ రీతి సీ - తాకాంతు వెనక
పురలక్ష్మియునుఁ గూడి - పోయెఁగానోపు
యిదిదుర్దినముఁ బోలి - యిప్పుడు దోఁచె
బదునాలుగేఁడులుం - బాసిన వెనక
మంద్రుడు వేసవిఁ దోఁచు - మబ్బుచందమున
దంద్రిడివై రాముఁడే - తరివచ్చు నొక్కొ"
అని పలుకుచును పం - చానన హీన
ఘనకందరముఁ బోలు - కాకుస్థ విభుని 10390
నర శూన్యమైనట్టి - నగరిలోఁ జొచ్చి
తరుణులు తోడుగా - తల్లుల నెల్ల
నచట నుండంగఁ జేసి - యాచార్యుఁ జూచి
పచరించి యొకమాట - భరతుండు పలికె,

—: భరతుఁడు నందిగ్రామమున రామపాదుకల బురస్క-
రించుకొని రాజ్యమును బాలింపఁబూనుట :—

"ఆగా యయోధ్యాపురం - బిఁక నేల నాకు ?
వోయి నందిగ్రామ - మున వసించెదను
రాముఁబాసిన విచా - రముఁ గాకయున్న
నేమిటం దీరు నిం - కేమియు నొల్ల
రామచంద్రుఁడు నాకు - రాజగుగాన
నామహాత్మునిరాక - నాత్మ నుంచెదను 10400
మీమనంబుల నిది - మేలని యెంచి
నేమింపుఁడ"నిన మం - త్రివరేణ్యు లనిరి.
"అన్నదమ్ముల మే - ర లన్నియు నీకె
వన్నెగా కితరు లె - వ్వరు సాటినీకు ?
నీచిత్త మెట్లుండె - నీవట్ల చేసి
యాచంద్రతారార్క - మగుకీర్తిఁ గనుము.
సీతా విభుండని - చిత్త మెఱుంగు
నాతని హృదయ మీ - వరసి వచ్చితివి
సరిపోయినట్లు వి - చారించి కొనుము
భరత రాజకుమార ! - పలు మాటలేల?" 10410
అన సారథిని రథం - బరిది వేగమున
గొని తెమ్మనుఁడు మిన్ను - గోరాడు చున్న
తళుతళుక్కున కోవి - దారధ్వజంబు
గల రథంబతఁడు చెం - గటఁ దెచ్చినిలుప
నందరతల్లుల - యనుమతి చేత

నందుతమ్మునిఁ గూడి - యచలుఁడై యెక్కి
వచ్చిన వారలె - ల్లరు నిండ్లు చొరక
యెచ్చటి కేఁగిన - నేఁగుద మనుచు
రామునిఁ బాయువా - రల మిఁకమీఁద
నేమర నేర్తుమె యీ - విభు నన్నుచు 10420
వీడెల్ల రఘుపతి - విడిచిన నాడు
పాడుగా దిప్పుడు - పాడయ్యె ననుచు
యిల్లని యాండ్రని - యిచ్చట నేల?
యెల్లరు వెంటరం - డీఁకఁ జాలు''ననుచు
గురుపురోహిత మంత్రి - కోవిదామాత్య
వరులుమున్నుఁగ బౌర - వర్గంబు గొలువ
రామచంద్రుని నవ - రత్న పాదుకలు
తామౌళినిడి యర - దము గదిలించి
పోయి నంది గ్రామ - పురిచేరి భరతుఁ
డాయెడ గురుఁడు ము - న్నగు వారిఁబలికె. 10430
''యీయవనీ చక్ర - మెల్ల రామునిది
ఆయన నాచేత - నది డాఁచనుంచె
కర్తయిందుకు పాదు - కా యుగళంబు
కర్తవ్య మిదినాకుఁ - గాచి కొల్చుటకుఁ
గాక యే నెవ్వఁడఁ - గడమకు ననుచు
నాకెలంకుల సుమం - త్రాదుల కనియె.
''పాదుకలను రాజ్య - భార మంతయును
పాదు కొన్నదిగాన - ధర్మ పీఠంబు

నుభయ చామరములు - నుచితాతపత్ర
మభిముఖులై మ్రొక్కి - యర్పింపుఁ డిపుడు 10440
శ్రీరామవిభుఁడు వ - చ్చిననాఁడు భక్తి
చేరి యీపాదుకల్ - శ్రీ పాదములను
తొడిగించి చూచు సం - తోషముల్ గాంచి
పుడమి యర్పింత మా - పుణ్యశీలునకు
నాఁడుగదా నామ - నంబులో నున్న
వ్రీడయు పాపంబు - వీడి సుఖంతు
రామాభిషేక సం - భ్రమమునేఁ జూచి
యీ మూఁడు లోకంబు - లేలి నట్లుందు''
అనుచు పాదుకలు సిం - హాసనాగ్రమున
నునిచి వసిష్ఠు ని - యోగంబుచేత 10450
నభిషేక మొనరించి - యా పాదుకలకు
నభిముఖుండై మ్రొక్కి - యట కొల్వుచేసి
జడలతో వల్కల - శాలులతోడ
పుడమియెంతయుఁ దన - భుజశక్తిఁ బ్రోచి
దినమును పారుప - త్తెములు పాదుకలు
గని విన్నపముచేసి - కానుకలే మయిన
నెవ్వారు దెచ్చిన - నెచ్చరింపుచును
దప్పులం గనిపించు - దారి యేర్పఱచి
మనవుల వారల - మనవు లాలించి
చనిపాదుకల తోడ - చాలంగ దడవు 10460
యేకతంబున నుండి - యెవ్వారి కెట్లు
ఘాకొనవలయు స - ర్వమునట్లు దీన

రాముఁడు లేని కొ - అంత రావిక
సీమ యంతయు సుర - క్షితము గానేలి
తమ్ముండుఁ దాను నా - దశరథ తనయుఁ
డమ్మేర సంతోషి - తాత్ముఁడై యుండె.

—: శ్రీరాముఁడు చిత్రకూటమునువిడిచి వేఱొక
యాశ్రమమున కరుగుట :—

చిత్ర కూటంబున - శ్రీరామ విభుఁడు
మిత్రసన్నిభుఁడు సౌ - మిత్రి సేవింప
శీతల వనతరు - సీమల యందు
శీతాంశు ముఖబింబ - సీతతోఁ గూడి 10470
వసియింప నచటి పా - వన మునిశ్రేణి
పౌసఁగ దిచ్చట తపం - బులు జపంబులును
వేఱె యొచ్చటనైన - విపిన భూములకుఁ
జేరుదమని చింత - చేసి యందఱును
పయనంబులగు జాడ - భావించి మిగుల
ప్రియముతో నొకమానిఁ - బేర్కొని పిలిచి
"యేల! యీ మునిగణం - బెల్ల నుల్లముల
చాలంగ కలఁగి వి - చారముల్ సేయ
మామువ్వురందు మీ - మనసులు నొవ్వ
నేమైనఁ జేసితి - మే" ని వాకొనుఁడు" 10480
అనిన నమ్మౌని వృద్ధుఁ - డా రాముమాట
విని తమ తెఱఁగెల్ల - వినుమంచుఁ బలికె.
"సీత సుశీల వి - శేషించి మాని

జాతంబునందు వా - త్సల్యంబు వెనుచు
మీ యెడ గొఱత లే - మియు నేలకల్గు !
నీయెడల ప్రయాణ - హేతువు వినుము
మీర లీశైలంబు - మీఁద వసించు
కారణంబునఁ జేసి - ఖరుఁడను వాఁడు
రావణానుజుఁడైన - రాక్షసుం డొక్కఁ
డీ వనంబునఁగల - ఋషుల నందఱిని 10490
వెతఁబెట్టుచును యాగ - వేదులు ద్రవ్వి
ప్రతిదివసంబు యూ - పంబులు విఱిచి
స్రుక్కులు పొడిసేసి - స్రువములు గాల్చి
మొక్కళంబున పాత్ర - ముల్ పాఱవైచి
అగ్నులు చల్లార్చి - యాగ వాటికలు
భగ్నంబులుగఁ జేసి - పశువుల మెసవి
శ్రీరామ! యేమని - చెప్పుదు ఖరుని
జేరిన దైత్యుల - చే దండగములు
నందుచే నిటనిల్వ - యజ్ఞ గాకున్న
నెందైన గదల వీ - రెంచిన వారు 10500
యిఁకనున్న బ్రతుకుల - కేవచ్చు కొదవ
యిఁకనేల యడియాస - లీ యాశ్రమమున''
అని ప్రాణముల మీఁది - యాసచే నిచటి
మునులిందుకు సమీప - మున మునువున్న
యడవి యున్నదిగాన - నరిగెద రట్టి
యెడకు మీకును మోస - మిచ్చోట నున్న
ఖరుఁడు జగద్ద్రోహి - కాంతతో వచ్చి

మొఱఁగక యున్నాఁడ - వికటి ఖేదములు
వలసిననీవు మా - వలన వెంబడిని
తొలఁగిరమ్మిదె కత్తి - తో సాము నీకు" 10510
అనిన యేమియును మా - టాడక యురక
వినుచున్న తనువారి - వెనక నమ్మౌని
కదలి పోయినవెంట - గహన మార్గమున
పదియడుగులు రాఁగ - పరమ సంయములు
దీవించి పనుప ధా - త్రీ సుతాజాని
యావేళవారిఁ బా - యక లేక మఱలి
తన పర్ణశాలకు - తమ్మునిం గూడి
వనిత చెంగటికి తా - వచ్చి యచ్చటను

—: రాముఁ డత్రిముని యాశ్రమము జేరుట :—

"కంటివె లక్ష్మణ! - గహన మార్గమున
నొంటి వీరలు వచ్చి - యున్నారటంచు 10520
మనశక్తి నమ్మక - మౌను లందఱును
దనుజులచేతి బా - ధకు నోర్వలేక
తొలఁగి పోయిరి దైత్య - దూషితంబైన
నెలవేల మనకు మా - ని గణంబులున్న
చోటు వేరొకయెడఁ - జూచి వసింత
మీటెంకి మనవార - లిందఱు వచ్చి
రొచ్చుచేసిరి గాన - రుచియించి యుండ
దిచ్చోటు పయనమై - యేతెందు మీరు''

అనుచు లక్ష్మణ సీత - లనుసరింపంగ
మనువంశమణి అత్రి - మౌని వసించు 10503
ఆశ్రమంబునకు మ - ధ్యాహ్నంబు నందు
నశ్రములై చేరు - నా తపోధనుఁడు
తనకు మ్రొక్కిన రాజ - తనయులం జాల
మనుఁడని దీవించి - మహిపుత్రిఁ గాంచి
ఆమౌని తనభార్య - ననసూయఁ జూచి
యీ మానవతి సీత - నీవు లాలించి
ఉపచరింపు మటంచు - నొగి నప్పగించి
యపుడు రామునిఁ జూచి - యతఁ డిట్టులనియె
"సుజనసన్నుత! యన - సూయ ప్రభావ
మజహరాదులకు ని - ట్లని పల్క రాదు 10540
వినుమెట్టులనిన ని - వ్వేలఁది పూర్వమున
వినని కానని యనా - వృష్టి దోషమున
పదియేండ్లు మహియెల్ల - బాధల నొంద
నది తా నెఱింగి మ - హా మాతశక్తి
కందమూల ఫలాది - కములు గల్పించి
మందాకినీ నది - మహిఁబాఱఁ జేసి
వసుమతిజనుల నె - వ్వాలు దీర్పఁజూచి
మసలక వేల్పులు - మది మచ్చరించి
పదివేలు వర్షముల్ - పడఁతి తపంబు
వదలక కావింప - వారు విఘ్నములు 10550
చేతనైనట్టు చే - సిన శోకించుకయు
భీతిఁ జలింపక - పెంపుతో నున్న

సిగ్గున దేవతా - శ్రేణి తచ్ఛక్తి
యుగ్గడింపుచు మెచ్చి - యోడిరి గాన
యీసాధ్వి నేమని - యెన్నుదో నీకు
కౌసల్యమాటు రా - ఘువవంశతిలక !
మేలుగోరిన నీవు - మేదినీతనయ
నా లలనామణి - యుండకుఁ బనిచి
మ్రొక్కింపు మనిన రా - ముఁడు సీతఁజూచి
చిక్కని భక్తితో - సేవింపు మీవు 10560
యీ పుణ్యవతి నన్ను - నిలసుత వచ్చి
యీ పురాణినిఁ బర - మాయుసున్నతను
ననసూయఁ జేరి ని - జాభిధానంబు
వినిపించి మ్రొక్కిన - విని యావెలంది
పావన చరితను - పరమ కల్యాణి
నావసుధాపుత్రి - నప్పుడు చూచి
"అమ్మ! పాతివ్రత్య - మాత్మ నేమఱక
నమ్మినవారి మనం - బ్రోచినావె?
యిలయెల్ల నేలిన - నీ కానలందు
మెలఁగిన సమబుద్ధి - మెలఁగ నేరుతువె ? 10570
తరుణివైయుండి బాం - ధవులనుఁ బాసి
పరిచర్య లొనరింతుఁ - బతికి నేననుచు
వచ్చిన యప్పుడే - వసుమతి నీవు
నిచ్చట శుభము ల - న్నియు నందఁగలవు
తగినవాఁడైన నను - తగనివాఁడై
మగఁ డొరపరియైన - మైలఁ బాటినను

కాముకుండైనను – కానివాఁడైన
లేమిఁజెందిన వీర – లేమఁ బొందినను
పతియె దైవము గాక – పడఁతుల కెందు
గతి వేరెకలదె యే – గతిఁ దలంచినను? 10580
సరకుసేయక పతిఁ – జాల నిందించు
గరితలకెందు స – ద్గతు లేలకల్గు!
నినువంటి సతులు – ర్వి నెగడంగఁగాదె
యనుపమ ధర్మంబు – లభివృద్ధి నొందె
ఆదిఁ బతివ్రతలై – నట్టి సతుల
వేద శాస్త్రంబులు – వినుతించు గాన
అట్టివారలజాడ ప్రాణ – నాయకుని
పట్టున మెలంగుదే – పతిహితం బెఱిఁగి
పెద్దలమగుటఁ జె – ప్పిన మాటగాక
బుద్ధులు నేర్పనో – పుదుమె నీ కేము 10590
నా తపంబీడేరె – నకతంబు చేత
నాతి నేనిన్ను మ – న్ననజూడఁ గల్గె"
అనియత్రి భామిని – యాడినమాట
వినయంబుతో సీత – విని యిట్టులనియె.

—: సీత యనసూయతోఁ బాతివ్రత్య ధర్మములఁ
గూర్చి ముచ్చటించుట :—

"ఓయమ్మ! నినువంటి – యుత్తమ సాధ్వు
లీ యర్థములు బల్క – కేల మానుదురు!
ధరణి నీవంటి యు – త్తమసతుల్ నడచు

పరమ ధర్మంబె చే - పట్టిన దాన
నెచ్చట నా నాథు - నిట్టివాఁడనఁగ
వచ్చునే? లోకైక - వర్ణితుండతఁడు 10600
అత్త చేతను తల్లి - యందు నే వినిన
యుత్తమ ధర్మంబు - లుల్లంబు లోన
అమ్మ! నీమాటచే - నవి వ్రేళ్లువారి
కొమ్మలు వెట్టి చి - గుళ్లంకురించె
పతిసేవఁ బోలునే - పడఁతుల కెల్ల
వ్రతములుఁ దపములు - వరనియములు
పతిసేవచేఁ గాదె - భామ సావిత్రి
యతిశయ సౌఖ్యంబు - లందె స్వర్గములు
నినుఁబోలి యలరోహి - ణీదేవి చంద్రు
నెనసి నిత్యానపా - యినియై సుఖంచె 10610
నారీతి మఱియుఁ గు - లాంగనల్ పతుల
జేరియు తమసుఖ - స్థితులు గైకొనిరి."
అనవిని "ఓ సీత! - యదుగు మేమైన
మనసునఁ గలయభి - మతము లిచ్చెదను
ఏ మివేడెద వన్న - నేమియు నొల్ల
నోమానవతి! నీ హి - తోక్తులే చాలు
నిన్నికోరికలు నే నం - దితి" ననుచు
విన్నవించి నత్రి - వెలఁది హర్షించి
"అలివేణి యీసొమ్ము - లంబరంబులును
వెలలేని యవి నీవు - వేడ్కధరించి 1062౦

శ్రీమహాలక్ష్మి రాజీ - వాత్మఁబోలి
రాముని చిత్తంబు - రంజిల్లఁజేసి
మనుమని యిచ్చిన - మాటాడ వెఱచి
అనసూయ చేత న - య్యంగ రాగములు
చేకొని సేవించు - సీతనుఁగాంచి
వాకొని యాపతి - వ్రత యిట్టులయె.
"అతివ! రాఘవుఁడు స్వ- యంవరణమున
అతిశక్తి నినుఁబెండ్లి - యాడెనటంచు
మునువింటి మది సర్వ - మును దెల్పుమనిన
జనకనందన పుణ్య - సాధ్వితోఁబలికె. 10630
"మాతండ్రి నిమివంశ - మండనుండగుచు
నీతివైఖరి ధ - రణీ చక్రమెల్ల
పాలించి కీర్తి సం - పన్నుఁడై యాగ
శాల దున్నింప నా - చాలు వెంబడినిఁ
బుట్టితి నేను న - భోవాణి పేరు
పెట్టి సీతయటంచుఁ - బేర్కొని నన్ను
బిడ్డల లేనిచోఁ - బ్రేమ నారాజు
గొడ్డువీఁగిన తన - కులకాంతఁ బిలిచి
ననుఁ జేతికిచ్చిన - నాతికి నపుడె
చనుదోయి చేపిపా - ల్జడిగొని కురియ 10640
నన్నుఁబోషింపుచో - నాకు నానాఁట
చిన్నారి పొన్నారి - చిఱుతప్రాయంబు
వచ్చినఁ దగినట్టి - వరునికీఁ దలఁచి
యిచ్చలో మాతండ్రి - యిట్లని యెంచె.

ననిపల్కి తనవివా - హ ప్రసంగంబు
తన మఱఁదులకును - ద్వాహంబు లగుట
నీవలి కథ తమ - రే తెంచుటయును
కోవగట్టుక పూస - గ్రుచ్చిన యట్లు
పలికిన విని సీత - పైఁ గృపాదృష్టి
వెలయించి పరమసా - ధ్వీ రత్నమనియె. 10650
అతని యీకథవిని - యానందమయ్యె

—: రాముం డత్రి యాశ్రమంబుననుండి దండకా
రణ్యంబునకుం బోవుట :—

శతపత్ర మిత్రుఁడ - స్తనగంబుఁ గదిసె
గూడులు చేరె ప - క్షులు మేపులుడిగి
వాడువారె వికాసి - వనరుహశ్రేణి
మునివరానుష్టాన - ముల వేళయయ్యె
గనువిచ్చెఁ గాసార - కైరవశ్రేణి
వెలిఁగె నాహవనీయ - వీతిహోత్రములు
చెలఁగె నుర్వరనిండి - చీకటిపిండు
చరియించె నవె నిశా - చారజంతువులు
హరిణముల్ వేదిక - లందువసించె 10660
మెఱసె చుక్కలగుంపు - మిన్నులనుండి
దొరసె తూరుపుదిశం - దోయజారాతి
నిండెను పండువె - న్నెల యెల్లయెడల
పండెఁ గోర్కెచకోర - పాళికి నివుడు

యేనొసంగిన సొమ్ము - లెల్ల ధరించి
మానిని సొమ్ము ! నీ - మగని చెంగటి కి"
అనవిని యనసూయ - యానతి సీత
యనుపమ దివ్య భూ - షాన్విత యగుచు
రామలక్ష్మణులఁ జే - రఁగ నేఁగి యత్రి
భామిని సేయు సం - భావనల్ దెలుప 10670
వినివారు వెఱగంది - వీక్షించి యచట
మునులచే బహుమాన - ములఁ బ్రీతులగుచు
నా రేయి యత్రి పు - ణ్యాశ్రమంబునను
వార లొక్కెడఁ దగు - వైఖరినుండి
మఱునాడు విహిత క - ర్మంబులు దీర్చి
మఱలి యయ్యాశ్రమ - మౌనిపుంగవుల
చెంతకుఁ జేరిన - శ్రీరాముఁ జూచి
సంతసంబున మౌని - సమితి యిట్లనియె.
" అనఘ ! మా జపతపో - హాని వారించి
యనయంబు కందమూ - లాదులు దేరఁ 10680
జనువారలకు బాధ - సలుపుచుఁ గ్రూర
వనమృగంబులు దై - త్య వర్గంబు నిచట
నిలువ రాములుచేసె - నీవు మాకొఱకు
నిలిచి యిచ్చట మాకు - నెగులెల్లఁ దీర్చి
శరముల నహితులఁ - జక్కాడి మునుల
గరుణించి పుణ్యంబు - గట్టుకో వలయు
యిదియె యాతాయాత - ఋషులాశ్రమముల

బ్రదుకుల పై యాసఁ - బాసి నిత్యమును
నడవులకునుఁ బోవు - నట్టి మార్గంబు
చెడకుండ యిందరిఁ - జేపట్టి మీరు 10690
నీత్రోవ నడవుల - కేఁగ నిచ్చోటి
వైదేయబాధలు - దలఁగించి ప్రోచి
యభయ దానమొసంగు - మనిన మానులను
నభిముఖుఁడై రాముఁ - డంజలి సేసి
అటుల కానిండని - యనుమతుండగుచు
పటుశౌర్య నిర్వాహ - బాహుగర్వమున
విలసిల్లెనని వేద - వేద్యుని పేర
నలమేలు మంగాంగ - నాథీశు పేర
నంచితకరుణా క - టాక్షుని పేరఁ
గాంచనమణిమయా - కల్పుని పేర 10700
వేదవేదాంతార్థ - వినుతుని పేర
నాదిత్య కోటిప్ర - భాంగుని పేరఁ
గంకణాంగదరత్న - కటకుని పేర
వెంకటేశుని పేర - విశ్వాత్ము పేర
నంకితంబగు వెంక - టాద్రీశచరణ
పంకజసేవాను - భావమానసుఁడు
హరిదాసమణి కట్ట - హరిదాసరాజు
వరదరాజు నితాంత - వరదానశాలి
రచియించు వాల్మీకి - రామాయణంబు
ప్రచురభక్తిని మదిఁ - బాటించి వినిన 10710

జదివిన వ్రాసిన - సభలఁ జేర్చొనిన
మదిదలంచినమెట్టి - మనుజులకైన
ధారుణిమీఁద సీ - తారామచంద్ర
పారిజాతదయా ప్ర - భావంబు వలన
హయమేధరాజ సూ - యాదిమ యాగ
నియత ఫలంబులు - నిరతాన్నదాన
సుకృతంబు నిత్యయ - శో వైభవములు
సకళంక తీర్థయా - త్రాది పుణ్యములు
సత్యవ్రత పదంబు - సకల సౌఖ్యములు
నిత్య మహాదాన - నిరుపమశ్రీలు 10720
కలికాల సంప్రాప్త - కలుష నాశనము
కలుములు హరిభక్తి - గౌరవోన్నతులు
శత్రుజయంబును - స్వామిహితంబు
పుత్రలాభంబును - భోగభాగ్యములు
ననుకూలదాంపత్య - మంగనాప్రియము
ధనధాన్యపశు వస్తు - దాసీసమృద్ధి
మానస హితము ధ - ర్మ ప్రవర్తనము
నానందములు ఖేద - మంద కుండుటయు
నలఘు వివేకంబు - నతుల గౌరవము
వలయుకార్యములు కై - వశము లౌటయును 10730
పావనత్వము దీర్ఘ - పరమాయువులును
కైవల్య సుఖము ని - క్కముగాగల్గు
నెన్నాళ్లు ధారుణి - యెన్నాళ్లు జలధు

ఎన్నాళ్లు రవిచంద్రు - లెన్నాళ్లు గిరులు
నెన్నాళ్లు నిగమంబు - లెన్నాళ్లు విశ్వ
మన్నాళ్లు నీకథ - యలరు నార్షంబు
నాదికావ్యం బయో - ధ్యాకాండమనఁగ
వేదసమానమై - విలసిల్లుఁగాత.

ఇది

కట్టా వరదరాజ రచితమైన
వాల్మీకి రామాయణ మందలి
యయోధ్యాకాండము.

సమాప్తము



